MAHARSHULA CHARITRALU-Part VII

By
Vidwan Bulusu Venkateswarlu, M.A.,




Edited by
Mudivarthi Kondamacharyulu.



T. T. D. Religious Publications Series No. 341




May, 1989

Copies: 2000

Published by:
Sri Ch. VENKATAPATHI RAJU. I.A.S.,
Executive Officer,
T. T. Devasthanams,
Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati. 517 507

# ముందుమాట

మహర్షులు మంత్రద్రష్టలు; మంత్రపతులు. పవిత్రమైన భారతా వనిలో ఎందరో మహర్షులు అవతరించి బ్రహ్మనిష్ఠా గరిష్ఠులై లోకోప కారకములైన ఎన్నో ఘనకార్యాలు నిర్వర్తించారు. ప్రజా సముదాయం ఆ మహర్షుల ఋణాన్ని ఎన్నటికీ తీర్చుకోలేదు. యుగయుగాల భారతీయ సంస్కృతినీ, విజ్ఞానమునూ విశ్వమునకు చాటిన ధర్మస్వరూ పులు వారు. తపస్స్వాధ్యాయ నిరతులై, నిగ్రహానుగ్రహ సమర్థులై, త్రికాలజ్ఞులైన మన మహర్షుల గురించిన విషయము లెన్నో శ్రుతిస్మృతి పురాణేతిహాసాలలో కనిపిస్తాయి. వారు స్వయంగా ధర్మమును ఆచ రించి లోకానికి ఆదర్శప్రాయులైనారు. అనేక ధర్మశాస్త్రాలు రచించి ప్రపంచానికి ఉపకరించారు.

నారదుడు సంగీతమునకు, పరాశరుడు స్మృతికీ, హోరా శాస్త్రము నకూ పెట్టిన భిక్షయే ఈ నాటి మేటి విద్వాంసులందరికీ శరణ్యం. నేటికీ మన భారత భూమిలో అసమాన మహిమాన్వితులైన యోగిపుంగవులు తమ ధర్మప్రబోధముతో భక్తులను తరింప జేస్తున్నారు.

"మహర్షుల చరిత్రలు" అను ఈ ఏడవ సంపుటంలో ఉపమన్యు మహర్షి, ఋభుమహర్షి, కాత్యాయన మహర్షి, గృత్సమహర్షి, తండి మహర్షి, మృకండు మహర్షి, వాత్స్యాయన మహర్షి, విపుల మహర్షి, సాందీపని మహర్షి, ఆస్తీక మహర్షి, కౌశికమహర్షి, దక్షమహర్షి, మున్నగు వారి చరిత్రలు సాకల్యంగా పౌర్వాపర్య సందర్భ సమన్వితంగా విచా రింప బడినవి. ప్రతి మహర్షి జీవితాన్నిగూర్చి చదివినపుడు పఠితలు ఎన్నో అమూల్య విషయాలు ఆకళింతకు తెచ్చుకొని ప్రయోజనంపొంద గలరు. భారతీయు లందరికీ మహర్షుల జీవిత చరిత్రలు అవశ్య పఠనీయాలే.

అనేకములైన ఇతిహాస పురాణాలను చక్కగా అవలోకనము చేసి సర్వజనావబోధకమైన సరళసుందర శైలిలో శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారు రచించిన మహర్షుల చరిత్రలలో ఇది ఏడవ సంపుటం.

సనాతన ధర్మప్రచారమునకై శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు వెలువరచుచున్న ధార్మికగ్రంథ పరంపరలో ఈ మహర్షుల చరిత్రలుకూడ ఆంధ్రపాఠకుల ఆదరాభిమానాలు సంపాదించుకొనగలవని మా విశ్వాసము.

తిరుపతి, సి హెచ్ వేంకటపతిరాజు,

5—6—89. కార్యనిర్వహణాధికారి, తి. తి. దే. తిరుపతి.

# విషయసూచిక

| విషయము | | పుట |
|---|---|---|


* రచయితచే పూర్వముద్రితములైన ఏడు, ఎనిమిది భాగములను కలిపి ఒకే సంపుటముగా ముద్రించుట జరిగినది.

ప్రకాశకులు

తిరుమల తిరుపతి దేవస్థానములు.

# మహర్షుల చరిత్రలు

## ఉపమన్యు మహర్షి

### జననము

శ్రీమంతమగు భారతదేశమునఁ గృతయుగమున మహా తపశ్శాలియు మహాత్ముఁడు నగు వ్యాఘ్రపాదుఁ డను మహర్షి యుండెను. అతఁడు గృహస్థాశ్రమమును నిర్వహించినపు డాతని ధర్మపత్నియం దిరువురు పుత్రులను గాంచెను. పెద్దవాఁడు ఉపమన్యువు. చిన్నవాఁడు ధౌమ్యుఁడు. వేదవేదాంగవేత్తయు, మహాతత్త్వవేత్తయు నగు వ్యాఘ్రపాదుఁ డనవరతము నిరుపమ నిష్ఠాగరిష్ఠుఁడై నిత్యతపోధ్యాన సమాధిస్థితుఁడై యుండుచుండెను.*

ఉత్తమపతివ్రతాతిలక మగు నా మహర్షి యిల్లాలు పిల్లల నల్లారు ముద్దుగాఁ బెంచుచుఁ బతి యడుగుజాడలలో నడచుచు వివేకవతియు విజ్ఞానఖనియు నై యుండెను. పుత్రు లిరువురు పెరిగి పెద్దవా రగుచు నొకనాఁడు బంధువులింటఁ బాయసాన్నముఁ దిని రుచిమరఁగి యట్టి పాయసాన్నము వండి పెట్టు మని తల్లిని గోరిరి. ఆ తల్లి పాయసాన్నము లేదన్నఁ బిల్లలయుల్లము నొవ్వునని చింతిల్లి పిష్టరసమును దయారుచేసి బిడ్డల కిచ్చెను. కాని, యది రుచింపమిఁ బాయసాన్నమే కావలయు నని వారు మారాము చేసిరి. అప్పుడు తల్లి పిల్లల చుబుకములు పుడుకుచు మూర్ధము లాఘ్రాణించి ముద్దు వెట్టుకొని "యావులేనిదే పాలురావు. పాలు లేనిదే పాయసాన్నము రా"దని వారికిఁ జెప్పెను. వారంత "నావు నెవరిత్తురు? మా కోరిక తీర్చువా రెవ"రని యడిగిరి. అనంతర మా మహాసాధ్వి యీశ్వరు నర్చించిన సర్వకామ్యములు సమ

---

* ఇది భారతానుశాసనికపర్వమునఁ గలదు. ఈ కథ తిక్కన భారతానుశాసనికమున లేదు. కారణము తెలియదు. సంస్కృతవాచ స్పత్యమున నుపమన్యుఁ డాయోద ధౌమ్యశిష్యుఁ డని కలదు. "ధౌమ్యోనామాయోదస్తస్య త్రయశ్శిష్యాఃబభూవుః, ఉపమన్యు రారుణిర్వేద శ్చేతి..."

కూరు ననియు నంతకు మించి కోరికలఁ దీరుపఁ గలవా రెవరును లే రని నుడివెను. ఆ మాట లాలించిన యా బాలురలోఁ బెద్ద ముద్దులు మూటగట్ట "నీశ్వరుఁ డెట నుండునో తెలుపుము. నే నాతనికడ కేగి కోరికలఁ దీరుపు మని యడుగుదు" నని పలికెను.

## మాతృోపదేశము

ఈశ్వర ప్రేరిత యైనయామె యీశ్వర రహస్య విజ్ఞానవంతురా లగుటచే నీశ్వరభక్తి పొంగిపొరల నమృతపు జడులఁ బోలిన నుడులతో నిట్లు పలికెను. "బిడ్డా! ఉపమన్యూ! ఈశ్వరు నెఱుఁగ నెవ్వరికిని శక్యము కాదు. అతఁడు పుణ్యాత్ములకే గోచరించును. ఆతనిరూపములు పెక్కు లని పెద్దలు పలుకుదురు. ఆతనిదయ పలుతెఱఁగులు. అతఁ డుండుచోటు లనంతములు. ఆతని శుభచరిత్ర మిది యిది యని తుదముట్ట నెవ్వరును బలుక లేరు. ఇంతకు నాతఁ డన్ని జీవులకు నంతరాత్మయై యుండును. భక్తులకుఁ బరమదయతో దర్శన మొసంగును. మహాత్ములగు మునులాతని దివ్యరూపములను గుఱించియుఁ జిత్రచరిత్రములను గుఱించియుఁ జెప్పు కొనుచు నానంద మందుచుందురు. ఆతఁడే బ్రహ్మవిష్ణుసురేంద్రులయు రుద్రాదిత్య విశ్వేదేవులయు, నరదేవనారదులయు, భూతప్రేత పిశాచాదులయు, దైత్యదానవులయు, సింహవ్యాఘ్రాదులయు, హంస కాకమయూరాదులయు, ఋషిగంధర్వ సిద్ధచారణాదులయు, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములయు రూపములు ధరించును. ఏకముఖుఁడు, ద్విముఖుఁడు, త్రిముఖుఁడు, షణ్ముఖుఁడు, బహుముఖుఁడు నగు చుండును. ఒక్కతల పెక్కుతలలు, ఒక్కపాదము, పెక్కుపాదములు పెక్కుచేతులు నొక్కట ధరించును. నవ్వుట, ఏడ్చుట, కోపించుట, శాంతుఁడగుట, గంతులువేయుట, మున్నగు పను లాతఁడు చేయును, ఒకపుడు బాలుఁడు, మఱొకపుఁడు యువకుఁడు, ఇంకొకపుడు వృద్ధుఁడు నగును. అన్నా! ఎన్నని చెప్పఁగలను! ఉపమన్యూ! నీ వాతని నాశ్ర యింపుము. నీ కోరిక సిద్ధించును."

## తపస్సు

తల్లిమాటలు విని యుపమన్యుఁడు బయలుదేఱి వెడలి యొక యేకాంత ప్రదేశమున నెడమకాలిబొటనవ్రేలిపై నిలిచి మహాతపస్సు చేయ

నారంభించెను. నూఱేండ్లు పండ్లుమాత్రము తిని, మఱినూఱేండ్లు రాలిపడిన యాకులుమాత్రము తిని, ఇంకొక నూఱేండ్లు నీరుమాత్రము త్రాగి, యింకొక నూఱేండ్లు గాలిమాత్రము పీల్చి మొత్తము వేయిసంవత్సరము లుపమన్యువు పరమశివు నారాధించెను.

ఈశ్వరుని కాతనిపై దయకలిగి యాతనిం బరీక్షింప నెంచి యింద్రునిరూపముతో దేవత లెల్లరును సేవింప నచటికి విచ్చేసెను. వేయికన్నులతో, వీర్యవంత మగు వజ్రాయుధముతో, నొక భయంకర మగు నేనుఁగు నెక్కి వచ్చిన యాతఁడు "మునీంద్రా! నీ తపమునకు మెచ్చితిని. నీకుఁ గావలసినవర మనుగ్రహింతును. కోరుకొను" మనెను. అంత నుపమన్యుఁ డాతని నిరాకరించి పశుపతినిదక్క నే నొండొరు నర్థింపను.

"పశుపతివచనా ద్భవామి సద్యః
  కృమి రథవా తరు రప్యనేకశాఖః,
అపశుపతి వరప్రసాదతో మే
  త్రిభువనరాజ్యవిభూతి రప్యనిష్టా.

ఈశ్వరునియాజ్ఞ యైనచో నొకకీటకము నయ్యెదను. లేదా నిట్టల మగు చెట్టు నయ్యెదను. అంతేకాని త్రిభువన సామ్రాజ్య మిచ్చినను ఇంకొకని వరము నా కక్కఱ లేదు.

"న నాకపృష్ఠం న చ దేవరాజ్యం
  న బ్రహ్మలోకం న చ నిష్కళత్వమ్
న సర్వకామా నఖిలాన్ వృణోమి
  హరస్య దాసత్వ మహం వృణోమి.

నా కా మహేశ్వరుని దాసత్వమే కావలయును. స్వర్గము వలదు. దేవ రాజ్యము వలదు. బ్రహ్మలోకము వలదు. మోక్షమే వలదు. నా కే కామ మును వలదు.

"యావ చ్ఛశాంకధవళామలబద్ధమౌళి
ర్నప్రీయతే పశుపతి ర్భగవాన్ మహేశః,
తావ జ్జరామరణజన్మశతాభిఘాతై
ర్దుఃఖాని దేహనిహితాని సముద్వహామి.

శశాంకుఁడు, పశుపతి, భగవానుఁడు నగు మహేశుఁ డెంతవఱకుఁ బ్రీతుఁడు కాఁడో, అంతవఱకు జరామరణ జన్మశతముల దెబ్బలను తినవలసినవాఁడ నగుచున్నాను. నేను చేసినపాపములకు జన్మము లింకను దప్పనిసరి యగుచో నాకు జన్మజన్మమునను నీశ్వరభక్తి యక్షయముగ నలవడును గాక!" అని పలికెను. ఇంద్రుఁ "డోయీ! ఈశ్వరుఁ డనుచున్నావు. ఆతఁ డెట్టివాఁడో తెలుపు" మని యడిగెను.

అందుల కుపమన్యు వపరిమిత శివభక్తి పారవశ్యమున నిట్లు పలికెను.

"సదసద్వ్యక్త మవ్యక్తం య మాహుః బ్రహ్మవాదినః,
నిత్యమేక మనేకం చ వరం తస్మా ద్వృణీమహే.
అనాదిమధ్యపర్యంతం జ్ఞానైశ్వర్య మచింతితమ్,
ఆత్మనాం పరమం యస్మాద్వరం తస్మాద్వృణీమహే.
ఐశ్వర్యం సకలం యస్మా దనుత్పాదిత మవ్యయమ్,
అబీజాద్బీజసంభూతం వరం తస్మా ద్వృణీమహే.

బ్రహ్మవాదు లెవనిని సత్, అసత్, వ్యక్త, అవ్యక్త రూపుఁ డని భావింతురో, నిత్యునిగను, కేవలునిగను అనేక రూపిగను భావింతురో ఆతనినుండి నేను వరము కోరుచున్నాను. ఆదిమధ్యాంతశూన్యుఁడు, జ్ఞానాత్ముఁడు, అచింత్యుఁడు, పరమాత్మ యెవఁడో వానినుండి నేను వరము గోరుచున్నాను. సమస్తైశ్వర్యము లెవనినుండి కలుగునో, అవ్యయుఁడు, అనుత్పాదితుఁడు, అబీజ బీజ సంభూతుఁ డెవఁడో అతని నుండి నేను వరము గోరుచున్నాను.

నీతో నాకు హేతువాద మేల? ఏమైనను నేనా సర్వేశ్వరునుండియే వరము కోరుదును కాని నీకడ నుండి కాదు సుమా" యనెను.

## ఈశ్వర సాక్షాత్కారము

అపు డామహర్షికి హంస కుందేందుసదృశము, మృణాళరజతప్రభ గలది, వృషభరూపమున నైరావతము ప్రత్యక్ష మయ్యెను. అది క్షీర సాగరమువలెఁ దెల్లనై నల్లనితోఁక, పర్వతమంత మేను, మధుపింగళ వర్ణముగల కన్నులు, వజ్రములవంటి కొమ్ములు, మేలిమిబంగారు కాంతి గలిగి యుండెను. దానియొడలి నిండుగ సువర్ణమాలిక లలంకరింపఁబడి యుండెను. చక్కని మూతి, చక్కనిడెక్కలు, చక్కని ముక్కు, చక్కని చెవులు మున్నగువానితో నది యతిమనోహరముగ నుండెను. తుషారగిరికూటమువలె, సితాభ్రశిఖరముభంగి నొప్పు నావృషభమును బార్వతితో నెక్కినశివుఁడు పున్నమ చంద్రునివలెఁ బొలుపొందెను. అతని తేజము వేయిసూర్యులకాంతివలె వ్యాపించెను. ప్రళయకాలభానునిభంగి ఆ పరమేశ్వరుఁడు చూడ శక్యుఁడు కాకుండెను- ఉపమన్యువిది యే మని పరికించుచుండఁగా నా దివ్యతేజ మెల్లెడల మిఱుమిట్లుగొలిపి యంతర్ధాన మయ్యెను. అచట మహేశ్వరుఁడు వృషభారూఢుఁడై, సౌమ్యుఁడై పార్వతీసహితుఁడై యాతనికిఁ బొడగట్టెను. ఇది యిట్టిదని చెప్పరాని రూపము, ఇంతింతనరానిమహాతేజము వెలయ నీలకంఠుఁడు అష్టాదశ భుజుఁడు, సర్వాభరణభూషితుఁడు, శుక్లాంబరధరుఁడు, శుక్లమాల్యాను లేపుఁడు, శుక్లధ్వజుఁడు, శుక్లయజ్ఞోపవీతుఁడు నయి యా దేవుఁడు గానవచ్చెను. ఆతనిచుట్టు నతనివంటిపరాక్రమము, రూపము గలిగిన యనుచరు లుండిరి. వా రాతనిస్తోత్రగీతము పాడుచు నానందమున నాడుచుండిరి. ఆతఁడు బాలేందు శేఖరుఁడై తెల్లని శరీర కాంతులు కలిగి ముగ్గురు సూర్యులవలె మూఁడు కన్నులు తేజఃకాంతులు చిమ్మ నొప్పారుచుండెను. తెల్లనగు నాతనిమేన రత్నములతోను బద్మములతోను గూర్పఁబడిన మనోహరమాలిక యుజ్జ్వలకాంతి నీను చుండెను. ఆతని యస్త్రములు సర్వతేజోమయములై మూర్తిమంత ములై యుండెను. ఆతనిధనువు ప్రళయాగ్నితుల్యమై సూర్యసన్నిభ మైనయొకబాణము, మహాఘోరమై దివ్యమైనపాశుపతాస్త్రము, ఏడు తలలు, తీక్ష్ణదంష్ట్రలు, విషోల్బణము గలిగి యావింటిపై కంఠ మంచిన యొకమహాసర్పము ఉపమన్యునకుఁ గానిపించెను. పరమేశ్వరుని

శూలము, తీక్ష్ణాగ్రమై భయంకరమై, రోమహర్షణమై, అనిర్వాచ్యప్రభావమై, రుద్రునిసన్నిధి నాతనికిఁ గానవచ్చెను. తళతళలాడుపిడి గలిగి, రౌద్రమగునగ్రము కలిగి, సర్పకంఠమువలె ముందున్నతభాగము కలిగి, దీప్తాగ్నిశతమువలె వెలుఁగొందు పరమేశ్వరునిపరశువు ఉపమన్యువునకు స్పష్టముగాఁ గానవయ్యెను. ఆతనికుడిప్రక్క లోకపితామహుఁ డగు బ్రహ్మ హంసయుక్తమై మనోవేగము గల విమానము నెక్కియుండెను. ఆతనియెడమప్రక్క గదాశంఖచక్రములతో నారాయణుఁడు, గరుడారూఢుఁడై యుండెను. మయూర వాహనుఁడగు కుమారస్వామి తల్లి దగ్గర నుండెను. శక్తిఘంటలతో రెండవయగ్నివలె నాతనియెదుట నంది యుండెను. స్వాయంభువాదు లగు మనువులు, భృగ్వాదులగు మహర్షులు, ఇంద్రాదులగు దేవతలు, శివుని జుట్టియుండిరి. సర్వభూతగణములు, సప్తమాతృకలు, నాతనికి నమస్కరించుచు నలువంకల నిలిచిరి. సురలు మహాస్తోత్రముల శంకరుని నుతించిరి. బ్రహ్మ యాతనిని రథంతరసామమున స్తుతించెను. నారాయణుఁడు నాతని సామములచేఁ గీర్తించెను. ఇంద్రుండు శతరుద్రీయమున నాతనిఁ బరబ్రహ్మ యని కొనియాడెను.

అప్పు డుపమన్యు వా మహేశ్వరునికి సాష్టాంగ మెరఁగి ఆనంద బాష్పములతో నిట్లని స్తుతించెను.

"నమో దేవాదిదేవాయ మహాదేవాయ వై నమః
శక్రరూపాయ శక్రాయ శక్రవేషధరాయ చ.

నమస్తే వజ్రహస్తాయ పింగళాయారుణాయ చ
పినాకపాణయే నిత్యం శంఖశూలధరాయ చ.

నమస్తే కృష్ణవాసాయ కృష్ణాకుంచితమూర్ధజే,
కృష్ణాజినోత్తరీయాయ కృష్ణాస్వభిరతాయ చ.

శుక్లవర్ణాయ శుక్లాయ శుక్లాంబరధరాయ చ,
శుక్లభస్మావ లిప్తాయ శుక్లకర్మరతాయచ.

నమోస్తు రక్తవర్ణాయ రక్తాంబరధరాయ చ,
రక్తధ్వజపతాకాయ రక్తస్రగనులేపినే.

నమోస్తు పీతవర్ణాయ పీతాంబరధరాయ చ,
నమోస్తు పీతచ్ఛత్రాయ కిరీటవరధారిణే.

అర్ధహారార్ధకేయూర స్వర్ణకుండలకర్ణినే,
నమః పవనవేగాయ నమోదేవాయవై నమః.

సురేంద్రాయ మునీంద్రాయ మహేంద్రాయ నమోస్తుతే,
నమ్యఃపద్మార్ధమాలాయ ఉత్పలైర్మిశ్రితాయ చ.

అర్ధచందనలిప్తాయ అర్ధస్రగనులేపినే,
నమ ఆదిత్యవక్త్రాయ ఆదిత్యనయనాయ చ.

నమ ఆదిత్యవర్ణాయ ఆదిత్యప్రతిమాయ చ,
నమస్సోమాయ సౌమ్యాయ సౌమ్యవక్త్రధరాయ చ.

సౌమ్యరూపాయ ముఖ్యాయ సౌమ్యదంష్ట్రా విభూషిణే,
నమ శ్శ్యామాయ గౌరాయ అర్ధపీతార్ధపాండవే.

నారీనరశరీరాయ స్త్రీ పుంసాయ నమోస్తు తే,
నమో వృషభవాహాయ గజేంద్రగమనాయ చ.

దుర్గమాయ నమస్తుభ్య మగమ్యగమనాయ చ,
నమోస్తు గణగీతాయ గణబృంద రతాయ చ.

గణానుయాతమార్గాయ గణనిత్యవ్రతాయ చ,
నమశ్శ్వేతాభ్రవర్ణాయ సంధ్యారాగప్రభాయ చ.

అనుద్దిష్టాభిధానాయ స్వరూపాయ నమోస్తు తే,
నమోరక్తాగ్రవాసాయ రక్తసూత్రధరాయ చ.

రక్తమాయావిచిత్రాయ రక్తాంబరధరాయ చ,
మణిభూషితమూర్ధాయ నమ శ్చంద్రార్ధభూషిణే.

విచిత్రమణిమూర్ధాయ కుసుమాష్టధరాయ చ,
నమోగ్నిముఖనేత్రాయ సహస్రశశిలోచనే.

అగ్నిరూపాయ కాంతాయ నమోస్తు గహనాయ చ,
ఖచరాయ నమస్తుభ్యం గోచరాభిరతాయ చ.

భూచరాయ భువనాయ అచరాయ చరాయ చ,
నమో దిగ్వాససే నిత్య మధివాస సువాససే.

నమో జగన్నివాసాయ ప్రతిపత్తిసుఖాయ చ,
నిత్యముద్బద్ధమకుట మహాకేయూరధారిణే.

సర్పకంఠోపహారాయ విచిత్రాభరణాయ చ,
నమస్త్రినేత్రనేత్రాయ సహస్ర శతలోచనే.

స్త్రీపుంసాయ నపుంసాయ నమస్సాంఖ్యాయ యోగినే,
శంయోరభిస్రవంతాయ అథర్వాయ నమోనమః.

నమ స్సర్వార్తినాశాయ నమ శ్శోకహరాయ చ,
నమో మేఘనినాదాయ బహుమాయాధరాయ చ.

బీజక్షేత్రాభిపాలాయ సృష్టిస్థిత్యంత హేతవే,
నమ స్సర్వసురేశాయ విశ్వేశాయ నమోనమః.

నమః పవనవేగాయ నమః పవనరూపిణే,
నమః కాంచనమాలాయ గిరిమాలాయ వై నమః.

నమ స్సురారిమాలాయ చండవేగాయవై నమః.

బ్రహ్మశిరోపహర్త్రాయ మహిషఘ్నాయవై నమః,
నమస్త్రిరూపధారాయ సర్వరూపధరాయ చ.

నమ స్త్రిపురహర్త్రాయ యజ్ఞవిధ్వంసనాయ చ,
నమః కామాంగనాశాయ కాలదండధరాయ చ.

నమ స్స్కందవిశాఖాయ బ్రహ్మదండాయవై నమః,
నమో భవాయ శర్వాయ విశ్వరూపాయవై నమః.

ఈశానాయ భవఘ్నాయ నమో స్త్వంధకఘాతినే,
నమో విశ్వాయ మాయాయ చింత్యాచింత్యాయవై నమః.

త్వంనో గతిశ్చ శ్రేష్ఠశ్చ త్వమేవహృదయం తథా,
త్వం బ్రహ్మ సర్వదేవానాం రుద్రాణాం నీలలోహితః.

ఆత్మా చ సర్వభూతానాం సాంఖ్యేపురుష ఉచ్యతే,
నమ స్తే భగవన్ దేవ నమ స్తే భక్తవత్సల,
యోగీశ్వర నమస్తేస్తు నమస్తే విశ్వసంభవ." *

---

* ఉపమన్యుకృత శివస్తోత్రము (పాఠాంతరము)

జయశంకర! పార్వతీపతే
మృడ శంభో శశిఖండమండన,
మదనాంతక భక్తవత్సల
ప్రియకైలాస దయాసుధాంబుధే.

సదుపాయ కథాస్వపండితో
హృదయే దుఃఖశరేణ ఖండితః,
శశిఖండశిఖండమండనం
శరణం యామి శరణ్య మీశ్వరమ్.

మహతః పరితః ప్రసర్పత
స్తమసో దర్శనభేదినో భిదే,
దిననాథ ఇవ స్వతేజసా
హృదయ వ్యోమ్ని మనా గుదేహి నః.

నవయం తవచర్మచక్షుషా
పదవీ మప్యుపవీక్షితుం క్షమాః,
కృపయాభయదేన చక్షుషా
సకలేనేశ విలోకయాశు నః.

మధురం హి పయస్స్వభావతో
నను కీదృక్సితశర్కరాన్వితమ్,
సవిశేషమృతాయ తే భవాం
ఛృవముండాభరణోపి పావనః.

అంతఁ జల్లనై సుగంధము వెల్లివిరియుపుష్పవర్ష ముపమన్యువుపైఁ గురిసెను. దేవదుందుభులు మ్రోఁగెను. పరమేశ్వరుఁడు దేవతలను జూచి యుపమన్యుని భక్తిభావమును గాంచితిరి గదా! యని పలికెను. వారెల్ల రొక్కపెట్టున నుపమన్యుమహర్షి యీప్సితార్థముల నందుఁగాక యని పలికిరి. అంతఁ బరమశివుఁడు పరమానందమున నుపమన్యు

---

భవ ఏవ భవాంతక స్సతాం
సమదృష్టి ర్విషమేక్షణోఽపి సన్,
అపిశూలధరో నిరామయో
దృఢవైరాగ్యరతోఽపి రాగవాన్.

అపిభైక్ష్య చరో మహేశ్వర
శ్చరితం చిత్రమిదం హి తే ప్రభో,
వితరత్యభివాంఛితం దృశా
పరిదృష్టః కిల కల్పపాదపః.

హృదయే స్మృతిరేవ ధీమతే
ననుతేఽభీష్టఫలప్రదో భవాన్,
సహసైవ భుజంగపాశవాన్
వినిగృహ్ణాతి న యావదంతకః.

అభయం కురు తావదాశుమే
గతజీవస్య పునః కివౌషధైః,
సవిషై రివ భీమపన్నగైః
విషయైరేభిరలం పరిక్షతమ్.

అమృతైరివ సంభ్రమేణ మాం
అభిషించాశు దయావలోకనైః,
మునయో బహవోఽద్య ధన్యతాం
గమితాస్స్వాభిమతార్థదర్శినః,
కరుణాకర యేనతేన మాం
అవసన్నం ననుపశ్య చక్షుషా.

నుపలాలించి "వత్సా! నీ భక్తికి సంతసించితిని. నీవు నావాఁడవు. నీ కేమి కావలయునో తెలుపు" మనెను.

ఉపమన్యుఁ డమితానందమున "మహాదేవా! నాకు నిత్యము నీయందు భక్తి నెగడునట్లు మొదటివర మనుగ్రహింపుము. రెండవ వరము భూతభవిష్యద్వర్తమానవేది నగుశక్తి నా కిమ్ము. నాకును నా

---

ప్రణమామ్యథ యామి చాపరం
 శరణం కం కృపణాఽభయ్రాప్రదమ్,
విరహీ వ విభో ప్రియామయం
 పరిపశ్యామి భవన్మయం జగత్.

బహవో భవతానుకంపితాః కిమితీశాన నమానుకంపసే
దధతా కిము మందరాచలం పరమాణుః కమఠేన దుర్ధరః.

అశుచిం యది మానుమన్యసే కిమిదం మూర్ధ్నికపాలదామతే,
ఉతశాఠ్యమసాధుసంగినం విషలక్ష్మాఽపినకిం ద్విజిహ్వాధృక్.

క్వదృశం విదధామి కింకరో, మ్యనుతిష్ఠామి కథం భయాకులః
క్వనుతిష్ఠసి రక్ష రక్షమాం, అయి శంభో శరణాగతోఽస్మి తే.

విలుఠామ్యవనౌ కిమాకులః కిమురోహన్మి శిరశ్ఛినద్మి వా,
కిమురోదిమి రారటీమి కిం కృపణం మాం నయదీక్షసే ప్రభో.

శివ సర్వగ శర్మద ప్రణతో దేవ దయాం కురుష్వ మే
నను ఈశ్వర నాథ దిక్షతే పునరేవేశ నమో నమోఽస్తు తే.

శరణం తరుణేందుశేఖర శ్శరణం మే గిరిరాజకన్యకా,
శరణం పునరేవ తావుభౌ శరణం నాన్య దుపైమి దైవతమ్.

ఉపమన్యుకృతం స్తవోత్తమం జపత శ్శంభుసమీపవర్తినః,
అభివాంఛితభాగ్యసంపదః పరమాయాః ప్రదదాతి శంకరః.
ఉపమన్యుకృతం స్తవోత్తమం ప్రజపేద్యస్తు శివస్య సన్నిధౌ,
శివలోక మవాప్య సోచిరా త్సహతేనైవ శివేన మోదతే.

కుటుంబమువారికి సక్షయము మగుక్షీరోదన ప్రాప్తిఁ గలిగించి నీవు నా యాశ్రమమున నుండిపొ" మ్మని ప్రార్థించెను.

పరమేశ్వరుఁ డాతని కోరిక లెఱిఁగి యిట్లు పలికెను. "వత్సా! దుఃఖము, జన్మమృత్యువులు నీ కిఁక నుండవు. నీవు కీర్తిశాలివి, తేజోనిధివి, దివ్యజ్ఞానయుతుఁడవు నయి సర్వమహర్షి సన్నుతుల నంద గలవు. సుశీలసుగుణసంపద, సర్వజ్ఞత్వము, ప్రియదర్శనత నీ కక్షయ మగుఁగాక! నిత్యయౌవనము నిరుపమతేజము నీలో నిలుచుఁగాక! నీకోరినపుడెల్ల క్షీరసముద్రము నీముందుఁ బ్రవహించుఁగాక! నీవు బంధుమిత్రసమేతముగాఁ గల్పాంతమున నన్నుఁ జేరుదువు గాక! నీకు నాపయి నిరంతర భక్తి నిలుచును గాక! నీవు తలచినంతనె వచ్చి పిలిచి నంతనె పలుకుదు నని నీకు వర మిచ్చుచున్నాను."

పరమేశ్వరుఁ డనంతరము దివ్యతేజముఁ జిమ్ముచు నంతర్హితుఁ డయ్యెను. ఉపమన్యునకు సర్వసిద్ధులు సమకూరి దివ్యప్రభావము వచ్చి వరించెను. అతఁ డింటి కేగి జరిగిన సంగతి తలిదండ్రులకుఁ జెప్పి వా రపరిమితానందమందఁ గొంతకాలము కడచిన పిమ్మట నెల్లరిని వీడి యొక యాశ్రమమును నిర్మించుకొని యందుండెను.

## ఉపమన్యుని యాశ్రమము

హిమవత్పర్వత సానువులందు ఉపమన్యుఁడు నిర్మించుకొన్న యాశ్రమము మిక్కిలి యద్భుతము, దివ్య ప్రభావ సంయుతము నయి యుండెను. అది బ్రాహ్మలక్ష్మితో నిండి దేవగంధర్వులచేఁ బూజింపఁ బడుచుండెను. అయ్యది ధవ, కకుభ, కదంబ, నారికేళ, కురవక, బదరీ పున్నాగాది బహుళ ఫలవృక్షములతోడను, వివిధ రమణీయ పుష్పలతల తోడను గూడియుండెను. ఆ వనము మృగ, వానర, శార్దూల, సింహ, ద్వీపికా సమూహములతో నిండి యుండెను. నెమిళ్ళ నృత్యములు, పక్షుల కిలకిలారావములు, పుష్పముల సుగంధములు, గంధర్వ కాంతా గానము, జలధారల మ్రోఁత, ఏనుఁగుల ఘీంకారరవము, కిన్నరులగీత

ములు, సామగాన పరుల స్వనములు, వీనుల విందు, కన్నులపండువు గావించుచుండెను. ఆ వనము సరోవరాలంకృతమై, విశాలములు కుసుమాదులతోఁ గూడినవియు నగునగ్ని గృహములతో శోభిల్లుచు, పరమ పవిత్ర గంగాతోయముల భాగ్యమున విలసిల్లుచు, అగ్నితుల్యులు మహాత్ములు నగు మహర్షుల పవిత్ర ప్రసంగములచే భాసిల్లుచు నుండెను. అందున్న తపస్వి జనులు వాయుభక్షులు, పర్ణభక్షులు, జలభక్షులు, ధూమాహారులు, క్షీరపాయులు నయి ధ్యాననిష్ఠులు, యోగవంతులు నయి యుండిరి. మఱియు నందున్నవా రెల్లరు గోచారులు, అశ్మకుట్టులు, దంతోలూ ఖలికులు, మరీచిపాయులు, ఫేనపాయులు, మృగ చారులు, అశ్వత్థ ఫలభక్షులు, జలశాయులు, చీర చర్మాంబరధరులు, వల్కలవసనులు. వారెల్లరుఁ దపోధను లగు మహర్షులు, నియమనిష్ఠా గరిష్ఠు లగుయతులు. ఉపమన్యుని యాశ్రమము మహాత్ములు పుణ్య కర్ములు, నగు శివగణముల చేతను, దేవగణముల చేతను సేవింపఁబడుచు నాకాశమందలి చంద్రమండలమువలె నతి మనోహరముగ నుండెను. అందు ముని మహత్త్వముచేఁ బాములును ముంగిసలును ప్రబల స్నేహమున నాడుకొనుచుండును. లేళ్ళును, పెద్దపులులును ప్రియమిత్రములు. ఇట్లే సాధారణముగాఁ బరస్పర విరోధముచేఁ బ్రవర్తింపవలసిన నరపశు పక్షి సమూహములు పరస్పర సుహృద్భావములతోఁ బ్రవర్తిల్లుట జగదాశ్చర్యకరముగా నుండెను. అందుచే నాయాశ్రమము సకలప్రాణి మనోహరమై, సకల జంతు సంవర్ధితమై, సకల శోభానివాసమై, సకల ముని సమ్మతమై భూలోక స్వర్గమై యలరారుచుండెను.

## శ్రీకృష్ణుఁ డుపమన్యుని దర్శించుట

తొల్లి యొకప్పుడు శ్రీకృష్ణుని యష్టమహిషులలో నొకతె యగు జాంబవతి భర్త యాదరాభిమానములను జూఱఁగొని తన కొకసుపుత్రు నిమ్మని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడు తాను పండ్రెండేండ్లు పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసినఁగాని సుపుత్రుఁడు లభించుట దుర్లభ మని పలికెను. అంత నామె తనకుఁ బుత్త్రు నిచ్చుటకై కృష్ణుఁడు పండ్రెండేండ్లు తపస్సుచేయుట కంగీకరించెను. కృష్ణుఁడు జాంబవతికిఁ బ్రియము

గావింప నెంచి గద, సాంబాదులతోఁ జెప్పి గరుత్మంతు నెక్కి హిమవత్పర్వతసానువు లందు బ్రహ్మలోకము వలె నొప్పారు నుపమన్యు నాశ్రమముకడ దిగి గరుత్మంతునిఁ బంపివేసెను. పిదపఁ గృష్ణుఁడు కాలిసడకను దపస్తేజముచే అగ్నిహోత్రుని వలెఁ బ్రకాశించుచు, శిష్యజనపరివృతుఁడు, పరమశాంతుఁడు, ప్రజ్ఞానిధి, యోగశక్తిచే యువకుఁడు నగు ఉపమన్యు మహర్షిని దర్శించెను.

ఉపమన్యుఁ డాతని నధికభక్తి తాత్పర్యములతో నాదరించి పూజించి ప్రసన్నునిఁ జేసికొని యాతఁడు వచ్చినపని తన దివ్యదృష్టిచేఁ దెలిసికొని "కృష్ణా! సర్వలోకద్రష్టవగు నీవు నన్ను దర్శింప వచ్చితివా! సర్వతపస్సార ఫలప్రదుఁడవగు నీకుఁ దపమా! సర్వలోకపిత వగునీకుఁ బుత్రుఁడా! ఏమి చిత్రము! ని విలాసము లెవఁ డెఱుఁగఁ గలఁడు? సరే. కానిమ్ము. నీ విట శర్వుని గుఱించి తప మొనరింపుము. అతఁడు నీకుఁ గానసై యభీష్టము లీయఁ గలఁడు. తొల్లి దేవతలు, మహర్షులు పరమేశ్వరు నిట భజించి బ్రహ్మచర్యతపస్సత్యశమదమములచేఁ బ్రీతునిఁ జేసి యభీప్సితములను బడయఁగాంచిరి మేరుపర్వతము నుఱ్ఱూఁత లూగించిన హిరణ్యకశిపుఁ డిందే శివు నారాధించి సర్వశక్తులు సర్వైశ్వర్యము లందఁగలిగెను. మందరుఁ డను హిరణ్యకశిపుని పుత్రుఁడు పరమేశ్వరు నిట నారాధించి యర్బుదవత్సరము లింద్రుని ముప్పతిప్పలు వెట్టి మూఁడుచెఱువుల నీళ్ళు త్రాగించెను. వాని శరీరమున విష్ణుచక్రము, నింద్రుని వజ్రాయుధము గడ్డిపఱక లయ్యెను. జలాంతర్గతుఁడై బలగర్వితుఁ డైన యాతని నుక్కడఁగింప దీప్తజ్వలనతుల్యము దుర్ధరము నగు చక్రమును సృజించి శివుఁడే నీ కొసఁగుచు నిది నీకు సుదర్శన మగుఁ గాక యని పలికిన నీ వా చక్రమును బరిగ్రహించి సుదర్శనచక్ర మని పేరిడితివి గదా! ఈశ్వరప్రీతిఁ గూర్చిన యా రాక్షసునిమేన నీ సుదర్శనచక్రము కూడ వ్యర్థమయ్యెను గదా! మఱియుఁ దనను భక్తిచే మెప్పించిన విద్యుత్ప్రభు నా సర్వేశ్వరుఁడు త్రిలోకేశ్వరు నొనరించెను. శతముఖుఁడను రాక్షసుఁడు సర్వేశ్వరు నర్చించి నూఱేండ్లు తన దేహమందలి రక్తమాంసములను అగ్నిలో హోమముచేసి తన యనన్యభక్తిని జూపినంతనే శివుఁ డాతని కోరికల నన్నిఁటిని దీర్చెను.

స్వయంభు వను మహనీయుఁడు పుత్రార్థియై పరమేశ్వరునిఁ బ్రార్థించి నూర్వురు పుత్రులను గాంచెను. పరమధార్మికుఁ డగు యాజ్ఞవల్క్యుఁడు పరమర్షియైన వ్యాసభగవానుఁడు నీశ్వరు నారాధించి కామితార్థము లందిరి. ఇంద్రునిచే నవమానితులైన వాలఖిల్యులు శివు నారాధించి యింద్ర శత్రువగు సుపర్ణుని జన్మమునకు హేతువులైరి. ఒకప్పుడు శివునికోపమున లోకములందలి జలమెల్ల నింకిపోవ దేవతలు సప్తకపాల క్రతువుచే నీశ్వరునే యారాధించి మరల జలములఁ గడించిరి. పరమే శ్వరు నారాధించియే వికర్ణుఁ డనువాఁడు పరమసిద్ధి గడించెను. శాకల్య మహర్షి తొమ్మిదివేలేండ్లు మనోయజ్ఞముచే మహేశ్వరు నారాధించి మహ నీయత గాంచెను. సావర్ణిమనువు శంకరు నారాధించియే సర్వకామ్య ములనంది పోయినయింద్రత్వమును మరలఁ బొందెను. నారదుఁ డీశ్వరు నర్చించియే దివ్యర్షియై తేజరిల్లెను. నే నింతవాఁడ నగుట కా మహేశ్వరకృపయే కారణము" అని పలికి శ్రీకృష్ణుని కెనిమిదిదినము లెనిమిది క్షణములవలెఁ గడచునట్లీశ్వర మాహాత్మ్యమునుగూర్చి తెలిపెను.

శ్రీకృష్ణుఁ డుపమన్యునికి శిష్యుఁడై యాతనివలన యథావిధిగాఁ దపోదీక్షితుఁడై దండము ధరించి, ముండియై, కుశచీరధరుఁడై యొక నెల పండ్లు తినియు, మఱియొకనెల నీరు త్రావియు, క్రమముగా గాలిని మాత్రమే పీల్చుచు నూర్ధ్వబాహుఁడై మహాతపము చేసి శివునిఁ బ్రత్యక్షము చేసికొని —

"నమోస్తు తే శాశ్వతపుణ్యయోని
బ్రహ్మాధిపాం త్వామృషయో వదంతి,
త్వమేవ నారాయణ శబ్ద సంజ్ఞం
నరం చ సత్యం ప్రవదంతి సంతః."

అని పెక్కువిధముల స్తుతించి పార్వతీపరమేశ్వరులచేఁ బెక్కువరము లంది నెగడొందెను.

ఊపమన్యు వది కాంచి —

"నాస్తి శర్వసమో దేవో నాస్తి శర్వసమో గతిః,
నాస్తి శర్వసమం దానం నాస్తి శర్వసమో రణే."

అని శివభక్తియుక్తుఁడై తాండవమాడెను.

పిదప శ్రీకృష్ణుఁ డుపమన్యునివలన తండిమహర్షి చరిత్ర మెఱిఁగి సెలవు గైకొనిపోయి యాప్సితార్థముల నందెను. *

---

* ఉపమన్యుఁ డొనర్చిన "అర్ధనారీశ్వరస్తోత్రము"

శ్లో. అంభోధరశ్యామలకుంతలాయై
తటిత్ప్రభా తామ్రజటాధరాయ,
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౧

ప్రదీప్తరత్నోజ్జ్వలకుండలాయై
స్ఫురన్మహాపన్నగభూషణాయ,
శివప్రియాయై చ శివాప్రియాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౨

మందారమాలా కలితాలకాయై
కపాలమాలాంకిత కంధరాయ,
దివ్యాంబరాయై చ దిగంబరాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౩

కస్తూరికాకుంకుమలేపనాయై
శ్మశానభస్మాంగవిలేపనాయ,
కృతస్మరాయై వికృతస్మరాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౪

పాదారవిందార్పితహంసకాయై
పాదాబ్జరాజత్ఫణినూపురాయ,
కళామయాయై వికలామయాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౫

ప్రపంచసృష్ట్యున్ముఖ లాస్యకాయై
సమస్తసంహారకతాండవాయ,
సమేక్షణాయై విషమేక్షణాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౬

ప్రపుల్ల నీలోత్పలలోచనాయై
వికాస పంకేరుహలోచనాయ,
జగజ్జనన్యై జగదేకపిత్రే
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౭

అంతర్బహిశ్చోర్ధ్వమధశ్చ మధ్యే
పురశ్చ పశ్చాచ్చ విదిక్షుదిక్షు,
సర్వంగతాయై సకలం గతాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ. ౮

ఉపమన్యుకృతం స్తోత్రం అర్ధనారీశ్వరాహ్వయమ్,
యః పఠేచ్ఛృణుయాద్వాపి శివలోకే మహీయతే.



# మహర్షుల చరిత్రలు

## ఋభు మహర్షి

### జననము

మృగశృంగుఁ డని పేరుగాంచిన వత్సుఁ డను మహర్షి చేసిన తపమునకు మెచ్చి విష్ణుమూర్తి ప్రత్యక్షమై యాతనికి వరము లొసంగుచు నాతఁడు ఋభు వనుపేరఁ గడపటిజన్మముఁ గాంచి తత్త్వజ్ఞానియై యిఁక జన్మముఁ గాంచక మోక్ష మందునని వాక్రుచ్చి యదృశ్యుఁ డయ్యెను. వత్సుఁడు బ్రహ్మచర్యమున మహర్షులను, యజ్ఞముచే దేవతలను, సంతానముచేఁ బితృదేవతలను, తపస్సుచే భగవంతుని సంతోషపెట్టి చిరకాలము మహాయోగియై జీవించి తుదకు యోగమార్గమున శరీరమును ద్యజించి బ్రహ్మపదమును గాంచెను. ఆ తరువాత నాతఁడు ప్రళయకాలపర్యంత మటు పరమసుఖమున నుండి యనంతరము శ్వేతవరాహకల్పమున బ్రహ్మమానస పుత్రుఁడై పుట్టి ఋభువను పేరు గాంచెను.

### జ్ఞానము

ఋభువునకు బాల్యమునుండియు బ్రహ్మజ్ఞానసంపద వెల్లివిరిసెను. అతని పూర్వజన్మసుకృత మట్టిదగుట నాతఁడు బ్రహ్మచర్యమును జేయుచు బ్రహ్మవిజ్ఞానము నార్జించి పరమపవిత్రుఁడై యుండెను. భగవంతుఁడు వరాహావతార మెత్తినప్పు డాతనిశిష్యుఁడై ఋభుఁడు :

"ఏకవ్యాపకమై సమస్తగతమై హేవాకమై శ్రీకరం
బై కల్యాణవిహారమై నిబిడమాయాతీతమై నిర్గుణం
బై కైవల్యవిహారమై జనన నాశాతీతమై యుత్తమ
శ్లోకంబై పరమార్థతత్త్వము నటించున్ నిత్యశుద్ధస్థితిన్."

అనియు, బ్రహ్మాదిభేదరూపములు పరమాత్మునికంటె వేఱు కావనియు, ఏకపదార్థమునకు అనేక రూపభేదములు బాహ్యాభ్యంతర ప్రవృత్తులవలననే

కలుగును కాని పరమాత్మునికి భేదములేదని తెలిసికొని దృఢనిశ్చయుఁడై దివ్యానందము నందుచుండెను.

## నిదాఘుఁడు శిష్యుఁడగుట

ఇట్లు ఋభువు తత్త్వమెఱిఁగి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై బహువర్షములు మహాతపస్సు చేయుచుండ పులస్త్యమహర్షి పుత్రుఁడును బ్రహ్మచర్యవ్రతపాలకుఁడు, బహుశ్రద్ధాభయభక్తి వినయవిధేయతలకు నిలయుఁడు నగు నిదాఘుఁడనువాఁడు ఉత్తమ మగుబ్రహ్మజిజ్ఞాస కలిగి తగిన గురువు నరసికొనుచు ఋభుమహర్షి కడకు విచ్చేసెను.

ఉత్తముఁ డగుగురువును బడయుటకొఱ కుత్తముఁ డగుశిష్యుఁ డెంత యాతురపడునో యట్లే యుత్తముఁ డగు శిష్యునిఁ బడయుట కుత్తముఁ డగుగురువు నంత యాతురత నందుచుండును. అతివిపుల సామ్రాజ్యమును నిజశక్తిచే సంపాదించి సుస్థిరము గావించి దానిని వినయ వివేకవంతుఁ డగు నిజపుత్రునిచేతిలోఁ బెట్టి తాను విశ్రాంతి గైకొనఁ దలఁచు చక్రవర్తి వలె, తన తపశ్శక్తిని ధారవోసి సంపాదించిన జ్ఞానఫలమును దా ననుభవించి తనయంతటి వాఁ డగుశిష్యుని కద్దాని నొసంగి జ్ఞానజ్యోతి నిత్యోజ్జ్వలముగ నిలిపియుంచుటకే నిజ మైనగురు వెదురుచూచు చుండును. కావున, సర్వవిధములఁ దనశిష్యుఁ డగుటకుఁ దగియున్న నిదాఘునిరాకఁ గాంచిన ఋభువు, ఆనందమున కంతు లేకుండెను. అట్లే, ఇన్నాళ్లకుఁ దనకుఁ దగిన గురువు లభించినాఁ డని పులస్త్యబ్రహ్మపుత్రుఁడును బ్రహ్మనంద మందెను. అడిగినదే తడవుగా గురువు శిష్యుని స్వీకరించెను. అంగీకరించినదే తడవుగా శిష్యుఁడు గురువునకు సేవకుఁ డయ్యెను.

## విజ్ఞానబోధ

కాలక్రమమున ఋభువు నిదాఘునకు సర్వశాస్త్ర విజ్ఞానమును బోధించి యొక్కయద్వైతమును మాత్రము బోధింపక మాని పోయి

గృహస్థాశ్రమమును స్వీకరించి గార్హస్థ్యధర్మములను జక్కఁగ నిర్వర్తింపు చుండు మని పంపివేసెను. శిష్యుఁడగు నిదాఘుఁడు గురునానతి గైకొని యేగి వివాహమాడి యాలినిగూడి దేవికానదీతీరమునఁ గల వీర నగర మనుపేరి పట్టణముఁ జేరియున్న యొకవనమును జేరి యందు గృహస్థాశ్రమమున నిర్వర్తింపఁ దొడఁగెను. పంచయజ్ఞములను జేయుచు, జపతపము లేమఱక, అతిథిసేవ యభ్యాగతసేవ మనోవాక్కాయ కర్మలచే నొనరించుచు, గురువును స్మరించుచు, భగవంతుని భావించుచు నిదాఘుఁడు ధర్మపత్నితోఁ గాఁపురము చేయుచుండ వేయిసంవత్సర ములు గడచెను.

ఇట్లుండ నొకనాఁడు శిష్యుని కద్వైతవాసనఁ దెలుపఁ దలఁపు గలిగి ఋభుమహర్షి శిష్యుఁడగు నిదాఘు నింటిముంగలకు వచ్చి నిలిచి యుండెను. వేయిసంవత్సరము లగుటచే నిదాఘుఁడు తన గురువని గుర్తుపట్టలేక యెవ్వఁడో యతిథి యనుకొని పిలిచి లోనికిఁ గొనిపోయి, అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించెను. ఋభువు తాను జెప్పలేదు. నిదాఘుఁడు గ్రహింప లేదు కాని, పరిపాటి ప్రకారము అతిథిని లేచివచ్చి పక్వాహారమును భుజించి బడలికలు పాయు మని నిదాఘుఁడు ప్రార్థించెను. తన కన్నముపై హితవు లే దని తెల్పి యింకఁ జేయించిన పదార్థము లే వని ఋభువు నిదాఘు నడిగెను. అతఁ డాయితము చేయించిన పండివంటల పేళ్లెల్లఁ దెలిపెను. కాని, యవి యేవియుఁ దనకు రుచింప వనియు షడ్రస సమన్విత మగుమృష్టాన్న భోజనముఁ దనకుఁ బెట్టింపు మనియు నా యతిథి గృహస్థునిఁ గోరెను. అతఁ డట్లే యని భార్యకుఁ జెప్పఁగా నామె యతిథికి, భర్తకు షడ్రసోపేత మగుభోజనము వండి వడ్డించెను. వాని నన్నిఁటిని దృప్తికరముగఁ దిని కూర్చుండి యున్న ఋభువును నిదాఘుఁడు "మహాత్మా! బడలిక తీఱినదికదా! శాకపాకములు రుచించినవా? ఎటనుండి యెటకుఁ బోవుచు నిట కేతెంచి నారు? తమ దేయూరు? నామధేయ మేమి?" అని ప్రశ్నించెను. దానికి ఋభు విట్లు బదులు చెప్పెను. "అయ్యా! ఆఁకలి వేయువాఁ డన్నము తిన్నఁ దృప్తి చేకూరును. అస లాఁకలియే యెఱుఁగని న న్నీప్రశ్నలతో ముంచఁ బనియేమి? భూమిపైఁ బుట్టినధాతువులను

దేహమున నున్న జలమును జఠరాగ్ని కాల్చును. ఆఁకలి, దప్పిక దేహధర్మములు. ఇదివఱలో కాని యిపుడు కాని నా కా దేహవికారములు లేనే లేవు. కావున, నేను నిత్యతృప్తుఁడను. సుఖము, తృప్తి – యివి మనోధర్మములు. మనోవికారములు గలవారి నీప్రశ్న లడుగుము. పరమాత్మునకు మనోధర్మము లంటవు. తత్త్వజ్ఞుఁ డాకాశమువలె నెల్లప్పుడు నెందును నుండును. నేను వచ్చువాఁడను ఉండువాఁడను గాను. నీవు తప్ప నితరులు తత్ త్వం (అది నీవే) అను వచనమునకుఁ దగరు. నేను తప్ప నితరులు సోఽహమ్ (వాఁడే నేను) అనుటకుఁ దగరు. అన్నమునందుఁ గల మృష్టామృష్టభేదము నీ వలన నెఱుఁగఁగోరి నిన్నుఁ బ్రశ్నించితిని. మృష్టాన్న మమృష్టము, అమృష్టాన్నము మృష్టమునై దేహమునకు బాధ, బాధ లేకుండుట కల్పించును. అంతే కాని అన్న మెన్నఁడును రుచి కాదు. మట్టిగోడలు మెత్తినచో గట్టిపడురీతిని పంచభూతములతోఁ గూడిన దేహము పంచభూతములవలనఁ బుట్టిన పదార్థములచేఁ బోషింపఁబడి బలము కలిగినదగును. ఏది రుచికరము, ఏది అరుచికరము అనువ్యర్థవాదములు మాని ముక్తిమార్గము నరసి చిత్తముఁ బరతత్త్వమునఁ దగిల్చి యిహలోకవిధుల నింక విడిచిపెట్టుము."

నిదాఘుఁ డంత నాతనికి నమస్కారముచేసి మనస్సు ప్రసన్నమైన దని పలికి కృతజ్ఞతాపూర్వకముగా నాతనిపే రడిగెను. ఆతఁ "డోయీ! నేను నీగురుఁడను. ఋభువును. నీ కీరహస్యముఁ దెలిపి వివేకముఁ గలిగింప వచ్చితిని. వచ్చినపని యైనది. పోయివచ్చెదను. నీ వీఁకఁ బ్రపంచ మంతయుఁ బరమేశ్వరాధీనముఁ జేసి సుస్థిరగతి విలసిల్లు" మని పలికి వెడలిపోయెను.

## పునర్దర్శనము

మరల వేయి దివ్యసంవత్సరములు కడచినపిదప ఋభువు నిదాఘుఁ డున్న నగరమునకు విచ్చేసి నగరసమీపమున నుండెను. ఆ పురమేలురాజు సైన్యము వెంబడినుండ నేనుఁగు నెక్కి రాజప్రాసాదమునకు బోవుచుండెను. ఆ సందడివలన జనుల రాకపోకలకుఁ బ్రతిబంధక మేర్పడెను. నిదాఘుఁడు సమీపమునఁ గలయుడవి నుండి వండ్లు, సమి



ధలు, కుశలు మున్నగునవి తానే మోసికొని వచ్చుచుండఁగా రాజాగమనమువలని ప్రతిబంధమునం బోలేక ఆ నగర బాహ్యప్రదేశమున నొకచోఁ గూర్చుండెను. ఈతనిని జూచి ఋభువు సమీపమునకు వచ్చి "ఒంటరివై యిచటఁ గూర్చుంటి వేమి?" యని యడిగెను. చూచి చిరకాలమగుట నిదాఘుఁ డాతని నానవాలు పట్టలేక "అయ్యా! ఈ బరువు మోసికొని యింటి కేగుచుండఁగా నీ రాజుబలఁగము తెరువున కడ్డు వచ్చుటచే నిచటఁ జదికిలఁ బడితి" నని చెప్పెను. "వీరిలో రా జెవఁడు? అతని బలమేది?" యని ఋభువు నిదాఘునిఁ బ్రశ్నించెను. "ఏనుఁగు మీఁద నున్నవాఁడు రాజు" అని నిదాఘుఁ డనెను. "ఏనుఁ గేది? రా జెవఁ" డని యాతఁడు మరలఁ బ్రశ్నించెను. "అయ్యా! మీఁద నున్నవాఁడు రాజు. క్రింద నున్న దేనుఁగు. చూడఁగనే చంటిపిల్లవాఁడైన నిది గ్రహింపఁ గలఁడు. నీ విట్లు ప్రశ్నించుచుంటి వే" మని నిదాఘుఁ డనెను. "క్రిందేది? మీఁ దేది? నాకుఁ జెప్పు" మని ఋభువు మరలఁ బ్రశ్నించెను. అందులకుఁ గోపించి నిదాఘుఁడు ఋభుని మెడ వంచి వీపుపై నెక్కి నేను రాజువలె మీఁద నున్నాఁడను. నీ వేనుఁగువలెఁ గ్రిందనున్నా" వని నిరూపించెను. "నీ వెవరు? నే నెవఁడను? చెప్పు" మని ఋభు వడిగెను. తత్క్షణమే తత్త్వంసోహం వాక్యములు రెండును నేకమైన యద్వైతవాసన నాతఁ డెఱింగి వెంటనే క్రింది కుఱికి సాష్టాంగపడి "మహాత్మా! నీవు నా గురుఁడ వగు ఋభుఁడవు గావుగదా? కానిచో నొరున కిట్టి యద్వైతవాసనాసంస్కారము కలుగునా యనుకొను చుంటి" నని పలికెను.

"ఓయీ! నేను ఋభుఁడనే. నీవు నాకుఁ జేసిన పూర్వసేవవలన నానందించి నీకు బ్రహ్మవిద్య తేటతెల్లముగ నుపదేశింప వచ్చితిని. నీ కేమైన సంశయము లున్నచో నడుగుము. తీర్చి పోవుదును. పోయిన నిఁక మరల రా" నని చెప్పెను. అప్పుడు శ్రద్ధాభయభక్తులతో "మహాత్మా! సంసారసాగరము ననాయాసముగా దాఁటించు నాత్మనాత్మవివేకమును నాకుఁ దెలిపి కరుణింపు" మని నిదాఘుఁడు ఋభువును బ్రార్థించెను. సకలార్థ విదుఁడు, సర్వవేదాంతసారజ్ఞుఁడు, సర్వపూజ్యుఁడు, మహాత్ముఁడు నగుఋభు విట్లు తెలిపెను; "వత్సా!

సర్వవాక్యములకు నవధిభూత మగుబ్రహ్మము, సర్వచింతావధియగు గురువు, సర్వకారణకార్యములకు నాత్మ, కార్య కారణవర్జితుఁడు, సర్వసంకల్పరహితుఁడు, సర్వనాదమయుఁ డగుశివుఁడు, సర్వమాయావర్జిత చిన్మాత్రస్వరూపుఁడు, సర్వానందమయుఁడు, పరుఁడు, సర్వతేజఃప్రకాశాత్ముఁడు, నాదానందమయాత్మకుఁడు, సర్వానుభవనిర్ముక్తుఁడు, సర్వధ్యానవివర్జితుఁడు, సర్వనాదకళాతీతుఁడు, అవ్యయుఁడు నగుఆత్మనే నేను. ఆత్మానాత్మవివేకాది భేదాభేదవివర్జితుఁడు, శాంతాశాంతాది హీనాత్ముఁడు, నాదాంతర్జ్యోతిరాత్మకుఁడు, తత్త్వమస్యాదిమహావాక్యార్థ దూరుఁడు, బ్రహ్మాస్మిమున్నగువాక్యముల కతిదూరుఁడు, తచ్ఛబ్దవర్జ్యుఁడు, త్వంశబ్దహీనుఁడు, అసివాక్యాంత వర్జితుఁడు, క్షరాక్షరవిహీనుఁడు, నాదాంతర్జ్యోతి యగు నాత్మను నేనే. ఆత్మ యనెడిశబ్దము లేనివాఁడు, ఆత్మ శబ్దార్థము లేనివాఁడు, సత్యజ్ఞానానందస్వరూపము లేనివాఁడు నగుఆత్మయే సనాతనుఁడు. నిర్దేశింప శక్యముకానివాఁడు, వేదవాక్యములకైన నగమ్యుఁడు, బాహ్యాభ్యంతరములు లేనివాఁడు, ప్రపంచమంతయుఁ దనస్వరూపమైనవాఁడు నగుఆత్మను నేనే. నామరూపాదికము కాని, భోజ్యము భోగ్యము భుక్కు కాని, సదసద్స్థితి కాని క్షరాక్షరస్థితి కాని లేనియాత్మనే నేను. గురుశిష్యాది భేదరహితము, దేవలోకము, సురాసురులు నను భావము లేనిది, ధర్మాధర్మములు శుద్ధాశుద్ధములు లేనిది, కాలాకాలములు, నిశ్చయసంశయములు, మంత్రామంత్రములు, విద్యావిద్యలు లేనిది, ద్రష్టృదృశ్యము లనుప్రసంగము లేనిది అగునాత్మను నేను. దేహత్రయము కాని కాలత్రయము కాని లోకత్రయముకాని నాకు లేదు. నాకుఁజిత్తము లేనందునఁ జింతలేదు. దేహము లేనందున జరలేదు. పాదములు లేనందున గమనము లేదు. హస్తములు లేనందునఁ గ్రియలు లేవు. జర లేనందునఁ జావు లేదు. బుద్ధి లేనందున సుఖాదికము లేదు. ధర్మములేదు. శుచి లేదు. సత్యము లేదు. భయము లేదు. అక్షరోచ్చారణము లేదు. గురుశిష్యాదికము లేదు. ఒకభావమే లేదు. కాన రెండవభావ మంతకంటెను లేదు. సత్య మున్న దన్నఁగొంచె మసత్య ముండవచ్చును. కనుక, సత్యమే లేదు. అసత్య మున్న దన్నను సత్యముండును. కనుక, అసత్య

త్వము లేదు. శుభాశుభములు, అశుభాశుభములును లేవు. భయము, అభయము, బంధము, మోక్షము ఇది అది యనెడివ్యవహారము ఉండుట, లేకుండుట, కార్యము, కారణము, ద్వైతము, అద్వైతము దృక్కు, దృశ్యము, అంతరము, బాహ్యము, పూర్ణత్వము. నీవు, నేను ఇది అది అనువ్యవహారము—ఇవి యెంతమాత్రము నాకు లేవు. అట్లే నీవును జగత్తంతయు బ్రహ్మమాత్రమే. నేనును బ్రహ్మస్వభావమాత్రుఁడను. కేవలచిన్మాత్రస్వరూపుఁడ నని యెఱుంగుము.

ఈప్రపంచము లేనే లేదు. ఇది పుట్టలేదు. పుట్టఁబోదు. చిత్తమునే ప్రపంచ మందురు. అది యెన్నఁటికిని లేనేలేదు. ప్రపంచము లేదు. చిత్తము లేదు. అహంకారము లేదు. జీవుఁడు లేఁడు. మాయ లేదు. దేహము లేదు. భయము లేదు. కర్త, క్రియ, శ్రవణము, మననము, సమాధి, ప్రమాత, ప్రమాణము మున్నగున వేమియును లేవు. అజ్ఞానము, అనుబంధము, అవివేకము, బంధత్రయము ఏమి యును లేవు. గంగ లేదు. గయ లేదు. సేతువు లేదు. భూతము లేదు. భూమి లేదు. నీరు లేదు. నిప్పు లేదు. గాలి లేదు. ఆకాశము లేదు. దేవతలు లేరు. దిక్పాలకులు లేరు. వేదము లేదు. గురువు లేఁడు. దూరము లేదు. దగ్గఱ లేదు. తుది లేదు. మొదలు లేదు. అంతము లేదు. అద్వైతద్వైతసత్యములు, బంధమోక్షములు లేవు. జాతి లేదు. గతి లేదు. వర్ణము లేదు. లౌకికము లేదు. సర్వం బ్రహ్మ మను వ్యవహారము లేదు. బ్రహ్మ మను వ్యవహారము లేదు. చిత్తనెడివ్యవహారము, నేను చిత్తునెడిమాట, బ్రహ్మాస్మియనుపలుకు, నిత్యశుద్ధుఁడ ననుట యేమియు లేవు. వాక్కుచే నే లవమో చెప్పఁబడునది, మనసుచే నే లవమాత్రమో యోచింపఁబడునది, బుద్ధిచే నే లవలేశమో నిశ్చయింపఁబడునది లేనే లేదు. చిత్తముచే నెఱుఁగఁబడునది లేదు. యోగియోగాదికము లేదు. సర్వదా సర్వము లేవు. అహోరాత్రమాస సంవత్సర యుగకల్పాదికము లేదు. స్నానధ్యానజపాదికము లేదు. భ్రాంతి అభ్రాంతి లేవు. వేదశాస్త్రపురాణములు, కార్యకారణములు, ఈశ్వరుఁడు, లోకము, భూతము, జనము ఐక్యము మున్నగున వెల్లమిథ్యాత్మకములు. వాక్కుచేఁ జెప్పఁబడునది, సంకల్పముచేఁ గల్పితమైనది,

మనస్సుచేఁ జింతింపఁబడునది, బుద్ధిచే నిశ్చయింపఁబడునది అన్నియు మిథ్య. శాస్త్రములవలనఁ దెలుపఁబడునది, నేత్రములచేఁ జూడఁబడునది, చెవులచేఁవినఁబడునది, ఇంద్రియములచే గ్రహింపఁబడునది - సమస్తము మిథ్య. సర్వము సంకల్పసంభవమే. నాది నీది, నాకు నీకు, నాకై నీకై, నాచే నీచే - ననువ్యవహారాదిక మెల్ల మిథ్య. "విష్ణువు రక్షకుఁడు, బ్రహ్మసృష్టికర్త, రుద్రుఁడు సంహారకుఁడు." ఇట్టిభావనావ్యవహారమంతయు మిథ్య. స్నానజపతపోహోమస్వాధ్యాయదేవపూజనము, మంత్రతంత్రసత్సంగగుణ దోషవిజృంభణము, అంతఃకరణము, అవిద్య అనేక కోటిబ్రహ్మాండము లనున వెల్ల మిథ్యలు" అని యెన్నో విషయములు తెలిపెను.

అప్పుడు నిదాఘుఁ డానందమున "స్వామీ! మీ చెప్పినయరూప బ్రహ్మపదార్థమువలన నాకుఁ గలిగెడిమేలు లేదు. ఎఱుఁగఁదగిన ధర్మాదికము లేని బ్రహ్మమును నే నెట్లెఱుంగఁగలను? ఎఱిఁగినఁ గలుగుఫలమేమి? మఱియుఁదాము సెల విచ్చినట్లు నడచుకొన్నచో సర్వవర్ణాశ్రమ ధర్మసంకరము కలుగుచున్నది. మీరు చెప్పినబ్రహ్మ విజ్ఞానము గొప్పదే యగుఁగాక! అది యటుంచి నాకు సంసారబంధమునుండి విముక్తిఁ గలిగించుజ్ఞానము నుపదేశింపుఁ"డని ప్రార్థించెను. అపుడు ఋభుఁడు నవ్వి "వత్సా! ఐన, వినుము. బ్రహ్మము సగుణ మనియు, నిర్గుణ మనియు, నిష్ప్రతియోగిక మనియు మూఁడు విధములు. అందు సగుణము మాయోపాధిసహితము, తత్త్వమస్యాదివాక్యవాచ్యార్థమైనది, వర్ణనీయస్వభావముగలదియు, జీవేశ్వరవిభాగముచే ద్వివిధమునగుటను, జీవుఁడు త్రివిధవంతుఁడు. ఈశ్వరుఁడు త్రివిధవంతుఁడు గనుకను సగుణ బ్రహ్మవిషయము దురవగాహము. రెండవ దగునిర్గుణబ్రహ్మము తత్త్వమస్యాదివాక్యలక్ష్యార్థ మగుట ముముక్షువుల కుపాదేయము. మూఁడవ దగు నిష్ప్రతి యోగికబ్రహ్మము నెఱుంగనిదే ముముక్షువునకు స్వగత భేదము నశింపదు.

సంసారమోక్షసిద్ధికి నిర్గుణబ్రహ్మస్వరూపమును జెప్పెదను వినుము. ఆ నిర్గుణబ్రహ్మము నీవే!

"త్వమేవ పరమాత్మాఽసి త్వమేవ పరమోగురుః,
త్వమేవాకాశరూపోఽసి సాక్షిహీనోఽసి సర్వదా.
త్వమేవ సర్వభావోఽసి త్వంబ్రహ్మాఽసి న సంశయః,
కాలహీనోఽసి కాలోఽసి సదా బ్రహ్మాఽసి చిద్ఘనః."

నీవే పరమాత్మవు. నీవే పరమగురుఁడవు. నీవే ఆకాశస్వరూపుఁడవు. నీవే సాక్షిహీనుఁడవు. సర్వభావములును నీవే. నీవే బ్రహ్మము. సందేహము లేదు. కాలహీనుఁడవు, కాలరూపివి, చిద్ఘనుఁడవు నగునీవే బ్రహ్మస్వరూపుఁడవు.

నీవు సత్యము, సిద్ధుఁడవు, సనాతనుఁడవు, ముక్తుఁడవు, మోక్ష స్వరూపుఁడవు, ఆనందరూప అమృతుఁడవు, దేవుఁడవు, శాంతుఁడవు, నిరామయుఁడవు, బ్రహ్మస్వరూపుఁడవు, పూర్ణుఁడవు, పరాత్పరుఁడవు.

దేహము నేననెడిసంకల్పమునే అంతఃకరణమందురు. ఈ దేహము నేననెడి సంకల్పమే మహాసంసార మనఁబడును. ఇదియే బంధము, దుఃఖము, నరకము. దేహము నేననెడిబుద్ధియే అవిద్య, ద్వైతము, పరిచ్ఛిన్నము. ఇట్టి సంకల్పమే మహాపాపము. మనస్సే సమస్త ప్రపంచమును, మహాశత్రువు, మహాసంసారము. శబ్దస్పర్శరూపరస గంధాదు లన్నియు మనస్సువలనఁ బుట్టినవి. మనస్సే సర్వమును గల్పించును. మనసే పాలించును. మనసే స్మరించును. కనుక, మనస్సే సంసార కారణమైనది. మనస్సే సర్వమును స్మరించును, విస్మరించును. మనసుచేతనే సర్వము భావింపఁబడుచున్నది. లేదనఁబడుచున్నది. దూషణ భూషణ తిరస్కారములు, సుఖదుఃఖములు నివి మనోకల్పితములు. సర్వమునకు నిదానమైన సూక్ష్మమైన మనస్సు సత్యజ్ఞానానందస్వరూప మనుసముద్రమునందు మాయచేఁ గల్పింపఁ బడినది. నీ వజ్ఞానవిరోధి వగు నిత్యబోధ స్వరూపుఁడవు. సూర్యోదయముతోఁ జీకఁటి నశించునట్లు జ్ఞానోదయముచే నజ్ఞానము నశించును. నీవు సర్వవ్యాపకమై సత్యజ్ఞానా నందముఖ్యలక్షణ మైన నిస్సంశయమైన అద్వితీయబ్రహ్మవు. సత్యజ్ఞానా నందలక్షణ మైన నిర్గుణబ్రహ్మము ముక్తినిమిత్త మెఱుఁగఁదగును. తదన్యము అలక్షణవంతము కాదని చెప్పఁబడుట మఱవ వలదు.

ఓయీ; నిదాఘా! జాగ్రదాదివిలక్షణమై తురీయ బ్రహ్మరూప మగు నే జ్ఞానము నెఱిఁగి సంసారమునుండి తరింతువో ఆజ్ఞానమును మరలఁ జెప్పెద, వినుము. సాలెపురుగు నూలుపోగుల నెట్లు సృజించి నాశనము చేయునో అట్లే జీవుఁడు జాగ్రత్స్వప్నములనుగూర్చి పోవుచుఁ దిరిగి వచ్చుచున్నాఁడు. జీవుఁడు నేత్రమందున్నపుడు జాగ్రదవస్థ యనియు, కంఠమం దున్నపుడు స్వప్నావస్థయనియు, హృదయమం దున్నప్పుడు సుషుప్తి యనియు, శిరమునఁ నున్నపుడు తురీయ మనియు గ్రహింప వలెను.

> యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ,
> ఆనందమేతజ్జీవస్య యజ్జాత్వా ముచ్యతే బుధః.
> సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్,
> ఆత్మవిద్యాతపోమూలం తద్బ్రహ్మోపనిషత్పదమ్.

ఏ నిర్గుణబ్రహ్మస్వరూపమునుండి వచస్సు మనస్సుతోఁ గూడ బ్రహ్మము నందక వే అగుచున్నదో, మఱి యే యానందము నెఱిఁగి పండితుఁడు బంధవిముక్తుఁ డగుచున్నాఁడో ఆ యానందమే జీవునిది. పాలయందలి నేయివలె దేహమునఁ గల సర్వవ్యాపి యైనయాత్మను ఆత్మ విద్యకును తపమునకును మూలమైన ఉపనిషత్ప్రానభూతమైన బ్రహ్మమునుగా నెఱుంగుము."

## నిదాఘుఁడు మరలఁ బ్రశ్నించుట

ఇది విని నిదాఘుఁడు "దేవా! 'యతోవాచో నివర్తంతే' అన్న శ్రుతివలన నానందము బ్రహ్మమునకుఁ జెప్పఁబడెను. ఇపుడు జీవునకుఁ జెప్పితిరి. ఆనందమయ సంజ్ఞ గలజీవునకు శ్రుతియం దానందము చెప్పఁబడినను, ఆ యానందమయము హేయగుణక మగుటవలన నది జీవునిది కాదు. అందలి యవాఙ్మనసగమ్యత జీవునకుఁ గాదు. ఆ శ్రుతి యందలి యానందమునకు వేద్యత్వము చెప్పఁబడినది. అది బ్రహ్మము నకుఁ జెప్పుట యుక్తముకాదు గదా?" అని ప్రశ్నించెను. ఋభువు చిఱునవ్వు నవ్వి యిట్లుపలికెను. "ఓయీ! ఏ కారణమున మోక్షాతీత

దశయందు జీవుఁడు బ్రహ్మత్వమును పొందునో ఆ కారణమున అవాఙ్మనసగోచర మగుబ్రహ్మము జీవశబ్దముచే చెప్పఁబడినది. కనుక, పంచకోశవికారి యగుజీవునకు స్వయంశబ్దార్థభూతమై ఆత్మస్థానీయ మగు నానందము వేద్యము. ఈపంచకోశములే జాగ్రదాదు లగుమూఁడవస్థలు. జాగ్రత్స్వప్నసుషుప్తులు. తదన్యము జ్ఞానానందమయస్వరూపము తురీయము. పైమూఁడవస్థలకు విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు నను వారు వరుసగా అభిమానులు. తదన్యుఁడు ప్రభువై నకూటస్థుఁడు. విశ్వుఁడు బహిఃప్రజ్ఞ గలవాఁడు; తైజసుఁ డంతఃప్రజ్ఞ గలవాఁడు. ప్రాజ్ఞుఁడు ఘనప్రజ్ఞగలవాఁడు. ఒకేజీవుఁ డిట్లు త్రివిధముగ నున్నాఁడు. విశ్వుఁడు కుడికంటి చివర, తైజసుఁడు మనస్సున, ప్రాజ్ఞుఁడు హృదయాకాశమున నొకేజీవుఁడు త్రివిధముగ నున్నాఁడు. విశ్వుఁడు స్థూలప్రపంచమును, తైజసుఁడు సూక్ష్మప్రపంచమును; ప్రాజ్ఞుఁ డానందమును ననుభవించును. స్థూలప్రపంచము విశ్వుని, సూక్ష్మప్రపంచము తైజసుని, ఆనందము ప్రాజ్ఞుని తృప్తిపఱుచును. కూటస్థుఁడు జీవునిమూలమున కర్మఫలభోగానుభవము నందుచున్నట్లు చెప్పఁబడినను అవి వాని నంటవు. కూటస్థుఁ డగుపురుషుఁడు విశ్వతైజసప్రాజ్ఞులకుఁ గారణము. సూర్యుఁడు జలమునఁ బ్రతిబింబించి యనేకవిధములఁ దోఁచినట్లు ప్రాణుఁ డనుపురుషుఁడు చైతన్యాత్మక జీవులను సర్వప్రపంచమును బ్రత్యేకించి పుట్టించుచున్నాఁడు. విశ్వతైజసులు స్వప్ననిద్రలు కలవారు. ప్రాజ్ఞుఁడు స్వప్నము లేని నిద్రతోఁ గూడినవాఁడు. సత్యవస్తువు నన్యవిధమునఁ గాంచుట స్వప్నము. తత్త్వము నెఱుంగకపోవుట నిద్ర. ఆ రెండిటి క్షీణతయే తురీయము. అనాది యగుమాయచే నిద్రించి యుండుజీవుఁడు జాగ్రత్స్థితిం జెందినపుడు పుట్టుక లేని ద్వైతశూన్య మైనస్వప్నము కాని నిద్ర కాని తురీయస్వరూపము నెఱుంగును. తురీయాత్మ జ్ఞానోదయమైనను దేహేంద్రియాదిప్రపంచ మున్నదా యున్న నది మాయాస్వరూపము. పరమార్థ మరయ నద్వైతమే కాని ద్వైతము లేదు."

నిదాఘుఁడు "దేవా! బ్రహ్మము ద్వివిధ మని మీరు పేర్కొనిరి కదా! అట్టి మీ కద్వైతశబ్ద మిపు డెట్లు సమ్మతమైనది?" అని ప్రశ్నించెను. అంత ఋభుమహర్షి 'వత్సా! ద్వైతప్రపంచశూన్యమై పూర్ణ చిద్ఘనమైన

నిర్గుణ బ్రహ్మమం దేకారణమున నద్వైత సంసిద్ధి కలుగుచు తదితరము నందు కలుగదో ఆ కారణమువలన సరూపారూపము లచే బ్రహ్మము ద్వివిధ మని వాదించునాకే అద్వైత వాదిత్వ మర్హముకాని అరూపాద్వైతవాదికి అద్వైత వాదిత్వమున కర్హతలేదు. ద్వైతాద్వైత మిశ్రమముల కతీతమై వ్యవహారాదుల కగోచర మైనయరూపబ్రహ్మమం దద్వైతవాదము కలుగదు.

ఓయీ! జాగ్రదవస్థయం దుండుస్థూలదేహము నన్నమయకోశము గను, స్వప్నావస్థయం దుండుసూక్ష్మదేహము ప్రాణమనోవిజ్ఞానమయ కోశముగను గ్రహింపుము. సుషుప్త్యవస్థయం దుండుకారణదేహమును ఆనందమయ కోశముగను, తురీయమం దశరీర మైనకోశవర్జితమును కూటస్థునిగను నెఱుంగుము. ఆ కూటస్థుఁడే మాయచే మోహితాత్ముఁడై చిదాభాసరూపమున దేహమునందుండి సర్వకర్మలు చేయుచున్నాఁడు; స్త్రీఅన్నపానాది విచిత్రభోగములచే జాగ్రదవస్థయందుఁ దృప్తిపడు చున్నాఁడు. జీవుఁడు మాయచేఁ గల్పిత మగుసంసారరూప స్వప్నావస్థ యందు సుఖదుఃఖభోక్త యగుచున్నాఁడు. సుషుప్తివేళ నింద్రియము లెల్ల లయింప నజ్ఞానాంధకార తిరస్కృతుఁడై సుఖరూపము నందు చున్నాఁడు. ఆ జీవుఁడే పూర్వజన్మకర్మ సంబంధమువలన సుషుప్తినుండి జాగ్రదవస్థ నందుచున్నాఁడు. శరీరత్రయమున క్రీడించుజీవునివలనఁ జిత్రాతిచిత్రకృత్యములు చేయఁబడుచున్నవి. ఏ చిదాత్మ యందు శరీరత్రయము లయ మందునో, ఏది సర్వవేదాంత రహస్యతత్త్వమో, ఏది పరిపూర్ణచైతన్యరూపమున చిదాభాసుని నిజస్వరూపమో అది సర్వా ధారానందాఖండ బోధస్వరూపము. ఈ చిదాత్మవలననే ప్రాణమనస్స ర్వేంద్రియములు పంచభూతములు పుట్టుచున్నవి. ఏ చిదాత్మ పరబ్రహ్మ స్వరూపమో, సూక్ష్మాతిసూక్ష్మమో, నిత్యమో అదే నీవు. నీవే అది. జాగ్ర త్స్వప్న సుషుప్త్యాది ప్రపంచము నే చిద్రూపము ప్రకాశింపఁజేయు చున్నదో ఆ బ్రహ్మము నేనని యెఱిఁగిన సర్వసంబంధములు నశించును.

మూఁడు శరీరములందలి భోజ్యభోక్తృభోగాదు లన్నిఁటికిని విలక్ష ణుఁడను, సాక్షిని, చిన్మాత్రుఁడను, సదాశివుఁడను నేనే. నా యందే సర్వము పుట్టి యంటి నశించు చున్నది. నే నణువుకంటె నణువును,

మహత్తును, విశ్వరూపిని, పురాణపురుషుఁడను, పరమేశ్వరుఁడను, హిరణ్మయుఁడను, శివరూపిని. నేను పాణిపాదములు కలవాఁడను గాను. అచింత్య శక్తుఁడను. కన్నులులేక చూచెదను. చెవులు లేక విందును, తెలిసికొందును. నేను నిస్సంగుఁడను. చిద్రూపుఁడను. నేనే వేదవేదాంతవేద్యుఁడను. వేదవేత్తను. వేదకర్తను. నాకుఁ బుణ్య పాపములు లేవు. నాశము లేదు. జన్మములేదు. దేహబుద్ధి లేదు. పృథివ్యప్తేజో వాయ్వాకాశములు నాకు లేవు.

ఇట్లు జీవుఁడు పంచకోశాత్మకగుహయందు శయనించిన నిష్క ళాద్వయపరమార్థస్వరూపము నెఱింగి —

" అఖండమాద్యంతవిహీనమేకం
తేజోమయానంద ఘనస్వరూపమ్,
సమస్తసాక్షిం సదసద్విహీనం
ప్రయాతి శుద్ధం పరమాత్మతత్త్వమ్. "

అఖండమై, యాద్యంతములు లేని, అద్వితీయమైన, తేజోమయానంద ఘనస్వరూపమైన, సకలసాక్షియైన సత్యాసత్యవ్యవహారము లేని స్వరూ పము కలిగిన శుద్ధపరమాత్మ తత్త్వమును బొందుచున్నాఁడు."

ఇట్లు ఋభుమహర్షి చేసిన నిర్మలబోధమును విని నిదాఘుఁడు సంశయరహితుఁడై బ్రహ్మజ్ఞుఁడై వెలింగెను.

---

# మహర్షుల చరిత్రలు

## కాత్యాయనమహర్షి

### వంశము

కాత్యాయనమహర్షికి మూఁడువిధము లగు వంశోత్పత్తి కాననగు చున్నది. కాత్యాయనుఁడు విశ్వామిత్ర వంశజుఁ డనున దొకటి; గోభిల పుత్రుఁడనున దింకొకటి. కతవంశమునఁ బుట్టినసోమదత్తుఁ డను బ్రాహ్మణునకు వసుదత్త యను భార్యయందుఁ గలిగినపుత్త్రుఁడు కాత్యా యనుఁ డనియు నీతఁడే వరరుచి యనుపేరఁ బ్రఖ్యాతిగాంచె ననియు మూఁడవది *

మంత్రద్రష్టగా ధర్మశాస్త్రస్రష్టగా పాణినీయ వ్యాకరణవార్త్తిక కర్త్తగాఁ గాత్యాయనమహర్షి పేరు ప్రఖ్యాతమై యున్నది. ఈ మువ్వ రును వేఱా లేక యొక్కరా యన్నది పరిశీలనార్హము. స్కాందపురాణో త్తరఖండమున బుధకవచస్తోత్ర మహామంత్రమునకు ద్రష్ట కాత్యాయన మహర్షి యని కలదు: కాత్యాయన స్మృతియందుఁగాత్యాయనస్మృతి గోభిలప్రోక్త మని యున్నది; కాత్యాయన మహర్షి వాక్యకారుఁ డగువర రుచియేయని కథాసరిత్సాగరాదులయం దున్నది.

---

* "కతస్యగోత్రాపత్యం స చ త్రివిధః ।

1. విశ్వామిత్ర వంశ్యః
2. గోభిలపుత్రః
3. కతవంశ్య సోమదత్త ద్విజపుత్రః

వసుదత్తా గర్భజః వరరుచినామ్నాఖ్యాతశ్చ..." సంస్కృత వాచస్పత్యము.

## జననము

తొల్లి పార్వతీపరమేశ్వరులను భయభక్తి యుక్తులతోఁ బుష్ప దంతుఁ డను మహనీయుఁడు పూజించుచుండెను. కాలక్రమమున నాతఁడు శివకింకరులలో నగ్రేసరుఁడై శివునికి మిగులఁ గూర్చువాఁడై యుండెను.

కాని, దురదృష్టవశమున నాతఁ డంబశాపము నంది భూలోకమున మర్త్యుఁడై పుట్టవలసివచ్చెను. శివుఁ డాతని నాదరించి "వత్సా! విచా రింపకుము. ఉత్తముల కోపానుగ్రహములు రెండును లోకహితంకర ములే యగును. నీవు కాత్యాయనుఁడు వరరుచి యనునామములతో నొకయుత్తమ విప్రుని కాతని ధర్మపత్నియం దుద్భవింపఁగలవు. నీవు శాస్త్రకర్తవై లోకహితమును గూర్చిన పిదప నాయంశమునకు శరీరము నొసఁగి నీశాపవిమోచనకై పంపఁగలను. అపుడు నీవు నన్నుఁ జేరఁ గలవు. కావున విచారింపకు" మని యోదార్చి భూలోకమునఁ బవిత్ర బ్రాహ్మణవంశమునఁ బుట్టనను జ్ఞ నొసంగెను. పుష్పదంతుఁడు శివుని పాదపద్మములకు మ్రొక్కి "మహాదేవా! నీ పాదభక్తితో నిలువఁగలిగిన నాఁడు నే నెన్నిజన్మము లెత్తుటకైనను పనుదీయను. దయచూడు" మని యంతర్హితుఁ డయ్యెను.

ఆ కాలమున భారతదేశమునఁ గౌశాంబి యను నొక మహానగర ముండెను. దానిని జేరి యొకపవిత్రమగు బ్రాహ్మణాగ్రహార ముం డెను. అందు కతుఁడను వంశమువాఁడు సోమదత్తుఁ డనుమహాతప శ్శాలి యుండెను. ఆతనికి 'అగ్నిశిఖుఁ' డని మఱియొకపేరు గలదు. ఆతఁడు ఋగ్యజుర్వేదములు సంపూర్ణముగా నేర్చి ఋజువర్తనమున మిక్కిలి ప్రసిద్ధి నంది కౌశాంబీపుర మేలురాజు తన్ను దేవుఁడని భావించి సేవించుచుండ నెడతెగని శివభక్తిగలవాఁడై విలసిల్లుచుండెను. కాలక్రమ మున నాతఁడు వసుదత్త యను పేరు గల కన్యకారత్నమును భార్యగాఁ బరిగ్రహింపఁ వివాహమాడెను. ఆ పుణ్యదంపతులు పదునాఱు సంవత్స రము లతిపవిత్ర మగుదాంపత్య జీవితమును గడపిరి. సత్పుత్రు నొకనిఁ బడయుటకై వారు నోచిన నోములు, చేసినవ్రతములు, కావించిన

యుపవాసములు లెక్కకు మిక్కిలి యయ్యెను. ఇట్లుండ నంబశాపము ఈశ్వరునోదార్పు గన్న పుష్పదంతుఁ డను శివకింకరుఁడు సోమదత్తుని జేరి వసుదత్త గర్భమును బ్రవేశించెను. శుక్లపక్ష చంద్రునివలె నామె గర్భమునఁ బెరిగి నవమాసములు నిండినపిదపఁ బుష్పదంతుఁడు కుమారుఁడై జన్మించెను. ఆ పుణ్యదంపతుల యానందమున కవధి లేకుండెను. సోమదత్తుఁ డాతనికి జాతకర్మాదు లొనరించి కాత్యాయనుఁ డనియు వరరుచి యనియుఁ బేరిడెను. కతునివంశమువాఁ డగుటచేఁ గాత్యాయనుఁ డని మంచితేజస్వి యగుటచే వరరుచి యనియు రెండు పేళ్లు నాతనివట్ల నన్వర్థ నామధేయము లయ్యెను. అప్పు డాకాశవాణి యానందాతిశయమున "వీఁడు శ్రుతధరుఁడగును. వర్షుని శిష్యుఁడై వ్యాకరణశాస్త్రమును వృద్ధిచేయును. కాత్యాయన వరరుచి నామముల నపారఖ్యాతి నార్జించు" నని ఘోషించెను.

సోమదత్తుఁ డట్టి పుత్రుఁ డుద్భవించినందుల కమితానంద మంది యుండెను. కాలక్రమమున బాలుని కైదవయేఁడు రాఁగానే సోమదత్తుఁడు మరణించెను. పాపము తనయుని యున్నతి కనులారఁ జూచు భాగ్య మాతనికి లేకపోయెను. అవివేకి యగు మానవుఁడు మృత్యుముఖమునఁ నివాసమున్నమాట మఱచి ధనములపైఁ దనయులపైఁ దరుణులపై నడియాసలు పెట్టుకొని "మీఁదటి కింతలాభము వచ్చును. ఏఁడాదిలో నాకొడు కింతవాఁ డగును. పదేండ్లలో నే నింత భాగ్యవంతుఁడ నగుదు" నని యేమేమో యాకాశ సౌధములు నిర్మించుకొనుచుండునంతలో నే రాత్రియో యిహలోకమును విడిచినవాఁ డగును.

చేయునది లేక చిన్నారిబిడ్డను బెంచుకొనుచు వసుదత్త భర్త్రుమరణదుఃఖమును దిగమ్రింగుకొని కాలముఁ గడపుచుండెను. ఇంతలోఁ గాత్యాయనున కుపనయన కాల మేతెంచెను. కాని, వసుదత్త యాకాశవాణి చెప్పిన వర్షుఁ డను గురు వెవరో యెట నుండునో యెఱుఁగక పుత్రుని కుపనయనము చేయలేక యింటనే యుంచుకొనెను.

ఆ కాలమున వేతస మనుపురమున నిద్ద ఱన్నదమ్ము లుండెడివారు. వారు మహావిద్వాంసులు. ఒకఁడు దేవస్వామి. రెండవవాఁడు కరంభుఁడు.

దేవస్వామికి ఇంద్రదత్తుఁడు కరంభునకు వ్యాడి యనునిరువురు పుత్రు లుదయించిరి. తదనంతరము కరంభుఁడు కాలగతినందెను. ఆ యెడఁ బాటు సహింపలేక యన్నయగు దేవస్వామియు మహాప్రస్థాన మొనర్చి దేహత్యాగము చేసెను. వారిద్దఱి భార్యలు వెంటనే సహగమనముచేసిరి. ఆ బాలు రిరువురు ననాథులై తమ తండ్రుల విద్యావిశేషములను విని తాముసు బండితులు గాఁ దలఁచి కుమారస్వామిని గూర్చి తపస్సు చేయ మొదలిడిరి. కొన్నాళ్ళ కాతఁడు వారికిఁ బ్రత్యక్షమై పాటలీపుత్రమునఁ గల వర్షుఁ డను గురువువలన సకలవిద్యలు లభించు నని చెప్పి యంతర్హి తుఁడయ్యెను. ఆ మాటలు విని యా బాలు రిరువురు బయలుదేరి పాటలీ పుత్రముఁ జేరిరి. అచట వారు వర్షుఁడను నుపాధ్యాయునిఁగూర్చి వాకబు చేయఁ దొడఁగిరి. "వర్షోపాధ్యాయు లెచట నున్నారు. వర్షో పాధ్యాయు లెచటనున్నా?" రని వారు పౌరుల నడుగ నందుఁ గొందఱు "వర్షుఁ డనుమూర్ఖుఁ డొకఁడు మా యూర నున్నాఁడు. కాని వర్షోపా ధ్యాయుఁ డెవఁడు మా వీట లేఁ" డని పలికిరి. ఆ బాలు రామాటలు విని "పోనిండు. మూర్ఖుఁడో జ్ఞానియో అతనియిల్లెక్కడ?" అని యడిగి వా రొక జీర్ణపర్ణశాలఁజూప బాలు రందుఁ జొచ్చి వర్షునిభార్యను గాంచి "అమ్మా! వర్షోపాధ్యాయుల యిల్లిదియేనా?" అని యాతురతతో నడిగిరి. ఔ నని యామె తెలుప నా బాలురమిఱానంద మంది తమ సంగతి చెప్పి వర్షునిగుఱించి పౌరులు మూర్ఖుఁడని పలికినపలుకులకుఁ గారణ మేమని యడిగిరి. ఆమె యిట్లు చెప్పఁ దొడఁగెను.

"వత్సలారా! వినుఁడు, ధర్మాత్ముఁడై నందుఁ డనురాజు పరిపా లించు పాటలీపుత్ర మనుపురమును జేరిన దీ యగ్రహారము. ఇందుఁ దొల్లి శంకరస్వామి యనునొక బ్రాహ్మణోత్తముఁ డుండెను. ఆయన మా మామగారు. వర్షుఁడు, ఉపవర్షుఁడు నని ఆయన కిరువురు కొడుకులు. తొలియాయన నా భర్త. ఉపవర్షుఁడు నా మఱఁది. మఱఁది మహా విద్వాంసుఁడు. నా భర్త జడుఁడు. అది కర్మ మనుకొని నే నాతనినే భగవంతునిగాఁ బూజించుచుంటిని. ఉపవర్షుఁడు వివాహమాడి మా దారిద్ర్యమునకు వగచి భార్య కిష్టము లేకున్నను మా దంపతులను దన యింట నిడుకొని పండ్రెండేఁడులు పోషించెను. ఇట్లుండ నా తోడికోడలు

నన్నును నా భర్తను నెన్నోవిధములఁ బరాభవించెను. నే నొకనాఁడు పట్టలేక భర్తను నిందించి తరువాతఁ బశ్చాత్తప్తనై క్షమింపవేఁడుకొంటిని. నా భర్త దిగులుపడి నాతోఁ జెప్పక విద్యానిమిత్తము హిమగిరి కరిగి పరమశివుని గుఱించి తపస్సు చేయఁదొడఁగెను. భర్త యెడఁబాటునకుఁ బరమదుఃఖితురాల నగునన్ను మఱఁది యూఱడించి యాదరించుటచే నెట్లో కాలము గడపుచుండ నైదేండ్లకు నా భర్త తిరిగివచ్చెను. తమ్ముఁడు, భార్యయు నాతనిం బూజించిరి. నేను సంతోషించితిని. అపుడు నా భర్త తనకు హిమగిరిపై గుమారస్వామి ప్రత్యక్షమై "శ్రుతధరుఁ డనుశిష్య రత్నము నీకడకు వచ్చును. ఆతనికి నీవు ఓంకారముతో వేదము చెప్ప నారంభించినంతనే నీకు సకల విద్యలు కరతలామలక మగు" నని చెప్పి యంతర్హితుఁడయ్యె నని తెలిపెను. ఆ శిష్యుఁడింతవఱకు రాలేదు. ఆతని రాకఁ గోరి యీ శిథిలగృహమునఁ గాలక్షేపము చేయుచున్నాము. మీరు విద్యకై యాతనిఁ గని కొనివచ్చి యాతనితోఁ జదువవచ్చును."

ఆ మాటలు విని యా బాలురు కుమారస్వామివరము పొల్లుకాదని ధైర్య మవలంబించి లోని కరిగి సమాధి ప్రవతస్థితుఁ డగు వర్షునిఁ గని నమస్కరించి నిశ్శబ్దముగ మరల బయటికి వచ్చి యాతనిభార్యతో "అమ్మా! మే మాతనిఁ గొనివత్తుము. సెలవొసఁగు" మని యామె యానఁ గాంచి బయలుదేఱిరి. వారు తిరుగనినేల లేదాయెను. ఎక్కడను శ్రుతధరుఁడు కనరాఁడాయెను. తుదకు వారు విసిగి వేసారి తిరుగుచు నొకరాత్రి కీర్తిశేషుఁడగు సోమదత్తునింటికి వచ్చి యాతిథ్యమును గోరిరి. వసుదత్త వారి నాదరించి యన్నము పెట్టెను. వారు తిని యరుగుపైఁ బరుండిరి. ఇంతలో నెటనుండియో యొకపెద్దమద్దెల ప్రమోఁత విన వచ్చెను. ఆ ధ్వని విని లోన వసుదత్త బిడ్డనితో "నాయనా! నందుఁడను నటశేఖరుఁడొకఁ డీ పీట నీ రాత్రి నాట్యమాడును. అతఁడు నీ తండ్రికిఁ బ్రియమిత్త్రుఁడు. అతఁ డీ యూరెపుడు వచ్చినను మనయింటికే వచ్చెడి వాఁడు. కాని, ఈసారి మీతండ్రి లేకపోవుటచే రాలే" దని కన్నీరు మున్నీరుగా భర్తను గూర్చి యేడ్చెను. అపుడామె కొడుకు "తల్లీ! విచారింపకుము. నేను నందునినాట్యము చూడ నేఁగెదను. అతఁడాడిన నాట్యము నెల్ల జేపుదయము నీ కడ నేను 'తు' 'చ' తప్పకచూపఁగల"

నని పలికెను. ఈ సంభాషణమును వినుచున్న వ్యాడీంద్రదత్తులకు శ్రుతధరుఁడు (=ఏకసంధాగ్రాహి) అతఁడే కా నోపునని తోఁచెను. వెంటనే వారు లోని కేఁగిరి. వ్యాడి బాలుఁడగు కాత్యాయనునిఁ జూచి “ఏదైన నొకసారి విన్న నొప్పగింపఁ గలవా?” అని యడిగెను. “ఆఁ” యని యాతఁడు బదులుచెప్పెను. అతని తల్లి యాతఁడు బాల్యము నుండి ఏకసంధాగ్రాహిగనే యున్నాఁడని చెప్పెను. వ్యాడి యొక ప్రాతిశాఖ్యమును జదివి యొప్పగింపు మన బాలుఁ డగు కాత్యాయనుఁడు తడవుకొనకుండఁ దప్పకుండ నొప్పగించెను. వ్యాడీంద్రదత్తులు మనోరథము తీరనున్న దని యానందించి కాత్యాయనుని గూడి యా రాత్రి నాట్యమున కేఁగిరి. నాట్యమైనంత మువ్వురును దిరిగి యింటికి వచ్చిరి. మఱునాఁ డుదయమే కాత్యాయనుఁడు రాత్రి నాట్యవాద్య సంగీతముల నన్నిఁటిని ‘తు’ ‘చ’ తప్పకుండఁ దల్లి యెదుటఁ బ్రదర్శించెను. రాత్రి నందుని నాట్యమునకు నీతని నాట్యమునకు నీషద్భేదము లేనికారణమున వ్యాడీంద్రదత్తు లమితానంద మంది తమసంగతి యంతయు నా తల్లికిఁ బిల్లవానికిఁ జెప్పి యామెవలన వారి యావద్వృత్తాంతము విని యాతనిం దమతోఁ బంపుమని యామెనుఁ గోరిరి. ఆమెవల్లె యనెను. వారటనాఁగి మఱునాఁడు కాత్యాయనునికి యథాశాస్త్రముగా నుపనయన సంస్కార మొనరించి యాతని తల్లియనుమతిఁ గొని కాత్యాయనునితో బయలుదేఱి పూవులలోఁ బెట్టినట్లాతనిఁ దీసికొని వర్షుని గృహమునకు వచ్చుచుండిరి. దూరమునుండియే వర్షుని భార్య యా మువ్వురను గాంచి స్వాగత మిచ్చి బ్రహ్మానందురాలై వారి నాదరించెను. వ్యాడీంద్రదత్తులు కాత్యాయనుని దీసికొని వచ్చి గురుపత్నికి గురునకు మ్రొక్కించి తాము మ్రొక్కిరి.

పరమచిత్రముగా వర్షుఁడు తన కున్న జడిమ యంతయు విఱియఁగా వారల మువ్వురను జేరఁదీసి వారచరిత్ర లెఱిఁగి యానందమున నొక శుభముహూర్తమునఁ దాను బ్రాతఃకృత్యముల నెల్ల నిర్వర్తించి దర్భాసనమునఁ గూర్చుండి తామును సర్వము నిర్వర్తించినశిష్యుల నెట్టయెదుటఁ గుశాసనములఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రక్క భార్య మిక్కిలి కుతూహలమున నిలువ, తూర్పుగఁ దిరిగి పవిత్రమును ధరించి

గురువులను గుమారస్వామిని భజించి తత్కరుణ శ్రుతిస్మృతిజ్ఞానము కలుగ "అగ్నిమీడే పురోహితమ్" అను ఋక్కును సస్వరముగ సుస్వరమున నొక్కసారి పఠించెను. వెంటనే కాత్యాయనుఁడు దానిని గ్రహించి యొప్పగించెను. తరువాత వ్యాడి యొప్పగించెను. పిదప నింద్రదత్తుఁడు దానిని జదివెను. ఏకసంథాగ్రాహి కాత్యాయనుఁడు, ద్విసంథా గ్రాహి వ్యాడి, త్రిసంథాగ్రాహి యింద్రదత్తుఁడు నైరి. ఇట్లు రెండు గడియలలో నిరువది సూక్తములు వారు పఠించిరి. ఈ సంగతి విని వచ్చి చూచి యుపవర్షుఁ డన్నకు సాష్టాంగ నమస్కారము లొనరించెను. పిమ్మట వా రట్లొక సంవత్సరములో మూఁడువేదములు శాఖలతోఁ గూడ గ్రహించిరి.

ఆ మహనీయులఖ్యాతి యెల్లెడల క్షణములో వ్యాపించెను. పాటలీపుత్ర మేలునంరాజానందమున వారిని జూడవచ్చి పాదచారియై సమీపించిమ్రొక్కి వర్షోపాధ్యాయునియు నేకసంథా, ద్విసంథా, త్రిసంథా గ్రాహులగు శిష్యరత్నములయు ప్రజ్ఞా విభవమునకుఁ బరవశుఁడై తాను గావించిన పరీక్షలలో వారు సునాయాసముగ గెలువ వర్షు నేనుఁగంబారిపై నెక్కించి ప్రక్క శిష్యులం గూర్చుండఁ బెట్టి తానును మంత్రులు పరివారము పాదచారులై దారిలో పౌరస్త్రీలు లాజ లక్షతలు వర్షునిపైని శిష్యులపైనిఁ జల్లుచుండఁగాఁ దన యాస్థానమునకు సగౌరముగాఁ దీసికొనివచ్చెను. పిదప సర్వాలంకృతమైన యా యాస్థానమున నున్నత పీఠమున రాజు వర్షోపాధ్యాయుని గూర్చుండఁబెట్టి కవిగాయనగాయనీ స్వనములు మిన్నుముట్టుచుండఁ గనకాభిషేకము చేసెను. తదనంతరము రాజవీథి నొక శ్రేష్ఠరాజ మందిరమును వర్షోపాధ్యాయుని కొసంగి యందు శిష్యులకుఁ బాఠము చెప్పుచు నుండవలసినదనియు వారికి దిన దినము నొకనిష్కము నుపాయనముగను సర్వసంభారములను బంపెదనని యేర్పాటుచేసి యుపవర్షుని శిష్యుల నెల్లరను బహుభంగుల సమ్మానించి తాను వర్షోపాధ్యాయుని ప్రియశిష్యుఁ డయ్యెను.

పిదప శుభవేళ వర్షుఁడు పూరిగుడిసె విడిచి రాజభవనమునఁ బ్రవేశించెను. బంధుమిత్రులు వచ్చి యాతనిం జేరిరి. వర్షునిభార్య తనకు

ముప్వురుపుత్రు లని కాత్యాయనవ్యాడీంద్రదత్తుల జూపుచుఁ వారిని గన్నతల్లికి మిన్నగాఁ గంటికి ఱెప్పవలెఁ గాపాడుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు వర్షుఁ డింద్రకృతమగు శబ్దశాస్త్రమును శిష్యులకుఁ జెప్ప నారంభించెను. ఒక్క నెలలో శిష్యు లా శాస్త్ర మెల్ల నేర్చిరి. పిదప గురుఁడు వారికి జ్యోతిషము నిరుక్తము సంపూర్ణముగా నేర్పెను. వారు నిగర్వులై యింద్ర, చంద్ర, కాశకృత్స్న, పిశలి, శాకటాయనాదు లగుపూర్వశబ్ద శాస్త్రవేత్తలను సాంగోపాంగముగా విమర్శింపఁ దొడంగిరి. దేశవ్యాప్తముగ వర్షుని కీర్తిచంద్రికలు వ్యాపించుటవలనఁ బెక్కురువేలు శిష్యులు వచ్చి యర్థింప వారెల్లరి కాదరమేదురత నా యా శాస్త్రములఁ జెప్పి శిష్యులచేఁ జెప్పించి వర్షోపాధ్యాయుఁ డపరిమిత ఖ్యాతి నందెను. అతని ధర్మపత్నియు శిష్యవాత్సల్యమున, బంధుప్రీతిని, పాతివ్రత్యమున, యోగ్యతాగుణమున నమస్కారపాత్రురాలయ్యెను.

## కాత్యాయనుఁడు పాణిని నోడించుట

గాంధార దేశమందలి శలాతుర గ్రామమున పాణినుఁ డనునొక సదాచారసంపన్నుఁ డగుబ్రాహ్మణుఁ డుండెను. అతనికి దాక్షి యను ధర్మపత్నియందు పాణిని యనునొక కొడుకు కలిగెను. అతనికి యుక్తకాలమున నుపనయన మొనరించి తండ్రి విద్యనిమిత్తము వర్షోపాధ్యాయునికడకుఁ బంపెను. పాణినివచ్చి యితరశిష్యులతోఁ జదువమొదలిడెనుగాని, యాతని కొక్కయక్కరమైన రాదయ్యెను. చాలబుద్ధిమంతుఁడు, శ్రద్ధాభయభక్తియుతుఁడే. కాని, యాతనికి చదివిన పాఠము చదివినట్లే యుండెను. ఈ చెవి విన్నది యా చెవిఁ బోవుచుండెను. తన జడత్వమున కాతఁడు మిక్కిలి దుఃఖపడఁ జొచ్చెను. ఇట్లుండ నొకనాఁడు కాత్యాయనవ్యాడీంద్ర దత్తులు పాణిని పలికిన పలుకులందలి యపస్వరములకుఁ బకపక నవ్విరి. గురుఁడు వారిని మందలించి పాణినిని మన్నించెను. పాణిని బెంగగొని యాత్మహత్యా ప్రయత్నమున నుండ గురుపత్ని యాతనిని వారించి గురునివలెనే కుమారస్వామినిగూర్చి తపస్సు చేసి విద్యలు సంపాదింపు మని బోధించెను.

పాణిని యా తల్లిమాటలు పాటించి హిమాలయమున కరిగి కుమారస్వామిని గుఱించి మహాతపము చేయఁగాఁ జేయఁగా గుహుఁడు ప్రత్యక్షమై యాతనికిఁ బంచాక్షరిమంత్ర ముపదేశించి ప్రయాగయందలి యక్షయవటము క్రింద భగవంతుఁ డగు శివుని భజించిన నాతఁడు సమస్త మొసంగఁ గలఁడని చెప్పి యదృశ్యుఁ డయ్యెను. పాణిని యా మాటలఁ బాటించి గయ కేగి యక్షయవటముక్రిందఁ దప మాచరించు మునీంద్రులఁ జేరి వారియాజ్ఞ నంది తానును దప మాచరించుచు నుండెను. ఇటుండ నీతని దీక్షకుఁ దీవ్ర తపశ్చర్యకు మెచ్చి శివుఁ డనుగ్రహింపఁ బాణినికి విద్య అలవడెను. మఱింతభయభక్తులతో నాతఁ డింకను భజింప శివుఁడు ప్రత్యక్షమై సనకాదుల నొకవంక, పాణిని నొకవంకఁ జూచి తనచేతియందలి ఢక్కను పదునాల్గుసారులు మ్రో యించెను. అంతఁ బదునాలుగు శబ్దము లుద్భవించినవి. వాని కంత మున ణ క జా దివర్ణములు చేర్పఁగా 'అ ఇ ఉ' ణాదికసూత్రము లయ్యెను. వానిని వ్యాకృతికై పాణినికి, బ్రహ్మవిద్యకై సనకాదులకు శివుఁ డొసంగెను. వారివారి సంశయములను దీర్చుటకై నందికేశు నేర్పఱిచి శివుఁ డంతర్హితుఁ డయ్యెను.

శివునికరుణ వడసి పాణిని వ్యాకరణము రచించెను. విజయియై తిరిగివచ్చినశిష్యుని గురు వభినందించెను. గురుపత్ని పరమానంద మందెను. కాత్యాయనవ్యాడీంద్రదత్తుల నాతఁడు కూర్చుండఁబెట్టి తనవ్యాకరణమును వినిపించెను. అంతటఁ గాత్యాయన మహర్షికిని పాణినికిని వాగ్వాద మయ్యెను. ఏడుదినము లిట్లు వాగ్వాదమైన పిదప నెనిమిదవదినమునఁ గాత్యాయనుఁడు పాణిని నోడించెను. పాణిని తన యోటమికి మిక్కిలి దుఃఖించి తన్నుఁగాపాడఁ బరమశివుని బరమభక్తిని బ్రార్థించెను. అతనిపై దయ కలిగి భవుఁ డొకహుంకారధ్వని నొన రించెను. ఆ ధ్వని యింద్రునిశబ్దశాస్త్రము నెల్లను మ్రింగివేసెను; దానితో భూమిపై నింద్రుని వ్యాకృతి యంతయు నంతరించిపోయెను. కాత్యాయన మహర్షి యిపు డోటమిచే ఖిన్నుఁడై యెటకో వెడలిపోయెను.

ఈ పరిణామమునకు వర్షోపాధ్యాయుఁ డతంత దుఃఖితుఁడై యుండ నా రాత్రి కుమారస్వామి యాతనికిఁ గలలోఁ గానసె "ఓయీ!

విచారింపకుము. నీవును నీ శిష్యులును పాణినియొద్ద నొక్కసారి వ్యాకరణమును వినుఁడు. మీ మీ పూర్వవిద్యలు మీకు వచ్చును. పాణిని పరమేశ్వరాంశావతారము. అతని వ్యాకృతి సదాశివదత్తము. దానిని మించువారు కాని యోడించువారు కాని యుండలేరు" అని పలికి యదృశ్యుఁ డయ్యెను.

మఱునాఁడుదయము తన స్వప్నము పాణినికిఁజెప్పి యతఁడును శిష్యులును నాతఁడు చెప్పిన యష్టాధ్యాయియగు వ్యాకరణమును శ్రద్ధగా వినిరి. వెంటనే వారందఱు వ్యాకరణవిద్యానిష్ణాతులైరి. పాణిని గురునికిఁ గురుభక్తికి వందనము లొనరించి సెలవుగైకొని హిమాలయ ప్రాంతమున నాశ్రమము నిర్మించుకొని శిష్యులకుఁ బాఠములు చెప్పుచు నం దుండిపోయెను.

కాత్యాయనమహర్షి వెడలిపోయి యీశ్వరుని గుఱించి యుగ్రతప మొనరించెను. శివుఁడు ప్రత్యక్షమై వరమడుగు మన్న నాతఁడు శబ్దశాస్త్రము నర్థించెను. వల్లెయని శివుఁ డది యిచ్చి యంతర్హితుఁడయ్యెను. కాత్యాయనుఁ డట్లు శివునివరముఁ బడసి పాణిని గ్రంథమంతయుఁ జదివి యాతఁడు చెప్పనిది చెప్పుచు, మరలఁ జెప్పినదానికింక మరలఁ జెప్పుట సాధ్యముకాని భంగి వార్తికములను రచించెను.

ఈ సంగతి యొక శిష్యునివలన విని పాణిని దన్నుఁదలదన్నిన కాత్యాయనమహర్షిపై నసూయ జనింప దుఃఖించి బయలుదేఱి కాత్యాయన మహర్షి యాశ్రమమును జేరెను. కాత్యాయనుఁ డాతనిరాకం గని లేచి యెదురేఁగుదెంచి యర్ఘ్యపాద్యాదులీయఁ బాణిని యంగీకరింపక నిప్పులు గ్రక్కు కన్నులతో "ఓరీ! నీవు పరమేశ్వరాంకితముగా నేను రచించిన వాక్యమునకు నిందలు రచించితివి. నీ శిరమీ రాత్రి శతధా భిన్నములై పడుఁగా" కని శపించెను. అపుడు కాత్యాయనుఁడు "ఓరీ! మూర్ఖా! బ్రహ్మచర్యము గావించి పొందిన విజ్ఞాన మేమైనది? ఆచార్య సేవాలబ్ధ మగుశమ మంతయు నే గంగఁ గలిసినది? వేదవేదాంగ విద్యల ఫలిత మిదియా? నీతోడిపూర్వవైర మావంతయు గడింపక, అతిథివని యర్ఘ్య పాద్యాదు లిచ్చి గౌరవింప వానిని గైకొనక యిట్లు దుందుడుకున నన్ను

ర పింతువా? నేను శివునాజ్ఞం దలధరించియే వార్తికములను వ్రాసితిని.
ు శాపము నా యెడ సత్యమగుచో నదే నా శాపము నీ యెడను సత్య
మగుంగాక!" అని పలికెను.

అప్పు డిరువురు తమ తమ యాశ్రమముల కరిగి శిష్యుల నెల్లరం
ిలిచి తమకుం గలిగిన శాపోదంతము వారలకుం జెప్పి యింకం దప్పదని
గాము యోగ మవలంబించి యా రాత్రి తమ శరీరములను విడిచివేసిరి.
ిదప వా రిరువురును బరమశివునిలోకముం జేరినంతనే పరమశివుండు పరి
ారములోని వారందఱకు వారిని గుఱించి చెప్పి కాత్యాయనుండు దేవి
ాపమునందిన పుష్పదంతుండను శివకింకరుండే యనియు నాతని శాప
వృత్తికిం దనతేజోంశమునకు రూప మొసంగిన నది పాణినియై పుష్ప
ంతుని శాపముం బాపిన దనియు వెల్లడించి తన తేజమును దనలోం
లుపుకొనెను. పుష్పదంతుని మరల నిజకింకరప్రధాను నొనర్చి యాద
ించెను.

ఈ ప్రకారము కాత్యాయనమహర్షి యవతారమును జాలించి శాశ్వత
వసాన్నిధ్యము నంది ధన్యుండయ్యెను. *

## కాత్యాయన స్మృతి

కాత్యాయనమహర్షి విరచిత మగుధర్మశాస్త్రమునకు "కాత్యాయన
స్మృతి" యని పేరు. ఇందు:

"అథాతో గోభిలోక్తానాం
అన్యేషాం చైవ కర్మణామ్,
అస్పృష్టానాం విధిం సమ్యక్
దర్శయిష్యే ప్రదీపవత్."

---

* 1. కథాసరిత్సాగరము.
2. పతంజలిచరిత్ర.
3. లఘుమతిమునికల్పతరువు. (సిద్ధాంతకౌముదిలో)

అని ప్రథమఖండమున ఆచారాధ్యాయ మారంభింపఁబడినది. స్మృతి చివర " ఇతి కాత్యాయనవిరచితే (గోభిలప్రోక్తే) కర్మ ప్రదీపే తృతీయః ప్రపాఠకః. ఇత్యేకోన త్రింశఃఖండః " అని కలదు.

ప్రథమఖండమున ఆచారాధ్యాయము యజ్ఞోపవీత ప్రకరణవర్ణనము శీర్షిక కలదు. ద్వితీయఖండమున నిత్యనైమిత్తిక కర్మవర్ణనము కలదు. తృతీయఖండమున త్రివిధక్రియావర్ణనము, చతుర్థఖండమున శ్రాద్ధకర్మవర్ణనము, పంచమఖండమునఁ దద్విశేషములు, షష్ఠఖండమున అనేక కర్మవర్ణనము, సప్తమఖండమున శమీగర్భాద్యనేక ప్రకరణవర్ణనము, అష్టమఖండమున సయజ్ఞస్రువ సమిధలక్షణము, నవమఖండమున సంధ్యాకాలకర్మవర్ణనము, దశమఖండమునఁ ప్రాతఃకాలికస్నానాది క్రియావర్ణనము కలవు. ఇది ప్రథమ ప్రపాఠకము; ఏకాదశఖండమున సంధ్యోపాసనవిధి, ద్వాదశఖండమున తర్పణవిధి, త్రయోదశఖండమున పంచమహాయజ్ఞవిధి, చతుర్దశఖండమున బ్రహ్మయజ్ఞవిధి, పంచదశఖండమున యజ్ఞవిధి, షోడశఖండమున శ్రాద్ధవిధి విశేషవిధి, సప్తదశఖండమున శ్రాద్ధవర్ణనము, అష్టాదశఖండమున వివాహాగ్ని హోమవిధానవర్ణనము, ఏకోనవింశతిఖండమున వికర్తవ్యతాస్త్రీధర్మవర్ణనము, కలవు. (ఇతి కాత్యాయన (వా-గోభిలే) విరచితే కర్మప్రదీపే ద్వితీయఃప్రపాఠకః.) వింశతిఖండమున ద్వితీయాదిస్త్రీకృతవైదికాగ్నివర్ణనము, ఏకవింశఃఖండమున మృతదాహసంస్కారవర్ణనము, ద్వావింశఃఖండమున దాహసంస్కార వర్ణనము, ఇందు:

మా శోకం కురుతానిత్యే సర్వస్మిన్ ప్రాణధర్మణి
ధర్మం కురుత యత్నేన యో వః సహ గమిష్యతి
మనుష్యే కదళీస్తంభే నిస్సారో సారమార్గణం
యః కరోతి స సమ్మూఢో జలబుద్బుదసన్నిభే
గంత్రీ వసుమతీ నాశం ఉదధిర్దైవతాని చ
ఫేనః ప్రఖ్యః కథం నాశం మర్త్యలోకో న యాస్యతి.
పంచధా సంభృతః కాయో యది పంచత్వమాగతః
కర్మభిః స్వశరీరోత్థైః తత్రకాపరిదేవనా.

సర్వేక్షయాన్తా నిచయాః పతనాంతాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాంతా మరణాంతంహి జీవితమ్.
శ్లేష్మాశ్రు బాంధవైర్ముక్తం ప్రేతో భుంక్తే యతో ఒవశః
అతో న రోదితవ్యం హి క్రియాః కార్యాః ప్రయత్నతః.

అను మహోపదేశములు కలవు. త్రయోవింశఃఖండమున విదేశస్థమృత పురుషదాహ సంస్కారవర్ణనము, చతుర్వింశః ఖండమున సూతకకర్మ త్యాగము షోడశశ్రాద్ధవిధివర్ణనము పంచవింశఃఖండమున నవయజ్ఞరహిత నవాన్నభోజన ప్రాయశ్చిత్తము, షడ్వింశఃఖండమున నవయజ్ఞకాలాభి ధానవర్ణనము, సప్తవింశఃఖండమున ప్రాయశ్చిత్తవర్ణనము అష్టవింశతి ఖండమున ప్రాయశ్చిత్తము, ఉపాకర్మ, ఫలనిరూపణవర్ణణము, ఏకోన త్రింశఃఖండమున శ్రాద్ధవర్ణనము గలవు. ఇది తృతీయప్రపాఠకము. *

## కాత్యాయన కృత బుధ స్తుతి

ఓమ్ అస్యశ్రీ బుధకవచస్తోత్రమహామంత్రస్య కాత్యాయనఋషిః ......ధ్యానమ్.

" బుధఃపుస్తకహస్తశ్చకుంకుమస్య సమద్యుతిః
బుధం జ్ఞానమయం సర్వం కుంకుమాభం చతుర్భుజమ్,
ఖడ్గశూల గదాపాణిం వరదాంకిత ముద్రితం
పీతాంబరధరం దేవం పీతమాల్యానులేపనం
వజ్రాద్యాభరణంచైవ కిరీటమకుటోజ్జ్వలం
శ్వేతాశ్వరథమారూఢం మేరుం చైవ ప్రదక్షిణం
బుధఃపుస్తకహస్తశ్చ కుంకుమస్య సమద్యుతిః
పీతాంబరధరః పాతు పీతమాల్యానులేపనః
బుధః పాతు శిరోదేశం సౌమ్యః పాతు చ ఫాలకమ్
నేత్రేజ్ఞానమయం పాతు శ్రుతీపాతు విధూద్భవః
ఘ్రాణం గంధధరః పాతు భుజౌ పుస్తకభూషితః

* స్కాందపురాణము : ఉత్తరఖండము.
స్మృతిసందర్భః తృతీయో భాగః.

మధ్యం పాతు సురారాధ్యః పాతు నాభిం ఖగేశ్వరః
కటిం కామాత్మజః పాతు ఊరు పాతు సురేశ్వరః
జానునీ రోహిణీసూనుః పాతు జంఘే ఫలప్రదః
పాదౌ బాణాసనః పాతు పాతు సౌమ్యోఽఖిలం వపుః
ఏషోహి కవచః పుణ్యః సర్వోపద్రవశాంతిదః
సర్వరోగప్రశమనః సర్వదుఃఖ నివారకః
ఆయురారోగ్యశుభదఃపుత్రపౌత్రప్రవర్ధనః
యః పఠేత్కవచం దివ్యం శృణుయాద్వా సమాహితః
సర్వాన్కామానవాప్నోతి దీర్ఘమాయుశ్చ విందతి."



# మహర్షుల చరిత్రలు

## గృత్సమద మహర్షి

### జ న న ము

శౌనకమహర్షివంశమున సునహోత్రుఁ డనుమహనీయుఁ డొకఁ డుదయించెను. అతఁడు నిత్యతపస్వి, శమదమాదిసంపన్నుఁడు. అతనికి నిజపత్నియందు ముప్వురు పుత్రు లుదయించి పరమధార్మికు లను ప్రఖ్యాతి నందిరి. వారు కాశుఁడు, శాల్మ్యుఁడు, గృత్సమదుఁడు ననువారు. వారిలో గృత్సమదుఁడు మహాతపశ్శాలియై సునహోత్రుని పుత్రుఁ డగుట సౌనహోత్రుఁడనియే పిలువఁబడుచుండెను. ఈతఁడు ఋగ్వేదులకుఁ దర్పణీయర్షియై శ్రుతి స్మృతిపారగుఁడై బ్రహ్మచారి, విప్రర్షి, శ్రీమంతుఁడు నని విఖ్యాతి గడించెను. *

### అగ్ని వరము లిచ్చుట

గృత్సమదుఁడు వేదవేత్తయై భక్తిసంపన్నుఁడై అగ్నిదేవుని వేదమంత్రములతో స్తుతించెను. పిదప నాతఁ డగ్ని ప్రీతికర మగు యజ్ఞ మొనరించెను. తదనంతరము అగ్నిహోత్రునికిఁ బరమతృప్తికర మగు మంత్రసప్తకముతో వేనోళ్ళ నాతఁడు శ్లాఘించెను. అకళంక హృదయుఁడు, అనుపమభక్తుఁడు, అవిరళతపస్సంపన్నుఁడు నగు నాతనిపట్ల నగ్నిహోత్రుఁడు దయకలిగి యాతనికి దివ్యశరీర మొసం

---

* "గృత్సమదః, శౌనకగోత్రప్రవరే సునహోత్రస్యపుత్రభేదే.
సునహోత్రస్య దాయాదాః త్రయః పరమధార్మికాః కాశః
శాల్మశ్చ ద్వావేతౌ తథా గృత్సమదః.
ఋగ్వేదేవర్తతే చాగ్ర్యా శ్రుతిర్యస్యమహాత్మనః యత్రగృత్సమదో బ్రహ్మన్
బ్రాహ్మణైస్సమహీయతే, సబ్రహ్మచారీ విప్రర్షిః శ్రీమాన్
గృత్సమదోఽభవత్" — వాచస్పత్యము.

గెను. మఱియు నాతఁడు త్రిలోకములందుఁ ద్రిశరీరములతో నొకేపరి తిరుగఁ గలమహాశక్తి యగ్నిహోత్రుఁ డనుగ్రహించెను. దానివలన, వెంటనే గృత్సమదుఁడు దివ్యశరీరధారియై స్వర్గమున కేఁగి రెండవ యింద్రునివలెఁ బ్రకాశించెను. అతఁడు భూమిపైని, ఆకాశమున, గాలి లోను మూఁడుచోట్ల మూఁడు శరీరములు ధరించి ప్రకాశించుచుండెను.

## ఇంద్రుని తోడి మైత్రి

ఇట్లుండ నింద్రశత్రువు లగు నిద్దఱు రాక్షసులు ధుని, చుమురి యనువారు స్వర్గమున రహస్యముగఁ దిరుగుచు నింద్రుని జంపుటకు యత్నించుచుండిరి. వారి క్రింద సమతేజుఁ డగు గృత్సమదుఁడు కాన వచ్చెను. ఈతఁడే యింద్రుఁ డనుకొని యా రాక్షసు లిరువురు సాయుధులై యాతనిపైఁ బడిరి. అతఁడు నిర్భయుఁడై వారి యాంతర్య మెఱఁగి వారినాశనముఁ దన క్షేమముఁ గోరి "యోజాతః" అదియగు వేదమంత్రములతో నింద్రుని గుణగణప్రశంస యొనరించెను. ఇంద్రుని గుణముల నీరీతి విన్న యా రాక్షసుల కిదివఱకు లేని విపరీత మగుగుండె జెదరు సంభవించెను. ఆ సమయమున కట కింద్రుఁడు విచ్చేసి భయంకరు లయ్యు పిఱికిపంద లయిన యా రాక్షసులను వెంటనే పిలుకు మార్చెను.

గృత్సమదుఁ డమితానంద మంది యింద్రుని మరల సంస్తుతించి యాతని గుణగణములను గొనియాడెను. అంత నింద్రుఁడు "మునీంద్రా! నీవు నాకుఁ బ్రియమిత్రుఁడ వైతివి. నీవు చేసిన ప్రశంస నిశ్చలమగు నీయంతఃకరణమునకు సాక్షి. అది నాకుఁ బ్రీతి పుట్టించినది. నేఁటి నుండి నీవు నాకుఁ బ్రియమిత్రుఁడవైతివి. నీతప మమోఘమై నీసమస్త వాంఛితములను ఈడేర్చునుగాక! నీ కేమివరము కావలయునో కోరు కొను" మని యాతనిని మిగుల బహూకరించెను. అంత నాతఁడు "మహేంద్రా! నీయీ కటాక్షమునకు నిత్యముఁ గృతజ్ఞుఁడను. ఓ మహా మహా! నీదయవలన నా శరీరమున కక్షయత యులరారుఁగాక! నాకు మనోజ్ఞ వాక్సమత్కృతి యలవడుఁగాక! సురేంద్రా! నీకరుణవడసి

నేను సర్వైశ్వర్యముల నందుదును గాక! నేను నిత్యము నాహృదయ మున నిన్నే స్మరించుచుందును గాక! జన్మజన్మములను నీ పద భక్తి నాకుఁ గలుగుఁగాక! నీకటాక్షము నాపైఁ బ్రసరించుచుండుఁగాక! నా హృదయ మెల్లప్పుడు నీయందే నిమగ్నమై యుండుఁగాక! నీవు శారీ రకముగా నా కెడదవ్వయినను, మానసికముగా మాత్రము నాహృదయ రథస్థితుఁడవై "రథితరుఁడ" వగుదువుగాక!" అని యాతని హస్త మును దనహస్తములోనికిఁ దీసికొని యభినందించెను. తరువాత నాతనిని దనప్రాసాదమునకుఁ గొనిపోయి విధివిధానమున సమస్త మగు నతిథిమర్యాద జరపి యాతనిపైఁ బ్రబలాభిమానమును బ్రక టించెను.

అనంతరము గృత్సమదుఁడు మరల నింద్రుని "స్తుతి" ఆదిగాఁ గలవేదమంత్రములతోఁ దనపై నాతఁడు చూపిన నిర్వ్యాజవాత్సల్య మునకుఁ గృతజ్ఞతతో మిగుల సంస్తుతించెను. ఆవేళ కచటి కింద్రగురు వగుబృహస్పతి విచ్చేయఁగా గృత్సమదుఁ డాతని నమితభక్తిని స్తుతిం చెను. పిదప, ఇంద్రబృహస్పతు లిరువురకు ననువర్తించువేద మంత్ర ములతో వారిని ఏకముగను ప్రత్యేకముగను స్తుతించెను. అంత వా రిరువురు నాతనిశ్రద్ధాభక్తుల కలరి "ఓయీ! నీవు నేఁటినుండి నిజముగా గృత్సమదుఁడవైతివి.* ఎవఁడు విద్యావినయసంపదచే సురేశ్వరుని సురేశ్వరగురువును సంతసింపఁజేయునో యాతనికంటె మేధావి యింకొ కఁడు లేఁడు?" అని యాతని నభినందించిరి.

మఱియొకప్పు డింద్రుఁడు గృత్సమదునిభక్తిని బరీక్షింపఁగోరి పక్షి రూపము ధరించి యాతనిభుజములపైఁ బ్రాలెను. దివ్యజ్ఞాన సంపన్నుఁ డగుగృత్సమదుఁడు తన దివ్యదృష్టిచే నాప్రాలినపక్షి యింద్రుఁ డని గ్రహించి యాతనిని బక్షీంద్రునిగ, సురేశ్వరునిగాఁ బ్రస్తుతించి తన యనన్యభక్తిని జాటెను. అపు డింద్రుఁడు నిజరూపమున నాతనికిఁ

* 'గృత్సో మేధావీ' అని నిఘంటువు. గృత్సమదుఁడు=మేధానిధి యని యర్థము. గృత్సుఁ డనఁగా మేధావి. ఈశ్వరుఁడు మేధావులకు మేధావి, గృత్సపతి అని కీర్తితుఁడు; గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చవో నమః.

ప్రత్యక్షమై "మిత్రమా! నీవిషయమున నాకింకెట్టిసంశయమును లేదు. నీవు సర్వకాలములందును నాకు మిత్రరత్నమవై యుందువుగాక! నీవలన నాకుఁ గలిగిన ప్రీతి యింకెవరివలనఁ గలుగలేదు. కావున, నీవు నాభక్తతముఁడవు. మిత్రతముఁడవు. నీయిచ్ఛవచ్చినపుడు యథేచ్ఛగా వచ్చుచుఁ బోవుచుండు" మని ప్రబోధించి వీడ్కొలిపెను. *

## శివకటాక్షము

ఒకప్పు డింద్రుఁడు సహస్రవర్షసత్రయాగ మొకటి యారంభించెను. అందు బృహస్పతిసమతేజుఁడై యింద్రుని ప్రార్థనమున గృత్సమదుఁడు బృహస్పతితోపాటు యజ్ఞ నిర్వహణమున సహాయుఁ డగుచుండెను. గృత్సమదున కింతగౌరవము లభించుట కసూయపడినవారలలో చాక్షుష మనువుపుత్రుఁ డగువరిష్ఠుఁ డనువాఁడు నాయజ్ఞమున నుండెను. యజ్ఞ విషయమున గృత్సమదుఁడు రథంతర సామగాన మతిమనోహరముగాఁ జేయుచున్నసమయమున వరిష్ఠుఁడు లేచి "ఓయీ! గృత్సమదుఁడా! శక్రక్రతువున రథంతరసామగాన మొనరించు సాహసము నీ కెట్లు కలిగినది? తగినశక్తి లేనిదే తగుదునమ్మా యని నీ వీపని కొడంబడినంత మాత్రముననఁ బ్రబుద్ధులు సంతసింతురా? నీ వుచ్చరించుచున్నసామమున నపస్వరము లనేకము లున్నవి. అపస్వరములతో మంత్రముచ్చరించినవానికిఁ గలుగు పాపమునకు మేర కలదా! అందును దేవేంద్రుని యజ్ఞముననా యిట్టి యపస్వరములు? ఏది తిరిగి యా సామము నుచ్చరింపు" మని హుంకరించెను. గృత్సమదుఁ డతిశాంతియుతుఁడై తా నుచ్చరించినమంత్రము సుస్వరయుతమే కాని యపస్వరసంయుతము కాదనియు, దానిబాధ్యత యంతయుఁ దనదే కాన నొరు లూరకొనవలసినదే యని వరిష్ఠుని హెచ్చరించెను. ఆ మాటలు విని వరిష్ఠుఁడు తోక ద్రొక్కినత్రాచువలె లేచి "ఓరీ! నీ కీయార్త్విజ్య మిచ్చినయింద్రుననవలెఁ గాని నిన్నుఁ గాదు. అపస్వరయుతముగ సామమంత్రమును జదివి యజ్ఞమును మంత్రమును గలుషిత మొనర్చుట నేను సహింపఁ

---

* ఋగ్వేదము II. 2; 12.

జాలను. నీవు వెంటనే క్షమార్పణము చెప్పుకొని, యా సామమును మరల నుచ్చరించి నేను దిద్దినస్వరముప్రకారము మరల నుచ్చరింపుము. లేదా నీవు శాపగ్రస్తుఁడ వగుదు" వని గద్దింప నాతని నావంతయు లక్ష్యపెట్టక గృత్సమదుఁడు తనపని తాను జేయుచునే యుండెను.

అంత వసిష్ఠుఁ డతికోపియై శాపోదకములు చేతఁ గైకొని "ఓరీ! నీవు బుద్ధిహీనుఁడవై మేధావి నని గర్వించి యున్నావు. నీవు గృత్స మదుఁడవు (మేధావివి) కావు. గర్వోన్మదుఁడవు. నీవు ప్రజ్ఞాహీనుఁడవై నన్నుఁ దృణీకరించితివి. కావున, నీవు విద్యావిహీనుఁడవై క్రూర మృగమవై ఘోరవనమునఁ జరింతువు గాక! నీవు దుఃఖభాజనుఁడవై యాహారపానీయములైన లభింపక యలమటింతువు గాక! సింహభీకర మగు వనమున నీవు సహస్రాధికవర్షము లతినీచపరత నివసింతువు గాక!" యని విడిచెను.

వసిష్ఠుని యుగ్రశాపమున గృత్సమదుఁడు వెంటనే మృగమై శక్రక్రతువున నగ్రాసనమునఁ గూర్చుండి సర్వమును దిలకించుచున్న శంకరుని పాదములపైఁ బడి శరణుఁజొచ్చెను. ఇంద్రుఁడు తన మిత్రుని గాపాడుమని ఈశ్వరు నర్థించెను. పరమశివుఁ డాతనియందు దోషము లేని కారణమున వెంటనే యాతని ననుగ్రహించి యభయ మిచ్చి వసి ష్ఠుని శాపముఁ గ్రమ్మఱించి గృత్సమదుని మరల గృత్సమదు నొనరించి వసిష్ఠుని నిందించి యాతనిచే నితనికి మ్రొక్కించి "వత్సా! గృత్స మదా! నీవు నిష్కళంకుఁడవు. నిత్యోజ్జ్వలుఁడవు. ని న్నిఁక నెవ్వ రెవ్వ డేమియుఁ జేయఁజాలరు. నీవు జరామరణ వర్జితుఁడవై సత్య శౌచ శమదమాది సంపన్నుఁడవై సర్వదుఃఖదూరుఁడవై శాశ్వతత్వము నందుదువుగా" కని వర మొసంగి కాపాడెను.

గృత్సమదుఁ డిట్లు మహాశాపము బారినుండి తప్పించుకొని శివుని కటాక్ష మను మహాయోగమును నవ్యాజవత్సలుఁ డగు నాతని వరప్రసాద మును సంపాదించి ధన్యుఁ డయ్యెను. దేవత లాతనిపైఁ బుష్పవృష్టి కురిసిరి. యక్ష కిన్నర కింపురుషు లాటపాటలఁ దమహర్షమును దేట పఱచిరి. ఇంద్రుఁ డభినందించెను. వసిష్ఠుఁడు సిగ్గుపడి మైత్రి కోరెను.

ఆహా! భగవద్భక్తులకు పవి పుష్పము; అగ్ని మంచు; శాపము వరము నగునుగదా! *

## గణేశ భక్తుఁడు

గృత్సమదుఁడు గణేశభక్తులలో నగ్రేసరుఁడు. అతఁడు మానసిక పూజ, బాహ్యపూజ అనుద్వివిధపూజలు గావించి గణపతి యనుగ్రహము సైతము సంపాదించెను. అతఁ డిట్లు గణేశమానసికపూజ యొనరించెను. "ఓ విఘ్నేశ్వరా! వందిమాగధస్తుతులను విని నీవు బ్రాహ్మీ ముహూర్తమున లెమ్ము. జగన్మంగళకరుఁడవు కమ్ము. నీవు నా చిత్త పద్మమునుండి లేచి బహిర్గణేశుఁడవు కమ్ము. నా చిత్తమునుండి నీవు బయలువెడలి బహిర్గతుఁడ వగునపు డిదే దేవపతి, ఈశ్వర, మునిజనముల సన్నుతు లందుచున్నావు. నే నతిశుచిగా నీకు జలము నందించుచున్నాను. దంతధావనము చేసికొనుము. ఇదే దివ్యవస్త్రము నర్పించుచున్నాను. ముఖము తుడుచుకొనుము. సభను బ్రవేశింపుము. సర్వద్విజాతుల యభినందనములను, శుకాదుల సంభాషణమును గని విని నీవు లేచి సుమండపమును గల్పించుకొని యధిష్ఠింపుము. రత్నములందుఁ బ్రదీప్తమైన నీ ప్రతిబింబమును జూచుకొనుము. రత్నసువర్ణయుక్తమగు దివ్యాసనము నలంకరింపుము. నీకు నాబుద్ధిచే సిద్ధముచేసిన పాద్యము నర్పించుచున్నాను. సుఖోష్ణభావముగల సువాసితజల మిదే హృదయశుద్ధిగ నిచ్చుచున్నాను. పరిగ్రహింపుము. నీకు సువస్త్రముఁ గట్టి, సంప్రోక్షించి, దూర్వాదులచే నర్చించెదను. ఓ భావప్రియా! నీ పాదపద్మములందే నామనస్సు లగ్న మగునట్లుచేసి యనుగ్రహింపుము. కర్పూర తైలాదిసువాసిత మగు జలము నీకై కల్పించితిని. నీ వాచమించి కృపాకటాక్ష వీక్షణముల నాపైఁ బఱపుము. అంతరభావమునఁ బ్రవాళముక్తాఫలహాటకాదులచే సుసంస్కృత మయి నాచే నీయఁబడు ననర్ఘ మగు నర్ఘ్యమును సఫల మొనరింపుము. సుగంధయుక్తము, మధుపర్కశోభితము, భావ

* భారతము అనుశాసనిక పర్వము.

సంకల్పితము నగుదానిని గ్రహించి భక్త సంరక్షణార్థము పునరాచమన మొనరింపుము. సువాసితమగు చంపకాదిక పుష్పతైలము నీకొఱకై సిద్ధము చేసియున్నాను. దానిని నీసర్వాంగములకు రాయుచు సేవ చేసెదను. అనేక తీర్థజలములను సేకరించి వానిని సుఖోష్ణజలముల నొనరించి యందు శుద్ధస్నానము చేయించెదను. తరువాత నీచే పయస్స్నానము, దధిస్నానము, మచ్చిత్త దత్తమగు జలముచేఁ జేయించెదను. ఓ విఘ్నహరా! నీకటాక్షసంపాదనకై సుతీర్థజ మగు ఘృతస్నానము చిత్తకల్పిత మగుమధుస్నానము నీచేఁ జేయించెదను. మాయనుండి నన్నుఁ గాపాడుము. పరమవిశుద్ధుఁడ వగు నిన్ను మనస్సున వేదసూక్తులచేఁ బూజించెదను. వానిముందు దూర్వాదు లిప్పు డులుగదా! అపారబ్రహ్మాండ మండలభూత బ్రహ్మణస్పతి వగు నిన్నభిషేకించెదను. మనోదత్తమగు నమూల్యవస్త్రయుగ్మముచే నీ దేహము నలంకరించెదను. బ్రజలఁ గాపాడుము. ఓ విఘ్నేశ! భక్త ప్రతిపాలకా! నీ వాచమించి నే నిచ్చినయుత్తరీయమును గ్రహించి నా నమస్కృతులు స్వీకరింపుము. త్రిగుణస్వరూపము, సువర్ణనిర్మితము, అహినిందభూతము నగుయజ్ఞోపవీతమును భావముచే నీకు దత్తము చేయుచున్నాను. భక్తరక్షకా! పరిగ్రహింపుము. ఉదయించుచున్న సూర్యునికాంతి గల సిందూరముచే నీకుఁ దిలకము దిద్దెదను. సర్వాంగ సంసేవన మాచరించెదను. ప్రభూ! స్వీకరింపుము. సహస్రశీర్షము, సువర్ణనిర్మితము నగుదివ్యకిరీటమును మనస్సుచే నీ కర్పించుచున్నాను. అనేకరత్నశోభితమగు నది నీమస్తకమునఁ బ్రశస్తినందుఁగాక! విచిత్ర రత్ననిర్మితము, హేమమయమునగు సరత్నకుండల ద్వయము నీ కర్పించెదను. స్వీకరింపుము. దేవా! నీకు సువర్ణకంచుకము, నీ దంత శోభనమునకై సువర్ణరత్ననిర్మితమగు దంతాభరణముల నిచ్చెదను. తండ్రీ! నీ నాలుగుభుజములకు నాలుగురత్నసువర్ణకృతములగు భుజ కీర్తులఁ జేయించి యిచ్చెదను. ధరింపుము. నీయంగుళులకు రత్నాంగు ళీయకములను భావసమర్పణ చేయుచున్నాను. స్వీకరించి రక్షింపుము. ప్రవాళముక్తాఫల రత్నములతో సువర్ణసూత్రమును జేయించి నీకుఁ గటి సూత్రముగా నర్పించుచున్నాను. మహాత్మా! అది నీ లంబోదరమునకు శోభ గలిగింపఁగలదు. దయతో ధరింపుము. నీ లలాటభూషణాభివృద్ధి

క్షయరహిత మగుపూర్ణ చంద్రాభరణము నర్పించుచున్నాను. ఓ భక్త ప్రియా! గ్రహింపుము. సదానందసుఖప్రదుఁడవగు నో విఘ్నేశా! నీకు మానసికముగాఁ జింతామణిభూష నర్పించుచున్నాను. రత్న సువర్ణయుక్త మగు కాంచి నిచ్చుచున్నాను. కింకిణీనాదమేదురము లగు మణిమంజీరముల నిచ్చుచున్నాను. స్వామీ! స్వీకరించి వర ప్రదుఁడ వగుము. విచిత్రధాతు ప్రభావము లగు ననేకాలంకారములను నీకుఁ గావలసినన్ని నా హృదయముచే నీ కర్పించుచున్నాను, పరిగ్ర హింపుము. చంపకము, మాలతి, జలపంకజము, స్థలపద్మము, మల్లిక మున్నగు సమస్త పుష్పములతోడనుగ్రుచ్చి సుమహారమును భక్తితో నీకు మానసికముగ నర్పించుచున్నాను. తరువాత, మందార శమీ దళాదులు, దూర్వాంకురములు, దీపము, ధూపము, షడ్రస సంయుత ములగు భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయములను నీకు నైవేద్య మిడుచున్నాను. భోజన మధ్యపానీయముగా సువాసితమగు జలము కమండలువునుండి క్రోలుదువు గాక! నీ హస్తముఖములు కడుగుకొను టకు నీకు తీర్థజలము లొసంగుదును. ద్రాక్షాదిరంభా ఫలచూత ఫల ములు, ఖర్జూరకార్కంధుక దాడిమములు, సుస్వాదు యుక్తములగు ఫలములను నీకు సమర్పించుచున్నాను. ప్రభూ! స్వీకరింపుము. దేవా! అష్టాంగయుక్తమగు తాంబూలమును, మందార కూర్పాసక యుక్త వస్త్రముతోఁ గప్పఁబడిన రత్నసువర్ణయుక్తమగు దివ్యాసనము నర్పించితిని. మఱియు, నీప్రీతికొఱకై సర్వోపచారముల నొనరింతును. తండ్రీ! నీకు బంగారు కాసులు దక్షిణగా నిచ్చెదను. పుచ్చుకొని లోక ములఁ గాపాడుము. వివిధములగు రాజోపచారములు, అసంఖ్యాకము లగు హస్త్యశ్వచ్ఛత్రాదికములు నీకు మానసికముగా నర్పించుచున్నాను. పరిగ్రహింపుము. మందారపుష్పములు, శమీదళములు, దూర్వాంకుర ములు నీకుఁ బర్వతోపమానముగా నర్పింతును. దేవదేవా! నీకు శ్రీశుకా దులు, శివ విష్ణుముఖ్యులు, ఇంద్రాదులు, శేషాదులు, మునీంద్రులు సేవక భావయుక్తులయి నమస్కరించుచున్నారు. మాయాస్వరూప యగు శక్తి నీయెడమ కడనుండి నిన్నర్చించుచున్నది. నీ కుడిప్రక్క నిలిచి విద్యాదేవత నిన్నారాధించుచున్నది. ముద్గల శంభుముఖ్యులు, నీ వెనుక నిలిచియు, గంధర్వముఖ్యులు ముందు నిల్చియు నిన్నుఁ

గీ_ర్తించుచున్నారు. అప్సరసలు నీ మోదమునకై విచిత్రనృత్యము నొన రించుచున్నారు. నాలుగుభుజములు, మూఁడుకన్నులు, కలిగి పాశ హస్తుఁడవై అంకుశమువంటి యేకదంతముతో నొప్పుచు మహోదరుఁ డవు, గజాస్యుఁడవు నగునోదేవా! నీకు నమస్కరింతును. నీవు సర్పోప వీతుఁడవు. గజకర్ణధారివి. నీకు వందనములు. నీకు మానసికమగు జపమున నా హృదయము నర్పించుచున్నాను. అజ్ఞానధ్వాంతాఘముల నపహరింపుము. వేదమంత్రములతో సుమంత్రితములగు పుష్పదళ ములతో నీకు మంత్రపుష్పము నొసంగుచున్నాను. దేవా! నీకుఁ గోటి ప్రదక్షిణము లొనరింతును. సంఖ్యాహీనములగు సాష్టాంగనమస్కారము లొనరించెదను. నాహృదయశుద్ధిగ మరల నీకుఁ బూజ గావించుచున్నాను. నా యపరాధముల నెల్ల క్షమించి భ_క్తిసంప్రార్థన మనుగ్రహించి సఫలీ కృతమనోరథు నొనరింపుము."

గృత్సమదుఁడు గణేశబాహ్యపూజ యీవిధమునఁ గావించెను. "చతుర్బాహుఁడు, త్రినేత్రుఁడు, గజాస్యుఁడు, ర_క్తవర్ణుఁడు, పాశాం కుశయుతుఁడు, మాయాయు_క్తుఁడునగు గణేశుని జింతించెదను:

"ఆగచ్ఛ బ్రహ్మణాం నాథ సురాసురవరార్చిత!
సిద్ధిబుద్ధ్యాదిసంయు_క్త భ_క్తిగ్రహణలాలస!
కృతార్థోఽహం కృతార్థోఽహం తవాగమనతః ప్రభో!
విఘ్నేశానుగృహీతోఽహం సఫలో మేభవోఽభవత్."

ఓ గణనాయకా! ప్రభూ! ఈ రత్నసింహాసన మలంకరింపుము. భ_క్తులను బహుముఖములఁ గాపాడుము. శీతోష్ణసుఖదములగు న_త్తమపాద్య ములను గ్రహించి దేవా! పాదప్రక్షాళన మొనర్పుము. వివిధ తీర్థ ములనుండి కొనివచ్చి సుగంధయుత మగునట్లు సువస్తుమిశ్రిత మగు నట్లు చేసిన యీ జలముతో గణనాయకా! ఆచమింపుము. అనర్ఘరత్న ప్రవాళము_క్త సంస్కృతమైనఅర్ఘ్యమును గ్రహించి హేరంబా! ద్విరదాననా! సంతోషింపుము. దధిమధుఘృతయు_క్తమగు మధు పర్కము నిదే భ_క్తితో సమర్పించుచున్నాను. స్వీకరింపుము. నమస్కారము. చంపకాదులచే సువాసితము గావింపఁబడిన యు_త్తమ

మగుతైలమును రాచికొని లంబోదరా! అభ్యంగము నొనరింపుము; నీకు నమస్కారము. ఓ విఘ్నేశా! భక్తవత్సలా! యక్షకర్దమాదులతోఁ గూడిన యీ నలుఁగుపిండి యొడలంత రాచికొని స్నానముచేయుము. నానాతీర్థజలములు కొనివచ్చి సుఖోష్ణశీతలము గావించి నే నిచ్చు నీ జలములతో స్నానమొనరింపుము. కామధేనువును పిదికిన ఈ యుత్తమ మగు పయస్సును నీస్నానార్థ ముపయోగింపుము. పంచామృత స్నానముకూడ జలస్నానమధ్యమున నొనరింపుము. గంగాది నదుల నుండి కొనితెచ్చిన యీ జలములచే మరల మరల స్నానము గావిం పుము. పాపహరణమగు దధిధేనువయస్సును స్నానార్థ ముపయో గింపుము. ఈ ఆవునెయ్యి పరమ సుఖప్రదము. దీనితో. స్నాన మొనరింపుము. ఇదిగో మధువు. దీనినికూడ దానికొఱ కుపయోగిం పుము. ఇక్షుకాండసముద్భూత మగు శర్కరాసవముకూడ స్నానార్థము వాడుము. మలహరము, శుద్ధము, సర్వసుగంధకారణమునగు ఈ యక్షకర్దమాదులను స్నానవేళ నుపయోగింపుము. దూర్వాంకురములు, గంధాక్షతములు నీ కర్పించెదను పరిగ్రహింపుము. "బ్రహ్మణస్పతే" అను మంత్రమున నిన్ను ఇరువదియొక్కసారి అభిషేకించెదను. ఓ ద్వర దాననా! కటాక్షింపుము. సర్వతీర్థభవమగు ఈ జలముతో నాచ మింపుము. ఇది వస్త్రయుగ్మము. విఘ్ననాథా! పరిగ్రహింపుము. నభస్తారాంకితము, సుచిత్రమునగు నుత్తరీయమును సభక్తికముగ నీ కర్పించెదను. సర్వసిద్ధీశ! స్వీకరింపుము. త్రైగుణ్యమయ రూపము, ప్రణవగ్రంథి బంధనమునగు ఈ యుపవీతమును ఓ గణ పతీ! గ్రహింపుము. సదానందవర్ధనము, అంగలేపన భావార్థము నగు ఈ సిందూరమును గైకొనుము. నీ యంగములకు స్వర్ణరత్న ములతో ననేకాభరణములు చేయించితిని. వీని నంగీకరింపుము. అష్టగంధయుక్తమగు ని ద్దానిని దేవా! నీ ద్వాదశాంగములకు నలఁదు కొనుము. రక్తచందన కుంకుమ యుతములగు ఈ అక్షతలను నీ ముఖ మండలమున విరాజిల్లనిమ్ము. చంపకాదులగు సుమములచేతను శమీ మందారదూర్వాదిదళములచేత నిన్నుఁ బూజింతును. మహోదరుఁడ వగు వినాయకా! సర్వసౌరభకారకము దశాంగ గుగ్గులుధూప మర్పించె దను. గ్రహింపుము దేవా! జ్యోతి రూపక మగు ఈ దీపమును

గ్రహించి నా నానాజాతి జన్మదుఃఖములను హరింపుము. చతుర్విధాన్న సంపన్నమగు మధురలడ్డుకాదికమును నీకు నైవేద్యము పెట్టెదను. విఘ్నపా! భుజింపుము. సువాసితము, తీర్థసమాహృతమునగు ఈ పవిత్ర జలమును మధ్యమధ్యమునఁ ద్రావుము. భోజనానంతర మీ యక్ష కర్దమముచేఁ జేయి కడిగికొని సువాసితజలమును గ్రోలుము. దాడిమ, ద్రాక్షా ఖర్జూర రంభాదిఫలములను దేవదేవేశా! గ్రహింపుము. దేవా! అష్టాంగతాంబూలమును భక్తితో నర్పించుచుంటిని. విఘ్నరాజా? వేసికొనుము. కాంచనాది నానాధాతురూపకమగు రత్నాదికమును దక్షిణగా నిచ్చుచుంటిని. అంగీకరింపుము. నే నొనరించు రాజోప చారాదికమున సంతుష్టి నందుము. ఇరువదియొక్కవిధము లగు దూర్వాంకురములను పరిగ్రహించి పాలింపుము. అఘాపహము, నానాదీపసమాయుక్తము నగు నీరాజనమును గ్రహించి సమస్తాజ్ఞాన మును బోఁగొట్టుము. "గణానాంత్వా" అనుమంత్రమును వేయి సారు లుచ్చరించెదను. దేవా! సర్వసిద్ధి ప్రదాయకుఁడవు కమ్ము. సుకర్పూరము, నానాదీపమయము నగు నీరాజనము నీ కర్పించెదను. దేవా! పరిగ్రహింపుము. నీ నాలుగు పాదములందు, నాభియందు, రెండు మొగములందు, చతుర్వేద మంత్రములతో నేడేసి మారులు పుష్పపత్రాదులతోఁ బూజించెదను. పంచప్రకారస్తోత్రము లొనరించెదను. స్వామీ! సంతోషించి కటాక్షింపుము. బ్రహ్మేశుఁడ వను భావముతో నీచుట్టు నిరువదియొక్కసారులుకాని ముమ్మారుకాని ప్రదక్షిణ మొనరించి సాష్టాంగముగా నమస్కరించెదను. సర్వపూజ్యుఁడవగు హేరంబా! న్యూనాతిరిక్తభావదోష నివృత్త్యర్థమై మరల నీకు దూర్వాంకురపూజ గావించెదను. దేవా! నా పూజ సాంగ మని యను గ్రహింపుము. నీ నిర్మాల్యమును కనుల కద్దికొని శిరసున ధరించెదను. అది సదా సర్వప్రదమగుఁగాక! అసంఖ్యాకము లగు నా యపరాధములనెల్ల గణనాథా! క్షమింపుము. నీ పాదప్రియుఁడను, భక్త ప్రవరుఁడనుగా నన్నాశీర్వదింపుము. నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే మిత్రుఁడవు, నీవే బంధుఁడవు. నీవే కులదైవమవు. సర్వము నాకు నీవే. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు మనోవాక్కాయ కర్మలచే నేఁ గావించిన సాంసర్గిక కర్మ మంతయు గణేశుఁడవగు నీకే

యర్పించెదను. నానావిధ పాపములను నాశనము గావించుకొనుటకై నీ పాదతీర్థమును దలపై ధరించెదను. నీ పాదోదకముఁ బానముచేసి సర్వాంతర్గతపాపములను నశింపఁజేసికొందును. ఓ విఘ్నేశా! నీ ద్వాదశాంగములను నామమంత్రములతో నర్చించెదను. నీ మూర్ధమున, లలాటమున, దక్షిణకర్ణమూలమున, వామకర్ణమూలమున, కంఠమున, హృదయమున, దక్షిణబాహువున, వామబాహువున, నాభిదేశమున, కుక్షియందు, వామకుక్షియందు, పృష్ఠమున నిన్నర్చించి నీప్రసాదమును స్వీకరించి తరించెదను."

ఈ విధముగా మహాయోగి సంతతభక్తి సమన్వితుఁడు నగు గృత్సమదుఁడు దినదినము మూఁడు కాలములయందు గణేశబాహ్యపూజ చేసి తరించెను.



# మహర్షుల చరిత్రలు

## తండిమహర్షి

### తపస్సు

పూర్వము తండి యనునొకబ్రాహ్మణుఁ డుండెను. అతఁడు బ్రహ్మచర్యనిష్ఠతో సకలవేదశాస్త్రములను జదివి యోగ మెఱిఁగి జ్ఞానియై మహర్షియై ప్రఖ్యాతి గాంచెను. అతఁడు పదివేలసంవత్సరము లేకాగ్ర చిత్తుఁడై సమాధిస్థితి నుండి పరమశివు నారాధించెను. అంత నాతని యాంతరదృష్టికి పరమేశ్వరుఁడు కానరాఁగా నాతఁ డాతని నిట్లు ధ్యానించెను. "ఓపరమేశ్వరా! సాంఖ్యవిదులు, యోగీశ్వరులు నెవ్వని నెల్లప్పుడు పరుఁడని ప్రస్తుతించి, ప్రధానుఁడని భావించి పురుషుఁ డని పూజించి, అధిష్ఠాత యని యర్చించి, ఈశ్వరుఁడని యెన్ని, ఉత్పత్తి వినాశహేతు భూతుఁ డని యూహింతురో అతఁడే నీవు. దేవాసుర మహర్షులలో నిన్ను మించినవాఁడు లేఁడు. నీ వజుఁడవు. అనాదినిధ నుఁడవు, విభుఁడవు. ఈశానుఁడవు, అత్యంతసుఖివి, అనఘుఁడవు. అట్టి నిన్ను నే నమితభక్తియుక్తి శరణుచొచ్చెదను."

### శివసాక్షాత్కారము

ఇట్లు నిర్మలముగ ధ్యానించిన తండిమహర్షికి శివుఁడు ప్రత్యక్ష మయ్యెను. మహోగ్రతపస్సంపన్నుఁ డగు తండి యీశ్వరుని పద కమలములపై వ్రాలి శ్రద్ధాభయభక్తి యుక్తుఁడై "ఓ సర్వేశ్వరా! నీవు పవిత్రులలోఁ బవిత్రుఁడవు. దేవా! నీవు బుద్ధిమంతులలో బుద్ధి మంతుఁడవు. తేజోనిధివి. ఉత్తమతపోరూపుఁడవు. విశ్వావసు హిరణ్యాక్ష పురుహూతాదులకు నిత్యనమస్కారార్హుఁడవు. శుభప్రదుఁడవు. జననమరణ ప్రవాహమునుండి తప్పించుకొన యతులు నీ పాదము లను నావను బట్టి తరించి కృతకృత్యులై మోక్ష మందుదురు. బ్రహ్మేంద్రా

దులు, విష్ణ్వాదివిశ్వేదేవతలు, మహర్షులే నిన్నెఱుఁగఁజాల రన్న నా వంటివారికేమి తెలియును? సమస్తము నీ నుండి వచ్చి సమస్తము నీయందే ప్రతిష్ఠితమై యున్నది. నీవు కాలమను పేరి వాఁడవు; పురుషుఁడ వనఁబడుట నీవే. బ్రహ్మ మనఁగా నీవే. అధిపౌరుష, అధ్యాత్మ, అధిభూత, అధిదైవతములు నీ తనువులని దేవతలు మహర్షులు మాత్ర మెఱుఁగుదురు. అధిలోక, అధివిజ్ఞాన, అధి యజ్ఞములు నీవే. స్వర్గమోక్షములు నీవే. కామక్రోధములు నీవే. సత్త్వరజస్తమములు నీవే. ఊర్ధ్వాధోభాగములు నీవే. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు నీవే. స్కందేంద్ర యమ వరుణాదులు, సూర్యా చంద్రమసులు, ధాతవిధాతలు నందఱు నీవే. పంచభూతములు, బుద్ధిమతి స్థితులు, సత్యాసత్యములు, భావాభావములు నీవే. ఇంద్రి యేంద్రియార్థములు నీవే. నీవే పరబ్రహ్మవు, నీవే పరమపదమవు. నిత్యానందుఁడవు, నిత్యానందదాయివి నీవే. సర్వాత్మవు నీవు. సర్వ దర్శివి నీవు. సర్వగుఁడవు నీవు. సర్వవిజ్ఞుఁడవు నీవు. దేహకర్తవు నీవు. దేహభర్తవు నీవు, దేహివి నీవు, దేహభుక్కువు నీవు. ప్రాణకర్త, ప్రాణభర్త, ప్రాణి, ప్రాణదుఁడు, ప్రాణిగతి సర్వము నీవే. ఆత్మ విజ్ఞులై ధ్యానపరులైన భక్తుల కధ్యాత్మగతివి నీవే. సకలభూతములకు నీవు శుభాశుభగతిప్రదుఁడవు. నీవే జంతువులకు జననమరణములు కలిగించుచు, మహర్షులకు సిద్ధిప్రదుఁడవై, యోగుల కపవర్గదాతవై ఆత్మవేత్తలకుఁ గైవల్య మొసఁగువాఁడవై యున్నావు. భక్తియోగ మున నిన్నుఁ దెలియువారలకు నిన్ను నీవ తెలుపు కొనుచున్నావు.

దేవాధిదేవా! నిన్నుఁ దెలిసికొన్నవారికి జననమరణములు కలుగవు. నిన్నుఁ దెలిసికొన్న నిఁకఁ దెలిసికొన వలసినదే యుండదు. నీ లాభమును గన్నపండితుఁ డేలాభమును గోరఁడు. సూక్ష్మమగు పరమగతివి నీవు. నిన్నుఁ బొందిన అక్షయము, అవ్యయము నగులాభ మగును. సాంఖ్యులు, గుణతత్త్వజ్ఞులు, సూక్ష్మజ్ఞులు నిన్నుఁ దెలిసి కొనియే బంధవిముక్తు లగుచున్నారు. వేదవిదులు వేదాంత ప్రతిష్ఠి తుఁడ వగు వేద్యునిగా నిన్నెఱుంగుదురు. ప్రాణాయామపరాయణులు ఓంకార రథము నెక్కి నిన్నుఁ బొందుదురు. దేవయానులకు ద్వార

మగునాదిత్యుఁడవు నీవే. పితృయానము చేయువారికి ద్వారమగు చంద్రుఁడవు నీవే. దిక్కులునీవు. యుగములు నీవు. అయనములు నీవు. మున్ను ప్రజాపతి నిన్నర్థించి కృతార్థుఁ డయ్యెను. బహ్వృచులు తత్త్వకర్మమున ఋక్కులచే నిన్నే యనుశాసింతురు. అధ్వర్యు లధ్వరములయందు నిన్నే యజుర్మయునిగను త్రిధావేద్యునిగను నెంచి హోమ మొనర్తురు. శుద్ధబుద్ధులగు సామగులు సామములచే నిన్నే గాన మొనర్తురు. ఆథర్వణులగు విప్రులు నిన్నే ఋతముగను, సత్యముగను, పరబ్రహ్మముగను కీర్తింతురు. రేయుంబవళ్లు శ్రోత్రనేత్రములుగా, పక్షమాసములు శిరోభుజములుగా, ఋతువులే వీర్యముగా, మాఘ మాసమే ధైర్యముగా, వత్సరములే గుహ్యోరుపాదములుగా కాల రూపుఁడవు, మృత్యు యమ హుతాశనరూపుఁడవుగా నున్నవాఁడవు నీవే. సూర్యా చంద్రమసులు, నక్షత్రగ్రహములు, సప్తర్షులు, పదునాలుగులోకములు, సత్తు, అసత్తు, అష్టప్రకృతులకుఁ బరమైనది నీ భాగమే. ఇదియే పరము, బ్రహ్మము, పరమపదము, పరమకాష్ఠ, పరమకళ, పరమసిద్ధి, పరమగతి, పరమశాంతి, పరమనిర్వృతి, తుష్టి, సిద్ధి, శ్రుతి, స్మృతి, భక్తుల కవ్యయ ప్రాప్తివి, అధ్యాత్మగతివి నీవే. జన్మమృత్యుజరాహీనులు కాఁగోరు విరాగధనులకు గతివి నీవే" అని నుతించెను.

ఈ విధముగా నుతించిన తండిమహర్షిభక్తికి మెచ్చి శివుఁడు "వత్సా! నీవు అక్షయుఁడవు, అవ్యయుఁడవు, దుఃఖరహితుఁడవు అగుదువుగాక! నీవు తేజశ్శాలివై, కీర్తియుతుఁడవై, జ్ఞానివై, ఋషిజన భూషితుఁడవు కాఁగలవు. నీ పుత్త్రుఁడు సూత్రకర్తయై నెగడొందఁ గలఁడు. ఇఁక, నీకు నావలనఁ గావలసిన దేమియో కోరుకొను" మని పలికెను. అపుడు తండి యానందపరవశుఁడై "మహాదేవా! నీ దయకంటె నాకుఁ గావలసిన దేమున్నది? సర్వకాలములయందును నాకు నీచరణ భక్తి యనుగ్రహింపు" మని ప్రార్థించెను. పరమేశ్వరుఁ డానందించి యట్లే యని యంతర్హితుఁడ య్యెను. శివకటాక్షము నందిన పిదప, తండిమహర్షి యొక యాశ్రమమును నిర్మించుకొని యందు తపోధ్యాన యుక్తుఁడై దినములు కడపుచుండెను.

## తండి ఉపమన్యు ననుగ్రహించుట

ఉపమన్యుమహర్షి యొకప్పుడు తండిమహర్షి యాశ్రమమునకు విచ్చేసి యాతనిచే నతిథిసత్కారము నంది "మహనీయా! నీవలనఁ బరమేశ్వరుని సహస్రనామములు తెలిసికొన విచ్చేసితిని తెలుపఁ గోరుదు" నని ప్రార్థించెను. అంతఁ దండి భక్తిశ్రద్ధలతో శివుని ధ్యానించి యిట్లు చెప్పఁదొడఁగెను.

"పరమేశ్వరుని నామములు తెలుపుమని మున్ను దేవతలు బ్రహ్మ నడుగ నతఁడు వారికి పదివేలనామములను దెలిపెను. వానినుండి వేయినామము లెన్ని బ్రహ్మ స్వర్గవాసుల కొసంగెను. నేను వాని నెఱింగి స్వర్గలోకమునుండి భూలోకమునకుఁ గొనివచ్చితిని. అందుచే భూలోకవాసు లీ స్తవరాజము తండికృత మందురు. ఇది సర్వమంగళ ములను సమకూర్చునది. సర్వకల్మషములను నశింపఁజేయునది. బ్రహ్మలకు బ్రహ్మ, పరులకుఁ బరుఁడు, తేజములకుఁ దేజము, తప ములకుఁ దపము, శాంతములకు శాంతము, ద్యుతులకు ద్యుతి, దాంతులకు దాంతుఁడు, ధీమంతులకు ధీ, దేవతలకు దేవత, మహర్షులకు యజ్ఞములకు యజ్ఞము, శివులకు శివుఁడు, రుద్రులకు రుద్రుఁడు, యోగులకు యోగి, కారణములకుఁ గారణము, నగు హరుని అష్టోత్తర సహస్రనామములు :

"స్థిరుఁడు, స్థాణువు, ప్రభువు, భీముఁడు, ప్రవరుఁడు, వరదుఁడు, పరుఁడు, సర్వాత్మ, సర్వవిఖ్యాతుఁడు, సర్వుఁడు, సర్వకరుఁడు, భవుఁడు జటి, చర్మి, శిఖండి, సర్వాంగుఁడు, సర్వభావనుఁడు, హరుఁడు, హరిణాక్షుఁడు, సర్వభూతహరుఁడు, ప్రభుఁడు, ప్రవృత్తుఁడు, నివృత్తుఁడు, నియతుఁడు, శాశ్వతుఁడు, ధ్రువుఁడు, శ్మశానవాసి, భగవంతుఁడు, ఖచరుఁడు, గోచరుఁడు, అర్దనుఁడు, అభివాద్యుఁడు మహాకర్మి, తపస్వి, భూతభావనుఁడు, ఉన్మత్తవేషి, ప్రత్యక్షుఁడు, సర్వలోక ప్రజాపతి...." మొదలుగాఁగలవి. *

---

* తండికృత శివసహస్రనామ స్తోత్రము :

శ్లో. స్థిర స్స్థాణుః ప్రభుర్భీమః ప్రవరో వరదో వరః,
సర్వాత్మా సర్వవిఖ్యాత స్సర్వ స్సర్వకరో భవః.

వీనిని జపించినవారు సర్వకామ్య సంసిద్ధిగాంచి ముక్తులగుదురు. తండి బ్రహ్మపదముఁ జేరి శివునారాధించి శివైక్యమునందెను.

---

జటీ చర్మీ శిఖండీ చ సర్వాంగ స్సర్వభావనః,
హరశ్చ హరిణాక్షశ్చ సర్వభూతహరః ప్రభుః.
ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ నియత శ్శాశ్వతో ధ్రువః,
శ్మశానవాసీ భగవాన్ ఖచరో గోచరోఽర్దనః.
అభివాద్యో మహాకర్మా తపస్వీ భూతభావనః,
ఉన్మత్తవేషః ప్రచ్ఛన్న స్సర్వలోక ప్రజాపతిః.
మహారూపో మహాకాయో వృషరూపో మహాయశాః,
మహాత్మా సర్వభూతాత్మా విశ్వరూపో మహాహనుః.
లోకపా లోఽంతర్హితాత్మా ప్రసాదో నీలలోహితః,
పవిత్రం చ మహాంశ్చైవ నియమో నియమాశ్రితః.
సర్వకర్మా స్వయంభూత ఆదిరాదికరో విధిః,
సహస్రాక్షో విశాలాక్ష స్సోమో నక్షత్రసాధకః.
చంద్ర స్సూర్య శ్శనిః కేతు ర్గ్రహో గ్రహపతి ర్వరః,
ఆది రంతో లయః కర్తా మృగబాణార్పణోఽనఘః.
మహాతపా ఘోరతపా అదీనో దీనసాధకః,
సంవత్సరకరో మంత్రః ప్రమాణం పరమం తపః.
యోగీ యోజ్యో మహాబీజో మహారేతా మహాబలః,
సువర్ణరేతా స్సర్వజ్ఞ స్సుబీజో బీజవాహనః.
దశబాహుస్త్వనిమిషో నీలకంఠ ఉమాపతిః,
విశ్వరూపస్స్వయం శ్రేష్ఠ బలవీరో బలోగణః.
గణకర్తా గణపతిః దిగ్వాసాః కామఏవ చ,
మంత్రవి త్పరమో మంత్రః సర్వభావకరో హరః.
కమండలుధరో ధన్వీ బాణహస్తః కపాలవాన్,
అశనీ శతఘ్నీ ఖడ్గీ చ పట్టసీ చాయుధీ మహాన్.
స్రువహస్త స్సురూప శ్చ తేజ స్తేజస్కరో నిధిః,
ఉష్ణీషీ చ సువక్త్ర శ్చ ఉదగ్రో వినతస్తథా.
దీర్ఘశ్చ హరికేశశ్చ సుతీర్థః కృష్ణఏవ చ,
సృగాలరూప స్సిద్ధార్థో ముండ స్సర్వశుభంకరః.

అజశ్చ బహురూపశ్చ గంధధారీ కపర్ద్యపి,
ఊర్ధ్వరేతా ఊర్ధ్వలింగ ఊర్ధ్వశాయీ నభస్థలః.
త్రిజట శ్చీరవాసా శ్చ రుద్ర స్సేనాపతి ర్విభుః,
అహశ్చరో నక్తంచర స్తిగ్మమన్యుస్సువర్చసః.
గజహా దైత్యహా కాలో లోకధాతా గుణాకరః,
సింహశార్దూలరూపశ్చ ఆర్ద్రచర్మాంబరావృతః.
కాలయోగీ మహానాథ స్సర్వకామ శ్చతుష్పథః,
నిశాచరః ప్రేతచారీ భూతచారీ మహేశ్వరః.
బహుభూతో బహుధరః స్వర్భాను రమితో గతిః,
నృత్యప్రియో నిత్యనర్తో నర్తక స్సర్వలాలసః.
ఘోరో మహాతపాః పాశో నిత్యోఽనీహో నిరాలయః,
సహస్రహస్తో విజయో వ్యవసాయో హ్యతంద్రితః.
అధర్షణో ధర్షణాత్మా యజ్ఞహా కామనాశకః,
దక్షయాగాపహారీ చ సుసహో మధ్యమస్తథా.
తేజోఽపహారీ బలహా ముదితోఽర్థోఽజితో వరః.
గంభీరఘోషో గంభీరో గంభీరబల వాహనః.
న్యగ్రోధరూపో న్యగ్రోధ వృక్షకర్ణస్థితి ర్విభుః,
సుతీక్ష్ణదశనశ్చైవ మహాకాయో మహాననః.
విష్వక్సేనో హరి ర్యజ్ఞ స్సంయుగాపీడవాహనః,
తీక్ష్ణతాప శ్చ హర్యశ్వ స్సహాయః కర్మకాలవిత్.
విష్ణుప్రసాదితో యజ్ఞ స్సముద్రో బడబాముఖః,
హుతాశన సహాయశ్చ ప్రశాంతాత్మా హుతాశనః.
ఉగ్రతేజా మహాతేజా జన్యో విజయకాలవిత్,
జ్యోతిషామయనః సిద్ధి స్సర్వవిగ్రహఏవ చ.
శిఖీ ముండీ జటీ జ్వాలీ మూర్తిజో మూర్ధగో బలీ,
వైణవీ పణవీ తాళీ ఖలీ కాలకటంకటః.
నక్షత్రవిగ్రహమతిః గుణబుద్ధి ర్లయోఽగమః,
ప్రజాపతి ర్విశ్వబాహు ర్విభాగ స్సర్వతోముఖః.
విమోచన స్సుసరణో హిరణ్యకవచోద్భవః,
మేఢ్రజో బలచారీ చ మహీచారీ స్స్తుతస్తథా.

సర్వతూర్యనినాదీ చ సర్వవాద్యపరిగ్రహః,
వ్యాళరూపో గుహావాసీ గ్రహమాలీ తరంగవిత్.
త్రిదశః కాలదృక్కర్మ సర్వబంధవిమోచనః,
బంధన స్త్వసురేంద్రాణాం యుధి శత్రువినాశనః.
సాంఖ్యప్రసాదో దుర్వాసా స్సర్వసాధుని షేవితః,
ప్రస్కందనో విభాగజ్ఞో హ్యతుల్యో యజ్ఞభాగవిత్.
సర్వావాస స్సర్వచారీ దుర్వాసా వాసవోఽమరః,
హైమో హేమకరో యజ్ఞః సర్వధారీ ధరోత్తమః.
లోహితాక్షో మహాక్షశ్చ విజయాక్షో విశారదః,
సంగ్రహో నిగ్రహఃకర్తా సర్వచీరనివాసనః.
ముఖ్యోఽ ముఖ్యశ్చ దేహశ్చకాహళి స్సర్వకామదః,
సర్వకాలప్రసాద శ్చ సుబలో బలరూపభృత్.
సర్వకామవరశ్చైవ సర్వద స్సర్వతోముఖః,
ఆకాశనిర్విరూపశ్చ నిపాతోహ్యవశః ఖగః.
రౌద్రరూపోఽంశురాదిత్యో బహురశ్మి స్సువర్చసీ,
వసువేగో మహావేగో మనోవేగో నిశాచరః,
సర్వావాసీ శ్రియావాసీ ఉపదేశకరోఽ కరః,
మునిరాత్మా నిరాలోక స్సంభగ్నశ్చ సహస్రదః.
పక్షీచ పక్షరూపశ్చ అతిదీప్తో విశాంపతిః,
ఉన్మాదో మదనః కామో హ్యశ్వత్థోఽ ర్థకరో యశః.
వామదేవశ్చ వామశ్చ ప్రాగ్దక్షిణ ఉదఙ్ముఖః,
సిద్ధయోగీ మహర్షిశ్చ సిద్ధార్థ స్సిద్ధసాధకః.
భిక్షుశ్చ భిక్షురూపశ్చ విపణో మృదురవ్యయః,
మహాసేనో విశాఖశ్చ షష్టిభాగో గవాంపతిః.
వజ్రజిహ్వశ్చ విష్కంభీ చమూస్తంభనఏవ చ,
వృత్తావృత్తకర స్తాలో మధు ర్మధుకలోచనః.
వాచస్పత్యో వాజసనో నిత్యమాశ్రితపూజితః,
బ్రహ్మచారీ లోకచారీ సర్వచారీ విచారవిత్.
ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాకభృత్,
నిమిత్తస్థో నిమిత్తం చ నంది ర్నందికరో హరిః.

నందీశ్వరశ్చ నందీ చ నందనో నందివర్ధనః,
భగహారీ నిహంతా చ కాలో బ్రహ్మ పితామహః.
చతుర్ముఖో మహాలింగః చారులింగస్తథైవ చ,
లింగాధ్యక్షస్సురాధ్యక్షో యోగాధ్యక్షో యుగావహః.
బీజాధ్యక్షో బీజకర్తా అధ్యాత్మానుగతో బలః,
ఇతిహాసస్సకల్పశ్చ గౌతమోఽథ నిశాకరః.
దంభో హ్యదంభో వైదంభో వశ్యో వశకరః కలిః,
లోకకర్తా పశుపతిః మహాకర్తా హ్యనౌషధః
అక్షరం పరమం బ్రహ్మ బలవాన్ శక్ర ఏవ చ,
నీతి ర్హ్యనీతి శ్శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః.
బహుప్రసాదస్సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్,
వేదకారో మంత్రకారో విద్వాన్ సమరమర్దనః.
మహామేఘనివాసీ చ మహాఘోరో వశీకరః,
అగ్నిజ్వాలో మహాజ్వాలో హ్యతిధూమ్రో హుతోహవిః.
వృషణ శ్శంకరో నిత్యం వర్చస్వీ ధూమకేతనః,
నీలస్తథాంగలుబ్ధశ్చ శోభనో నిరవగ్రహః.
స్వస్తిదః స్వస్తిభావశ్చ భాగీభాగకరో లఘుః,
ఉత్సంగశ్చ మహాంగశ్చ మహాగర్భపరాయణః
కృష్ణవర్ణ స్సువర్ణశ్చ ఇంద్రియం సర్వదేహినాం,
మహాపాదో మహాహస్తో మహాకాయో మహాయశాః,
మహామూర్ధా మహామాత్రో మహానేత్రో నిశాలయః,
మహాంతకో మహాకర్ణో మహోష్ఠశ్చ మహాహనుః.
మహానాసో మహాకంబు ర్మహాగ్రీవః శ్మశానభాక్,
మహావక్షో మహోరస్కో హ్యంతరాత్మా మృగాలయః.
లంబనో లంబితోష్ఠశ్చ మహామాయః పయోనిధిః,
మహాదంతో మహాదంష్ట్రో మహాజిహ్వో మహాముఖః.
మహానఖో మహారోమా మహాకేశో మహాజటః,
ప్రసన్నశ్చ ప్రసాదశ్చ ప్రత్యయో గిరిసాధనః.
స్నేహనోఽ స్నేహనశ్చైవ అజితశ్చ మహామునిః,
వృక్షాకారో వృక్షకేతు రనలో వాయువాహనః.

గండలీ మేరుధామా చ దేవాధిపతిరేవ చ,
అథర్వశీర్ష స్సామస్య ఋక్సహ(స్రామితేక్షణః.
యజుఃపాదభుజో గుహ్యః (ప్రకాశో జంగమస్తథా,
అమోఘార్థః (ప్రసాదశ్చ అభిగమ్యస్సుదర్శనః.
ఉపకారః(ప్రియ స్సర్వః కనకః కాంచనచ్ఛవిః,
నాభి ర్నందికరో భావః పుష్కరః స్థపతిః స్థిరః.
ద్వాదశ(స్త్రాసన శ్చాద్యోయజ్ఞో యజ్ఞసమాహితః,
నక్తం కలిశ్చ కాలశ్చ మకరః కాలపూజితః.
సగణో గణకారశ్చ భూతవాహనసారథిః,
భస్మాశయో భస్మగోప్తా భస్మభూత స్తరుర్గణః.
లోకపాల స్తథాలోకో మహాత్మా సర్వపూజితః,
శుక్ల స్త్రిశుక్ల సంపన్నః శుచిర్భూతని షేవితః.
ఆ(శమస్థః (క్రియావస్థో విశ్వకర్మమతిర్వరః,
విశాలశాఖస్తా(మోష్ఠో హ్యంబుజాల స్సునిశ్చలః.
కపిలః కపిశ శ్శుక్ల ఆయుశ్చైవ పరోఽపరః,
గంధర్వో హ్యదితి స్తార్క్ష్య స్సువిజ్ఞేయ స్సుశారదః.
పరశ్వధాయుధో దేవో హ్యనుకారీ సుబాంధవః,
తుంబవీణో మహా(క్రోధ ఊర్ధ్వరేతా జలేశయః.
ఉ(గ్రో వంశకరో వంశో వంశనాదో హ్యనిందితః,
సర్వాంగరూపో మాయావీ సుహృదో హ్యనిలోఽనలః.
బంధనో బంధకర్తా చ సుబంధనవిమోచనః,
సయజ్ఞారి స్సకామారి ర్మహాదం(ష్ట్రో మహాయుధః.
బహుధా నిందితశ్శర్వ శ్శంకరః శంకరోధనః,
అమరేశో మహాదేవో విశ్వదేవ స్సురారిహా.
అహిర్బుధ్న్యో ఽ నిలాభశ్చ చేకితానో హరిస్తథా,
అజైకపా చ్చ కాపాలీ (త్రిశంకు రజిత శ్శివః.
ధన్వంతరి ర్ధూమకేతు స్స్కందో వై(శవణస్తథా,
ధాతా శ(క్రశ్చ విష్ణుశ్చ మి(త్ర స్త్వష్టా (ధ్రువో ధరః.
(ప్రభావ స్సర్వగో వాయు రర్యమా సవితా రవిః,
ఉషంగుశ్చ విధాతా చ మాంధాతా భూతభావనః.

విభు ర్వర్ణవిభావీ చ సర్వకామగుణావహః,
పద్మనాభో మహాగర్భ శ్చంద్రవక్త్రోఽనిలో నలః.
బలవాం శ్చో పశాంతశ్చ పురాణః పుణ్యచంచరీ,
కురుకర్తా కురూవాసీ కురుభూతో గుణౌషధః.
సర్వాశయో గర్భచారీ సర్వేషాం ప్రాణినాం పతిః,
దేవదేవ స్సుఖాసక్త స్సదసత్సర్వరత్నవిత్.
కైలాసగిరివాసీ చ హిమవద్గిరి సంశ్రయః,
కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః.
వణిజో వర్ధకీ వృక్షో వకుళ శ్చందనచ్ఛదః,
సారగ్రీవో మహాజత్రు రలోలశ్చ మహౌషధః.
సిద్ధార్థకారీ సిద్ధార్థ శ్ఛందోవ్యాకరణోత్తరః,
సింహనాద స్సింహదంష్ట్రః సింహగ స్సింహవాహనః.
ప్రభావాత్మా జగత్కాలః కాలో లోకహిత స్తరుః,
సారంగో నవచక్రాంగః కేతుమాలీ సభావనః.
భూతాలయో భూతపతిః అహోరాత్ర మనిందితః,
వాహితా సర్వభూతానాం నిలయశ్చ విభు ర్భవః.
అమోఘ స్సంయతో హ్యశ్వో భోజనః ప్రాణధారణః,
ధృతిమాన్ మతిమాన్ దక్షః సత్కృతశ్చ యుగాధిపః.
గోపాలీ గోపతి ర్గ్రామో గోచర్మవసనో హరిః,
హిరణ్యబాహుశ్చ తథా గుహాపాలః ప్రవేశకః.
ప్రకృష్టారి ర్మహాహర్షో జితకామో జితేంద్రియః,
గాంధారశ్చ సువాసశ్చ తపస్సక్తో రతిర్నరః.
మహాగీతో మహానృత్యో హ్యప్సరోగణసేవితః,
మహాకేతు ర్మహాధాతు ర్నైకసానుచరశ్చలః.
ఆవేదనీయ ఆవేశః సర్వగంధసుఖావహః,
తోరణ స్తారణో వాతః పరిధీపతి ఖేచరః.
సంయోగో వర్ధనో వృద్ధో హ్యతివృద్ధో గుణాధికః,
నిత్యఆత్మా సహాయశ్చ దేవాసురపతిః పతిః.
యుక్తశ్చ యుక్తబాహుశ్చ దేవో దివిసుపర్వణః,
ఆషాఢశ్చ సుషాఢశ్చ ధ్రువోఽథ హరిణో హరః

వపురావర్తమానేభ్యో వసుశ్రేష్ఠో మహాపథః,
శిరోహారీ విమర్శశ్చ సర్వలక్షణలక్షితః.
అక్షశ్చ రథయోగీ చ సర్వయోగీ మహాబలః,
సమామ్నాయోఽసమామ్నాయ స్తీర్థదేవో మహారథః.
నిర్జీవో జీవనో మంత్ర శ్శుభాక్షో బహుకర్కశః,
రత్నప్రభూతో రక్తాంగో మహార్ణవనిపానవిత్.
మూలం విశాలో హ్యమృతో వ్యక్తావ్యక్త స్తపోనిధిః,
ఆరోహణోఽధిరోహశ్చ శీలధారీ మహాయశాః.
సేనాకల్పో మహాకల్పో యోగో యోగకరో హరిః,
యుగరూపో మహారూపో మహానాగహనో వధః.
న్యాయనిర్వపణః పాదః పండితో హ్యచలోపమః,
బహుమాలో మహామాల శ్శశీహరిసులోచనః.
విస్తారో లవణః కూప స్త్రియుగ స్సఫలోదయః,
త్రినేత్రశ్చ విషణ్ణాంగో మణివిద్ధో జటాధరః.
బిందుర్విసర్గ స్సుముఖః శర స్సర్వాయుధస్సహః,
నివేదనస్సుఖాజాతః సుగంధారో మహాధనుః.
గంధపాలీ చ భగవాన్ ఉత్థానః సర్వకర్మణామ్,
మంథానో బహుళో వాయుః సకల స్సర్వలోచనః.
తలస్తాలః కరస్థాలీ ఊర్ధ్వసంహననో మహాన్,
ఛత్రం సుఛత్రో విఖ్యాతో లోకస్సర్వాశ్రయః క్రమః.
ముండో విరూపో వికృతో దండీకుండీ వికుర్వణః,
హర్యక్షః కకుభో వజ్రీ శతజిహ్వ స్సహస్రపాత్.
సహస్రమూర్ధా దేవేంద్ర స్సర్వదేవమయో గురుః,
సహస్రబాహు స్సర్వాంగః శరణ్య స్సర్వలోకకృత్.
పవిత్రం త్రికకున్మంత్రః కనిష్ఠః కృష్ణపింగళః,
బ్రహ్మదండ వినిర్మాతా శతఘ్నీ పాశశక్తిమాన్.
పద్మగర్భో మహాగర్భో బ్రహ్మగర్భో జలోద్భవః,
గభస్తి ర్బ్రహ్మకృద్బ్రహ్మీ బ్రహ్మ విద్బ్రాహ్మణో గతిః.
అనంతరూపో నైకాత్మా తిగ్మతేజా స్స్వయంభువః,
ఊర్ధ్వగాత్మా పశుపతి ర్వాతరంహో మనోజవః.

చందనీపద్మనాళాగ్ర స్సురభ్యుత్తరణో నరః,
కర్ణికారమహాస్రగ్వీ నీలమౌళిః పినాకభృత్.
ఉమాపతి రుమాకాంతో జాహ్నవీ భృ దుమాధవః
వరో వరాహో వరదో వరేణ్య స్సుమహాస్వనః.
మహాప్రసాదో దమనః శత్రుహా శ్వేతపింగళః,
ప్రీతాత్మా పరమాత్మా చ ప్రయతాత్మా ప్రధానధృత్.
సర్వపార్శ్వముఖ స్త్ర్యక్షో ధర్మసాధారణో వరః,
చరాచరాత్మా సూక్ష్మాత్మా అమృతో గోవృషేశ్వరః.
సాధ్యర్షి ర్వసురాదిత్యో వివస్వాన్ సవితాఽమృతః,
వ్యాసస్సర్గస్సుసంక్షేపో విస్తరః పర్యయోనరః.
ఋతు స్సంవత్సరో మాసః పక్ష స్సంఖ్యా సమాపనః,
కళా కాష్ఠా లవా మ్మాత్రా ముహూర్తాహః క్షపాక్షణాః.
విశ్వక్షేత్రం ప్రజాబీజం లింగమాద్యస్తునిర్గమః,
సదసద్వ్యక్త మవ్యక్తం పితా మాతా పితామహః.
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్,
నిర్వాణం హ్లాదనం చైవ బ్రహ్మలోకః పరాగతిః.
దేవాసురవినిర్మాతా దేవాసురపరాయణః,
దేవాసురగురుర్దేవో దేవాసురనమస్కృతః.
దేవాసురమహామాత్రో దేవాసురగణాశ్రయః,
దేవాసురగణాధ్యక్షో దేవాసురగణాగ్రణీః.
దేవాదిదేవో దేవర్షి ర్దేవాసురవరప్రదః,
దేవాసురేశ్వరో విశ్వో దేవాసురమహేశ్వరః.
సర్వదేవమయోఽచింత్యో దేవతాత్మా త్మసంభవః,
ఉద్భిత్త్రివిక్రమో వైద్యో విరజో నీరజోఽమరః.
ఈడ్యో హస్తీ శ్వరో వ్యాఘ్రో దేవ సింహో నరర్షభః,
విబుధోఽగ్రవర స్సూక్ష్మ స్సర్వదేవ స్తపోమయః.
సుయుక్త శ్శోభనో వజ్రీ ప్రాసానాం ప్రభవోఽవ్యయః,
గుహః కాంతో నిజస్సర్గః పవిత్రం సర్వపావనః.
శృంగీ శృంగప్రియో బభ్రూ రాజరాజో నిరామయః,
అభిరామస్సురగణో విరామస్సర్వసాధనః.

లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః,
స్థావరాణాం పతిశ్చైవ నియమేంద్రియ వర్ధనః
సిద్ధార్థ స్సిద్ధభూతార్థోఽచింత్యసత్యవ్రత శ్శుచిః,
వ్రతాధిపః పరంబ్రహ్మ భక్తానుగ్రహకారకః
విముక్తో ముక్త తేజాశ్చ శ్రీమాన్ శ్రీవర్ధనో జగత్.

(మహాభారతము. — అనుశాసనికపర్వము.)



# మహర్షుల చరిత్రలు

## మృకండుమహర్షి

### జననము

మహానుభావుఁడగు మృగశృంగమహర్షి తపశ్శక్తిచేఁ జనిపోయిన సువృత్తను ఆమెచెలికత్తెలను మరల బ్రతికించెను. సువృత్తతండ్రి యగు సుచక్షుఁడు తనకూఁతును సువృత్త నాతని కిచ్చి పరిణయము చేయు సమయమున నామె ముప్వురు చెలికత్తెలు విచ్చేసి మృగశృంగు నితో "మహాత్మా! నీవు మాకుఁ బ్రాణదానము చేసిననాఁడే నిన్నుమాకుఁ బతిగా మేము వరించియుంటిమి. మమ్మును నీవు వివాహ మాడుము. నీకు మేలు కలుగును. లేకున్న మేము మా ప్రాణములు విడుతు" మని పలికిరి. మృగశృంగమహర్షి యేమి చేయుటకును బాలుపోక డోలాందోళిత మనస్కుఁడై యుండఁగా వ్యాసమహర్షి విచ్చేసి వారి నల్వురను బరిణయమాడు మని మృగశృంగుని హెచ్చరించెను. ఆతని యాదేశము ననుసరించి మృగశృంగుఁడు వారినల్వురను వివాహమాడి ధర్మయుక్తముగా గృహస్థధర్మమును నిర్వర్తించుచుండెను.

సువృత్తయు, నామెచెలికత్తెలు సవతులు నగు కమల, విమల, సురస యనువారును దోఁబుట్టువుల వలె మెలఁగుచు, నించుకయు నీర్ష్యాద్వేషములు లేక మృగశృంగమహర్షి నెల్లవిధముల సేవామూలమున సంతోష పెట్టుచుండిరి. అతఁడును వారియెడ సమానప్రేమను జూపుచు నందఱ నానందపఱచు చుండెను. సురూప సుగుణసుందరు లగు నా యిందువదనలఁ గూడి మహనీయ తపోనిధి యగు మృగశృంగుఁడు తపస్స్వాధ్యాయనిష్ఠ నేమఱక, అతిథ్యభ్యాగతపూజ గావించుచు, ఇష్టోపభోగములఁ దాను దనిసి భార్యలఁ దనుపుచు సారహీన మగు సంసారమును మిగుల సారవంత మొనరించుచుఁ గడపుచుండఁగా నాతనిభార్యలు నలువురు నొక్కసారిగా గర్భములు ధరించిరి. చెట్టునకుఁ

గాయ, మొక్కఁటుఁ బూవు, అవునకు దూడ మిక్కిలియందమిచ్చును. అదేవిధమున నతిశయ రూప సౌభాగ్యములకుఁ బతిసేవాపరాయణతకు వినయవిధేయతలకు ఫలము స్త్రీకి సుపుత్రోదయమే. పవిత్ర వివాహ ధర్మము పావన సంతానమేకదా!

నవమాసములు నిండినపిదప సువృత్తాసాధ్వి యొక సుపుత్రుని గాంచెను. ఆతని జన్మకాల లగ్నాదులఁ బరిశీలించి త్రికాలవేది యగు మృగశృంగమహర్షి "భవిష్యత్కాలమున మృగములు కండూతి వాయఁ దపోనిష్ఠా గరిష్ఠుండగు నాతనిదేహంబును దమ దేహంబులతో రాచికొను ననెడి యర్థంబు సూచితంబుగా నాపుత్రునకు మృకండుఁడను నామకరణము చేసెను. అపుడే మిగిలిన ముువ్వురు భార్యలు ప్రసవించి ముువ్వురుపుత్రులను గాంచిరని విని మృగశృంగమహర్షి వారిలోఁ గమల కొడుకునకు ఉత్తముఁ డనియు, విమలకొడుకునకు సుమతి యనియు, సురస కొడుకునకు సువ్రతుఁ డనియు నామకరణముచేసెను.

## బాల్యము

కాలక్రమమున శుక్లపక్ష చంద్రులవలె నా బాలురు నల్వురు పెరిగి యుపనీతులైనపిదపఁ దండ్రి వారికి నాలుగువేదములు సాంగోపాంగముగా నేర్పి సకలవిద్యలు చదివించి విద్వాంసులఁ గావించెను. వారిలో మృకండుఁ డందఱికన్న నెక్కుడు మేధగలిగి గుణవిద్యాగురుశీలముల మిగిలినవారికి మిన్నయై యుండెను. విద్యావివేక వినయ విధేయు లగు పుత్రులు నల్వురు తల్లులకుఁ దండ్రికి సేవచేయుచు విద్యావైభవమున వెలుఁగొందుచుండ మృగశృంగమహర్షి కాంచి తనజన్మము ధన్యమైనదిగా భావించెను.

మానవదేహములు కాలపరిణామ శీలములు. నేఁడు పొత్తిళ్ళలో నొదిఁగియున్న బిడ్డ రేపు క్రీడాసక్తుఁ డగు బాలుఁడు. నేఁటి బాలుఁడు రేపు తరుణీసక్తుఁ డగు యువకుఁడు. నేఁటియువకుఁడు రేపు జరా జాడ్య పీడితుఁడగు ముదివగ్గు. నిగనిగలాడు సోయగమున నెగడు నేఁటి కురులు రేపు చూడ నసహ్యకరము లగు పలిత కేశములు.

తనయునంగు బిడ్డలు పెరిగి పెద్దవారగుచు విద్యాబుద్ధులు గఱచి విలసిల్లుచుండఁ జూచిన మృగశృంగుఁడు వారికి వివాహములు కావించి వారిని గృహస్థుల నొనరింపఁ గాంక్షించెను. మానవకాంక్షలు చిత్ర విచిత్రములు. బిడ్డలు లేనిచో బిడ్డలకొఱకుఁ గాంక్ష, పుట్టినబిడ్డ పెరిగి పెద్దవాఁడై విద్యాబుద్ధులు గఱవవలయు ననుకాంక్ష, ఆ పిదపఁ గోడలిని జూడఁ గాంక్ష, పిమ్మట నాకోడలి కడుపున నొక కాయ కాచినఁ జూడఁ గాంక్ష. ఒక కాంక్ష కోటి కాంక్షలఁ బుట్టించుట కాంక్షాస్వభావము గదా!

## వివాహము

మృకండునకు యుక్తవయస్సు రాఁగానే యాతనికి ముద్గల మహర్షి కుమారిక యగుమరుద్వతిపై మక్కువ కలిగెను. ముద్గలుఁ డమితానంద మంది మరుద్వతిని మృకండుని కిచ్చి వివాహము చేయ నంగీకరించెను. మృగశృంగుఁ డానందించెను. పిదప నొక శుభ ముహూర్తమున మరుద్వతీమృకండులవివాహ మతివైభవముగా జరిగెను. అట్లే మృగశృంగమహర్షి యితరపుత్రులలో ఉత్తముఁడు కణ్వుఁ డనువానికూఁతు రగుకుశను, సుమతి సుమతి యనువానికూఁతు రగుసత్యను, సువ్రతుఁడు పృథుపుత్రికయగు ప్రియంవదను అగ్ని సాక్షిగా వివాహమాడిరి. ఇట్లు మృగశృంగుని పుత్రులు వివాహితులై గృహస్థాశ్రమములఁ బ్రవేశించి శమదమాదులు గలిగి సత్యవర్తనులై శాశ్వత కీర్తి గడించిరి.

ఇట్లుండఁగా మరుద్వతిమృకండులకుఁ దక్క మిగిలినవా రందఱకు సంతానము కలిగెను. మృగశృంగుఁడు కొడుకులపైఁ గోడండ్రపై సంసారభారమును మోపి తాను భార్యతోఁ గూడి తపఃపరుఁడు తీర్థ యాత్రాసక్తుఁడు నయి వానప్రస్థాశ్రమమును నడపి తుదకు శాంతి యుతుఁడు సర్వభూతాంతరాత్ముఁడు నయి జీవములు వాసెను.

## సంతతికై మృకండుని తపస్సు

మృకండుఁడు తనకు సంతతి కలుగ లేదని వంతచెంది భార్యను నలువురతల్లులను వెంటఁ గొని తీర్థయాత్రకు బయలుదేఱెను. క్రమ

ముగా నాతఁడు వారితో విశ్వేశ్వరరాజధాని యగు కాశీపురమును జేరి గంగాస్నానాదికమును యథావిధిగ నెఱవేర్చి ఢుంఠివిఘ్నేశ్వర సమీపమునఁ దనపేర నొకశివలింగమును బ్రతిష్ఠచేసెను. అట్లే యాతని తల్లులు నల్వురును దమతమ పేర సువృత్తేశ్వర, కమలేశ్వర, విమలేశ్వర, సురసేశ్వరలింగములను బ్రతిష్ఠించిరి. మరుద్వతి తనపేర మరుద్వతీశ్వరలింగమును బ్రతిష్ఠించెను. వీర లందఱతిభక్తిశ్రద్ధాన్వితులై లింగప్రతిష్ఠాపన చేయుటచే నా లింగము లనంతశక్తి సంపన్నము లయ్యెను. మృకండీశ్వరసందర్శనమున సర్వకార్యసిద్ధి యగును. సువృత్తేశ్వరదర్శనమున మంచిశీలము సర్వకార్యములయందు విఘ్నము లేకుండుట గల్గును, కమలేశ్వర దర్శనమున సర్వకామ్యసిద్ధియు, విమలేశ్వరలింగదర్శనమున విమలజ్ఞానము, మరుద్వతీశ్వరదర్శనమున జన్మరాహిత్యము సంభవించును.

ఈ ప్రకారము మృకండుమహర్షి కాశీనగరమున వారితో నొక్క సంవత్సర ముండి శివప్రీతికరముగా మహా తపస్సుచేసెను. అంత నొక నాఁడు మృకండుని తల్లులు వృద్ధ లగుట విశ్వేశ్వరునికిఁ బ్రదక్షిణములు చేయుచుఁ బడిపోయి ప్రాణములు విడుచువేళ విశ్వేశ్వరుఁడు వారికిఁ దారక మంత్రోపదేశము చేసి వారిని గైలాసమునకుఁ దీసికొనిపోయెను. మృకండుమహర్షి తల్లుల కూర్ధ్వదైహికక్రియలెల్లఁ గావించి మాతృఋణ విముక్తుఁ డయ్యెను.

## వరప్రసాదము

పిదప మరుద్వతీమృకండులు కాశిలోనే యుండి నిత్యము గంగాస్నానము గావించుచు భక్తి తాత్పర్యములతో విశ్వేశ్వరునిగూర్చి మహాతపము చేసిరి. అంతఁ గొంత కాలమునకు విశ్వేశ్వరుఁడు మృకండునిపై దయ దలఁచి ప్రత్యక్షమై వరము కోరుకొను మనెను. మృకండుఁడు శివుని దన కొకపుత్రు నిమ్మని గోరుకొనెను. విశ్వేశ్వరుఁ డాతనితో "ఓయీ! మిక్కిలి గుణవంతుఁడై పదునాఱేండ్లుమాత్రము బ్రదుకుకొడుకు కావలయునా? లేక గుణహీనుఁడై చిరంజీవి యగుకొడుకు కావలయునా? తెల్పు" మనెను. అంత మృకండుఁడు "దేవా!

అల్పాయువైనను సుగుణవంతుఁ డగుసుతునే యి" మ్మని ప్రార్థించెను. శివుఁడట్లే యని యంతర్ధాన మయ్యెను.

## మార్కండేయ జననము

అంతఁ గొంతకాల మైనపిదప మృకండుని దయవలన మరుద్వతి గర్భమును ధరించెను. పెన్నిధిఁ గన్న పేదలవలెఁ జిరకాలమున కా యదృష్టముపట్టిన యా జాయాపతుల యానందమునకు మేరలేకుండెను. నవమాసములు నిండినపిదపఁ గాలవిదులు స్తుతి యొనర్పఁ దగిన సుముహూర్తమున మరుద్వతి యొక సుపుత్రుని గాంచెను. అపు డాకాశము నుండి పుష్పవర్షము కురిసెను; దేవదుందుభులు మ్రోఁగెను. దశదిశలు, నదులు ప్రసాదము లయ్యెను; వ్యాసమహర్షి శిష్య సమేతుఁడై యచటికి విచ్చేసి, దేవతలు జయజయధ్వానము లొనరించుచుండ జాతకర్మాదికమును నడపి యా బాలునికి మార్కండేయుఁడని పేరిడెను. మృకండుఁ డపరిమితానందము నంది వ్యాసభగవానుని పాదములపై వ్రాలి యలభ్యయోగ మగు నాతని దర్శనమునకుఁ గృతజ్ఞతఁ దెలిపి యాతని ననేక విధముల నర్చించెను. పిదప వ్యాసుఁడు బాలు నాశీర్వదించి యా మహనీయుని గన్న దంపతుల నభినందించి వెడలిపోయెను.

పిదప, బాలచంద్రునివలెఁ బెరుఁగు మార్కండేయున కైదవ యేఁడు రాఁగానే మృకండుమహర్షి యుపనయన మొనరించి వేద వేదాంగములను బోధించెను. పూర్వజన్మ సంస్కారవు కతమున నాతఁ డఖిలవేదముల నచిరకాలముననే నేర్చెను. ఇట్లుండఁ గాలము పరుగిడెను. మార్కండేయునకుఁ బదునాఱవయేఁడు వచ్చెను. మరుద్వతీ మృకండు లిది కారణ మని తెలుపక కన్నీరు మున్నీరుగా నేడ్చుచు దిగులుపడుటఁ గాంచినమార్కండేయుఁడు తలిదండ్రులకు మ్రొక్కి వారివంతకుఁ గల కారణముఁ దెలుపుఁ డని ప్రార్థించెను. చెప్పలేక చెప్పలేక చెప్పఁ దప్పక మృకండుమహర్షి యావద్విషయము మార్కండేయునికిఁ జెప్పెను. మార్కండేయుఁ డావంతయుఁ జింతింపక ధైర్యయుతుఁడై చిఱునగవుతో "తండ్రీ! భయపడకుఁడు. నేను

శివుని గొలిచి చావు గెలిచెదను" అని పలుక దీనదృక్కులతో నాతలి దండ్రులు అక్కుమారు నక్కులఁ జేర్చుకొని "తథా" స్తని పలికిరి.

మఱియు :

"కాలపాశంబుచేఁ గట్టఁగాఁ బడియున్న
శ్వేతకేతువును రక్షించినాఁడు
ప్రళయాగ్నివలెఁ బ్రజ్వరిలుకాలకూటంబుఁ
గ్రోలి ముజ్జగములఁ బ్రోచినాఁడు
ధట్టించి యరకాలఁ దన్ని మిత్తిని శిలా
దుని తనూజాతుని మనిచినాఁడు
జాలకారకుఁ డైన జాలంధరుని మక్క
డంచి దేవతలఁ బాలించినాఁడు

త్రిపురదైత్యుల భస్మీకరించి విష్ణు
బాణమున, సాధువులను గాపాడినాఁడు
దర్పితాంధక గర్వ విధ్వంసకుండు
శిక్షిత మనోభవుం డిందుశేఖరుండు.

అట్టిశరణాగత రక్షకుఁ డగు శంకరుఁడె నిన్ను రక్షించు" నని యాశీర్వ దించిరి.

## మృత్యు జయము

మార్కండేయుఁ డట్లు తలిదండ్రుల దీవనలఁ బడసి దక్షిణ సముద్రతీరమునఁ దనపేర శివలింగమును బ్రతిష్ఠించి యచట మాఘ స్నానము చేసి శుచియై మార్కండేయ లింగమునకుఁ ద్రికాలపూజ చేసి పూజావసానమున నానందపులకాంకిత గాత్రుఁడై నాట్య మొనర్చి శివ స్తోత్రము గావించుచుండెను. అంతలో నాతని కాయువు చెల్లుటచే నతి భయంకర మగు కోరలుగల నోటితో, అంజనపర్వతమువంటి మేనితో, భీకరాయుధపాణియై, సర్పవృశ్చిక రోమచయముతో, నిప్పులు రాలు కన్నులతో, క్రూరదృష్టితో, కోపముతో, మృత్యుదేవత భృత్యగణము తన్ను వెన్నంటియుండ యముఁడు విచ్చేసి తన కాలపాశమును మార్కండేయుని మెడకుఁ దగిలించి బలముగ లాగెను. అపుడు

మార్కండేయుఁ డాలింగమును గట్టిగాఁ గౌఁగిలించుకొని యముని జూచి "ఓయీ! శివస్తోత్రము పూర్తియగువఱకు నాఁగుము. తరువాత నేనే వచ్చెద" ననెను. అంత యముఁడు "ఓయీ! మూఢా! కాలముతీఱు లోపలనే నరుఁడు చేయవలసిన కృత్యములు చేసియుండవలెఁ గాని యముఁ డాపను లగువఱ కాఁగునా? నరుఁడు పూర్వవయస్సుననే ధర్మము చేసికొనవలయును; అట్లు కాక వార్ధకమున మొదలుపెట్టిన నాఁడు తుది నెగ్గఁగలఁడా? మాసాష్టకము శ్రమపడినవాఁ డేఁడాది సుఖ పడును. పగటివేళఁ గార్యము సాధించుకొన్న రాత్రి హాయిగా నిద్రింప వచ్చును. పూర్వవయస్సున ధర్మకర్మము లొనరించినయెడల వార్ధక మున సుఖింపవచ్చును. ఱేపటిపని నేఁడే చేసికొనవలయును. మధ్యా హ్నపుఁ బని ప్రొద్దుటే చేసికొనవలయును. కాలము మూఁడనివాఁడు కోటిబాణములచేఁ గొట్టఁబడినను జావఁడు. కాలము మూఁడినవాఁడు గడ్డిపఱక తగిలినను జచ్చును. కోటిమంది చక్రవర్తులు వేయిమంది యింద్రులు నాచేఁ జచ్చిరి. ఇఁక నీవు నాకొక లెక్కయా" యని తర్జింప మార్కండేయుఁ డాతని కిట్లనియెను. "ఓయీ! శంకరస్తవ మున కడ్డువచ్చినవాఁడు మడియఁగలఁడు. మఱియు శివభక్తులకు శివుఁడే శాస్త. నీవు గావు. శివభక్తుల కావదలు రావు. శంకరుని కింకరులను దాఁకుటకు బ్రహ్మాదులకేని శక్యముకాదు పొమ్ము." ఆ మాటలు విని యముఁడు మండిపడి యాతనిని మ్రింగివేయ నోరు తెఱవఁగనే యాలిం గమునుండి శివుఁడు ప్రాదుర్భవించి యము నొక్క తన్నుఁ దన్నెను. దానితో నాతఁ డామడదూరమునఁ బడిపోయెను.

## శివస్తుతి

మార్కండేయుఁ డత్యంతభక్తి సంభరితుఁడై పరమేశ్వరు నిట్లు స్తుతించెను:

"మత్తకోకిల:

బాలచంద్రకళావిభూషణ భాసమాన కపర్దునిన్
వ్యాళరాజగుణోపపన్న సువర్ణశైల శరాసనున్
నాళికేక్షణబాణునిన్ గణనాథునిన్ ద్రిపురఘ్ను నిన్
గాలకాలుని జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్?

శైలరాజ సుతాపరిష్కృత చారువామ కళేబరున్
హేళిలోచనహారి నీక్షణ నిర్మితాఖిల లోకునిన్
బాలితావనపాత్రునిన్ మునిభావనీయ చరిత్రునిన్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

వ్యాళభూషణ భూషితాంగుని నార్తలోక శరణ్యునిన్
ఫాలలోచన దగ్ధకాముని భస్మదిగ్ధ శరీరునిన్
శూలపాణి నశేషదుష్టనిషూదనవ్రత దీక్షితున్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

నాళికాసన విష్ణు నిర్జర నాయకాద్యఖిలద్యు స
త్పాళిసేవిత పాదపద్ముని దక్షయజ్ఞ విభంజనున్
క్షాళితప్రణతాఘపంకుని సర్వలోక మహేశునిన్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

నీలలోహితమూర్తి నుగ్రుని నిత్యునిన్ బ్రళయానలా
భీలరూప వినాశితాంబుజ పేశికోటి సహస్రు ను
ద్వేలశక్తి ననశ్వరోర్ధ్వగతి ప్రదాత నమేయునిన్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

బాలిశావిదిత ప్రభావుని( బంచవక్త్రుని రౌప్య గో
త్రాలయస్థితి సౌఖ్యవేది ననాది నవ్యయునిన్ విప
జ్జాలతూల సమీరునిన్ గజచర్మధారి నలభ్యునిన్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

క్ష్వేళపాయిని మృత్యుజేతను సిద్ధిదాత నశేష రు
క్సాల దావదవాగ్ని నాశ్రితకల్పశాఖి నజున్ దిశా
చేలునిన్ భగవంతునిన్ గుణసింధువున్ బరమాత్మునిన్
గాలకాలుని జొచ్చితిన్ నను( గాలు( డేమి యొనర్చెడిన్ ?

కాళికాహృదయాబ్జ భానుని( గామితార్థదునిన్ మహా
కాలునిన్ భవరోగవైద్యుని( గర్మపాదపమూల ని

ర్మూలన క్షమునిన్ గుణత్రయ రూపునిన్ గరుణానిధిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ నను. గాలుఁ డేమి యొనర్చెడిన్?

కాళ్లు పట్టుకొంటిఁ గాలకంఠునిఁ గళా
మూర్తి నఖిలగురుని మోక్షకరునిఁ
త్రిభువనాధిపతిని దేవాదిదేవుని
మృత్యు వేమి చేయు నింక నన్ను?

కాళ్ళు పట్టుకొంటిఁ గాలాగ్ని రుద్రుని
వృషభవాహనుని గిరీశు నజునిఁ
జండికాంతరంగ సరసీరుహార్కుని
మృత్యు వేమి చేయు నింక నన్ను?

కాళ్ళు పట్టుకొంటి గంగాధరుని మహా
నటుని శివుని దుష్టనాశకరుని
భక్తరక్షకునిఁ గపాలిని శూలిని
మృత్యు వేమి చేయు నింక నన్ను?

కాళ్ళు పట్టుకొంటిఁ గైలాసనాథుని
సృష్టి రక్షణప్రణష్టికరుని
సర్వభూత పతిని సర్వేష్టదాతను
మృత్యు వేమి చేయు నింక నన్ను? *

అని యెలుఁగెత్తి ప్రార్థించెను. శివుఁ డాతనిభక్తి మెచ్చుకొని యాత నికి దీర్ఘాయువు త్రికాలజ్ఞత దివ్యశక్తినొసంగి యదృశ్యుఁ డయ్యెను.

---

* ఈపద్యములు శ్రీ. శే. పిసుపాటి చిదంబరశాస్త్రిగారి పద్మపురాణము ఉత్తరఖండము లోనివి. వీనికి సంస్కృత మూల శ్లోకములు :

రత్నసాను శరాసనం రజతాద్రి శృంగ నికేతనం
శింజినీకృత పన్నగేశ్వర మచ్యుతానల సాయకమ్,
క్షిప్రదగ్ధ పురత్రయం త్రిదశాలయై రభివందితం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

మార్కండేయుఁ డింటి కేఁగి తన్నుఁ దలపోయు తల్లిదండ్రుల కా వృత్తాంత మంతయుఁ దెలిపి వారి నానందాబ్ధి నోలలాడించెను. అట్టి మహామహుని బుత్రరత్నముగాఁ గన్నందుల కపరిమితానందమునఁ జిరకాలము జీవించి శివకటాక్షమున నాపుణ్యదంపతులు శివసాయుజ్య మందిరి.

---

పంచపాదప పుష్పగంధి పదాంబుజద్వయ శోభితం
ఫాలలోచన జాతపావక దగ్ధమన్మథ విగ్రహమ్,
భస్మదిగ్ధ కళేబరం భవనాశనం భవ మవ్యయం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

మత్తవారణ ముఖ్య చర్మకృతోత్తరీయ మనోహరం
పంకజాసన పద్మలోచన పూజితాంఘ్రి సరోరుహమ్,
దేవసింధు తరంగ సీకరసిక్త శీత జటాధరం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

కుండలీకృత కుండలేశ్వర కుండలం వృషవాహనం
నారదాది మునీశ్వర స్తుతవైభవం భువనేశ్వరమ్,
అంధకాంతక మాశ్రితామర పాదపం మదనాంతకం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

యక్షరాజసఖం భగాక్షహరం భుజంగ విభూషణం
శైలరాజసుతాపరిష్కృత చారువామ కళేబరమ్,
క్ష్వేళనీలగళం పరశ్వధధారిణం మృగధారిణం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

భేషజం భవరోగిణా మఖిలాపదా మపహారిణం
దక్షయజ్ఞ వినాశనం త్రిగుణాత్మకం త్రివిలోచనమ్,
భుక్తిముక్తి ఫలప్రదం సకలాఘ సంఘనిబర్హణం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

భక్తవత్సల మర్చితాం నిధి మక్షయం హరిదంబరం
సర్వభూతపతిం పరాత్పర మప్రమేయ మనూపమమ్,
సోమవారి నభోహుతాశన సోమపాద్యఖిలాకృతిం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

విశ్వసృష్టి విధాయకం పునరేవ పాలనతత్పరం
సంహరంత మపి ప్రపంచ మశేషలోక నివాసినమ్,
క్రీడయంత మహర్నిశం గణనాథయూథ సమావృతం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.

కాలకంఠం కలామూర్తిం కాలాగ్నిం కాలనాశనమ్,
నమామి శిరసా దేవం కిం నో మృత్యుః కరిష్యతి. *



* (పద్మపురాణము, భాగవతము.)

# మహర్షుల చరిత్రలు

## వాత్స్యాయన మహర్షి

### తపస్సు

వాత్స్యాయనమహర్షి బ్రహ్మచర్యవ్రతము నవలంబించి మనోవాక్కాయకర్మలచే మహాతప మొనరించిన తపశ్శాలురలో మేటి, యోగులలో నద్వితీయుఁడు, జ్ఞానులలో సుప్రసిద్ధుఁడు నయ్యెను. తపశ్శక్తి మూలమున నీతఁడు ముల్లోకములు తిరుగుచు ముముక్షువులఁ బ్రోచుచు మోదఖేదములు లేక దివ్యవర్చస్వియై యుండెను. అతఁడు మహాతప మొనరించి ఆదిశేషుని ప్రియభక్తుఁడై యాతని కృపాకటాక్షముల నత్యధికముగఁ జూఱగొనెను.

### ఆదిశేషుని ఆశ్రయము

ఒకప్పుడు వాత్స్యాయనమహర్షి శేషునికడ కేగి సాష్టాంగ నమస్కారము లొనరించి శ్రద్ధాభయభక్తుఁడై సృష్టిక్రమము సవిశేషముగా నెఱింగింపు మని ప్రార్థించెను. అనంతుఁ డాతని జిజ్ఞాసకు మెచ్చి బ్రహ్మాది స్తంబ పర్యంత మగు సమస్తసృష్టిక్రమమును సవిశేషముగా నెఱింగించెను. పిదప నాతఁడు సూర్యవంశక్షత్రియుల చరిత్రలాదిశేషు నడిగి సవిస్తరముగాఁ దెలిసికొనెను. ప్రసంగవశమున రఘువంశకథ విని తనివితీరక వాత్స్యాయనుఁడు శేషునికి మ్రొక్కి "దేవా! భువనపావన మగు రామకథామృతమును గ్రోలి తనివి గనువాఁ డుండఁడు. రామచరిత్రము విన్నను, తలఁచినను, చెప్పుకొన్నను, కలుషముల నెల్ల నఱవఱలు చేయఁజాలును. మఱియు రామాశ్వమేధ వృత్తాంతము రామకథారత్నములలో నత్యుత్తమము. సకలభువనవహనమహనీయుఁడ వగు నీనోట నది వినఁ గుతూహలపడు

చున్నాను శ్రమ మిచ్చినందులకు క్షమించి నా కోరికc దీరుపు" మని సవినయముగాc బ్రార్థించెను.

## రామకథాశ్రవణము

ఆదిశేషుc డానందించి "మునీంద్రా! నీయదృష్టము మంచిది. నీ జన్మము ధన్యము. పుణ్యహీనునకు రామకథాసుధారసముc గ్రోలు సంకల్పమే కలుగదు. నీవంటిపుణ్యాత్ముల పుణ్యదాయక మగుకోరిక వలన నావంటివారికి పరమాత్ముని స్మరించుభాగ్య మబ్బును. రామ కథాసముద్రము నీదుటకు నావంటి యత్యల్పుc డెంతయు నసమ ర్థుcడు. ఐనను, నీ కోరిక దీరుప యథాశక్తిc దెలిపెదను. ఆకాశమువలె ననంతమైన రామకథ యెక్కడ? పక్షిసముcడ నగునేను జెప్పcగడcగు టెక్కడ? అగ్ని సంపర్కమున సువర్ణము అమలమైన విధమున, అఖిల ఘోర పాపహరణ నిపుణ మగు రామకథాభిమర్శనమున నా బుద్ధి పరి శుద్ధి నందుcగాక!" అని పలికి క్షణమాత్రము నిమీలిత నేత్రుcడై పరమ విజ్ఞానబలమున రామకథ కనులకుc గట్టినట్లు కానిపింప హర్ష పులకితుcడై యిట్లు చెప్పcదొడcగెను.

సర్వలోక వైరియగు రావణాసురుని దనబాణములనెడు నగ్నిచే దగ్ధముచేసి, గుణవంతుcడగు విభీషణునకుc బట్టాభిషేక మొనరించి, ఇంద్రాదిదేవతలు భక్తిశ్రద్ధలతోc జేయు వందనోపచారములు స్వీక రించుచు మునీశ్వరబృందముల వేదోక్తాశీర్వచనములకు మోదమందుచు స్వకార్యము నిర్వర్తించి శ్రీరాముcడు భువనాభిరాముcడై జానకీలక్ష్మ ణులు పార్శ్వముల నుండ సాకేతమునకుc బోవ నెంచి పుష్పకవిమానము నధిష్ఠించెను. ఆతనివెంట బ్రహ్మాదులు, సుగ్రీవుcడు, విభీషణుcడు, వానరులు నాతని యాజ్ఞచేc బుష్పక మధిరోహించిరి. అంతc బుష్పక మెగిరి నందిగ్రామముc జేరెను. నందిగ్రామమున నున్నభరతునకుc దనరాక నెఱిcగింప శ్రీరాముc డాంజనేయుని బంపెను.

హనుమంతుcడు కడcగంటనైనc గాసువీసములc దాcకక, కల నైనc గాంతను దలcచికొనక, మంచినీటి చుక్క యైనను గొంతునc

బోసికొనక, అస్నానమైన దగ్గఱకు రానీయక, జడలుగట్టిన శిరోజములతో, క్షీణించు శరీరముతో భ్రాతృవిరహమున క్షణ మొకయుగముగాఁ గడపుచు రాముని రాకకై సూర్యదేవునికి వేయి మ్రొక్కులు మ్రొక్కుచుఁ బలవించుభరతునిఁ జూచి యాతని రామభక్తిముందుఁ దన భక్తి యేపాటి దనుకొని యాంజనేయుఁ డాతనికి రామాగమనవార్తఁ దెలుప నాతఁ డపరిమితానందమున రాముని కెదురేగి భక్తిపురస్సరముగాఁ గౌఁగిలించుకొని యాతని వాత్సల్యమునకు గురియై యాతని యానఁ బుష్పక మెక్కెను. విమానము అయోధ్య చేరెను. దిగి రామాదులు తల్లులకు మ్రొక్కి పెద్దలపాదము లంటి సర్వజన ప్రియులైరి. భరతుఁడు రాజ్యము రామునికొప్పగించెను. దేవతలు శ్రీరాము నిట్లు స్తుతించిరి.

"రామా !

త్రిలోకాభిరామా !

సహస్రాంశువంశాబ్ధిసోమా !

మత్స్యావతారము: త్వదీయప్రభావం బసామాన్య మాపన్నసంరక్షణా ! వేదసందోహ చౌర్యంబు గావించి యంభోధిలోఁ దూఱియుండన్ హయగ్రీవరాత్రించరగ్రామణిన్గూల్చి మత్స్యావతారంబునన్ వేదరాశిన్ బ్రసాదింపవే !

కూర్మావతారము: ధాతకున్ గూర్మరూపంబునన్ మందరగ్రావమున్ మోసి బర్హిర్ముఖశ్రేణి కెల్లన్ సుధాన్నంబు సంతృప్తిగాఁ బెట్టవే !

వరాహావతారము: పోత్రిపై లోకసంతాపకారిన్ హిరణ్యాక్షరాత్రించరాధీశ్వరున్ దున్మి విశ్వంభరామండలోద్ధారమున్ జేయవే !

నృసింహావతారము: నారసింహుండవై యుద్భవంబంది కంబంబునం దద్ధిరణ్యాక్షరక్షోనుజుం జీల్చి చెండాడి యాపద్గతుండైన ప్రహ్లాదునిం బ్రోవవే !

వామనావతారము: వామనాకారమ్ముం దాల్చి పాదత్రయ క్ష్మాతలం బర్థివై కోరి, లబ్ధాభిలాషుండవై సర్వలోకంబు వ్యాపించి రెం డడుగులన్, శిష్ట మైయున్న యేకాంఘ్రిచే దుష్టరక్షోధినాథున్ బలిన్ ద్రొక్కవే యంటఁ బాతాళమున్!

పరశురామావతారము: భార్గవాకారముంజెంది గర్వాంధ మై యున్న క్షత్త్రింబుఁ గ్రోధాగ్నిలో వేల్చి, ముయ్యేడుమాఱుల్ మహీ భారముం దీర్పవే!

రామావతారము: రామచంద్రుండవై తాటకన్ మాపి, గాధేయ యజ్ఞంబు రక్షించి, చేపట్టి సీతాసతీరత్నమున్, రాజ్యమున్ వీడి, ఘోరాటవుల్ సొచ్చి, నానావిధ క్లేశముల్ సైంచి, లోకాపకారిన్ మహాపాపకారిన్ సురారిన్ సమూలంబుగా రావణుం ద్రుంచి, లోకంబులన్ నిల్పవే! త్వత్కృతంబైన రక్షోవినాశంబు తత్కార్యసంజాత లోకైక కల్యాణమున్ వేయి నోళ్లన్ నుతింపంగ సాధ్యంబె!

కృష్ణావతారము: కృష్ణుండవై పుట్టి శాసించి కంసాదిహింసాపరస్వాంతులన్, గావవే ధర్మమార్గైక సంసక్తులన్ భక్తులన్.

బౌద్ధావతారము: బుద్ధరూపంబునన్ బౌద్ధమార్గంబు బోధించి, సాధింపవే దేవతాకార్యమున్!

కల్క్యవతారము: కల్కివై నాశ మొందింపవే పాపలోకంబు నెల్లన్.

భవల్లీల లక్ష్యేయముల్; సృష్టి గావింప సంకల్ప ముత్పన్న మైనన్ సృజింపంబడున్; సర్వలోకంబులున్ స్వస్థతంజెంది యుండంగ నాకాంక్ష సంధిల్లినన్ స్వస్థతం జెందియుండున్; హరింపందలం పేర్పడంగన్ లయుంబొందు; లోకత్రయారాధ్య! నీనామముల్ బ్రహ్మహత్యాది పాపంబులన్ రూపుమాపన్ సమర్థంబు; అస్తోకమాహాత్మ్య! నిన్నంట వేనాఁటికైనన్ జరామృత్యు జన్మాది దుఃఖంబు; అప్రాప్య! నీతత్త్వ మెవ్వం డెఱుంగున్; గుణాతీత! నీభావ మెవ్వండెఱుంగున్; నిరాకార! నీరూప మెవ్వం

డెఱుంగున్; సదాకార! నీ వెల్లెడన్ నిండియున్నాఁడ వంతర్బహిర్భేద శూన్యుండవై; త్వచ్చరిత్రంబు చిత్రంబు చిత్రంబు వాఙ్మానసాగోచరా! ధర్మభంగం, బధర్మోదయంబున్ దటస్థించు కాలంబునం దాత్మతేజంబుచే వ్యక్తరూపుండవై యుద్ధరింపంగదే శిష్టులన్, సంహరింపంగదే దుష్టులన్, సర్వశక్తుల్ త్వదాయత్తముల్; నీవు గాకున్న లోకంబు లెల్లన్ బ్రవర్తింపఁ జేయన్ సమర్థుండు వేఱొక్కఁ డెవ్వండు స్వామీ! భవన్మాయకున్ లోనుగాకుండువా రెవ్వ రీ మూఁడులోకంబులన్; యజ్ఞముల్ పూర్తముల్ దానముల్ ధర్మముల్ దేవ! నీ ప్రీతికై గాదె కావింతు రార్యుల్; తపస్వుల్ తపంబున్ త్వదర్థంబ కావింతు; రింతేల? తత్త్వజ్ఞులైనట్టివా రెల్ల కర్మంబులున్ నీకె యర్పింతు; రాద్యుండ; వీ వప్రమేయుండ; వీ వప్రణాశుండ; వీ వాత్మ; వీ వెల్ల కాలంబు; లోకత్రయస్తోత్రపాత్రంబు; నీపాద యుగ్మంబు; సర్వేప్సితార్థప్రదం; బస్మదీయాంతరంగంబులందుండుఁగా కెప్పుడున్; నిన్నె దర్శించుచున్ నిన్నె ధ్యానించుచున్ నిన్నె కీర్తించుచున్ ధన్యతం జెందుభాగ్యంబు మాకున్ బ్రసాదింపు మీశా! నమస్తే నమస్తే నమస్తే నమః." *

దేవతాప్రార్థనమును విని రాముఁడు వారి కభయహస్త మిచ్చి వీడ్కొలిపి తాను బరమ ధర్మముగా రాజ్యమును బాలించెను.

తరువాత నొకనాఁ డగస్త్యమహర్షి విచ్చేసి రాముఁ డడుగ నాతనికి రావణాదులచరిత్ర మెఱింగించెను. రాముఁడు రావణుని జంపుటచేఁ గలిగినబ్రహ్మహత్యాపాపమును బాపకొన నుపాయ మేమని యడుగ నగస్త్యుఁ డశ్వమేధయాగమును జేయు మని సూచించెను. శ్రీరాముఁ డట్లశ్వమేధయాగము చేసి శత్రుఘ్నుని యాగాశ్వమువెంటఁ బంపెను. వీరాగ్రేసరులు పెక్కురు శత్రుఘ్నునివెంట నరిగిరి. యాగాశ్వము బహుప్రదేశములఁ దిరిగి చక్రాంకపురమును జేరఁగా నట దమనుఁ డద్దానిం బట్ట భరతసుతుఁ డగుపుష్కలుఁ డాతని నోడించెను. క్రతుహయము తేజఃపురముఁ జేరి పిదప నుత్తర దిశ కేగి యనంతరము రేవాప్రహదములో మునిఁగిపోవ హనుమత్పుష్కలులతో శత్రుఘ్నుఁడు

---

* శ్రీమత్పిసుపాటి చిదంబరకవిప్రణీత పద్మపురాణ పాతాళఖండము రా౨.

పాతాళమునకేగి హయమును విడిపించి యది దేవపురము చేర రుక్మాంగదుఁ డద్దానిం బట్టుకొనెను. శత్రుఘ్నాదులకు రుక్మాంగదాదులకు నట ఘోరరణ మయ్యెను. ప్రతిపక్షమునుఁబట్టి యీశ్వరుఁ డని చేయ రాఁగా శత్రుఘ్నుఁ డీశ్వరునితో యుద్ధ మొనర్చెను. శత్రుఘ్నాదులు సోలఁగా హనుమంతుఁ డీశ్వరు నెదిరించి యుద్ధము చేసెను. వారిరువురు మిత్రులైరి. శివునిపనుపున హనుమంతుఁ డేగి సంజీవ నౌషధిని దెచ్చి చచ్చినవారిని బ్రదుకఁజేసెను. శత్రుఘ్నుఁడు మరల శూలితో యుద్ధ మొనరించి సోలిపోఁగా నట రాముఁడు ప్రత్యక్షము కాఁగా నీశ్వరుఁ డాతని నెంతయుఁ గీర్తించెను. ఉభయులు మైత్రి నెలకొలుపుకొనిరి. తరువాత యాగాశ్వము హేమకూటముం జేరెను. అట నది కదలక మెదలక నిలిచిపోవఁగాఁ గారణము తెలియరాదాయెను. శత్రుఘ్నుఁ డాప్రాంతమునఁ దప మొనరించు గౌతమమహర్షిని జేరి తత్కారణముఁ దెలుపు మని ప్రార్థింప నా మహర్షి యాతనికి సాత్త్వికుని చరిత్రఁ దెలిపి రామకథాశ్రవణమున నాతఁడు రాక్షసత్వవిముక్తుఁ డగుటఁ దెలిపెను. వెంటనే క్రతుహయము కదలి కుండలపురముఁ జేర సురథుఁ డనురాజు దానిని బట్టుకొనెను. శత్రుఘ్నాదులు సురథాదులతో ఘోరయుద్ధముచేయ సురథుఁడు హనుమదాదులను బంధించెను. రాముఁ డటఁ బ్రత్యక్షముకాఁగా సురథుఁడు నమస్కరించి రామదర్శనముకొఱకే తా నాపని చేసితి నని చెప్పి హయమును విడిచి మైత్రిచేసికొనెను. తరువాత యాగాశ్వము వాల్మీక్యాశ్రమముఁజేర లవుఁ డద్దానిం గట్టివైచెను."

ఈ కథ చెప్పుచుండ వాసుకిని వాత్స్యాయనుఁడు సీతాపరిత్యాగ కథఁ దెలుపు మని కోర నాతఁ డద్దాని నెల్లఁ జెప్పెను. "శ్రీరామ చంద్రునంతటిమహనీయునికిని జనాపవాద మెట్లు వచ్చెనో తెలుప వేఁడుదు" నని వాత్స్యాయనుఁ డడుగ వాసుకి యిట్లు చెప్పెను. "తొల్లి సీతాదేవి బాల్యమున నుద్యానవనమున చెలికత్తెలతో విహారము సల్పు చుండ నొకచెట్టుమీఁద రెండుచిలుకలు కానవచ్చెను. అందలి మగచిలుక ఆఁడుచిలుకకు రామాయణకథ చెప్పి సీతవలె నీవు రామునివలె నేను నుందు మని పలికెను. ఆఁడుచిలుక యట్లే యని యానందాతిశయ

మున మగచిలుకను గౌఁగిలించుకొనెను. ఇది కని చిలుకలు పలుకు పలుకులు విని సీత సాదరముగా వానిని బట్టి తెం డని చెలికత్తెలను గోర వారు మెల్లగా నా చిలుకలను రెండింటిని బట్టుకొని సీతముందుఁ బెట్టిరి. సీత వానిని దువ్వి భయపడకుఁ డని హెచ్చరించి "రాముఁ డెవఁడు? సీత యెవతె? మీరు చెప్పుకొన్నకథ యెక్కడిది?" అని కుతూహలముతోఁ బ్రశ్నింప మగచిల్క యిట్లు చెప్పెను. "అమ్మా! ఇది నా భార్య. మే మిరువురము వాల్మీకిమహర్షి యాశ్రమముచెంత నుందుము. ఆ మహర్షి భావిరామాయణము వ్రాసి శిష్యులకుఁ జెప్పుచుండఁగా మేము వింటిమి. అది విన్నవారిపాపము లెల్ల హరించి తాపములను బాపును. కావున, నీవును వినుము చెప్పెద" నని భావి రామకథ యంతయును జెప్పి "మ మ్మింక విడిచిపెట్టుము. పోయెద" మని కోరెను. సీత "ఓ చిలుకా! అంత తొందర పడకు, మీకు సర్వసత్కారములు చేసెదను. ఆ రాముఁ డెట నున్నాఁడు? ఆతనిరూపరేఖ లెటువంటివి?" అని ప్రశ్నించెను. ఆ చిలుక రామునిసౌందర్యము వర్ణించి చెప్పఁగా సీత పరవశయై విని తానే జనకునికూఁతు రగుసీత నని యా చిలుకకుఁ జెప్ప నా రెండుచిలుకలు నామెకు నమస్కరించి సెలవు కోరెను. "రాముఁడు నన్నుఁ బరిణయ మాడువఱకు నేను మిమ్ము విడువ" నని సీత పలికెను. ఆ చిలుకలు భయపడి తాము బంధితులమై యుండలే మనియు వాల్మీకియాశ్రమమున స్వేచ్ఛగా సుఖముందు మని యెంత చెప్పినను సీత వానిని విడువ దయ్యెను. అంత నా మగచిలుక ''సీతా! నాభార్య గర్భవతి. బంధన ప్రాప్తి కోర్వలేదు. కావలసినపుడు మరల వత్తుము. మమ్ము విడువుము. నీకుఁ బుణ్యముండు'' నని ప్రార్థించెను. అంత సీత బాలికగాన బాల్య చాపలమున మగచిలుకను విడిచి "నీవు పొమ్ము. ఆడుచిలుకను ప్రసవమైనపిదప విడిచెదను" అని పలికెను. ఈ చిలుక యెగిరి చెట్టుపై కెక్కి "ఓ సీతమ్మా! నా యాలిని విడిచి నే మనఁజాలను విడువుము. అయ్యో! మౌనమే భూషణము. వాగ్దోషమున బంధము వచ్చును. కనుక, నెవ్వరితోడను మాటలాడవల దని పెద్ద లన్నమాట నిజము. నేను మంచి కథ చెప్పినను నీవు బంధించితివి. విడువు'' మని మరలఁ గోరినను సీత వినదయ్యెను. ఆఁడుచిలుకయు భర్తను విడిచియుండలేను. పోనిమ్మన్నను సీత విడువదాయెను.

ఆ యాఁడు చిలుక గోడుగోడున నేడ్చుచు:

"కఠినురాలా! నీవు గర్భిణి నగు నన్ను
భర్తతోడ నెడలువాపినట్లు
దైవ మింక గర్భధారిణి వగు నిన్ను
భర్తతోడ నెడలువాపుఁ గాక!"

అని శపించెను. వెంటనే యామె దుఃఖభారమున నసువులు విడిచెను. మగచిలుక యేడ్చి యేడ్చి గంగలోఁ బడి 'నేను మఱుజన్మమున సీతను రామునితో నెడఁబాపుదునుగా' కను తుదికోరికతో మరణించెను. ఆ మగ చిలుకయే అయోధ్యలోఁ జాకలియై పుట్టి శ్రీరామునకు జనాపవాదమును గల్పించి సీతాపరిత్యాగమునకు హేతుభూత మయ్యెను. ఇట్లు చిత్ర విచిత్రములు అదృష్టశ్రుత పూర్వములు నగు కథాపరంపరలతో వాత్స్యా యన మహర్షికి వాసుకి శ్రీమద్రామాయణమును సంపూర్ణముగా విని పించెను. వాత్స్యాయనుఁ డమితానందమున వాసుకిని వీడుకొని నిజాశ్రమమున కేగి హరిమహిమామృతమును గ్రోలి యితరులకుఁ బంచియిచ్చి యజరామరత్వ మందెను.*

## కామశాస్త్రము

వాత్స్యాయనమహర్షి కామశాస్త్రము నభ్యసించి లోకోపకారార్థము కామసూత్రములను సంధానించెను. వత్సుఁ డనురాజు వత్సదేశమును బాలించుచుండ మల్లనాగుఁ డనువాఁ డాస్థానవిద్వాంసుఁడై యుండి రాజును సక్రమ కామోపదేశమున సన్మార్గమున నిలిపె ననియు నందుచే మల్లనాగునకు వాత్స్యాయనుఁ డని (వత్సునకు జ్ఞాన మనుకన్ను నిచ్చినవాఁడు) యాతనికిఁ బేరువచ్చెనని యొక పుక్కిటిపురాణము కలదు. † ఇది సత్యము కాదు. వాత్స్యాయనుపేరుగల తనతల్లికి జ్ఞాననేత్ర మైనవాఁడు గనుక వాత్స్యకొడుకు వాత్స్యాయనుఁ డయ్యెను.

---

* శ్రీపద్మపురాణము: పాతాళఖండము.

† భాస్కరనృసింహకవివృత్తి.

అసలు వాత్స్యాయన మహర్షి రచించిన కామశాస్త్రము కాలగర్భమునం జిందరవందర యైనది. ఇది కామశాస్త్రమునకు మాతృక. ఇప్పుడు లభ్యమైనది భ్రష్టరూపమగు తత్ప్రతిక. ఇందలి తొలిభాగమందలి తొలియధికరణము సాధారణాధికరణము. ఇందు శాస్త్ర సంగ్రహము, త్రివర్గప్రతిపత్తి, విద్యాసముద్దేశము, నాగరకవృత్తము, నాయకసహాయ దూతీ కర్మవిమర్శ అను నధ్యాయములలోఁ బెక్కువిషయములు కలవు. రెండవ దగు సాంప్రయోగికాధికరణమున రతావస్థాపన, ఆలింగన విచారము, చుంబనవికల్పము, నఖరదనజాతి, దశనచ్ఛేద్యము, సంవేశన చిత్రరతము, సీత్కృతాది, పురుషోప సృప్తము, ఔపరిష్టకము, రతారంభావసానికము, అను నధ్యాయముల ననేకవిషయములు కలవు. మూఁడవ దగు కన్యాసంప్రయోగాధికరణమున వరణవిధానము, కన్యావిస్రంభణము, బాలోపక్రమము, ఏకపురుషాభియోగము వివాహయోగము నను నధ్యాయములలో నాయా విషయములు కలవు.

రెండవభాగమందలి మొదటి యధికరణము భార్యాధికారి కాధికరణము. ఇందు ఏకచారిణీవృత్తము, సపత్నీజ్యేష్ఠావృత్త కనిష్ఠావృత్తము, స్త్రీపురుష శీలావస్థాపనము, పరిచయకారణాది, భావపరీక్ష, దూతీకర్మ, ఈశ్వరకామితము, అంతఃపురదారరక్షితము, అను నధ్యాయములుకలవు. రెండవ దగు వైశికాధికరణమున కాంతానువృత్తము, అర్థాగమోపాయము, విశీర్ణప్రతి సంధానము, లాభవిశేషము, అర్థానర్థానుబంధ విచారము, సుభగంకరణము, నష్టరాగ ప్రత్యానయనము నను నధ్యాయములు కలవు.

వాత్స్యాయన కామ సూత్రములు: మూలము.

ప్రథమభాగము.

I. సామాన్యాధికరణము:

## 1. శాస్త్రసంగ్రహాధ్యాయము.

"ధర్మార్థకామేభ్యోనమః. శాస్త్రే ప్రకృతత్వాత్ తత్సమయావబోధ కశ్చాచార్యేభ్యః తత్సంబంధాత్. ప్రజాపతిర్హి ప్రజాస్సృష్ట్వా తాసాం స్థితి నిబంధనం త్రివర్గస్య సాధనం అధ్యాయానాం శతసహస్రేణాగ్రే ప్రోవాచ.

తస్యైకదేశం స్వాయంభువో మను ర్ధర్మాధికారికం పృథక్చకార. బృహస్పతి రర్థాధి కారికమ్. మహాదేవానుచరశ్చ నందీ సహస్రేణాధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ. తదేవతు పంచభి రధ్యాయశతైః ఔద్దాలకి శ్శ్వేతకేతు స్సంచిక్షేప. తదేవతు పునరధ్యర్థశతేన. సాధారణ సాంప్రయోగిక కన్యాసంప్రయుక్తక భార్యాధికారిక పారదారిక వైశికౌపనిషదికై స్సప్తభి రధికరణైః బాభ్రవ్యః పాంచాలః సంచిక్షేప. తస్య షష్ఠం వైశిక మధికరణం పాటలిపుత్రికాణాం గణికానాం నియోగా ద్దత్తకః పృథక్చకార. తత్ప్రసంగా చ్చారాయణః సాధారణ మధికరణం పృథక్ప్రోవాచ. సువర్ణనాభ స్సాంప్రయోగికమ్, ఘోటకముఖః కన్యాసంప్రయుక్తకం, గోనర్దీయో భార్యాధికారికం, గోణికాపుత్రః పారదారికం, కుచుమార ఔపనిషదికం. ఏవం బహుభి రాచార్యైః తచ్ఛాస్త్రం ఖండశః ప్రణీత ముత్సన్నకల్ప మభూత్. తత్ర దత్తకాదిభిః ప్రణీతానాం శాస్త్రావయవానాం ఏకదేశత్వాత్ మహదితి చ బాభ్రవీయస్య దురధ్యేయత్వాత్, సంక్షిప్య సర్వమర్థ మల్పేన గ్రంథేన కామసూత్రమిదం ప్రణీతవాన్. తస్యాయం ప్రకరణాధికరణ సముద్దేశః శాస్త్రసంగ్రహః త్రివర్గప్రతిపత్తిః విద్యాసముద్దేశః నాగరకీవృత్తం నాయకీ సహాయదూతీకర్మ విమర్శః. ఇతి సాధారణ మధికరణం ప్రకరణాని పంచ. ప్రమాణకాలభావేభ్యో రతావస్థాపనం ప్రీతివిశేషాః ఆలింగనవిచారాః చుంబన వికల్పాః నఖ రదన జాతయః దశనచ్ఛేద్యవిషయాః దేశ్యా ఉపచారాః సంవేశన ప్రకారాః చిత్రరతాని ప్రహరణయోగాః తద్యుక్తాశ్చసీత్కృతో పక్రమాః పురుషాయితం పురుషోపసృప్తాని ఔపరిష్టకం రతారంభం అవసానికం రతవిశేషాః ప్రణయకలహః-ఇతి సాంప్రయోగికం ద్వితీయ మధికరణం. అధ్యాయాదశ ప్రకరణాని సప్తదశ. వరణవిధానం సంబంధ నిర్ణయః, కన్యావిస్రంభణం, బాలాయా ఉపక్రమాః, ఇంగితాకారసూచనం, ఏకపురుషాభియోగాః, ప్రయోజ్యస్యోపావర్తనం, అభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తిః వివాహయోగాః ఇతి కన్యాసంప్రయుక్తకంతృతీయాధికరణం అధ్యాయాః పంచ. ప్రకరణాని నవ. ఏకచారిణీ వృత్తం ప్రవాసచర్యా సపత్నీషు జ్యేష్ఠావృత్తం కనిష్ఠావృత్తం పునర్భూవృత్తం దుర్భగావృత్తం ఆంతఃపురికం, పురుషస్య బహ్వీషు ప్రతిపత్తిః ఇతి భార్యాధికారికం చతుర్థ మధికరణం. అధ్యాయా

ద్వౌ. ప్రకరణా న్యష్ట. స్త్రీపురుష శీలావస్థాపనం వ్యావర్తన కారణాని స్త్రీషు సిద్ధాః పురుషాః అయత్నసాధ్యా యోషితః పరిచయకారణాని, అభియోగ్యాః భావపరీక్షా దూతీకర్మాణి ఈశ్వర కామితం ఆంతఃపురికం దారరక్షితం-ఇతి పారదారికం పంచమ మధికరణమ్. అధ్యాయాః షట్ ప్రకరణాని దశ. గమ్యచింతా, గమనకారణాని, ఉపావర్తన విధిః, కాంతానువర్తనం, అర్థాగమోపాయాః, విరక్తలింగాని, విరక్తప్రతిపత్తిః నిష్కాసన ప్రకారాః, విశీర్ణ ప్రతిసంధానం, లాభవిశేషః, అర్థానర్థానుబంధ సంశయవిచారః, వేశ్యావిశేషాశ్చ ఇతి వైశికం షష్ఠ మధికరణం అధ్యాయాష్షట్. ప్రకరణాని ద్వాదశ. సుభగంకరణమ్, వశీకరణం, వృష్యాశ్చయోగాః, నష్టరాగ ప్రత్యానయనం, వృద్ధివిధయః చిత్రాశ్చ యోగాః ఇత్యౌపనిషదికమ్ సప్తమ మధికరణం అధ్యాయౌద్వౌ ప్రక రణాని షట్. ఏవం షట్త్రింశదధ్యాయాః. చతుష్షష్టిప్రకరణాని, అధి కరణాః సప్త సపాదం శ్లోకసహస్రం, ఇతి శాస్త్ర సంగ్రహః.

శ్లో॥ సంక్షేప మిమ ముక్త్వాథ విస్తరోతః ప్రవక్ష్యతే,
ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసభాషణమ్.

## 2 త్రివర్గ ప్రతిపత్త్యధ్యాయః

శతాయు ర్వైపురుషో విభజ్యకాల మన్యోన్యాను బద్ధం పరస్పర స్యానుపఘాతకం త్రివర్గం సేవేత. బాల్యేవిద్యాగ్రహణాదీ నర్థాన్. కామంచ యౌవనే. స్థావిరే ధర్మం మోక్షం చ. అనిత్యత్వా దాయుషో యథోపపదం వా సేవేత. బ్రహ్మచర్యమేవ త్వా విద్యాగ్రహణాత్. అలౌ కికత్వా దదృష్టార్థత్వా దప్రవృత్తానాం. యజ్ఞాదీనాం శాస్త్రా త్ప్రవర్తనం లౌకికత్వా ద్దృష్టార్థత్వా చ్చ. ప్రవృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్యః శాస్త్రాదేవ నివారణం ధర్మః. తం శ్రుతే ర్ధర్మజ్ఞసమవాయాచ్చ ప్రతి పద్యేత. విద్యా భూమి హిరణ్యం పశు ధాన్య భాండోపస్కర మిత్రా నా మార్జనం ఆర్జితస్య పరిరక్షణం అర్థః. తం అధ్యక్ష ప్రచారాత్ వార్తా సమయవిద్భ్యో వణిగ్భ్యశ్చేతి. శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణానాం ఆత్మ సంయుక్తేన మనసా అధిష్ఠితానాం స్వేషు స్వేషు విషయే ష్వానుకూల్యతః

ప్రవృత్తిః కామః. స్పర్శవిశేషవిషయే త్వస్యాభిమానిక సుఖానువిద్ధా ఫలవత్యర్థప్రతీతిః ప్రాధాన్యా త్కామః. తం కామసూత్రా న్నాగరక జన సమవాయా చ్చ ప్రతిపద్యేత. తేషు సమవాయే పూర్వః పూర్వోగరీయాన్. అర్థశ్చరాజ్ఞః, తన్మూలకత్వా ల్లోకయాత్రాయాః, వేశ్యాయాశ్చ, ఇతి త్రివర్గప్రతిపత్తిః. ధర్మస్యాలౌకికత్వా త్తదభిధాయకం. శాస్త్రం యుక్తమ్. ఉపాయపూర్వకత్వా దర్థసిద్ధేః. ఉపాయప్రతిపత్తి శ్శాస్త్రాత్. తిర్యగ్యోనిష్వపి తు స్వయం ప్రవృత్తత్వాత్ కామస్య నిత్యత్వా చ్చ న శాస్త్రేణ కృత్య మస్తీత్యాచార్యాః. సంప్రయోగ పరాధీనత్వాత్ స్త్రీపుంసయో రుపాయ మపేక్షతే. సా చోపాయప్రతిపత్తిః కామసూత్రా దితి వాత్స్యాయనః.

తిర్యగ్యోనిషు పున రనావృతత్వాత్ స్త్రీజాతేశ్చ ఋతౌ యావదర్థం ప్రవృత్తేరబుద్ధిపూర్వకత్వా చ్చ ప్రవృత్తీనా మనుపాయః ప్రత్యయః, న ధర్మాం శ్చరేత్. ఏష్యత్ఫలత్వాత్. సాంశయికత్వా చ్చ. కో హ్యబాలిశో హస్తగతం పరగతం కుర్యాత్. వర మద్య కపోతశ్శ్వో మయూరాత్. వరం సాంశయికా న్నిష్కాద సాంశయికః కార్షాపణ ఇతి లోకాయతికాః. శాస్త్రస్యానభిశంక్యత్వా దభిచారానువ్యాహారయో శ్చ క్వచిత్ఫలదర్శనా న్నక్షత్ర చంద్ర సూర్యతారాగ్రహచక్రస్య లోకార్థం బుద్ధిపూర్వక మివ ప్రవృత్తే ర్దర్శనా ద్వర్ణాశ్రమాచారస్థితిలక్షణార్థత్వా చ్చ లోకయాత్రాయాః హస్తగతస్య చ బీజస్య భవిష్యత స్సస్యార్థే త్యాగ దర్శనా చ్చరేద్ధర్మా నితి వాత్స్యాయనః నార్థాం శ్చరేత్, ప్రయత్నతోఽపి హ్యేతే నుష్ఠీయ మానా నైవకదాచి త్స్యుః అననుష్ఠీయమానా అపి యదృచ్ఛయా భవేయుః. తత్సర్వం కాలకారిత మితి. కాల ఏవ హి పురుషానర్థానర్థయోః జయపరాజయయోః సుఖదుఃఖయో శ్చ స్థాపయతి. కాలేన బలి రింద్రః కృతః, కాలేన వ్యవరోపితః కాలఏవ పునర ప్యేనం కర్తేతి కాలకారణికాః పురుషకారపూర్వకత్వా త్సర్వప్రవృత్తీనాం ఉపాయః ప్రత్యయః అవశ్యం భావినోప్యర్థస్య ఉపాయపూర్వకత్వా దేవ న నిష్కర్మణో భద్ర మస్తీతి వాత్స్యాయనః. న కామాం శ్చరేత్. ధర్మార్థయోః ప్రధానయో రేవ మన్యేషాం చ సతాం ప్రత్యనీకత్వాదన ర్థజనన సంసర్గ మసద్వ్యవసాయ మశౌచ మనాయతిం చైతే పురుషస్య

జనయంతి తథా ప్రమాదం లాఘవ మప్రత్యయ మగ్రాహ్యతాం చ. బహవశ్చ కామవశగా స్సగణా ఏవ వినష్టా శ్రూయంతే. యథా దాండక్యోనాను భోజః కామా ద్బ్రాహ్మణకన్యా మభిగమ్యమానః సబంధురాష్ట్రో వినసాశ. దేవరాజ శ్చాహల్యా, మతిబలశ్చ కీచకో ద్రౌపదీం, రావణశ్చ సీతా, మపరే చాన్యేచ బహవో దృశ్యంతే కామవశగా వినష్టా ఇత్యర్థ చింతకాః శరీరస్థితి హేతుత్వా దాహారసధర్మాణో హి కామః ఫలభూతాశ్చ ధర్మార్థయోః బోద్ధవ్యం తు దోషేష్వివ నహి భిక్షుకా స్సంతీతి స్థాల్యో నాధిశ్రీయంతే నహి మృగాస్సంతీతి యవానోప్యంతే ఇతి వాత్స్యాయనః భవంతి చాఽత్రశ్లోకాః

శ్లో॥ ఏవ మర్థం చ కామంచ, ధర్మం చోపాచర న్నరః,
ఇహాముత్ర చ నిశ్శల్య మత్యంతం సుఖ మశ్నుతే.

కిం స్యాత్పరత్రేత్యాశంకాకార్యే యస్మి న్న జాయతే. న చార్థఘ్నం సుఖం చేతి శిష్టా స్తత్ర వ్యవస్థితాః త్రివర్గ సాధకం యత్స్యాత్ ద్వయో రేకస్య వా పునః కార్యం తదపి కుర్వీత నత్వేకార్థం ద్విబాధకమ్.

## 3. విద్యాసముద్దేశాధ్యాయః

ధర్మార్థాంగ విద్యాకాలా ననుపరోధయన్ కామ సూత్రం తదంగ విద్యాశ్చ పురుషోధీయీత. ప్రాగ్యౌవనా స్త్రీ ప్రత్తాచ పత్యురభి ప్రాయాత్, యోషితాం శాస్త్ర గ్రహణ స్యాభావా దనర్థక మిహ శాస్త్రే స్త్రీశాసన మిత్యాచార్యాః ప్రయోగగ్రహణం త్వాసామ్. ప్రయోగస్య చ శాస్త్రపూర్వకత్వాదితి వాత్స్యాయనః. తన్న కేవల మిహైవ సర్వత్రైవ హి లోకే కతిచిదేవ హి శాస్త్రజ్ఞాః సర్వజనవిషయశ్చ ప్రయోగః ప్రయోగస్య చ దూరస్థమపి శాస్త్రమేవ హేతుః. అస్తి వ్యాకరణ మిత్యవైయాకరణా అపి యాజ్ఞికాఊహం క్రతుషు ప్రయుంజతే. అస్తిజ్యోతిష మితి పుణ్యాహేషు కర్మ కుర్వతే. తథాశ్వారోహాః గజారోహాశ్చ అశ్వాన్ గజాంశ్చ అనధి గతశాస్త్రా అపి వినయంతే. తథా స్తి రాజేతి దూరస్థా అపి జనపదా న మర్యాదా మతివర్తంతే తద్వదేతత్. సంత్యపి ఖలు

శాస్త్రప్రహతబుద్ధయో గణికా రాజపుత్ర్యోమహామాత్ర దుహితరశ్చ. తస్మా ద్వైశ్వాసికా జనాద్రహసి ప్రయోగాన్ శాస్త్ర మేకదేశం వా స్త్రీ గృహ్ణీయాత్. అభ్యాస ప్రయోజ్యాంశ్చ చతుష్షష్ఠికాన్ యోగా న్కన్యా రహస్యేకాకి న్యభ్యసేత్. ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్తపురుష సం ప్రయోగా సహసంప్రవృద్ధా ధాత్రేయికా తథాభూతా వా నిరత్యయ సంభాషణా సఖీ సవయాశ్చ మాతృష్వసా విస్రబ్ధా తత్స్థా నీయా వృద్ధ దాసీం పూర్వ సంసృష్టావా భిక్షుకీ స్వసా చ విశ్వాస ప్రయోగాత్. గీతం, వాద్యం, నృత్యమ్, ఆలేఖ్యమ్, విశేషకచ్ఛేద్యం, తండుల కుసుమ బలివికారాః, పుష్పాస్తరణం, దశనవసనాంగరాగః మణిభూమికా కర్మ, శయనరచనమ్, ఉదకవాద్యమ్, ఉదకాఘాతః, చిత్రాశ్చయోగాః, మాల్యగ్రథనవికల్పాః శేఖరకాపీడయోజనమ్, నేపథ్య ప్రయోగాః కర్ణపత్రభంగాః, గంధయుక్తిః, భూషణయోజనమ్, ఐంద్రజాలాః, కౌచుమారాశ్చయోగాః, హస్తలాఘవమ్, విచిత్రశాక యూషభక్ష్య వికారక్రియా, పానకరస రాగాసవయోజనమ్, సూచీవానకర్మాణి, సూత్రక్రీడా, వీణాడమరుక వాద్యాని ప్రహేళికా, ప్రతిమాలా, దుర్వా చకయోగాః, పుస్తకవాచనం, నాటకాఖ్యాయికా దర్శనమ్, కావ్యసమస్యా పూరణం. పట్టికావాన వేత్రవికల్పాః, తక్షకర్మాణి, తక్షణమ్, వాస్తువిద్యా, రూప్యరత్న పరీక్షా, ధాతువాదః, మణిరాగాకరజ్ఞానం, వృక్షాయుర్వేద యోగాః, మేషకుక్కుటలావకయుద్ధవిధిః శుకసారికా ప్రలాపనం, ఉత్సా దనే, సంవాహనే, కేశమర్దనే చకౌశలం, అక్షరముష్టికా కథనమ్, మ్లేచ్ఛి తక వికల్పాః, దేశభాషా విజ్ఞానం, పుష్పశకటికా, నిమిత్త జ్ఞానం, యంత్రమాతృకా, ధారణ మాతృకా, సంపాఠ్యం, మానసీకావ్యక్రియా, అభిధానకోశః, ఛందోజ్ఞానం, క్రియాకల్పః, ఛలితకయోగాః, వస్త్ర గోపనాని, ద్యూతశేషాః ఆకర్షక్రీడా, బాలక్రీడనకాని, వైనయికానాం, వైజయికానాం, వ్యాయామికానాం, చ విద్యానాం జ్ఞానం. ఇతి చతుష్షష్టి రంగవిద్యా కామసూత్ర స్యావయవిన్యః, పాంచాలికీ చతుష్షష్టి రపరా. తస్యాః ప్రయోగా నన్వవేత్య సాంప్రయోగికే వక్ష్యామః. కామస్య తదాత్మకత్వాత్. 'అభిరభ్యుచ్ఛ్రితావేశ్యా శీలరూపగుణాన్వితా' లభతే గణికా శబ్దం స్థానం చ జనసంసది. పూజితాసా సదా రాజ్ఞాగుణవద్భిశ్చ సంస్తుతా, ప్రార్థ నీయాభిగమ్యా చ లక్ష్యభూతా చ జాయతే. యోగజ్ఞా

రాజపుత్రీ చ మహామాత్రసుతా తథా, సహస్రాంతః పురమపి స్వవశే కురుతే పతిమ్. తథాపతివియోగే చ వ్యసనం దారుణంగతా, దేశాంతరేపి విద్యాభి స్సాసుఖేనైవ జీవతి. నరః కలాసు కుశలో వాచాల శ్చాటు కారకః, అసంస్తుతోపి నారీణాం చిత్తమాశ్వేవ విందతి. కళానాం గ్రహణాదేవ సౌభాగ్యముపజాయతే, దేశకాలౌ త్వవేక్ష్యాసాం ప్రయోగస్సంభవేన్నవా.

## 4. నాగరకవృత్తాధ్యాయః

గృహీతవిద్యః ప్రతిగ్రహ జయక్రయ నిర్వేశాధి గతైరర్థై రన్వయాగతై రుభయై ర్వా గార్హస్త్య మధిగమ్య నాగరకవృత్తం వర్తేత. నగరే పత్తనే ఖర్వాటే మహతివా సజ్జనాశ్రయే స్థానమ్. యాత్రావశా ద్వా. తత్రభవనసమాసన్నోదకం వృక్షవాటికావత్ విభక్త కర్మకక్షం ద్వివాసగృహం కారయేత్. బాహ్యేచ వాసగృహే సుశ్లక్ష్ణ ముభయోపధానం మధ్యే వినతం శుక్లోత్తరచ్ఛదం శయనీయం స్యాత్ ప్రతిశయ్యికా చ....యక్ష రాత్రిః కౌముదీజాగరః సువసంతకః సహకార భంజికా అభ్యూషఖాదికా బిసఖాదికా నవపత్రికా ఉదకక్ష్వేడికా పాంచాలానుయానం ఏకశాల్మలీ యవచతుర్థీ ఆలోల చతుర్థీ మదనోత్సవః దమన భంజికాహోలాకా అశోకోత్తంసికా పుష్పావచాయికా చూతలతికా ఇక్షుభంజికా కదంబయుద్ధాని తాస్తాశ్చ మహిమాన్యాః దేశ్యాశ్చక్రీడాః జనేభ్యో విశిష్ట మాచరేయురితి సంభూయ క్రీడాః. ఏక చారిణశ్చ. విభవసామర్థ్యా ద్గణికాయాః నాయికాయాశ్చ సఖీభి ర్నాగరకైశ్చ సహ చరిత మేతేన వ్యాఖ్యాతమ్. అవిభవస్తు శరీరమాత్రో మల్లికాఫేన కషాయమాత్ర పరిచ్ఛదః పూజ్యాద్దేశా దాగతః కళాసు విచక్షణః తదుపదేశేన గోష్ఠ్యాం వేశోచితేచ వృత్తే సాధయే దాత్మాన మితి పీఠమర్దః. భుక్తవిభవస్తు గుణవాన్ సకళత్రో వేశే గోష్ఠ్యాం చ బహుమతః తదుపజీవీ చ విటః. ఏకదేశ విద్యస్తుక్రీడనకో విశ్వాస్యశ్చ విదూషకః వైహాసికోవా. ఏతే వేశ్యానాం నాగరకాణాం చ మంత్రిణ స్సంధివిగ్రహ నియుక్తాః తైర్భిక్షుక్యః విదగ్ధాః ముండా వృషల్యోవృద్ధ గణికాశ్చ

వ్యాఖ్యాతాః. గ్రామవాసీ చ సజాతాన్ విచక్షణాన్ కౌతూహలికాన్ ప్రోత్సాహ్య నాగరికజనస్య వృత్తం వర్ణయన్ శ్రద్ధాం చ జనయన్ తదేవానుకుర్వీత. గోష్ఠీశ్చ ప్రవర్తయేత్. సాంగత్యేన మనురంజయేత్. కర్మసుచ సాహాయ్యేన చానుగృహ్ణీయాత్ ఉపకారయేచ్చేతి నాగరకవృత్తమ్. భవంతి చాత్రశ్లోకాః

యా గోష్ఠీ లోకవిద్విష్టా యా చ స్వైరవిసర్పిణీ,
పరహింసాత్మికా యా చ నతా మవతరే ద్బుధః.
లోక చిత్తానువర్తిన్యా క్రీడామాత్రైకకార్యయా,
గోష్ఠ్యా సహచర న్విద్వాన్ లోకే సిద్ధిం నియచ్ఛతి.

## 5. నాయకసహాయదూతీకర్మవిమర్శాధ్యాయః

కామశ్చతుర్షువర్ణేషు సవర్ణతశ్చానన్యపూర్వాయాం ప్రయుజ్యమానః పుత్రీయో యశస్యో లౌకికశ్చ భవతి. తద్విపరీత ఉత్తమవర్ణాసు పరపరిగృహీతాసు చ ప్రతిషిద్ధః అపరవర్ణా స్వనిరవసితాసు వేశ్యాసు పునర్భూషు చ న శిష్టో న ప్రతిషిద్ధః సుఖార్థత్వాత్. తత్ర నాయికా స్త్రిస్రః కన్యా పునర్భూః వేశ్యా చ. పటుతా ధార్ష్ట్య మింగితాకారజ్ఞతా అనుకూలత్వం పరమర్మజ్ఞతా ప్రమాణతా ప్రతారణం దేశజ్ఞానం కాలజ్ఞతా విషహ్యాబుద్ధిత్వం అక్షిప్ర ప్రతిపత్తిః సోపాయ దూతగుణాః భవతి చాత్రశ్లోకః

ఆత్మవాన్ మిత్రవాన్ యుక్తః భావజ్ఞోదేశకాలవిత్,
అలభ్యా మప్యయత్నేన స్త్రియం సంపాదయే న్నరః.

## II సాంప్రయోగి కాధికరణమ్.

### 1. రతావస్థాపనాధ్యాయః

శశో వృషోశ్వ ఇతి ఇంగితో నాయకవిశేషాః. నాయికా పునర్మృగి బడబా హస్తినీ చేతి. తత్ర సదృశసంప్రయోగేన సమరతాని త్రీణి.

విపర్యయేణ విషమాని షట్. విషమేష్వపి పురుషాధిక్యం చే దనంతర సంప్రయోగే ద్వే ఉచ్చరతే. వ్యవహిత మేక ముచ్చతరరతమ్‌! విపర్యయే పునర్ద్వే నీచరతే. వ్యవహితమేకం నీచతరరతం చ. తేషు సమాని శ్రేష్ఠాని. తరశబ్దాంకితే ద్వే కనిష్ఠే. శేషాణి మధ్యమాని ........ తస్మాచ్చోపాయ వైలక్షణ్యాదపి భవతి. అభియోక్తాహ మితి పురుషో నురజ్యతే అభియుక్తాహ మనేనేతి యువతిరితి వాత్స్యాయనః .... ....

2. ఆలింగనవిచారాధ్యాయః

సంప్రయోగాంగం చతుఃషష్టి రిత్యాచక్షతే చతుః షష్టి ప్రకరణత్వాత్. శాస్త్రమేవేదం చతుష్షష్టి రిత్యాచార్యవాదః. .... .... ....

> కృతే ప్రతికృతం కుర్యా త్తాడితే ప్రతితాడితమ్,
> కరణేన చ తేనై వ చుమ్బితే ప్రతిచుంబితమ్.

3. నఖరదన జాత్యధ్యాయః.

రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖవిలేఖనమ్. తస్యప్రథమసమాగమే ప్రధానప్రత్యాగమనే ప్రవాసగమనే క్రుద్ధ ప్రసన్నాయాం మత్తాయాం చ ప్రయోగో ననిత్య మచండవేగయోగః .... .... ....

> నఖక్షతాని పశ్యంత్యా గూఢస్థానేషు యోషితః,
> చిరోత్సృష్టా ప్యభినవా ప్రీతిర్భవతి పేశలా.
>
> చిరోత్సృష్టేషు రాగేషు ప్రీతిర్గచ్ఛేత్పరాభవమ్,
> రాగాయతన సంస్మారి యది నస్యాన్నఖక్షతమ్.
>
> పశ్యతో యువతిం దూరాన్నఖోచ్ఛిష్ట పయోధరామ్,
> బహుమానః పరస్యాపి రాగయోగశ్చ జాయతే.
>
> పురుషశ్చ ప్రదేశేషు నఖచిహ్నైః వినిహ్నితః,
> చిత్రం స్థిరమపి ప్రాయశ్చలయత్యేవ యోషితః.
>
> నాన్యత్పటుతరం కించి దస్తిరాగ వివర్ధనమ్,
> నఖదంత సముత్థానాం కర్మణాం గతయో యథా.

4. దశనచ్ఛేద్యాధ్యాయః.

ఉత్తరోష్ఠ మంతర్ముఖం నయన మితి ముక్త్వాచుంబనవద్దశన రదనస్థానాని .... ... ....

పరస్పరానుకూల్యేన తదేవం లజ్జమానయోః,
సంవత్సరశతే నాపి ప్రీతిర్నపరిహీయతే.

5. సంవేశన చిత్రరతాధ్యాయః.

రాగకాలే విశాలయంత్యేవ జఘనం మృగి సంవిశేదుచ్చరతే. అవ హ్రాసయంతీవ హస్తినీ నీచరతే. .... .... ....
భవతశ్చాత్ర శ్లోకాః:

పశూనాం మృగజాతీనాం పతంగానాంచ విభ్రమైః,
తైస్తైరుపాయై శ్చిత్తజ్ఞో రతియోగా న్వివర్ధయేత్.
తత్సాత్మ్యద్దేశసాత్మ్యాచ్చతైస్తైర్భావైః ప్రయోజితైః,
స్త్రీణాం రాగశ్చ స్నేహశ్చ బహుమానశ్చ జాయతే.

6. సీత్కృతాధ్యాయః.

కలహరూపం సురత మాచక్షతే వివాదాత్మకత్వా ద్వామశీలత్వా చ్చ కామస్య. తస్మాత్ప్రహరణస్థాన మంగంస్కంధౌ శిర స్తనాంతరం పృష్ఠం జఘనం పార్శ్వఇతిస్థానాని. తచ్చతుర్విధం అపహస్తకం ప్రసృతకం ముష్టిః సమతలకమితి తదుద్భవం చ సీత్కృతం. .... ....

నాస్త్యత్ర గణనా కాచి న్న చ శాస్త్రపరిగ్రహః,
ప్రవృత్తే రతిసంయోగే రాగ ఏవాత్రకారణమ్ ....
నచ సర్వదా న సర్వాసు ప్రయోజ్యాస్సంప్రయోగికాః,
స్థానే దేశేచ కాలేచ యోగే ఏషాం విధీయతే.

7. పురుషోపసృపాధ్యాయః.

నాయకస్య సంతతాభ్యాసా త్పరిశ్రమ ముపలక్ష్య రాగస్య చాను పశమం అనుమతా తేన తమధోవపాత్య పురుషాయితేన సాహాయ్యం దద్యా స్వాభిప్రాయాద్వా వికల్ప యోజనార్థినీ నాయకకుతూహలాద్వా ....

ప్రచ్ఛాదితస్వభావాపి గూఢాకారాపి భామినీ,
వివృణోత్యేవ భావం స్వరాగా దపరివర్తినీ.
యథా శీలాభవేన్నారి యథాచరతి లాలనా,
తస్యా ఏవ విచేష్టాభి స్తత్సర్వ ముపలక్షయేత్.
నత్వే వర్తేన ప్రసూతాం నమృగీం న చ గర్భిణీమ్,
న చాతి వ్యాయతాం నారీం యోజయేత్పురుషాయితే.

8. ఔపరిష్టకాద్యధ్యాయః.

ద్వివిధా తృతీయా ప్రకృతిః స్త్రీరూపిణీ పురుషరూపిణీ చ. తత్ర స్త్రీరూపిణీ స్త్రియా వేష మాలాం లీలాపం భావం మృదుత్వం భీరుత్వం ముగ్ధతామసహిష్ణుతాం వ్రీడాం చానుకుర్వీత .... ....

తస్మాద్దేశం చ కాలంచ ప్రయోగం శాస్త్రమేవ చ,
ఆత్మానం చాపి సంప్రేక్ష్య యోగాన్యుంజీతవా నవా.
అర్థస్యాస్య రహస్యత్వా చ్చలత్వా న్మనస స్తథా,
కః కదా కిం కుతః కుర్యాదితికో జ్ఞాతు మర్హతి.

9. రతారంభావసాని కాద్యధ్యాయః.

నాగరక స్సహమిత్రజనేన సపరిచారకశ్చ కృతపుష్పోపహారే సంచారిత సురభిధూపే రత్యావాసే ప్రసాధితే వాసగృహే కృతస్నాన ప్రసాధనాం యుక్త్యాపీతాం స్త్రియం సాంత్వనైః పునఃపానేన చోప క్రమేత .... .... ....

కన్యాభిః పరయోషిద్భిః గణికాభిశ్చ భావతః,
వీక్ష్యతే బహుమానేన చతుష్షష్టి విచక్షణః.

III కన్యాసంప్రయుక్తకాధికరణమ్.

1. వరణవిధానాధ్యాయః.

సవర్ణాయాం అనన్యపూర్వాయాం శాస్త్రతోధిగతాయాం ధర్మోర్థః పుత్రాః సంబంధః పక్షవృద్ధిః అనుపస్కృతా రతిశ్చ .... ....

కృత్వాపి చోచ్చ సంబంధం పశ్చాజ్జాతిషు సం నమేత్,
నత్వేవ హీన సంబంధం కుర్యాత్సద్భిర్వినిందితమ్.

2. కన్యావిస్రంభణాద్యధ్యాయః

సంగతయా త్రిరాత్ర మధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జన మాహార స్తథా సప్తాహం సతూర్యం మంగళస్నానం ప్రసాధనం సహ భోజనం చ ప్రేక్షా సంబంధినాంచ పూజన మితి సార్వవర్ణికమ్ ....

3. బాలోపక్రమాద్యధ్యాయః.

ధనహీనస్తు గుణయుక్తోపి మధ్యస్థగుణో హీనాపదేశో వా సధనో వా ప్రాతివేశ్యః మాతాపితా భ్రాతృషు చ పరతంత్రః బాలవృత్తి రుచిత ప్రవేశో వా కన్యా మలభ్యాత్వన్న వరయేత్ .... .... ....

బాలక్రీడనకై ర్బాలా కళాభి ర్యౌవనే స్థితా,
వత్సలాచాపి సంగ్రాహ్యా విశ్వాశ్యజన సంగ్రహాత్.

4. ఏక పురుషాభియోగాద్యధ్యాయః.

దర్శితేంగితాకారాం కన్యా ముపాయతోఽభియుంజీత ....

గుణసామ్యేభియోక్తౄణా మేకో వరయితా వరః,
తత్రాభియోక్తః శ్రైష్ఠ్యం అనురాగాత్మకోహి సః.

5. వివాహయోగాధ్యాయః.

ప్రాచుర్యేణ కన్యాయాః వివిక్తదర్శనస్యాలాభే ధాత్రేయికాం ప్రియహితాభ్యా ముపగృహ్యోపస్పృశేత్ .... ....

సుఖత్వా ద బహుక్లేశా దపి చావరణా దిహ,
అనురాగాత్మ కత్వాచ్చ గాంధర్వంప్రవరో మతః.

## ద్వితీయభాగః

I భార్యాధికరణమ్.

1. ఏకచారిణీవృత్తాధ్యాయః.

భార్యా ఏకచారిణీ గూఢ విశ్రంభా దేవవత్పతిమానుకూల్యేన వర్తేత తన్మతేన కుటుంబచింతా మాత్మని సంనివేశయేత్ .... ....

సద్వృత్త మనువర్తేత నాయకస్య హితైషిణీ,
కులయోషా పునర్భూర్వా వేశ్యావాప్యేకచారిణీ.
ధర్మమర్థం తథా కామం లభంతే స్థానమేవ చ,
నిస్సపత్నం చ భర్తారం నార్య స్సద్వృత్త మాశ్రితాః.

2. జ్యేష్ఠావృత్తప్రకరణమ్.

జాడ్యదౌశ్శీల్య దౌర్భాగ్యేభ్యః ప్రజానుత్పత్తేరాభీక్ష్ణ్యేన దారికో త్పత్తే ర్నాయక చాపలాద్వా సపత్న్యభి వేదనమ్ .... ....

యువతిశ్చ జితక్రోధా యథా శాస్త్రప్రవర్తినీ,
కరోతి వశ్యం భర్తారం సపత్నీశ్చాధితిష్ఠతి.

II పారదారికాధికరణమ్.

1. స్త్రీపురుష శీలావస్థాపనాద్యధ్యాయః.

వ్యాఖ్యాత కారణా పరపరిగ్రహోపాయాః. తేషు సాధ్యత్వ మన త్యయం గమ్యత్వ మాయతిం వృత్తిం చాదిత ఏవ పరీక్షేత ....

శంకితాం రక్షితాం భీతాం సశ్వశ్రూ కాంచయోషితమ్,
నతర్కయేత్ మేధావీ జానన్ప్రత్యయ మాత్మనః.

2. భావపరీక్షాధ్యాయః.

అభియుంజానో యోషితః ప్రవృత్తిం పరీక్షేతతయా భావపరీక్షితో భవతి. మంత్రమన్యత్వానాం దూత్యైనాం సాధయేత్. .... ....

ధీరాయా మప్రగల్భాయాం పరీక్ష్యాయాంచయోషితి,
ఏష సూక్ష్మవిధిః ప్రోక్తం సిద్ధా ఏవస్ఫుటంస్త్రియః.

3. దూతీకర్మాధ్యాయః.

దర్శితేంగితేకారాం తు ప్రవిరళదర్శనా మపూర్వాం చ దూత్యోప సర్పయేత్. .... .... ....

అసంకల్పిత మప్యర్థ ముత్సృష్టం దోషకారణాత్,
పునరావర్త యత్యేవ దూతీవచన కౌశలాత్.

4. ఈశ్వరకామితాధ్యాయః.

న రాజ్ఞాం మహామాత్రాణాం వా పరభవనప్రవేశో విద్యతే. మహా జనేన హిచరితం ఏషాం దృశ్యతే అనువిధీయతే చ. .... ....

నత్వేవైత ప్రయుంజీత రాజా లోకహితేరతః,
నిగృహీతారిషడ్వర్గః తథా విజయతే మహీమ్.

5. అంతఃపురికా ప్రకరణమ్.

నాంతఃపురాణం రక్షణయోగా త్పురుషసందర్శనం విద్యతే. పత్యు శ్చైకత్వా దనేకసాధారణత్వాచ్చ అతృప్తిస్తస్మా త్తాని యోగత ఏవ పరస్పరం రంజయేయుః .... .... ....

III వైశికాధికరణమ్.

1. సహాయగమ్యాగమ్యాది చింతాధ్యాయః.

వేశ్యానాం పురుషాదిగమే రవృత్తిశ్చ సర్గాత్. రతితః ప్రవర్తనం స్వాభావికం కృత్రిమ మర్థార్థం .... .... ....

2. కాంతానువృత్తాధ్యాయః.

సంయుక్తా నాయకేన తద్రంజనార్థ మేకచారిణీ వృత్త మనుతిష్ఠేత్ .... .... ....

కామయంతే విరజ్యంతే రంజయంతి త్యజంతి చ,
కర్షయంత్యోపి సర్వార్థాన్ జ్ఞాయంతే నైవయోషితః.

3. అర్థాగమోపాయాద్యధ్యాయః.

సక్తాద్విత్తాదానం స్వాభావిక ముపాయతశ్చ .... ....

పరీక్ష్యగమ్యైస్సంయోగః సంయుక్తస్యానురంజనమ్,
రక్తా దర్థస్య చాదాన మంతేమోక్షశ్చ వైశికమ్.
ఏవమేతేన కల్పేన స్థితా వేశ్యాపరిగ్రహే,
నాతి సంధీయతే గమ్యైః కరోత్యర్థాంశ్చ పుష్కలాన్.

4. విశీర్ణప్రతిసంధానాధ్యాయః.

వర్తమానం నిష్పీడితార్థ ఉత్సృజంతీ విశీర్ణేన సహసం దద్యాత్....

సక్తంతు వశినం నారీ సంభాష్యా వ్యన్యతో వ్రజేత్,
తతశ్చార్థ ముపాదాయ సక్త మే వానురంజయేత్.
ఆయతిం ప్రసమీక్ష్యాదౌ లాభంప్రీతిం చ పుష్కలామ్,
సౌహృదం ప్రతిసందద్యా ద్విశీర్ణం స్త్రీ విచక్షణా.

5. లాభవిశేషాద్యధ్యాయః.

గమ్యబాహుళ్యే ప్రతిదినం చ లభమానా నైకం ప్రతిగృహ్ణీయాత్. .... .... ....

6. అర్థానర్థానుబంధసంశయవిచారాద్యధ్యాయః.

అర్థా నాచర్యమాణా సనర్థా అప్యనూద్భవంతి అనుబంధా స్సంశయాశ్చ. .... .... ....

సంతి రాగపరా నార్యః సంతి చార్థపరా అపి,
ప్రాక్తత్ర వర్ణితో రాగః వేశ్యాయోగాశ్చ వైశికీ.

VI ఔపనిషదికాధికరణమ్.

1. సుభగంకరణాద్యధ్యాయః.

వ్యాఖ్యాతం కామసూత్రమ్ తదుక్తైస్తు విధిరభిప్రేత మర్థ మనధిగచ్ఛన్ ఔపనిషదిక మాచరేత్ .... .... ....

తపోయుక్తాః ప్రయుంజీత శిష్టై రనుగతావిధీన్
బ్రాహ్మణైశ్చ సుహృద్భిశ్చ మంగళై రభినందితాన్.

2. నష్టరాగప్రత్యానయనాద్యధ్యాయః

చండవేగాం రంజయితు మనక్నువ న్యోగా నాచరేత్. .... .... .... ....

న శాస్త్ర మస్తీ త్యేతేన ప్రయోగాహి సమీక్ష్యతే,
శాస్త్రార్థా న్వ్యాపినో విద్యా త్ప్రయోగాం శ్చైకదేశికాన్.
బాభ్రవీయాంశ్చ సూత్రార్థా నాగమయ్య విమృశ్చ చ,
వాత్స్యాయన శ్చకారేదం కామసూత్రం యథావిధి.
తదేతద్బ్రహ్మ చర్యేణ పరేణచ సమాధినా,
విహితం లోకయాత్రార్థం నరాగార్థోస్యసంవిధిః.
రక్షన్ ధర్మార్థ కామానాం స్థితిం స్వాం లోకవర్తినీమ్,
అన్యశాస్త్రస్య తత్త్వజ్ఞో భవత్యేవ జితేంద్రియః.
తదేతత్కుశలం విద్వాన్ ధర్మార్థా నవలోకయన్,
నాతిరాగాత్మికః కామీ ప్రయుంజానః ప్రసిద్ధ్యతి.



# మహర్షుల చరిత్రలు

## విపుల మహర్షి

### బాల్యము

పూర్వకాలమున భృగువంశమునఁ బుట్టిన విపులుఁడనునొక ముని కుమారుఁ డుపనీతుఁడై బ్రహ్మచర్యాశ్రమమునఁ బ్రవేశించి విద్యార్థియై దేవశర్మ యనునొకమునిసత్తమునికడ నివసించుచుండెను. దేవశర్మ యాతనిని గన్నకొడుకువలెఁ గాంచుచు నాతనిశ్రద్ధాభక్తులకు వినయ విధేయతలకు నుభయములకు మెచ్చి విద్యాబుద్ధులు గఱపుచుండెను. అచిరకాలమున నాతఁ డఖిలవిద్యలు నద్వితీయముగ నేర్చుటేకాక యోగ విద్యలో నప్రతిమానుఁ డయ్యెను. గురుకులవాసము, బ్రహ్మచర్యదీక్ష, శుశ్రూషాభాగ్యము, శ్రద్ధాభక్తులు, వినయవిధేయతలు, సుగుణసంప దలు గలయేవిద్యార్థి యేగురునికడఁ జేరి విద్యాబుద్ధులు నేర్వఁజాలఁడు? ఇట్టిబుద్ధిశాలి యగు విపులుఁడు గురు వగుదేవశర్మకుఁ బ్రియశిష్యుఁ డగుటలో నాశ్చర్యము లేదుకదా!

దేవశర్మకుఁ జక్కనిచుక్క, అమ్మలమిన్న యగు రుచి యను భార్య యుండెను. ఆమె పతివ్రతయై భర్త యడుగులకు మడుగు లొత్తుచు శిష్యజనవత్సలయై యుండెను. ఆమెసౌందర్యమునకు మహేం ద్రాదులే ముగ్ధులై యామెను మోహింపఁజొచ్చిరి. ఇంద్రుఁ డామెను గాంక్షించి దేవశర్మయాశ్రమమునకు రాకపోకలు మొదలిడెను. ఇంద్రుని పూర్వచరిత్రము నెఱిఁగినదేవశర్మ యాతనిని వారించి తనయాలిని వేయి కనులతోఁ జూచుకొనుచుండెను. ఇంద్రుని యాస అడియాసలయ్యెను. ఐన నాతఁడు తరుణమున కెదురుచూచుచుండెనే కాని నిరాశుఁడు కాఁడయ్యెను.

## గురుని యోగము

ఇటులుండ నొకమహారాజుచే నొకగొప్పయజ్ఞమును నిర్వర్తింపఁ జేయుటకు దేవశర్మ గ్రామాంతరము పోవలసివచ్చెను. భార్యారక్షణమున కొఱకు నేమిచేయవలయునో యాలోచించుకొని తుదకు విపులుని బిలిచి "ఓయీ! నీవు ఉత్తమ మగు భృగుకులమునఁ బుట్టినవాఁడవు. వినయ విద్యలఁ బ్రియశిష్యుఁడవు. సర్వ సమర్థుఁడవు. కావున, నీ కొకముఖ్య మగుపని నొప్పగించి నేను గ్రామాంతర మేగవలయు" నని చెప్పెను. విపులుఁ డందుల కంగీకరించి యాజ్ఞాపింపుఁ డని కోరెను. అంత దేవశర్మ యాతనికి ఇంద్రుఁడు రుచిని మోహించి తరుణముకొఱ కెదురుచూచుచుండుటయు, రుచి పతివ్రతయే యైనను స్త్రీసహజమగు చపలత కతీతురాలు కాలేకపోవచ్చు ననియుఁ దాను తిరిగి వచ్చువఱకుఁ గోటికన్నులతో రుచిని గనిపెట్టి యుండవలసిన దనియు నామె నింద్రుని బారిఁ బడకుండఁ గాపాడవలయు ననియు హెచ్చరించెను.

ఉగ్రతపుఁడు, సూర్యేంద్రసమానతేజుఁడు, ధర్మజ్ఞుఁడు, సత్యవాది యగువిపులమహర్షి గురునానతి శిరమునఁ దాల్చి "దేవా! ఆ యింద్రుఁ డిట కెటు వచ్చును? అతనిరూప మెట్లుండును? తెలుపు" మని కోరెను. దేవశర్మ "వత్సా! ఇంద్రుఁడు మాయావి, కామరూపి. ఏ రూపమునసైన నెపుడైనను రాఁగలఁడు. అతఁడు కిరీటి, వజ్రభూషణుఁడు, వజ్రాయుధధారి, కుండలాలంకృతుఁడు కాని, అతఁడు ధరింప లేనిరూపము లేదు. పశుపక్షినరరూపములలో నేదియైన ధరింపఁ గలఁడు. క్షణక్షణమున కాతఁడు తనరూపములను మార్చుకొనఁగలఁడు. దివ్యదృష్టికలవాఁడు తక్క నితరుఁ డెవ్వఁ డాతనిం బట్టుకొనఁజాలఁడు. నా కాశక్తి యున్న దని యాతనికిఁ దెలియును. అందుచే శాపభీతుఁడై నాకంటఁబడకున్నాఁడు. నేను లేనివేళఁ గనిపెట్టి తప్పక రాఁగలఁడు. కావున, నీవు కడు జాగరూకతతోఁ జూడవలయును" అని చెప్పి తాను బయనమై పోయెను.

## గురుపత్నీ సంరక్షణము

గురుఁ డరిగినపిదప విపులుఁడు గురుతరబాధ్యతను మోయవలసి వచ్చెను. ఇంద్రుని గనిపెట్టుట కొఱకెన్నియుపాయములనో యాలో

చించెను. కాని, వాని నన్నింటి నవలీలగా దాటి యింద్రుండు రుచిని గొని పోఁగలఁ డని యాతఁ డూహించెను. తుద కాతఁడు యోగమార్గ మవ లంబించి గురుపత్ని యగురుచిశరీరమును జొచ్చెను. ఆమె కాసంగతియే మాత్రమును దెలియదు. అతఁడటు లామెలోఁ బ్రవేశించి తనకన్నుల కాంతి యాకాంతకన్నులకాంతిలోఁగలిపి వాయు వాకాశమునఁ గలిసి యుండున ట్లామెశరీరమును గలిసి యుండి యామెసంరక్షణమును బూనెను. అతఁ డామెశరీరమును జొచ్చుటకుఁ బూర్వము తనశరీరము నాయాశ్రమప్రాంతమున విడిచియుండెను.

ఇచ్చట నిట్లుండఁగా దేవశర్మ యజ్ఞార్థ మెటకో దూరగ్రామమున కేగె ననియు రుచి యొక్కతెయే యాశ్రమమునఁ గల దనియు విని యింద్రుండు చక్కగ నలంకరించుకొని యాశాబద్ధుఁడై దేవశర్మ యాశ్రమ మునకు విచ్చేసెను. ఆశ్రమప్రాంగణమున విపులునిబొంది నాతఁడు గాంచెను. లోన పీనశ్రోణిపయోధర, పద్మదళ విశాలాక్షి, పూర్ణచంద్ర వదన, రుచిరాపాంగ యగురుచి యాతనికంటఁబడెను. అతఁడు కామ వశుఁడై యామెను సమీపించెను. మహాపతివ్రత యైనను రుచి యాతని అతి సుందరరూపమును గాంచఁగనే యాతని కెదురై "నీ వెవఁడవు? ఏల వచ్చితి?" వని యడిగెను. ఆమె నావేశించి యున్న విపులునిసంగతి యెఱుఁగక, ఇంద్రుఁ డామెతో "సుందరీ! నీ పొందుఁ గోరి చిరకాలమునుండి దిన మొకయుగముగాఁ గడపు చుంటిని. నీ పతి యున్నపుడు వచ్చిన నాగతి యేమగునో నే నెఱిఁగి యాతఁడు లేని యీ యవకాశమును బురస్కరించుకొని వచ్చితిని. ఒక్కనిమిషమైన నీకఁ దాళఁజాలను. నీబిగికౌఁగి లొసఁగి, అధరసుధ నందిచ్చి, కామకేళిఁ దేల్పు" మని ప్రార్థించెను. రుచి దేహము కామ వశమై యింద్రుని పొందు గోరుట నెఱిఁగిన విపులుఁడు యోగబలమున దాని నటికట్టి యామెకు సర్వాంగబంధన మొనరించెను. దానితో నామె కదల లేదు. మెదల లేదు. పలుక లేదు. కులుక లేదు. ఇంద్రుఁడు కామజ్వర హెచ్చి యామె కెన్నియో సంజ్ఞలు చేయుచుండెను. కాని యవి నిష్ప్రయోజనము లయ్యెను. నిశ్చేష్టయై యున్నరుచిని గాంచి యింద్రుఁడు సిగ్గుపడెను. కాని, యాతఁ డామెప్రేమ కొల్లగొన మరల

మరలఁ బలుకరించెను. తుద కామె నోటినుండి "నీ వేలవచ్చితివి? పో" మ్మను శబ్దము పురుషకంఠమునుండి వచ్చినట్లు తోఁచుచు వినఁబడెను. అది విని యింద్రుఁ డనుమానపడి యిది యేమని దివ్యదృష్టిని జూచెను. అపు డాతనికి సర్వము గోచరించెను. కాని యింద్రునకు గురుసమశక్తి సంపన్నుఁ డగువిపులుఁడు తన్ను శపించునేమో యని చాల భయము కలిగెను. అందుచే నాతఁడు కాముకతఁ గట్టిపెట్టి నిశ్చేష్టుఁడై నిలిచెను. విపులుఁడు గురుపత్నిశరీరమును విడిచి తనశరీరమును బ్రవేశించి లేచి వచ్చి భయభ్రాంతుఁడైనయింద్రుని "ఓరీ! దేవసామ్రాజ్య మేలువాఁడ వయ్యు నింత యింద్రియ చాపల్యముఁ గాంచితివి. రక్తమాంసాస్థి కల్పిత మగు దుర్గంధభూయిష్ఠశరీరముపై నింత కామలాలసతయా? దుర్మార్గా! ఇట్టియకృత్యమునకేగదా గౌతమమహర్షి శాపమును గాంచి తేజోహీనుఁడవైతివి? నీ కింక నేల బుద్ధి రాలేదో. నీపై దయదలఁచి విడుచుచున్నాను. శీఘ్రమే వచ్చినదారిని బొమ్ము. లేదా క్షణములో నిన్ను భస్మము చేయఁగలను. ఇట్టి నీచపుఁబను లిఁకఁ గట్టిపెట్టుము. బుద్ధి తెచ్చుకొని బ్రదికెద నని యొట్టుపెట్టుకొనుము. పతివ్రతలను, మహర్షులను సేవించి శుభములు పొందుము. ఋషిపత్నులపొందు గోరి వంశవినాశముఁ గొనితెచ్చుకొనకుము" అని పెక్కుగతులఁ జీవాట్లు పెట్టెను. ఇంద్రుఁడు హీనతేజుఁడై సిగ్గుపడిపోయి వెంటనే యంతర్ధాన మయ్యెను. భ్రష్ట కావలసినరుచి ఘోరప్రమాదమునుండి తప్పి తన్నుఁ దప్పించినవిపులు నెంతయు శ్లాఘించెను. గుర్వాజ్ఞఁ బాటింపఁగలిగితి నని విపులుఁ డపరిమితానంద మందెను. ఇది జరిగిన రెండుగడియలకే దేవశర్మ పని ముగించుకొని యాశ్రమమునకు వచ్చి చేరెను.

గురువునకు జరిగిన సంగతి యంతయుఁ జెప్పి శిష్యుఁ డగు విపులుఁడు గురుపత్నిని దిరిగి గురువున కొప్పగించెను. దేవశర్మ శిష్యుని మహత్త్వమునకు మిక్కిలి సంతసించి యాతనిగురుభక్తిని స్థిరధర్మ మును మెచ్చి మేలుమే అని హెచ్చరించి "వత్సా! నీ వేదే నొకవర మును గోరుకొమ్ము. ఇచ్చెద" నని పలికెను. "దేవా! నిరంతరధర్మ బుద్ధియు దైవచింతనము నాకనుగ్రహింపు" మని విపులుఁడు ప్రార్థింప దేవశర్మ యట్లే యని యాతనిని వీడుకొల్పి తనయాశ్రమమునఁ దానును భార్య యగు రుచియు యథాపూర్వము తపోవ్రతదీక్షలఁ గాలము గడపుచుండెను.

విపులుఁడు గురుననుమతిఁ గొని వెడలి వేఱొకచో నొకయాశ్రమ మును నిర్మించుకొని యందు నిరంతరతపో నియమధనుఁడై నిర్విచార ముగ నివసించు చుండెను. అతఁడు తపశ్శక్తికతమున భూలోకము నుండి స్వర్గలోకమునకు స్వర్గమునుండి భూలోకమునకు రాకపోకలు నిరాతంకముగ నొనరించుచుండెను.

## విపులుఁడు గురుపత్నికి దివ్యసుమములు తెచ్చియిచ్చుట

ఇట్లుండ దేవశర్మసతి యగురుచి ప్రభావతి యను తనయక్క యింటి కొకదినమునఁ బోవుచుండఁగా దారిలో నొకయప్సరస విడిచిన మనోహరకుసుమములఁ గొన్నిటిఁ జూచి వానిని దీసికొని తలలోఁ బెట్టు కొనెను. పిదప నామె ప్రయాణము సాగించి ప్రభావతియింటికిఁబోయెను. ప్రభావతి యంగదేశపురాజగుచిత్రరథుని భార్య. ఆమె యాప్యాయ ముగా నింటికి వచ్చినచెల్లెలిని రుచిని గౌఁగిలించుకొని యామెకొప్పులోఁ గలమనోహర కుసుమములఁ జూచి "చెల్లీ! నీ కీపూవు లెక్కడివే? చాల బాగున్నవి. నా కెట్లైన నిట్టివి కొన్ని తెప్పించిపెట్టవే!" అని మిక్కిలి మక్కువతోఁ గోరుకొనెను. రుచి యది యెంతపని యట్లే తెప్పించెద నని యక్కతోఁ జెప్పి జరిగినసంగతి పతి యగుదేవశర్మకుఁ జెప్పి యట్టి పుష్పములను దెప్పింపుఁ డని ప్రార్థించెను. దేవశర్మశిష్యుఁ డగు విపులుని బిలిపించి తనయొక్కయు, తనయాలియొక్కయు, ప్రభావతి యొక్కయుకోరికనెఱిఁగించి యెట్లైన వారికోరిక దీరుపు మని కోరెను. విపులుఁడు సరే యని యవి తొలుత రుచికి లభించినచోటికే పోయి యటఁ దన తపశ్శక్తివలన మఱికొన్ని పడియుండుట చూచి వానిని దీసి కొని వచ్చుచుండఁగా నొకనిర్జనవనమున నొకరిచేయి యొకరు పట్టుకొని చక్రాకారముగాఁ దిరుగుచున్న యిద్దరు పురుషులను జూచెను. వారి కంతలో నేలొకోయేదో కలహము కలిగెను. వెంటనే వా రుభయులు నొట్టుపెట్టుకొనుచు "మనలో నసత్యమాడినవానికి విపులునకుఁ బట్టు దుర్గతి పట్టుఁగాక" యనుకొన విపులుఁ డామాట లాలించెను. తనమాట యంతనీచముగా వారు చెప్పుకొనుట కాశ్చర్యవిషాదము లందుచు నాతఁడు ముందునకుఁ బోవ నాలుగురువ్యక్తులు పాచికలాడుకొనుచుఁ

గానవచ్చిరి. వారును వివాద మేదో కలుగఁగా నొకఁ డొకఁడే తా నసత్యద్యూత మాడినచోఁ దనకు విపులునికిఁ గలిగినదుర్గతి పట్టుఁగాక యనిశపథముపలుకుట నాతఁడు విని నిలువున నీరయిపోయెను. అతఁ డెటులో ఆ పూవులతో నింటికేగి గురునకు వాని నర్పించి నమస్కరించెను.

## గురు కటాక్షము

దేవశర్మ యాపూలను రుచి కిచ్చి విపులుని బిలిచి "ఓయీ! ఆవన మున నీవు కన్నచిత్రము లేమో చెప్పు" మని యడిగెను. విపులుఁడు తాను గన్నవ్యక్తులనుగూర్చి వా రన్నపలుకులఁగూర్చి విన్నవించి "అయ్యా! వా రెవరు? వా రట్లనుటకుఁ గారణ మేమి?" అని ప్రశ్నించెను. అంత గురుఁడు శిష్యునితో "ఓయీ! నీకు మొదటఁ గానఁబడ్డజంట అహోరాత్రములు. చక్రాకారమున నవి తిరుగుచు నీదుష్కృతమును నీ కెఱింగించెను. మఱి పాచికలాడు షట్కము ఋతువులు. అవి నీదోషము నెఱుఁగఁజాలినవి. ఇట్లహోరాత్రములు ఋతువులు మానవుఁ డొనర్చుపుణ్యపాపముల నరయుచునే యుండును. మూర్ఖుఁ డగునరుఁడు రహస్యముగాఁ బాపము లొనరించుచుఁ ద న్నెవ్వఁ డును జూడ లేచనుకొని మోసపోవును. పురుషుఁడు నిత్యము నొనర్చు పుణ్యపాపకర్మములను అహోరాత్రములు ఋతువులు నెఱిఁగి యాతని కాపుణ్యపాపములఁ దెలుపుచునే యుండును. నీవు గురుపత్ని నావేశించిన దోషము నవి యెఱిఁగి యా దోషమును నీముందుఁ బ్రదర్శించినవి. నీవు రుచిని దుర్వృత్తినుండి కాపాడితివి. దురుద్దేశముతో నీ వామెలోఁ బ్రవేశించి యావేశింపలేదు. కాన సమస్త మెఱిఁగిన నేను నీ కీవిషయ మున దోషము లే దని యూరకుంటిని. కాని, యది దోషమే. ఆ దోషము కతముననే నీ కాయనుభవము కలిగినది. నీ కాదోష మెల్ల పోవునట్లు నేను వరమిచ్చెదను. నీ విఁక మహోత్తముఁడవై తపస్సిద్ధి గాంచి తరించెదవు గాక!" అని యాశీర్వదించెను.

ఈ విధముగా విపులుఁ డజ్ఞానమున నొనరించిన దోషము నశింప నాశ్రమమున కేగి పెక్కువిధముల తప మొనరించి జ్ఞానసంపన్నుఁడై మోక్షము నందెను.

# సాందీపనిమహర్షి

## జననము : బాల్యము

అవంతిపురము తొల్లి యఖిల సౌభాగ్యములకు నిలయమై యుండెను. అందులకుఁ గారణ మందు వేదజ్ఞులు, శాస్త్రజ్ఞులు, పురాణజ్ఞులు నగు బ్రాహ్మణోత్తములు నిరంతర తపోవ్రత పరాయణులు, సంతత స్వాధ్యాయప్రవచన దీక్షాదక్షులు నయి యుండుటయే. వారిలో సందీపనుఁ డను నొక మహర్షి జ్ఞానతేజమున బ్రహ్మవర్చసమున మిక్కిలి ప్రకాశించుచు సార్థకనామధేయుఁడై యుండెను. ఆ మహనీయుఁడు బ్రహ్మచర్యాశ్రమమును గురుకులవాసమునఁ గడపి వేదాది విద్యల నభ్యసించి తపోయోగముల నాటితేరి గృహస్థాశ్రమమును స్వీకరించి యాదర్శబ్రాహ్మణుఁడై యలరారుచుండెను.

కాలక్రమమున సందీపనముని దయవలన నాతనిపత్ని గర్భము ధరించి నవమాసములు నిండినపిదప నొక శుభముహూర్తమున నొక పుత్రరత్నమును గాంచెను. సందీపనముని సంతోషమున నాతనికి జాతకర్మాదికమును నడపెను. ఆ బాలుఁడు సాందీపని (సందీపసుని కొడుకు) యని పిలువఁబడుచుండెను. సాందీపని బాల్యమును గడపి యుపనీతుఁడై సమస్త వేదశాస్త్రములను సాంగోపాంగముగా నభ్యసించెను. పిదప నాతఁడు సమస్తవేదరహస్యములను దెలిసికొని సత్యవాది, దయాశాలి, ప్రియదర్శనుఁడు, సాత్త్వికుఁడు, విష్ణుపూజారతుఁడు, వివేకధనుఁడునై వెలుఁగొందెను. విద్యాదేవితోపా టాతనిని దపోలక్ష్మి కూడ వరించెను. సాందీపని తపశ్శక్తితమునఁ దండ్రికి దీటయిన తనయుఁ డనుఖ్యాతి నార్జించెను.

## వివాహము: సంతానము

కొంతకాల మైనపిదప సాందీపని బ్రహ్మచర్యాశ్రమమును విడిచి పెట్టి గృహస్థధర్మమును స్వీకరించెను. సద్గృహస్థుఁడై విరాజిల్లు నామహనీయుఁడు ధర్మపత్నియం దొక సుపుత్రునిం గాంచెను. ఆబాలుఁడాబాల్యమునుండియు విష్ణుభక్తుఁడు, విరాగసంపన్నుఁడు, విజ్ఞానరాశి, వివేకనిలయుఁడు నై వెలసెను. ముక్కుపచ్చలారకముందే యాతఁడేకసంథాగ్రాహియై తండ్రికడ సర్వవిద్యల నభ్యసించెను. విద్యకుతోడు వివేకము, వివేకమునుగూడి వినయము, వినయమును మించి విజ్ఞత, వీని నన్నింటిని మించినయాత్మా నాత్మవివేకము నాతని కలవడెను. ఆతనికి బాల్యముననే కలిగినయనుపమాన వైరాగ్యసంపద వలన జీవితము క్షణిక మనియు నందు సాధింపవలసిన దనంతమనియు సంసారబంధమునుండి చావుపుట్టుకల చక్రమునుండి తప్పించుకొను సత్వరయత్నమున నిమగ్నుఁడుకాని మానవుని జన్మ మెంతయు వ్యర్థ మనియు నాతఁడు విశ్వసించెను. గతానుగతికముగాఁ దాను వివాహమాడి బిడ్డలఁ గని బంధములఁ బెంచుకొని త్రెంచుకొనుట కాతని మన స్సంగీకరింప దయ్యెను. దానికితో డాతనిమనస్సు విష్ణుకథాసుధారసమును వినుచు లేక త్రావుచు సర్వం విష్ణుమయం జగత్తనుభావము వెల్లి విరియ నాతఁడు భక్తపుంగవుఁడై విష్ణుకథాలాపములఁ గాలము వెళ్ళఁబుచ్చఁజొచ్చెను.

## పుత్రమరణము

సాందీపనిపుత్రుఁడు బహుపురాణముల నవలోకించి యందలి సారము నాకళించినదిట్టు. ప్రభాసతీర్థ మహత్త్వమాతని కొంటఁబట్టెను. మాఘమాసమునఁ బూర్ణిమా దినమునఁ బ్రాతఃకాలమునఁ బ్రభాసతీర్థమున మునిఁగి దేహమును వీడఁగల్గు మహనీయుఁ డిహలోక బంధములఁ ద్రెంచుకొని సాంహీన మగుసంసార కాంతారమున దారితప్పి చరించుదురవస్థఁ బడక తరించు నని యాతఁ డెన్నియో పర్యాయములు చదివి విని తన కట్టియదృష్ట మబ్బునా యని యాతఁ డనుకొనుచుండెను. ఇట్లుండ నొకనాఁ డాతఁడు తోడిబాలురతో స్నానార్థము

ప్రభాస తీర్థమున కరిగెను. నాడు మాఘపూర్ణిమ. అందు దిగి యాతఁడు స్నాన మొనరించుచు నీపుణ్యకాలము నిఁక దాఁటఁ బెట్టరా దనుకొని "ఓవనజాక్ష! కృష్ణ! అచ్యుతా! నిన్ను స్మరించుచు నీపుణ్య దివసమున నిందు మునిఁగి బొంది వీడెదను. నన్ను నీలోఁ గలుపు కొమ్ము. ఈ జన్మ జరామరణ చక్రమునుండి నన్నుఁ దప్పింపుము. భవవార్ధిని బడిపోకుండ రక్షింపుము. నీ పాదపద్మములకడ నాకుఁ గొంచెము స్థానముఁ గల్పించి నన్నిటఁ బడియుండ ని" మ్మనిభక్తి ప్రవృత్తితో నా బాలుఁడందు మునిఁగిపోయెను. స్నానార్థ మందు దిగిన విప్రబాలు రందఱును బైకి వచ్చిరి. కాని సాందీపనిపుత్త్రునిజాడ కానరా దయ్యెను. అతఁడు తన నిర్ణయము నెవ్వ డెవరికిని జెప్పి యుండని కారణమున నప్పని జరిగియుండు నని యెవ్వరు నెఱుఁగఁజాల కుండిరి. తోడిబాలురు చాలసేపట వేచి వేచి వెదకి వెదకి వేసారి వేసారి తుద కింటి కేగి సాందీపని కా వృత్తాంత మెఱింగించిరి.

సాందీపని తనకొడుకు దివ్యమృతి నందె ననియు నాతఁడు విష్ణు రక్షితుఁడై వెలయుచుండు ననియు విశ్వసించి జన్మమృత్యువులసార మెఱిఁగిన మహనీయుఁ డగుట పుత్త్రవియోగదుఃఖమున బెంబేలుపడక ధైర్య మవలంబించి వైరాగ్యము నూతగాఁ గొని జ్ఞానము నాశ్రయించి చెక్కుచెదరక తన కేమియు జరుగనట్లు చిత్తశాంతియుతుఁడై చెలు వొందెను. కాని, యాతనిపత్ని స్త్రీసహజ మగు నేకైకపుత్త్రప్రేమను విడువఁజాలక యాతనికై విలపింపఁజొచ్చెను. సాందీపని యామెకు ధైర్యము చెప్పి చావుబ్రదుకుల మర్మములఁ జాటి జీవితముల యస్థిర త్వము నెఱింగించి యుత్తమమృతుల నుదాహరించి తమ పుత్త్రుఁడు విష్ణుభక్తుఁ డగుట విష్ణుసంరక్షితుఁడై శాశ్వతసౌఖ్యము నందియుండు నని వినిపించెను. ఆమె యప్పటికి దుఃఖము వీడి భర్త తెలిపినగతిని బ్రహ్మానుసంధానమున సుఖముగా నుండెను.

## బలరామకృష్ణులకు గురుత్వము

బలరామకృష్ణులు కంసవధానంతరము తమ తలిదండ్రు లగు దేవకీవసుదేవులను విడుదల చేయించిరి. పిదప దేవకీవసుదేవులు గర్గాది

భూసురోత్తములచేఁ దమపుత్త్రుల కుపనయనమహోత్సవముఁ జేయించిరి. వసుదేవుఁడు బ్రాహ్మణులకు సదక్షిణముగా ననేక గోహిరణ్య దానము లొనరించి తొల్లి రామకృష్ణులజన్మసమయమందుఁ దన మనసున నర్పించిన గోవుల నుచ్చరించి యిచ్చవచ్చిన విప్రుల కెల్ల యిచ్చవచ్చినన్ని కామితముల నొసంగెను. అనంతరము వసుదేవుఁడు రామకృష్ణులకు గురువు నన్వేషింపఁ దొడఁగెను. గర్గాదిపురోహితులు కాశీప్రాంతమునఁగల యవంతిపురవాసి సాందీపనిమహర్షి యందులకుఁ దగినవాఁడని సూచించిరి. సర్వజ్ఞులు, జగద్గురువులు, సంపూర్ణులు నయ్యు రామకృష్ణులు గురుశుశ్రూషాలభ్య మగువిద్యయే విద్య యని లోకమునకుఁ జాటు నిమిత్తము గురువును జేరి చదువుకొన నంగీకరించిరి.

బలరామకృష్ణులు ప్రమదాంతఃకరణులై బ్రహ్మచారులై విద్యార్థులై చని మహావైభవరాశియైన కాశినిజేరి తత్తీరమునఁ గల యవంతిపురమున సకల విద్యావిలాసియు, సంతతభగవచ్చరణారవింద సేవామనీషియు నగు సాందీపని మహర్షిని జేరి సాష్టాంగనమస్కారము లొనరించి యా మహనీయుని శిష్యత్వ మాశించి శుద్ధభావవర్తనముల నాతని సేవింపఁదొడఁగిరి. కొన్నాళ్ల కాతఁడు వీరిసేవల కలరి సర్వజగన్నియంతలు తనకడ సాష్టాంగపడుట కచ్చెరువంది సంతుష్టాంతరంగుఁడై వారలకు విద్యలెల్ల బోధింపఁ దొడఁగెను.

"వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృత ధర్మశాస్త్రములు నుద్యన్మీ(?)యముందర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబునన్."

బలరామకృష్ణులు నొక్కనాఁ డొకొక్కవిద్య ఒకసారి విన్నంతనే నేర్చి యందుఁ బరిపూర్ణ పాండిత్యము సంపాదింపఁగల్గిరి. చిత్ర మేమనఁగా

"గురువులకు నెల్ల గురులై
గురులఘుభావములు లేక కొమరొందు జగ

ద్గురులు త్రిలోకహితార్థము
గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్."

భాగ. ౧౦ స్కం, పూ. భా. ౧౪౧౫

అహా! ఏమి యదృష్టము! త్రిమూర్తులను బరీక్షించుశక్తి భృగు మహర్షికిఁ గలిగినది. త్రిమూర్తులను బంటిబిడ్డలఁ జేయుశక్తి అన సూయా సాధ్వికిఁ గలిగినది. శ్రీరామునికి గురువగు నదృష్టము వసిష్ఠ నకుఁ గలిగినది. విష్ణుమూర్తిని బుత్త్రునిగాఁ గనుయోగము కశ్య పాదులకే కలిగినది. వదునాలుగుభువనములకుఁ గుదురులగు బలరామ కృష్ణులకుఁ బాఠము చెప్పు నదృష్టము వేలాది విప్రులలో నొక్క సాందీప నికే గలిగినది. అదృష్టశ్రుత పూర్వమగు మహాయోగముఁ గన్న సాందీపని భాగ్య మెంతటిదో!

## గురుదక్షిణ

అచిరకాలముననే యన్నివిద్యలు నేర్చినబలరామ కృష్ణులను బిలిచి సాందీపని తా నింక నేర్పఁగలిగినవిద్య యేదియు లేదని పలికెను. బలరామకృష్ణులు గురువునకు గురుపత్నికి నమస్కరించి తమ్ముఁ గన్న బిడ్డలవలెఁ గాంచి విద్యాబుద్ధులు గఱపినందులకుఁ గృతజ్ఞత తెలిపి యేదేని గురుదక్షిణఁ గోరుకొమ్మని యర్థించిరి. సాందీపని సంతోష ముతోఁ దనసతివంకఁ జూచెను. ఆమె ప్రభాసతీర్థమున మరణించిన తన పుత్త్రుఁడు పునర్జీవితుఁడు కావలయు నను కాంక్షతక్క అన్యకాంక్ష తన కేమియు లేదని నుడివెను. బలరామకృష్ణులు సాందీపనిని మఱి మఱి యర్థింపఁగా నాతఁడు "వత్సలారా! మీరు జగదతీతప్రజ్ఞావం తులు. మీకు సాధ్యము కానిపనియే యుండదు. మాయేకైక పుత్రుఁడు మున్నుఁ బ్రభాసతీర్థమున మునిఁగి చనిపోయెను. నే నెన్ని చెప్పినను నా సతి పుత్రమరణఖిన్నయై వాపోవుచునే యున్నది. మీకు గురు దక్షిణ యీవలయునను గట్టిసంకల్పము న్నయెడల మృతపుత్త్రుని దీసి కొనివచ్చి మాకిండు. అంతకుమించి మాకు దేనియందును వాంఛ లేదు" అని పలికెను. ఆ మాట లాలించి బలరామకృష్ణులు గురు

పుత్త్రిమరణవిధమును సవిస్తరముగాఁ దెలిసికొని మృతపుత్త్రుని దెచ్చి సమర్పించి గురుదక్షిణగా నొసఁగుదు మని చెప్పి బయలుదేఱి వెడలిరి. సాందీపని దంపతులకుఁ గలిగిన యానంద మింతింతన రాకుండెను.

బలరామకృష్ణులు రథారూఢులై బయలుదేఱిపోయి సముద్రము కడ కేగి "ఓ సముద్రరాజా! నీవు మాగురుపుత్త్రుని దీసికొనివచ్చి మా కొప్పగింపనియెడల నీ పని పట్టెదము. జాగ్రత్త" యని హెచ్చరించిరి. పరమభీతుఁడై సముద్రుఁడు వారిపాలి కేతెంచి "మహాత్ములారా! ఇందు నాదోష మేమియు లేదు. మీగురు పుత్త్రుఁడు ప్రభాస తీర్థమున మరణోద్యుక్తుఁడై దిగినంతనే యొక పెద్దయల యాతనిని లోనికి లాగుకొనిపోయెను. ప్రభాసతీర్థమధ్యమునఁ గల పంచజనుఁ డనురాక్షసుఁ డా బాలుని మ్రింగి నాలో వచ్చి దాఁగికొనియున్నాఁ" డని నివేదించెను. అపుడు కృష్ణుఁడు బలరాముని గట్టుననుంచి తాను శంఖనాదము చేసి యా సముద్రమధ్యముం జొచ్చిపోయి యందు దాఁగియున్న పంచజనరాక్షసునిఁబట్టి వానిపొట్ట చీల్చి యందు గురుపుత్త్రునిఁ గానక యొక దివ్యశంఖమున్నఁ గైకొని సముద్రము వెలికి వచ్చి యన్నయగు బలరాముని గూడి రథమెక్కి పోయి సంయమని అనుపేరు గల యముని పట్టమును జేరి ప్రళయకాల మేఘ గంభీరనినద భీషణ మగుశంఖము పూరించిన సకలలోక భయప్రదుఁ డైన యముఁడే భయపడిపోయి బయటికివచ్చి బలరామకృష్ణులను జూచి వారు లీలా మనుష్యులయినవిష్ణుమూర్తులని యెఱింగి భక్తితో సేవించి సర్వభూత మయుఁడగు కృష్ణునకు నమస్కరించి వచ్చినపని యడిగెను. శ్రీకృష్ణుఁ డాతనికి విషయ మంతయుఁ జెప్పఁగా విని యముఁడు శ్రద్ధాభయభక్తి యుక్తుఁడై సాందీపనిపుత్త్రి రత్నమును గొనితెచ్చి యిచ్చి సాష్టాంగ మెఱఁగెను. బలరామకృష్ణు లాతని నెచ్చెలిగాఁ గైకొని గురుపుత్త్రుని రథ మెక్కించి తీసికొని వచ్చి గురుదంపతుల కొసంగ వారు —

"కాలుని వీటికిఁ జని మృత
బాలకుఁ దే నొరులవశమె? భవదీయకృపన్

మేలు దొరఁకొనియె మాకు వి
శాల మగుంగాక మీయశము లోకములన్"

అని సంస్తుతించి హృదయపూర్వక మగు ఆశీర్వచన పరంపరతో వారిని వీడ్కొలిపిరి. బలరామకృష్ణులు కృతార్థులై మధురాపురి కేగిరి.

సాందీపనిపుత్త్రుఁడు తాను స్వచ్ఛందముగనే చనిపోయితి ననియుఁ దనబ్రహ్మచర్యాదిఫలముగను వంశాను గతమహాపుణ్యము కతమునను దనకు యమలోకమున దివ్యగౌరవమే జరిగె ననియు నందలివిశేషములను దలిదండ్రుల కెఱిఁగించి వారి నానందాంబుధి నోలల నాడించెను. సాందీపని చిరకాలము ధర్మాత్ముండై గృహస్థాశ్రమము నిర్వర్తించి బహుశిష్యులకు విద్యాదాన మొనరించి తుదకు సన్న్యస్తచిత్తుఁడై సర్వేశ్వరపాద కమలములఁ జిత్తముఁ జేర్చి శ్రీకృష్ణకటాక్షమున మహాయోగులైన నందఁజాలనికైవల్య మంది చరితార్థుఁ డయ్యెను. *



* పద్మపురాణము, భాగవతము, హరివంశము.

# మహర్షుల చరిత్రలు

## సారస్వతమహర్షి

### జననము

దధీచిమహర్షి మహోగ్రతపస్సు చేసిన మహనీయుఁడగుటచే బ్రహ్మతేజ మాతని నావహించెను. అతఁడొక దివ్యతేజోగోళమువలెఁ బ్రకాశించుచు నద్వితీయ సౌందర్యస్వరూపి యయ్యెను. సరస్వతీ నదీతీరమున నాతఁడుండి సరస్వతీనదిలోనికి స్నానపానములకు రాక పోక లొనరించునపుడు చూచినసరస్వతి యాతనిని మోహించియుండెను.

దధీచి ధీశాలిత్వము, మహాతపస్సు, బ్రహ్మవాదిత్వము, జితేంద్రి యత యింద్రునికిఁ గన్నెఱ్ఱ కలిగించెను. అతఁ డీతని నెట్లైన స్వాధీన పఱచుకొనఁ దలఁచి యివి యిచ్చెద, నవి యిచ్చెద నని యాతని నాశ పెట్టఁ జూచెను. కాని నిష్కామియు, నిరుపమ నిష్ఠాగరిష్ఠుఁడు నగు నాతఁడు వాని నన్నిటిని దృణీకరించెను. వేఱుపాయములేక యింద్రుఁ డలంబుస యనునప్సరసను బిలిచి "తరుణీ! ఆ దధీచిని నీవెట్లైన నొడఁ బఱచుకొని యాతని తపస్తేజమును హరింపవలయును. ఇం కొండు పాయము లేదు. నీకు నే నెల్లపుడుఁ గృతజ్ఞుఁడనై యుందు" నని బతిమాలుకొనెను. ఆమె యింద్రునికోరిక తీరుపఁ దలఁచి సర్వాంగ సుందరియై సరస్వతీ నదీతీరమునకు వచ్చి చేరెను.

దధీచి సరస్వతీనదియందు స్నానము చేయఁబోవుచున్న సమయ మందు జగదేకసుందరి యగు నప్సరస యాతనిని సమీపించి మార వికారములను జూపెను. దివ్యసుందరవిగ్రహ యగు నామెనుఁ గాంచి నంతనే భావితాత్ముఁడగు నా మహర్షికి రేతఃపతనము కాకుండెను. అతఁ డామెవంకఁ జూడమాని నదిలో దిగినంతనే యాతని రేత మా నదీజల ములఁ బడెను. సరస్వతీనది వెంటనే స్త్రీరూపమును ధరించి యా రేత మును గైకొని గర్భవతియై కాలక్రమమున నొకపుత్త్రునిగాంచెను. అతఁడే సారస్వతుఁడు.

## పితృదర్శనము

కొంతకాలమైన పిదప దధీచిమహర్షి నక్షత్రమధ్యమందలి చంద్రుని వలె ఋషులమధ్యఁ గొలువుదీరియున్న సమయమున సరస్వతీనదీదేవి తనయుల్లారు ముద్దుబిడ్డ నెత్తుకొని దివ్యముగఁ దేజరిల్లుచు నటకు విచ్చేసెను. అపుడు సర్వమునిజననేత్రములు నాతల్లిబిడ్డలపైఁ బ్రసరించెను. దధీచి యంతధైర్యముగాఁ దనయాశ్రమమును బ్రవేశించి ఋషిమధ్యమున కట్లు నిర్భయముగాఁ జొచ్చునామె యెవ్వరని దివ్యదృషిని జూడఁగానే యామహనీయుని కంతయుఁ దెలిసెను. సరస్వతీనది దధీచిని సమీపించి నమస్కరించి "ఓబ్రహ్మర్షీంద్రా! ఈ బాలచంద్రుఁడు నీపుత్రుఁడు. నీయందుఁ గలభక్తి శ్రద్ధలచే నీవుమున్ను అలంబుస యను నప్సరసను గాంచినంతనే నాజలములలో విడిచిన వీర్యమును బరిగ్రహించితిని. త్రిలోక సన్నుతుఁడవగు నీతేజము వ్యర్థము కారాదని నే నాఁడుదానసై దానిని గ్రహించి గర్భవతనై యీ పుత్త్రినిగాంచి నీ కొప్పగింపఁ దీసికొనివచ్చితిని. ఈతఁ డనిందితుఁడు. ఈ పుత్త్రిరత్నముమ స్వీకరించి న న్ననుగ్రహింపు" మని పలికెను.

దధీచి సంతోషముతో లేచి సరస్వతీనదిమతల్లికి మ్రొక్కి "మహాభాగా! నీవు తొల్లి బ్రహ్మసరోవరమున నుద్భవ మందితివి. సంశితవ్రతు లగుమునులు నీతత్త్వమెఱింగి నిన్నారాధింతురు. ప్రియదర్శనవగునీవు నా కతిప్రియ మొనరించితివి. నీకుఁ గృతజ్ఞుఁడను. ఈ నీ పుత్త్రిఁడు నీ పేరనే సారస్వతుఁ డని ప్రఖ్యాతి నందును. ఈతఁడు త్రిలోకారాధ్యుఁ డగుదివ్యమునియై లోకసంరక్షణ మొనరించి శుభప్రదుఁడు కాఁగలఁడు. నీవు నాకొనరించినయుపకారమునకుఁ బ్రత్యుపకారముగా నీకుఁ గొన్నివరము లనుగ్రహించెదను, స్వీకరింపుము. నీజలములలో స్నాన మొనరించి శుచియై నీ జలములచేఁ దర్పణమొనరించినవారికి విశ్వేదేవతలు, పితృదేవతలు, గంధర్వులు, అప్సరసలు మిక్కిలితృప్తినొంది సకలశుభములు సమకూర్తురుగాక! నీవు పావన లగు నదులలో నెల్ల పావనవై వందనార్హ వగుదువుగాక! "అని పలికి సారస్వతుని గైకొని మూర్ధాఘ్రాణ మొనరించి పరిగ్రహించి సరస్వతీ

నదీమతల్లి కొసంగుచు "నీవే యీతనిని బెంచి పెద్దవాని నొనరింపుము. నేనును వచ్చి చూచుచుందు" నని యామె కొప్పగించెను. సరస్వతి యా బాలుని స్వీకరించి దధీచి వీడ్కొలుప వెడలిపోయెను.

## దధీచిదివ్యార్పణము

అపుడు దేవదానవులకుఁ దీవ్రవిరోధము సంభవించెను. ఇంద్రుఁ డరిబలము నవలీలగా జయించునొకదివ్యాయుధమునకై యెల్లెడలఁ బరిభ్రమించి యెందును గనలేఁ డయ్యెను. ఇంద్రుఁడు దేవతలతోఁ గూడి బ్రహ్మపనుపున దధీచిమహర్షిని జేరి త్రిలోకవిజయవంతము లగు నాయుధములకై యాతని యెముక లర్థించెను. దేవకార్యసిద్ధికన్నఁ దనదేహధారణఫల మింకొకటి లే దని యెంచిన దధీచి తనశరీరమును యోగాగ్నిచే విడిచివేసెను. దేవత లాతని యెముకలు కొనిపోయి త్వష్ట కీయ నాతఁడు వానిని శుభ్రపఱిచి వానినుండి వజ్రాయుధము, చక్రములు, గదలు, దండములు మున్నగువానిని సిద్ధము చేసెను. వాని నుపయోగించి దేవతలు రాక్షసుల నవలీలగా నుఱుమాడఁదొడఁగిరి. మంత్రయుక్తమును బ్రహ్మతేజోద్భవమును నగువజ్రాయుధముచే నింద్రుఁడు తొంబదితొమ్మండుగురు దైత్యనాయకులను జంపివేయఁగలి గెను. పరమర్షియు, ప్రజాపతిపుత్రుఁ డగుభృగుమహర్షి మహాతపస్సు చేసి కన్నపుత్త్రుఁడును, లోకపావనుఁడును, అతికాయుఁడు, తేజస్వి, సకలలోకసారభూతుఁడు నయి వెలుఁగొందిన దధీచి మహాబలిష్ఠుఁడు, పర్వతోపముఁడు, విస్మయకరతేజోనిధి, మహాదీర్ఘవిగ్రహుఁడు. అట్టివాని యెముకల కట్టి యతిలోకశక్తి యబ్బుట కాని, యాతఁడు బ్రతికి యుండఁగా నాతఁడన్న నింద్రుఁడు భయపడుట కాని యాశ్చర్యకర విషయములు కావు.

## సారస్వతుని లోకసంరక్షణము

దారుణముగ దైత్యులమారణహోమ మైనపిదప నొక్కసారిగా సర్వలోకభయంకర మగుక్షామపీడ సంభవించెను. అనావృష్టిదోషము వలన అన్నపానములకు జనములు కఱవువాచి కాందిశీకులు కాఁజొచ్చిరి.

తపస్వులకుసైత మాబాధ తగిలెను. వారు నొకకడనుండి యొకకడకు వలసపోవఁ దొడంగిరి. దావానలమువలె వ్యాపించి యీక్షామము భీత్యావహ మయ్యెను.

సారస్వతుఁడు సరస్వతీకటాక్షమున లాలనమున పెరిగి పెద్దవాఁడగుచు సరస్వతీనదీతీరమునఁ జక్కని యాశ్రమము నిర్మించుకొని యందు మహాతపోజీవనముఁ గడపుచుండెను. అనర్ఘ మగునాతనిమహాతపస్సువలన నాతని కనేకదివ్యశక్తు లలవడెను. క్షామ మెంత తీవ్రతర మైనను నాతఁడు వేదములను పఠించుచు, అతిథ్యభ్యాగత సేవ చేయుచు, దేవపితృదేవతృప్తి గావించుచుఁ బ్రాణధారణముచేసికొని యటనే యుండిపోయెను క్రమముగ నాతఁడు తపశ్శక్తిని బారించి ద్వాదశవర్ష ప్రాయ యగు క్షామదేవత నెల్లలోకములనుండి పాఱద్రోలి లోకసంరక్షణము గావించెను. సూర్యాగమనమున విరిసినచీఁకటివలె సారస్వతతపోగ్నిచేఁ గఱవుదూదిపింజలపర్వతములు క్షణములో దగ్ధ మయ్యెను. అపు డెల్లలోకములును నాశ్చర్యపడి తమతమదివ్యదృష్టి వలన నిట్టియలోకమహత్త్వము దధీచిపుత్త్రున కలవడె నని గ్రహించి యానందించిరి. క్షామము వైతొలఁగినదని మునులు శిష్యులఁ బిలిచి మరల వేదాధ్యయన మారంభించిరి. కాని పండ్రెండుసంవత్సరములు క్షామపీడావృతులై యిల్లనక వాకిలి యనక, ఎండనక, కొండనక, దూర మనక, భార మనక పెక్కుచోట్ల పరిభ్రమించినవా రగుటచే వారు వేదవిద్య మఱచిపోయిరి. ఆ కారణమున వారి కధ్యయనాధ్యాపనశక్తి కుంటువడెను.

దీనికి మునులెల్లరు భీతిచెంది పరస్పరము కలిసికొనుచు, చర్చించుకొనుచు,నెల్లరు నట్టి స్థితిలోనే యున్నారని గ్రహించుకొని కింకర్తవ్యతామూఢులై వేదవిహీనతకు ఖిన్నులై డోలాందోళితమనస్కులైరి. వారిలో నొకఁడు దైవవశమున సారస్వతమహర్షియాశ్రమ ప్రాంతమునఁ దిరుగుచు వీనులవిందుగ వేదస్వనములు వినవచ్చుటచేఁ బెన్నిధి గన్న పేదవలె నాశ్రమమును బ్రవేశించి సారస్వతమహర్షి బోధింప వేదములు వల్లించు శిష్యులఁ జూచి యత్యాశ్చర్యానంద పరవశుఁడై పరుగుపరుగునఁ బోయి ఋషులకెల్లర కీవిషయముఁ దెలిపెను.

వారెల్ల రానందాశ్చర్యపులకితులై బారులుతీరి గుంపులు గుంపులుగా సౌరస్వతమహర్షి దివ్యాశ్రమమును ప్రవేశించిరి. వారికిని ఉదాత్తాను దాత్తస్వరిత మనోహరమై పర్వపాపహరణసమర్థమై పూర్వమహాయోగ భాగ్యసూచకమై వేదనాదము వినవచ్చెను.

## వేదప్రసాదము

ఋషులెల్లరు సమీపించి సారస్వతునికి మ్రొక్కి "ఓ మహనీయా! లోకోపద్రవము సంభవించినది. నీకడదక్క నెయ్యెడల శాస్త్రసమ్మత మగువేదాధ్యయనము వినరాదయ్యెను. కాన మేము మిక్కిలి క్షోభ పడి వేదరాశి భూదేవిని విడిచిపోయినదా యని బెగ్గడిలుచు నీదగ్గఱకు వచ్చితిమి. వేదరాశి మూర్తీభవించినవిధమున నున్న నిన్నుఁ జూడఁగనే మా హృదయములు కుదుటఁబడినవి. దయదలఁచి మాకును వేదోపదేశ మొనరించి వేదముల నిలిపి విప్రులఁ దనిపి లోకోద్ధరణ మొనరింపు మని ప్రార్థించిరి. అంత సారస్వతుఁడు వారి నందఱ నాదరించి "అయ్యా! మీరు మాయాశ్రమమున విడిసి మా కంతేవాసులై మాకడ నభ్యసింప వలెను. అన్యథా మీకు వేదరాశి నొసఁగుట సాధ్యము కా"దని పలికెను.

ఆ మాటలు విని మునులు "అయ్యా! నీవు బాలుఁడవు. మేము వృద్ధులము. బాలగురువుకడ వృద్ధశిష్యులు వేదాభ్యాస మొనరించుట వింతలలో నెల్ల వింత యగునేమో? పోనీ; మ్మది ధర్మబాహ్యము కాదు గదా" యని పలికిరి. అంత సారస్వతమహర్షి "మహాత్ములారా! గురు ముఖగ్రహణమునఁ గాని వేదవిద్యనిలువదు. అధ్యాపన ధర్మవిరుద్ధ ముగా మీరు వేదములు గ్రహింపరాదు. నేను మీ కీయరాదు. దాన, మీకును మాకును బ్రమాదము సంభవించును. అధర్మబోధనము కాని యధర్మపరిగ్రహణము కాని యుభయవినాశహేతువో, ఉభయవైరకార ణమో యగును. ధర్మసంపాదనా విషయమున ఋషులు వయోభేదము కాని వార్థకచిహ్నములు కాని విత్తబాంధవ్యములుగాని నిమిత్తములుగాఁ దెలుపలేదు" అని పలికెను.

అపుడు ఋషు లెల్లరు మహాప్రసాద మని సారస్వతమహర్షికి శిష్యులైరి. సారస్వతమహర్షి శిష్యులసంఖ్య వారితో అరువదిమూఁడువే లయ్యెను. వా రెల్ల రతి శ్రద్ధాభయభక్తులతో గురుశుశ్రూషలు చేయుచు వేదాధ్యయనము మొదలిడిరి. సారస్వతమహర్షి శక్తిసంపదచే నెల్లర కనతికాలముననే వేదరాశి బోధిత మయ్యెను. దాని మూలమున ఋషు లెల్లరు ధర్మపరిగ్రహమును గని దానివలన వైదికవిప్రత్వమును నిలుపుకొని ధన్యులైరి.

సారస్వతమహర్షి యిట్లు సర్వలోక సంరక్షణ మొనరించి శాశ్వత కీర్తిచంద్రికలను సంపాదించెను. *



* భారతము : అనుశాసనికపర్వము.

# మహర్షుల చరిత్రలు

## ఆస్తీకమహర్షి

### వంశచరిత్ర

శ్రీమంతమగు భారతదేశమున నొకప్పుడు జరత్కారుఁ డనునొక మహర్షి యుండెను.* అతఁడు చతుర్వేదపారంగతుఁడై చతుర్ముఖుని వలెఁ జెలువొందుచుండెను. కఠోరబ్రహ్మచర్యదీక్షలోఁ గాలము గడపుచు మహోగ్రతపస్సంపన్నుఁడైన యా మహనీయుఁడు సర్వధర్మములను సమగ్రముగ నెఱింగెను. నిలచినచోట నిలువక, ఉన్నయూర నుండక, సూర్యాస్తమయవేళకుఁ జేరిన యూరనే సూర్యోదయవేళవఱకు మాత్ర ముండుచు, నాతఁడు సమస్త క్షేత్రములను సందర్శించి సకల తీర్థము లందును స్నానజపక్రియ లొనరించుచు, నాహారము వర్జించి, వాయువునే భక్షించుచు శరీరము శుష్కించుచున్నను సరకుగొనక సంచరించు చుండెను.

ఇట్లుండ సహస్ర కిరణునివలెఁ జక్కఁగాఁ బ్రకాశించుచున్న జర త్కారుమహర్షి యొకనాఁ డొక కొడమాత్రమే మిగిలియున్న వీరణ మనుపేరి తృణస్తంబమును బట్టుకొని సూక్ష్మరూపులై తలక్రిందుగఁ దపముచేయు కొందఱు ఋషులను జూచెను. మఱియు ఆ ఒంటికొడను అందలి కన్నములో దూఱియున్న యొక యెలుక కొంచెము కొంచె ముగాఁ గొఱికివేయుచుండెను. ఆ కొడ నా యెలుక పూర్తిగాఁ గొఱికి వేసినచో దానిని బట్టుకొని వ్రేలాడు ఋషులు దానిక్రిందిభాగమున నున్న

---

*జరత్కారుఁ డనఁగా తపముచే దేహమును కృశింపఁజేసినవాఁ డని యర్థము. కారు = (కామాది మహాప్రమాదములకు మూలమై పాపాదులకు హేతువైన) దేహ మును, జరయతి = (తపము, బ్రహ్మచర్యము మున్నగువానిచే) కృశింపఁజేయువాఁడు అని యర్థము.

లోతు తెలియని పెద్దగోతిలో పడి యథోలోకముల కేగవలసి యుండును. పైఁగా, వారు నిరాహారులై చిక్కి జీర్ణించి శల్యావశిష్టులై తమ్ముఁ గాచు దిక్కు గలదా యని యెదు రెదురు చూచుచుండిరి.

ఈ స్థితిలో నున్న వారిని సమీపించి జరత్కారుమహర్షి "మహనీయులారా! మీ రెవరు? మీ రీ గోతిలో నిట్టి దారుణ ప్రమాదస్థితిలో నుండఁ గారణ మేమి? ఎలుక సగము కొఱికిన యీ తృణ స్తంబముకాడ యూడిపడిన దాని నంటియున్న మీ కంద అధఃపతన మందవలసినదే కదా! ఈ గోయియా బ్రహ్మండమైనది, దానిలోతు తెలియదు. అది పాతాళమునుగూడ దాఁటిపోవున ట్లున్నది. ఈ దీనస్థితిలో నున్న మీకు నే నొనర్పఁగల సాయ మేమైన నున్నఁ జెప్పుఁడు. సాధుసజ్జనుల సంతాపమును దీర్చి సమయమునకు సాయపడని మానవుని జన్మ మేల? కాల్పనా! అతని తపమేల? జపమేల? నాతపమునందు నాలుగవభాగము కాని మూఁడవపాలుకాని లేదా సగమైనఁ గాని యవసరమైన సంపూర్ణముగఁ గాని ధారవోసి మీప్రాణములకు నాప్రాణముల నొడ్డఁగలను. ఆలసింపక న న్నాజ్ఞాపింపుఁడు'' అని కరుణాతరంగిత హృదయాంతరంగుఁడై పలికెను.

ఆ యాపత్సమయమున నమృతోపమానములుగా వినవచ్చిన యాతని పలుకులకు వా రపరిమితానంద మంది ''వత్సా! నీవు బ్రహ్మచారివివలె నున్నావు. ఐనచో మాకుఁ బ్రయోజనము లేదు. నీ తపస్సు మాకు ధారవోయ నక్కఱ లేదు. మాకు నపరిమిత తపము కలదు. ఏమున్నను సత్సంతానము లేనందున నరకోన్ముఖుల మయినాము. మేమీ దీనస్థితి నుండి తపస్విని, దయాశాలివి, మహాత్ముఁడవు నగునిన్ను గుర్తుపట్ట లేకున్నాము. మేము యాయావర వ్రతసంపన్నులము, సంతానహీనుల మగుట మేము పుణ్యలోకములనుండి జాఱిపడితిమి. ఇంకను క్రిందికిఁ బడనున్నారము. మా తపస్సు మమ్ముఁ గాపాడలేక పోయినది. అల్పభాగ్యుల మగుమాకు మందభాగ్యుఁ డగునొకఁడు మా సంతతికి తంతువుగా నున్నాఁడు. వాఁ డుండియు లేనివాఁడే యైనాఁడు. వానిపేరు జరత్కారుఁడు. వాఁడు వేదవేదాంగవేత్త.

సర్వవిజ్ఞాని, మహాతపస్వి. కాని, యాతఁ డవివాహితుఁడై యుండి మా కీ దురవస్థఁ గల్పించినాఁడు. అతఁడు పెండ్లాడి సత్సంతానవంతుఁడైనచో మా బాధలు తీఱు. మా కష్టములు గట్టెక్కు. నీ కాతఁ డొకవేళ నెచటనైనఁ దటస్థపడినచో జాలిగుండెలు కలవాఁడవు కావున నాతని మనస్సు కరఁగునట్లు మా దురవస్థ నాతనికిఁ దెలిపి శీఘ్రమే వివాహ మాడి సంతానముఁ గాంచి మాకు విముక్తి గల్గింపఁ బ్రబోధింపుము. నీవు మాకుఁ జేయఁగల మే లిదియే. మఱియు మా కులమున కా యొంటితంతువే మిగిలియున్నది. మిగిలిన వన్నియుఁ గాలుఁడను ఎలుక కొఱికియే వేసినది. ఈ యేకతంతువును గూడ సగము పైఁగాఁ గొఱికివేసియే యున్నది. ఈ యేకతంతువే కేవలతపస్వి యగుజరత్కారుఁడు. దీనిని గొఱుకు నెలుకయే మహాభయంకరుఁ డగుకాలుఁడు. మహాబలుఁ డగుకాలుఁడు జరత్కారునిఁ గృశింపఁజేయుచున్నాఁడు. ఇట్లు మూలము తెగి సద్గతినుండి జాఱిపడి మఱిమాలియున్నమ మ్మాతని తపము కాపాడలేదు. పుణ్యకర్ములమైనను మే మీయొక్కలోపముచే నధోగతికిఁ బోఁ బోవుచున్నాము. మేము పోయినపిదప వాఁడుమ కాల భక్షితుఁడై నిస్సంతు వగుట మాకంటె నధికదుర్గతి నందవలసినదే. తపో యజ్ఞాదులు కాని మఱియేమి కాని సత్సంతానమునకు సాటిగావు.

"తగియెడుపుత్త్రిలం బడసి ధర్మువు తప్పక తమ్ము నుత్తముల్
పొగడఁగ మన్ మహామతులు పొందుగతుల్ గడు ఘోరనిష్ఠతో
దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్మగ నిచ్చి యజ్ఞముల్
నెగడఁగఁ జేసియుం బడయనేర రపుత్త్రికులైనదుర్మతుల్.

భార. ఆది. ౨. ౧౫౦.

ఈ సంగతు లన్నియు నీవు తప్పక మా జరత్కారునితోఁ జెప్పుము. మఱియు నాతఁ డెట్లు చెప్పిన మామాట విని మా దుర్గతులఁ దప్పించునో యటులే యుక్తియుక్తముగఁ జెప్పఁగల సమర్థుఁడవు నీవు. చెప్పి మాకు మేలు చేయు" మని కోరుకొనిరి.

అంత జరత్కారుఁ డెంతయు దుఃఖాందోళితమనస్కుఁడై యెలుఁగు డగ్గుత్తిక వడ "మహాత్ములారా! ఆ నిర్భాగ్యుఁడను జరత్కారుఁడమ నేనే.

నే నూర్ధ్వ రేతస్కుఁడనై యుత్తమగతులనంద నస్ఖలితబ్రహ్మచర్యమును బాటించుచున్నాను. మీయీ దుస్థితిని గన్న నేను మీయీ మాటలుకాదన లేను. మీ కేది హితమో నా కది యాజ్ఞాపింపుఁ” డని నమస్కరించెను. వారందుల కానందించి “వత్సా! ఈ సమాగమము దైవికము, ఉభయ తారకము. నీవు మా మాట పాటించి కేవలధర్మపరిపాలనకు, పితృ ప్రీతికి, సత్సంతానసంపాదనకు మాత్రమే వివాహమాడుము. పుత్త్రపౌత్ర వంతులు సునాయాసముగాఁ బొందుసద్గతి నెట్టి తపశ్శాలియు పొంద లేఁడు. నీవు నిష్కామివి. నిర్లిప్తుఁడవు. నిష్ఠాగరిష్ఠుఁడవు. కాదు కూడ దనక నీవు మేము చెప్పి నట్లు చేయుట మాకుఁ బరమహితము” అని పలికిరి.

అపుడు జరత్కారుఁ డాలోచించి “పితరులారా! నేను నాకొఱకై కామినీకాంచనములఁ గాంక్షింపఁజాలను. అది నా దృఢవ్రతము. కేవ లము మీకొఱకై నేను వివాహ మాడుదును. అదియు నేను విధించిన నియమముల నంగీకరించి తనంతఁ దానే కన్యను గొనివచ్చి బిచ్చ మిచ్చిన ట్లిచ్చి యామెను నేను బోషింపవలసిన యవసరము గల్పింపక తానే పోషించువాఁ డెవఁడైన వచ్చిననే. ఇన్ని సమకూరినను, ఆ సంసా రము సంతానపర్యంతమే. అది కాఁగానే యా బంధమును బుటుక్కున త్రెంపివేయుదు” నని వారికిఁ దెలియపఱచెను. వా రట్లే యగుఁగా కని యాశీర్వదించి వీడుకొలిపిరి. అతఁడు తిరిగి భూసంచారమున కేగెను.

తొల్లి కద్రూవినత లొండొరులు ఉచ్చైశ్శ్రవముతోఁక నలు పని తెలు పని పందెములు వేసికొనిరి. చూతము రమ్మని వినత యనఁగా కద్రువ పరాజయభీతిని వంక పెట్టి మఱునాఁడు చూతమని వినత నొప్పించి యింటి కేగెను. అనంతర మామె బిడ్డలగు పాములఁ బిలిచి సంగతి చెప్పి యెట్లైన నేగి యా గుఱ్ఱము తోఁకకుఁ జుట్టుకొని యున్నచో నది నలుపుగనే కనఁబడు నని తనకు విజయము కలిగి వినత తనకు దాసి యగును కాన నట్లొనరింపుఁ డని కోరెను. అట్టి యధర్మమునకుఁ దాము పాల్పడ లేమని నాగకుమారు లనిరి. అంతఁ గోపమున జనమేజయు

సర్పయాగమున వారు చచ్చునట్లు నిజపుత్త్రులను నిర్దాక్షిణ్యముగా నామె శపించెను. కర్కోటకాదులు భయపడి తల్లిచెప్పిన చొప్పునఁ జేసిరి. అట్లు దగాచేసి కద్రువ వినతను దనకు దాసిని జేసికొనెను. వైనతేయుఁడగు గరుడుఁ డమృతముఁ దెచ్చి మాతృదాస్యవిముక్తిఁ గావించెను.

అనంతరము సర్పశ్రేష్ఠుఁ డగు ఆదిశేషుఁడు బ్రహ్మయాజ్ఞచొప్పున భూభారము వహింప నంగీకరించి సర్వజనప్రియుఁడయ్యెను. వాసుకి సముద్ర మథన సమయమునఁ దరిత్రాడై యెల్లరి మన్ననలఁ గాంచి బ్రహ్మాదుల వరములు గడించెను. ఐనను, అతనికి మాతృశాపము కారణముగా రాఁబోవు సర్పకుల వినాశము మిక్కిలి భయావహ మయ్యెను. ఒకనాఁ డాతఁడు బంధుమిత్రాదులను నిజసోదరులను బిలిచి తనయాందోళనము వ్యక్తపఱచెను. మఱియు శేషుఁడు బ్రహ్మకుఁ బ్రియుఁడై భూభారము వహించి తమ యోగక్షేమములు చూచుటయే మఱచెననియుఁ దన కట్లు కాక తా నెన్నివరము లంది యున్నను జననీ శాపమున సర్పకులప్రళయ మేతేర నున్నదన్న మాట తలఁచుకొన్నప్పుడెల్ల గుండె జల్లుమనుచున్న దనియు నందుచే నిఁక వెంటనే తాము తమ ముందుసంగతిఁ దలఁచుకొని తొందరగ జాగరూకత వహింపవలె నని హెచ్చరించెను.

నాగకుమారు లాతనిమాటలు విని మదాంధీభూతులై జనమేజయుఁడు చేయఁబోవు సర్పయాగమునకు విఘ్నములు కలిగింతమని కొందఱు, బ్రాహ్మణవేషములఁ బోయి యా యాగము ధర్మవిరుద్ధమని చెప్పి యుడుపుద మని కొందఱు, సభాసదుల భయకంపితులఁ జేసి పాఱద్రోలెద మని మఱికొందఱు నిట్లింక నెందఱో యెన్నో ప్రగల్భములను బలికి యుపాయములఁ జెప్పిరి. అందలి ప్రబుద్ధు లా యుపాయము లతిప్రమాదహేతువు లని నిరాకరించిరి. కశ్యపునిఁ బ్రసన్నునిజేసికొని యాతని యాజ్ఞచొప్పునఁ జేయుద మని వాసుకి పలికెను. ఏలాపుత్త్రుఁ డను నాగుఁడు వివేకవంతుఁ డగుట "సోదరులారా! ఏ యుపాయము చేతను మనము సర్పయాగము

నాఁవలేము. దైవోపహతుఁడగు పురుషుఁడు దైవమునే యాశ్ర యించి కష్టములఁ గడతేరవలయును. మనము దైవోపహతులమై మాతృశాపము నందితిమి. దైవము నాశ్రయించి మన మా శాప విముక్తి నందవలయును. ఇంకొక రహస్యము వినుఁడు. జననీశాప మునాఁ డామె యొడిలో నుండి నిద్ర నటించుచు నేను బ్రహ్మకును దేవతలకును జరిగిన సంభాషణము వింటిని. "కద్రూశాపమున సర్ప కులము నశించును గదా! నీ వా శాపమేల నివారింపవైతి? వని బ్రహ్మను దేవతలు ప్రశ్నించిరి. క్రూరసర్పములు కొన్ని చావవలసియున్నవి. అవి చచ్చినవెనుక, వాసుకి చెల్లెలగు జరత్కారువునందు జరత్కారుఁ డను ఋషిపుంగవుని వలనఁ గలుగఁబోవు ఆస్తీకుఁడనువాఁ డేగిసర్ప యాగ ముడిగించి మిగిలిన నాగులకు మేలు చేయఁగలవాఁ" డని విరించి వివరించెను. కావున, జరత్కారుఁ డిచ్చటికి బిచ్చమునకు వచ్చినపుడు మచ్చెకంటియగు జరత్కారువును బిచ్చముగ నిచ్చి యామెకుఁ గలుగు కుమారునివలన మన కష్టములఁ బాపుకొని శుభముల నందుట మే" లని పలికెను. ఏలాపుత్త్రి నందఱు మెచ్చుకొని యట్లు చేయ నిశ్చయించుకొనియుండిరి. ఇంకొక పర్యాయము బ్రహ్మకడ నీమాట వచ్చినపు డాతఁ డేలాపుత్త్రుఁడు పలికినది సత్యమనియు నంత కంటె వేఱే ఉపాయము లేదనియుఁ జెప్పెను. ఈ కారణమున వాసుకి జరత్కారువును జగత్కారునికే యిచ్చి పరిణయము చేసి తన్మూలమున వంశవినాశము నరికట్ట నిశ్చయించుకొని యా మహనీయుని యాగమ మున కెదురెదురు చూచుచుండెను.

ఇట్లుండ జరత్కారుఁడు భూమండల మంతయుఁ దిరిగి తిరిగి ముదుసలి బ్రహ్మచారియై పితరులకు మేలుసేయఁగోరి స్థావరజంగమ ప్రకృతికి సర్వదేవతలకు నిట్లని విన్నవించెను: "నేను నిరపేక్షుఁడను. నిర్లిప్తుఁడను. సంసారసముద్రము నీఁదింపఁదలఁచితిని గాని యందుఁ బడి మునిఁగి యధోగతి నందఁదలఁచినవాఁడనుకాను. కాని కేవల పితృ ప్రీతికై సంతానార్థము జాయం గోరియున్నాఁడను. నాపేరు గలది, నా పోషణ మక్కఱ లేనిది, నే నడుగకుండ వచ్చునది, సత్సంతా నార్హురా లగునది యెవతెయో యామెనే నా కడకుఁ బంపుదురు గాక!"

నాగు లా సంగతి యెఱిఁగి వాసుకికిఁ దెలుప నాతఁడు సాలం కృతయుఁ, జక్కనిచుక్కయు, సత్యభాషిణియు, సంతానార్థయు నగు తనసోదరిని గొని మునిసన్నిధి కేగి మ్రొక్కి "మహాత్మా! నీవు పెట్టిన నియమము అన్నింటికి నంగీకరించెదను. ఈమె నీపేరు గలది. జరత్కారువు. నీ వీమెను బోషింప నక్కఱలేదు. నీ యనుజ్ఞ నేనే పోషించెదను.

> "ధన్యంబయ్యె భవత్కులం; బతికృతార్థం బయ్యె నస్మత్కులం
> బన్యోన్యానుగుణాభిధానములఁ జిత్తానంద మొందెన్; వివే
> కన్యాయాన్విత! భూసురోత్తమ! జరత్కారూ! జగన్మాన్య! యి
> క్కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారున్ మదీయానుజన్.
>
> భార. ఆది ౨. ౧౩౪

అని వినయవిధేయుఁడై వేఁడుకొనెను.

జరత్కారుఁ డంత "నే నీమెను బోషింపను. నా కిష్టము లేని పని నీమె చేయరాదు. చేసినయెడల వెంటనే యీమెను విడిచివేసె దను. ఈమె నా యడుగులకు మడుగు లొత్తుచు నుండవలయును. లేనిచో విడిచి పెట్టెదను. ఇష్టమా?" అని యడిగెను. జరత్కారువు, వాసుకి, యిరువురును మహాప్రసాదమని యెట్లయిన మీ రంగీకరించుటే మాకుఁ బదివే" అని సమాధాన మిచ్చిరి. ఆ ముసలిబ్రహ్మచారి యంగీ కరించి విధ్యుక్తముగా నామెను వివాహము చేసికొని గృహస్థుఁ డయ్యెను.

## జననము

నాఁటినుండి యాతఁడు వాసుకి రమ్యభవనమునందు దాసదాసీ జనముల సేవలు గొనుచు, మునిజనులు వచ్చి తన్నుఁ గీర్తించి పోవు చుండ, నాగు లందఱు తమ కులదైవ మని కీర్తించుచుండ రమ్యాతి రమ్యమగు పడుకటింట నవయౌవనవతియు, నతిసుందరాంగియు, నతివిధేయయు, మహాపతివ్రతయు నగు జరత్కారువు సేవలుగొనుచు

నభినవ శృంగార పురుషుఁడై యుండెను. తన కిష్టము లేనిపని చేసి నను, తనకుఁ బ్రతికూల మగుపలుకు పలికినను, తన్నవమానించినను, తనమాట వినకున్నను తత్క్షణము నామెను విడిచిపోయెద నని జరత్కారుఁ డామెకు ముందుగనే చెప్పివేసెను. ఆమె గడగడలాడుచు నాతని యడుగులకు మడుగు లొత్తుచు నిద్రాలస్యముల నెఱుఁగక మహాపతి వ్రతయై యాతనికి సేవలొనరించుచు నాతని కటాక్షమునకుఁ బాత్రురా లయ్యెను. ఆ పుణ్యదంపతు లొకరేయి మదన మహాసామ్రాజ్యమును బాలింపఁ దొడఁగిరి. ఆ పుణ్యవేళ నగ్నితుల్య మగు నుత్తమగర్భ మామెకుఁ గలిగెను. అది దినదినప్రవర్ధమాన మగుచుండ నొకనాఁడు జరత్కారుఁ డామె యొడిలోఁ దలనిడుకొని నిద్రాముద్రితునివలె నుండి "ఇఁక నాపనియైనది. ఉభయతారకుఁ డగుసుతుఁ డీమెకుఁ గలుగఁ గలఁడు. నే నిఁక నీబంధమును బటాపంచలు చేసికొని బయటపడుట మేలు. ఉపేక్షించితినా, బంధము బలమై ప్రమాదహేతువు కాఁగల" దనుకొని యేదోవంక చూచుకొని పోవలయు ననుకొనుచుండ సూర్యాస్త మయవేళ యయ్యెను. అపుడు జరత్కారువు "అయ్యో! ఇపుడేమి చేయుదును? సూర్యాస్తమయ మగుచున్నది. పతి నిద్రించుచున్నాఁడు. లేపుదునా? కోపము వచ్చునేమో? ఊరకుందునా? ఈతఁడు సంధ్యోచిత క్రియలు నడపనిచో ధర్మభంగమగునేమో? కోపఫలమునైనను సైఁప వచ్చును గాని, ధర్మలోపము సహింపరాని దేమో? ఏమి చేయుట?" అని యాలోచించి పతిని మెల్లఁగ లేపెను. ఆతఁడు లేచి కోపము నటించి "ఓసీ! ఏల నిద్రాభంగ మొనరించితివే?" యని యడిగెను. "దేవా! సూర్యాస్తమయవేళయైనది. సంధ్యాకృత్యములు నిర్వర్తింప సమయముగదా! యని లేపితిని, క్షమింపుఁడు" అని యామె బదులు చెప్పెను. ఓసీ! నీకు నాసంగతి తెలియదా? నే లేవకముందు సూర్యుఁ డస్తమింపలేఁడు. నీవు లేపి నా కప్రియము చేసితివి. నేను నిన్ను వీడి పోక తప్పదు. దుఃఖింపకుము. నీ గర్భమున సూర్యానలసన్నిభుఁ డైన యర్భకుఁడు పెరుఁగుచున్నాఁడు. అతఁ డుభయకుల దుఃఖోద్ధ రణ సమర్థుఁడు. నీ వేభయమును లేక నీ సోదరునికడనే యుండుము. నాకై నీ వించుకయు వగపకుము. బాంధవ్యము ఋణానుబంధ సం బంధము. ఆ ఋణానుబంధము తీఱినవెనుక నెవరి కెవరునుగారు.

నీపైఁ గోపముచే నేను పోవుట లేదు. ఋణానుబంధము తీఱుటచేఁ బోవుచున్నాను. మన సంబంధ మింతతో సరి. వనితా బంధము నన్ను బంధింపఁజాలదు. నీకు శుభమగుఁగాక! నే నేగినపిదప వాసుకితోఁ జెప్పుమని జరత్కారుఁడు నారీబంధము నవలీలఁ ద్రెంచివైచి మహోగ్రతప మొనరింప నచటినుండి వెడలిపోయెను. ఆహా! నిర్లిప్తుని నిర్మోహుని నెవరు బంధింపఁగలరు?

జరత్కారుఁడు వెడలిపోయినవృత్తాంతము జరత్కారువు సోదరుఁడగువాసుకికిఁ దెలుపఁ దమకార్యసిద్ధి యగునో కాదోయని జరత్కారువు గర్భధారణ మొనరించెనో లేదో యని యాతఁడు మిక్కిలి వగచెను. "నీ గర్భమున సూర్యానల సన్నిభుఁ డైన యర్భకుఁడు పెరుఁగుచున్నాఁడు. అతఁ డుభయకుల దుఃఖోద్ధరణ సమర్థుఁ" డని యాతఁడు చెప్పి తన్నూఱడించి పోవుట జరత్కారువు చెప్పఁగా విని వాసుకి మిగుల నానందించెను.

నవ మాసములు నిండినపిదప నొక శుభముహూర్తమున జరత్కారువు తేజస్సంపన్నుఁ డగు నొక సుపుత్త్రుని గాంచెను. నాగలోకమంతయు సంతోషమున నాట్య మొనరించెను. అతఁడు తల్లి కడుపున నుండఁగనే తండ్రి 'అస్తి' అని చెప్పి యడవికిఁ బోవుటచే నాతనికి "ఆస్తీకుఁడు" అని పేరువచ్చెను. అతఁ డల్లారుముద్దుగాఁ బెరుఁగుచు నాగరాజగు వాసుకి వాత్సల్యమునకు గుఱియై యలరారుచుండెను బాల్యమునుండి యాతఁ డతిబుద్ధిమంతుఁడై యుండెను.

## బాల్యము

ఆస్తీకుఁడు వాసుకి పనుపున చ్యవనమహర్షిపుత్త్రుఁ డగు ప్రమతి కడ శిష్యుఁడై చేరి సర్వవేదవేదాంగపారంగతుఁ డయ్యెను. పరిపూర్ణ బ్రహ్మతేజస్వి, అపగతపాపుఁడు, అపాకృతభవానుబంధుఁడు, నిజ మాతాపితృ ప్రబల భయాపహుఁడు నగుఆస్తీకుఁడు కాలక్రమమునఁ జక్కగఁ బెరుఁగుచుండెను.

## సర్పయాగము

ఇట్లుండ జనమేజయచక్రవర్తి తనతండ్రి యగుపరీక్షిత్తు తక్షక విషాగ్ని దగ్ధుఁ డగుటఁ దెలిసికొని మంత్రిపురోహితుల నందఱిని బిలువ నంపి తక్షకునిపైఁ బగదీర్చుకొను నుపాయ మెఱిఁగింపుఁడని కోరెను. వారు "మహారాజా! నీవు

పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్;
మంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్;
నించితి సజ్జనస్తుతుల నిర్మల మైనయశంబు దిక్కులన్;
సంచితపుణ్య! సర్వగుణసంపద నెవ్వరు నీ సమానులే?

కాదన కిట్టిపాటియపకారముఁ దక్షకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ! నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మముసేయుము తక్షకాది కా
కోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్రశిఖాచయంబులన్.

భార. ఆది. ౨, ౨౦౩, ౨౦౪.

అని హెచ్చరించిరి. జనమేజయుఁడు వెంటనే సర్పయాగముచేయ సమకట్టి పురోహితులను ఋత్విజులను బిలువనంపి సర్పయాగ విధానముఁ దెలుపుఁ డని కోరెను. వా రట్టియాగము పూర్వ మెవ్వరుఁ జేసియుండలే దని దేవతలే నీకై యిది కల్పించి రని విన్నవించిరి.

అపుడు జనమేజయుఁడు సర్పయాగము చేయ సమకట్టి కాశిరాజు కూతుఁ రగువపుష్ట యను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగ దీక్షితుఁ డయి శాస్త్రోక్తముగ శిల్పాచార్యులచే నిర్మితమైనదియు, అనేక యజ్ఞోపకరణాదులతో నిండినదియు, ధనధాన్యాదులతో సంపూర్ణమై నదియు, తనుతమ విధులను నిర్వర్తించుటకు విచ్చేసిన పెక్కురు విప్రులతోఁ గూడినదియు, నగుయజ్ఞగృహమున నున్న జనమేజయున కొక వాస్తువిద్యానిపుణుఁ డైనపౌరాణికుఁ "డయ్యా! ఈ యజ్ఞము మధ్యలో నొక బ్రాహ్మణుని మూలమున నాఁగిపోవునే కాని సాంతము కా"

దని చెప్పెను. రా జాతని మాటలు పెడచెవిని బెట్టెను. చ్యవన కుల విఖ్యాతుఁ డగుచండ భార్గవుఁడు హోతగా, పింగళుఁ డధ్వర్యుఁడుగా, శార్ఙ్గరవుఁడు బ్రహ్మగా, కౌత్సుఁ డుద్గాతగా, వ్యాస వైశంపాయన పైల జైమిని సుమంతు శుక శ్వేతకేతు లాదిగాఁగల మహామునులు సదస్యులుగా నీలాంబరపరిధానులు ధూమ్ర రక్త నయనములునై యాజ్ఞికు లగ్ని ముఖముచేసి వేల్వఁదొడఁగిన బ్రాహ్మణమంత్ర హోమ స్ఫురణమ వివశులై నాగరాజు లొండొరులఁ బిలుచుచు భయభ్రాంతులై వచ్చి యగ్నికుండమునఁ బడి చచ్చుచుండిరి. ఒక్కొక్కసారి సహస్రాయుత సంఖ్యలుగా నిట్లు చచ్చుసర్పములం జూచి తక్షకుఁడు వడవడ వడఁకి పోయి" రక్షింపుము, రక్షింపుము, రక్షింపు మను కేకలతో నేగి యింద్రుని శరణుచొచ్చెను. ఇంద్రుఁ డాతని కభయమిచ్చి యాతనిని దనకడనే యుంచుకొనెను.

## ఆస్తీకుఁడు సర్పయాగ ముడిగించుట

ఇట్లుండ సర్పరా జగువాసుకి జనమేజయుఁడు సర్పయాగ మారంభించుటయు, పెక్కు సర్పము లప్పటి కప్పుడే యగ్నికుండ మునఁ బడి చచ్చుట కడలి సోదరి యగుజరత్కారువును జేరి సంగతి చెప్పి ఆస్తీకుని సర్పయాగ నివృత్తికిఁ బురికొల్పు మని కోరెను. ఆమె కుమారుని మొగము చూచి మేనమామలఁ గాపాడుమని యాదేశించెను. ఆస్తీకుఁ డట్లే యని వాసుకి కభయ మిచ్చి సకల వేద వేదాంగవిదు లగు విప్రవరులతోఁ జని జనమేజయు సర్పయాగ గృహమున కేతెంచెను. ఆతనిదేహకాంతి సభాంతరమెల్ల వెలుంగుచుండెను. అపుడు సరసోక్తి నిపుణుఁ డగుఆస్తీకుఁడు —

"రజనీనాథకులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితం బాలించుచున్ దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రాముఁన్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత ! పారీక్షితా !

కువలయంబున వారికోరినకోర్కికిం దగ నీవు పొం
దవకులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవనిరాజ్యభరంబుఁ దాల్చినయంతనుండి మఖంబులన్
దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్.

అమ్మనుజేంద్రుఁ డైనసలుయజ్ఞము ధర్మజురాజసూయ య
జ్ఞమ్ముఁ బ్రయాగఁ జేసినప్రజాపతియజ్ఞముఁ బాశపాటి య
జ్ఞమ్మును గృష్ణుయజ్ఞము నిశాకరుయజ్ఞము నీ మనోజ్ఞ య
జ్ఞమ్మును నొక్కరూప విలసన్మహిమన్ గురువంశవర్ధనా!

వితతమఖప్రయోగవిధివిత్తము లుత్తమధీయుతుల్ జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్.

విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా!

ఆర్తిహరక్రియాభిరతుఁడై కృతసన్నిధియై ప్రదక్షిణా
వర్తశిఖాగ్రహస్తముల వహ్ని మహాద్విజదివ్యమంత్ర ని
ర్వర్తితహవ్యముల్ గొనుచు వారిజవైరికులేశ! నీకు సం
పూర్ణమనోరథంబులును బుణ్యఫలంబులు నిచ్చుచుండెడున్."

భార. ఆది. ౨. ౨౨౪-౨౨౮

జనమేజయుని, నాతనియజ్ఞమహిమను, ఋత్విజులను, సదస్యులను, అగ్నిభట్టారకుని, అనురూపశుభవచనముల స్తుతించిన నందఱును బరమానందమందిరి. జనమేజయుఁ డందఱియనుమతమున నాతనికి వర మొసఁగఁ దలఁచెను. ఇంతలో హోత "తక్షకుఁ డింకను వచ్చి యగ్నికుండమునఁ బడలేదే?" అనఁగా ఋత్విజులు "రాజా! తక్షకున కింద్రుఁ

దభయమిచ్చి దగ్గఱ నుంచుకొన్నాఁడు" అని మంత్రదేవతలు అగ్నిహోత్రుఁడు తెలుపుచున్నా" రనిరి. జనమేజయుఁడు "త్వరలో నాతనిని రప్పింపుఁడు. ఇంద్రుఁ డాతని కడ్డువచ్చెనేని ఇంద్రునితో వచ్చి తక్షకుఁ డగ్నిఁ బడి చచ్చుఁగా కని వేల్వుఁడు" అని తొందర చేసెను. హోత వెంటనే "సహేంద్ర తక్షకాయస్వాహా!" అని హోమము చేసెను. అప్పు డింద్రుఁడు తక్షకుని వెంటఁబెట్టుకొని వచ్చుచు నాకసమునుండి యజ్ఞమునుజూచి గడగడలాడి తక్షకుని విడిచివేసి పాఱిపోయెను. ఇంద్రపరిత్యక్తుఁ డగుతక్షకుఁడు బెగడుగుడుచుచు చేష్టలు దక్కి మేఘమండలమునఁ దిరుగుచుండెను.

ఆ సమయమున జనమేజయుఁ డేమివరము కావలెనో కోరుమిచ్చెద నన నాతఁడు —

> "మానితసత్యవాక్య! అభిమన్యుకులోద్వహ! శాంతమన్యుసం
> తానుఁడవై దయాభినిరతస్థితి నీవు మదీయబంధుసం
> తానమనోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో
> ర్వీనుత! సర్పయాగ ముడివింపుము కావుము సర్పసంతతిన్."
>
> భార. ఆది. ౨, ౨౩౧

అని ప్రార్థించెను. జనమేజయుఁ డాకోరిక విడిచి మఱియొక టేది కోరినను నిత్తు నని యెంత చెప్పినను వినక ఆస్తీకుఁడు మరల మరల నదియే కోరెను. సభాసదు లెల్లరు నాతనికోర్కి దీర్చుటే మంచి దని యేకకంఠులై పలికిరి.

## ఆస్తీకుని మహాత్త్వము

అందఱియభిమతము ననుసరించి జనమేజయుఁడు సర్పయాగము నాపివేసెను. కొంచె మించుమించుగా నగ్నికుండమునఁబడి చావవలసిన తక్షకు నీ విధముగా ఆస్తీకుఁడు రక్షించెను. జననీ శాపపీడితు లగు సర్పేంద్రులనుఁ గాపాడిన ఆస్తీకమహర్షి నెల్లరు నేకకంఠమునఁ గీర్తిం

చిరి. జరత్కార జరత్కారు తనయుఁ డగు ఆస్తీకమహర్షి చరిత్ర విన్నవారికి సకలపాపక్షయ మగును. అతనిఁ దలఁచినవారి కెవ్వాడు నెట్టి సర్పభయము కలుగదు.

ఇట్లు లోకోత్తర చరిత్రుఁ డైనయాస్తీకుఁడు నాగజాతిని గాపాడి మహాతపస్వియై గృహస్థాశ్రమమును స్వీకరించి యుత్తమ పుత్రపౌత్ర వంతుఁ డయ్యెను. జరత్కారుని పితృదేవతలును పుత్రపౌత్రవంతు లయి సంతానతంతువు బలీయ మగుట దుర్గతిఁ బాసి యుత్తమగతు లందిరి. ఆస్తీకుఁడు తపోజీవనమున ధన్యాత్ముఁడై యుత్తమ తపస్వు లలో మేటియయ్యెను.*



* భారతము : ఆదిపర్వము. ఆస్తీకపర్వము.

# మహర్షుల చరిత్రలు

## ఉతథ్య మహర్షి

### వంశచరిత్ర

విష్ణుమూర్తినాభికమలమునుండి పుట్టి సర్వసృష్టివిధాయకుఁడై బ్రహ్మదేవుఁడు సృష్టికార్యమునఁ దనకు సహాయులుగా నుందు ర పెక్కురు మానసపుత్త్రులను బుట్టించెను. బ్రహ్మముఖమునుండి యాత యిచ్ఛామాత్రమునఁ బుట్టి యగ్నికల్పుఁడైన యంగిరసుఁడు బ్రహ్ మానసపుత్రులలో మూఁడవవాఁడు. అంగిరసుఁడు కర్దమప్రజాపతి కూఁ లలో నొకతె యగుశ్రద్ధ యనునామెను బెండ్లాడి యామెవలన ను త్త్ర పుత్త్రిసంపద నందెను. ఉతథ్యుఁడు శ్రద్ధాంగిరసుల తొలిపుత్రుఁడు బృహస్పతి రెండవవాఁడు. సంవర్తుఁడు మూఁడవవాఁడు. ఇంక శ్రద్ధాంగిరులకు బహుసంతానమున్నట్లు కొన్నిపురాణములఁ గలద భాగవతపురాణమున వారికి బృహత్కీర్తి, బృహజ్జ్యోతి మున్నగుపుత్త్రి రాక, సినీవాలి మున్నగు పుత్రికలు కలరని కలదు.

వీరిలోఁ బెద్దవాఁ డగునుతథ్యుఁడు బాల్యము కడచినపిదప బ్రహ్ చర్యాశ్రమమున సర్వవేదశాస్త్రపారంగతుఁడై తపోధ్యాన తీర్థయాత్ర చణుఁడై యుండెను. విద్య పరిపూర్తియై యుక్తవయస్సు వచ్చి పిదప నాతఁడు మమత యనుకన్యను బెట్టవట్టి గృహస్థాశ్రమమున స్వీకరించెను.

అంగిరసుని పుత్రులలో నుతథ్యుఁడు మహాసాత్త్వికసంపన్నుఁడు తపశ్శాలి, తీర్థయాత్రాపరుఁడు నయ్యెను. బృహస్పతి బాల్యమున బ్రహ్మసనుపున సప్తమహర్షులచే సర్వశాస్త్రజ్ఞానమును సంపాదించి దే తలకు గురువై బహుప్రజ్ఞాశాలి యయ్యెను. మూఁడవవాఁ డగు సం ర్తుఁడు బ్రహ్మచారి, మహావిరాగి, యోగీశ్వరుఁడునై నిరహంకారి, నిర్ది ష్టుఁడు, నిష్ఠాగరిష్ఠుఁడు నన నెగడొందెను.

మమత పతిపరిచర్యాదీక్ష కలిగి యాతనిని భగవంతునిగా నారాధించుచుండెను. ఆమె పరిచర్యల కలరి ఉతథ్యుఁ డామెకు స్త్రీ సహజమగుసంతానకాంక్ష కల దని తెలుపఁగా నామె నానందపఱచి గర్భసంపద నొసఁగెను. ఆమె పతిప్రేమ కలరి తనకోరిక తీరినయానందమున నితోధిక పతిశుశ్రూషా పరాయణయై యుండెను. పిదప నుతథ్యుఁడు తీర్థయాత్రలకై మరల నిలువెడలి పోయెను.

## ఉతథ్యుని ప్రేరణ

తొల్లి దేవతలు బలవంతులై రాక్షసుల నోడించుచు వారి నష్టకష్టములపాలు చేయుచు నధికారమును జేఁబూని యుండిరి. రాక్షసులు తమగురు వగుశుక్రాచార్యునకు మ్రొక్కి తమకడగండ్లను దీర్పు మని ప్రార్థించిరి. శిష్యవత్సలుఁ డగుశుక్రాచార్యుఁడు రాక్షసులకు విజయము సంపాదించు వీర్యవంతము లగుశస్త్రాస్త్రములను శివు నర్చించి కొనివత్తు నని వనమున కేగి శివునిగుఱించి ఘోరతపమొనరించి కొంతకాలమునకు సంకల్పసిద్ధి గాంచి యింద్రుని కూఁతు రగుజయంతి మోహమునఁ దగిలి యామెతో నిష్టోపభోగము లనుభవించుచు నింటికి రా నాలసించెను. ఈ సమయమును బురస్కరించుకొని బృహస్పతి శుక్రాచార్యరూపమును ధరించి రాక్షసుల మోసగించి వారి నందఱను అర్హతమతస్థుల నొనరించి భ్రష్టుల నొనరించెను. ఈలోగా శుక్రాచార్యుఁడు తిరిగి రాఁగా మాయాశుక్రుని రూపమున నున్న బృహస్పతి తనకు వశులైయున్న రాక్షసులచే నాతనిం బాఱద్రోలించెను. ఈ యవమానమును భరింపఁజాలక శుక్రాచార్యుఁడు దీని కంతకును గారణమగు బృహస్పతిని భ్రాతృపత్నీ సమాగమ పాపమునకుఁ బాల్పడు మని ఘోరశాప మొసంగెను. తరువాతఁ గొంతకాలమునకు బృహస్పతి శుక్రరూపమును విడిచి స్వర్గమునకుఁ బోయిన వెనుక రాక్షసులు తాముపడ్డ మోసమునకు వగచి తమగురువగు శుక్రాచార్యుని క్షమాభిక్షము గోరుకొనిరి.

ఇట్లు శుక్రాచార్యశాపము నందిన బృహస్పతి యున్నతటి నొకనాఁ డాతఁడు సోదరుఁ డగు నుతథ్యునిఁ జూడ నాతని యాశ్రమమున కేగెను.

ఆ సమయమున నుతథ్యుఁడు తీర్థయాత్ర కేగి యుండుటచే ఉతథ్యుని భార్యయగు మమత యాతని నాదరించి యర్ఘ్యపాద్యాదు లొసంగెను. సహజ సౌందర్యసౌభాగ్యవతి యగు నామెను గాంచఁగనే బృహస్పతి రాగ నిర్మగ్నుఁ డయ్యెను. ఆతని ధోరణి చూచి పతివ్రతాతిలక మగుమమత భయభ్రాంతయై తాను గర్భవతి ననియుఁ దా నాతనికిఁ దల్లితో సమానురా లనియు సర్వదేవతా సార్వభౌముని కులగురు వగుబృహస్పతియే యిట్టి వికృతస్వభావము చూపుట ప్రమాదభూయిష్ఠ మనియు నాతనికి బోధించెను. శాపోపహతుఁడు పాపనిర్మగ్నుఁడు నగునాతని కామాటలు రుచించవయ్యెను. ఒంటరిక త్తెయు, నుజ్జ్వలాంగియు నగుమమత నాతఁడు కామమోహితుఁడై కరములఁ బట్టి కామకేళినిదేల్ప మనియు దేవరన్యాయమున నట్టివని తప్పవని కాదనియు బతిమాలఁదొడఁగెను. ఆ యువతి యాతని బిగికౌఁగిలి తప్పించుకొనలేక చాల కటకటంబడెను. ఆతఁడు వెంటనే యామెను శయ్యకుఁ జేర్చి బలవంతముగ రమించి వీర్యమును విడిచెను. మమతాగర్భస్థుఁ డగు బాలుఁడు దానిని గెంటివేయ నది నేలపైఁ బడి వెంటనే బాలుఁడయ్యెను. మమత గర్భము నుండియే యా బాలుఁడు బృహస్పతి భార్య నొరుఁడు రమించి పుత్త్రిని గను ననియు బృహస్పతి యుపమానపరిఖిన్నుఁ డగుఁగాక యనియు శపించెను. ఆ బాలుఁ డంధుఁ డగుఁగాక యని బృహస్పతి శపించెను. ఇంతలో సద్యోజనితుఁ డగు బాలుని విడిచిపోఁబోవు బృహస్పతి నాఁపి నీవే యా యధర్మ సంతానమును గొనిపోయి పెంపు మని మమత పలికెను. నీవే పెంచు మని బృహస్పతి పలికి వేవేగ వెడలిపోయెను. అట్లు ఉభయులచేతను విడువఁబడిన బాలుని భరతచక్రవర్తి తీసికొని పోయి పెంచుకొనెను. ఆ బాలుఁడే భరద్వాజుఁడు.

ఉతథ్యమహర్షి యాత్ర ముగించుకొని యింటికి వచ్చిన వెంటనే మమత జరిగినసంగతి యంతయుఁ బూసగ్రుచ్చినట్లు తెలిపి యందుఁ దనతప్పేమైన నున్న దండింపు మని ప్రార్థించెను. ఉతథ్యుఁడు దివ్యదృష్టిని జూచి యామె పాతివ్రత్యమును, బృహస్పతి శాపవృత్తాంతమును సర్వమును దెలిసికొని "సాధ్వీ! నీ దోష మించుకంతయును లేదు. బృహస్పతియు నంత బుద్ధిహీనుఁడు కాఁడు. ఆతఁడు శుక్రశాపోప

హతుఁడు, దైవోపహతుఁడై యీ పని యొనరించెను. కర్మప్రవాహగతి యెఱిఁగినవానికి శాపకోపతాపాదులతోఁ బని యుండదు. ఇం దెవరిని నిందింప వలసినపనిలేదు. జరిగినది జరిగినది. గర్భస్థుఁ డగుబాలుఁడే బృహస్పతికి శాపవ్యాజమున బుద్ధి చెప్పనే చెప్పినాఁడు. శాప తిమిర విముక్తుఁడైన బృహస్పతియు నింక నట్టిపని చేయుమన్నఁ జేయఁడు. జ్ఞానసంపన్నుల మగు మాయట్టివారికి సైరణ తప్ప నన్యము శరణ్యము కాదు. నీవు దినకరోపముఁ డగునుత్తమ పుత్రుని గని సాధ్వీరత్న మవుగా వెలుఁగొందుదువు, సంశయము లే" దని యామె నూఱడించెను.

జ్ఞానమూర్తియు మహాతపస్వియు నగుపతిదేవుని పరమశాంత మున కలరి యా సాధ్వి కాలము పుచ్చుచుండెను. పిదప నామె దినకర సదృశుని వంశోద్ధారకుని మహాతపశ్శాలిని దీర్ఘతముఁ డను కుమారునిఁ గని కడుపుచల్లనితల్లియై ప్రాలెను.

## ఉతథ్యునకు మాంధాత శిష్యుఁడగుట

తదనంతరము ఉతథ్యుఁడు తీర్థయాత్రలను జాలించి యాశ్రమ మునందే యుండుచు సాధ్వీరత్నమగు మమత సకలపరిచర్యలు చేయు చుండ తపఃప్రవచనదీక్షాసక్తుఁడై సర్వధర్మప్రబోధకుఁడై శాంతిసౌఖ్యము ననుభవించుచు నుండెను. ఆతనికడకు మునులే కాక పెక్కురు రాజర్షులు సైతము వచ్చి శిష్యులై యాతని సేవామూలమున సర్వధర్మముల నెఱిఁగి సంతృప్తులై వెడలుచుండిరి. షట్చక్రవర్తులలో నొకఁడై శాశ్వత యశస్సు నార్జించిన మాంధాత యనుచక్రవర్తి రాజర్షి ఉతథ్యునికడ కేతెంచి యా మహనీయునికి శిష్యుఁడై యాతనివలన సమస్తరాజధర్మ ములను కూలంకషముగ నెఱిఁగెను. ఈ గురుశిష్యుల రాజనీతిబోధనమే "ఉతథ్యగీత" యను పేర మిక్కిలి ప్రఖ్యాతి గాంచెను.

## ఉతథ్యగీత

ఉతథ్యమహర్షి మాంధాతృచక్రవర్తికిఁ దెలిపిన రాజధర్మ ప్రకార మిది:

## మూలము

"ధర్మాయ రాజా భవతి న కామకరణాయ తు,
మాంధాత రితి జానీహి రాజా లోకస్యరక్షితా. ౧

రాజాచరతిచేద్ధర్మం దేవత్వాయైవ కల్పతే,
న చే దధర్మం చరతి నరకాయైవ గచ్ఛతి. ౨

ధర్మే తిష్ఠంతి భూతాని ధర్మో రాజని తిష్ఠతి,
తం రాజా సాధు య శ్శాస్తి స రాజా పృథివీపతిః. ౩

రాజా పరమధర్మాత్మా లక్ష్మీవాన్ ధర్మ ఉచ్యతే,
దేవాశ్చ గేహా ద్గచ్ఛంతి ధర్మో నాస్తీతి చోచ్యతే. ౪

స్వధర్మే వర్తమానానా మర్థసిద్ధిః ప్రదృశ్యతే,
త దేవ మంగళం లోక స్సర్వస్సమనువర్తతే. ౫

ఉచ్ఛిద్యతే ధర్మవృత్త మధర్మో వర్తతే మహాన్,
భయమాహు ర్దివారాత్రం యదా పాపో నవార్యతే. ౬

మమేద మితి నైవైతత్సాధూనాం తాత ధర్మతః,
నవై వ్యవస్థా భవతి యదా పాపో నవార్యతే. ౭

నైవ భార్యా న పశవో న క్షేత్రం న నివేశనమ్,
సందృశ్యేత మనుష్యాణాం యదా పాపబలం భవేత్. ౮

దేవాః పూజాం న జానంతి న స్వధా పితర స్తదా,
న పూజ్యంతే హ్యతిథయో యదా పాపో న వార్యతే. ౯

న వేదా నధిగచ్ఛంతి వ్రతవంతో ద్విజాతయః,
న యజ్ఞాం స్తన్వతే విప్రా యదా పాపో న వార్యతే. ౧౦

వృద్ధానా మివ సత్త్వానాం మనోభవతి విహ్వలమ్,
మనుష్యాణాం మహారాజ యదా పాపో న వార్యతే. ౧౧

ఉభౌలోకా వభిప్రేక్ష్య రాజాన మృషయ స్స్వయమ్,
అసృజన్ సుమహద్భూత మయం ధర్మో భవిష్యతి. ౧౨

యస్మిన్ ధర్మో విరాజేత తం రాజానం ప్రచక్షతే,
యస్మిన్ విలీయతే ధర్మ స్తం దేవా వృషలం విదుః. ౧౩

వృషోహి భగవాన్ ధర్మో య స్తస్యకురుతేహ్యలమ్,
వృషలం తం విదుర్దేవా స్తస్మాద్ధర్మం వివర్ధయేత్. ౧౪

ధర్మే వర్ధతి వర్ధంతే సర్వభూతాని సర్వదా,
తస్మిన్ హ్రసతి హ్రీయంతే తస్మాద్ధర్మం న లోపయేత్. ౧౫

ధనాత్స్రవతి ధర్మోహి ధారణాద్వేతి నిశ్చయః,
అకార్యాణాం మనుష్యేంద్ర స సీమాంతకరస్స్మృతః. ౧౬

ప్రభవార్థం హి భూతానాం ధర్మస్సృష్ట స్స్వయంభువా,
తస్మాత్ప్రవ ర్తయే ద్ధర్మం ప్రజానుగ్రహకారణాత్. ౧౭

తస్మాద్ధి రాజశార్దూల ధర్మః శ్రేష్ఠతరస్స్మృతః,
స రాజా యః ప్రజా శ్శా స్తి సాధుకృ త్పురుషర్ష భః. ౧౮

కామక్రోధా వనాదృత్య ధర్మ మేవానుపాలయ,
ధర్మశ్శ్రేయస్కరతమో రాజ్ఞాం భరతస త్తమ. ౧౯

ధర్మస్య బ్రాహ్మణో యోని స్తస్మాత్తాన్ పూజయేత్సదా,
బ్రాహ్మణానాం చ మాంధాతః కుర్యాత్కామా నమత్సరీ. ౨౦

తేషాం హ్యకామకరణా ద్రాజ్ఞః సంజాయతే భయమ్,
మిత్రాణి న చ వర్ధంతే తథా మిత్రీభవం త్యపి. ౨౧

బ్రాహ్మణానాం సదాసూయా ద్బాల్యాద్వై రోచనో బలీ,
అథాస్మా చ్ఛ్రీ రపాక్రామ ద్యాస్మిన్నాసీత్ప్రతాపినీ. ౨౨

తత స్తస్మా దపాక్రమ్య సాగచ్ఛత్పాకశాసనమ్,
అథ సోఽన్వతప త్పశ్చా చ్ఛ్రియం దృష్ట్వా పురందరే. ౨౩

ఏతత్ఫల మసూయాయా అభిమానస్య వా విభో,
తస్మాద్బుధ్యస్వ మాంధాత ర్మాత్వాం జహ్యాత్ప్రతాపినీ. ౨౪

దర్పో నామ శ్రియః పుత్రో జజ్ఞే ధర్మాదితి శ్రుతిః,
తేన దేవాసురా రాజన్ నీతా స్సుబహవో వ్యయమ్. ౨౫

రాజర్షయ శ్చ బహవః తథా బుధ్యస్వ పార్థివ,
రాజా భవతి తం జిత్వా దాస స్తేన పరాజితః. ౨౬

సయథా దర్పసహిత మధర్మం నానుసేవసే,
తథా వ ర్తస్వ మాంధాత శ్చిరం చేత్ స్థాతు మిచ్ఛసి. ౨౭

మ త్తా త్ప్రమత్తా త్పోగండా దున్మత్తాచ్చ విశేషతః,
తదభ్యాసో దుపావ ర్త సహితానాం చ సేవనాత్. ౨౮

నిగృహీతా దమాత్యాచ్చ స్త్రీభ్య శ్చైవ విశేషతః,
పర్వతా ద్విషమా ద్దుర్గా ద్ధస్తినోఽశ్వాత్సరీసృపాత్. ౨౯

ఏతేభ్యో నిత్యయు క్తస్స్యా న్న క్తం చర్యాం చ వర్జయేత్,
అత్యాగం చాభిమానం చ దంభం క్రోధం చ వర్జయేత్. ౩౦

అవిజ్ఞాతాసు చ స్త్రీషు క్లీబాసు స్వైరిణీషు చ,
పరభార్యాసు కన్యాసు నాచరే న్మైథునం నృప. ౩౧

కులేషు పాప రక్షాంసి జాయంతే వర్ణసంకరాత్,
అపుమాంసోఽంగ హీనాశ్చ స్థూలజిహ్వా విచేతసః. ౩౨

ఏతే చాన్యే చ జాయంతే యదా రాజా ప్రమాద్యతి,
తస్మా ద్రాజ్ఞా విశేషేణ వ ర్తితవ్యం ప్రజాహి తే. ౩౩

క్షత్రియస్య ప్రమ త్తస్య దోషస్సంజాయతే మహాన్,
అధర్మాస్సంప్రవర్ధంతే ప్రజాసంకరకారకాః. ౩౪

అశీతే విద్యతే శీతం శీతే శీతం న విద్యతే,
అవృష్టి రతివృష్టిశ్చ వ్యాధిశ్చాప్యావిశేత్ప్రజాః. ౩౫

నక్షత్రాణ్యుపతిష్ఠంతి గ్రహా ఘోరా స్తథాగతే,
ఉత్పాతాశ్చాత్ర దృశ్యంతే బహవో రాజనాశనాః. ౩౬

అరక్షితాత్మా యో రాజా ప్రజాశ్చాపి న రక్షతి,
ప్రజాశ్చ తస్య క్షీయంతే తతస్సోనువినశ్యతి. ౩౭

ద్వావాదదాతే హ్యేకస్య ద్వయోస్సుబహవో పరే,
కుమార్య స్సంప్రలుప్యంతే తదాహు ర్నృపదూషణమ్. ౩౮

మమేద మితి నై కస్య మనుష్యేష్వవతిష్ఠతి,
త్య క్త్వా ధర్మం యదా రాజా ప్రమాద మనుతిష్ఠతి. ౩౯

కాలవర్షీ చ పర్జన్యో ధర్మచారీ చ పార్థివ,
సంప ద్యదై షా భవతి సా బిభ ర్తి సుఖం ప్రజాః. ౪౦

యో న జానాతి నిర్హ ర్తుం వస్త్రాణాం రజకో మలమ్,
ర క్తానాం వా శోధయితుం యథానా స్తి తథైవ సః. ౪౧

ఏవమేత ద్ద్విజేంద్రాణాం క్షత్రియాణాం విశాం తథా,
శూద్ర శ్చతుర్థో వర్ణానాం నానాక ర్తస్వవస్థితః. ౪౨

కర్మ శూద్రే కృషి ర్వై శ్యే దండనీతిశ్చ రాజని,
బ్రహ్మచర్యం తపోమంత్రాః సత్యం చాపి ద్విజాతిషు. ౪౩

తేషాం యః క్ష త్త్రియో వేద వస్త్రాణామివ శోధనమ్,
శీలదోషాన్ వినిర్హ ర్తుం స పితా స ప్రజాపతిః. ౪౪

కృతం త్రేతాం ద్వాపరం చ కలిశ్చ భరతర్షభ,
రాజవృత్తాని సర్వాణి రాజై వ యుగ ముచ్యతే. ౪౫

చాతుర్వర్ణ్యం తథా వేదా శ్చాతురాశ్రమ్యమేవ చ,
సర్వం ప్రముహ్యతే హ్యేతద్యదా రాజా ప్రమాద్యతి. ౪౬

రాజై వ క ర్తా భూతానాం రాజై వ చ వినాశకః,
ధర్మాత్మా య స్సకర్తాస్యా దధర్మాత్మా వినాశకః. ౪౭

రాజ్ఞో భార్యాశ్చ పుత్రాశ్చ బాంధవా స్సుహృద స్తథా,
సమేత్య సర్వే శోచంతి యదా రాజాప్రమాద్యతి. ౪౮

హ స్తినోఽశ్వాశ్చ గావశ్చా ప్యుష్ట్రాశ్వతరగర్దభాః,
అధర్మభూతే నృపతౌ సర్వే సీదంతి జంతవః. ౪౯

దుర్బలార్థం బలం సృష్టం ధాత్రా మాంధాత రుచ్యతే,
అబలం తు మహద్భూతం యస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్. ౫౦

యచ్చ భూతం సంభజతే యే చ భూతా స్తదన్వయాః,
అధర్మస్థే హి నృపతౌ సర్వే శోచంతి పార్థివ. ౫౧

దుర్బలస్య చ య చ్చక్షుః మునే రాశీవిషస్య చ,
అవిషహ్యతమం మన్యే మాస్మ దుర్బలమాసదః. ౫౨

దుర్బలాం స్తాత బుధ్యేథా నిత్యమేవావిమానితాన్,
మా త్వాం దుర్బల చక్షూంషి ప్రదహేయు స్సబాంధవమ్. ౫౩

నహి దుర్బల దగ్ధస్య కులే కించి త్ప్రరోహతి,
ఆమూలం నిర్దహత్యేవ యాస్మ దుర్బల మాసదః. ౫౪

అబలం వై బలా చ్ఛ్రేయో యచ్చాతి బలవ ద్బలమ్,
బల స్యాబలదగ్ధస్య న కించి దవశిష్యతే. ౫౫

విమానితో హతః క్రుష్ట స్త్రాతారం చే న్నవిందతి,
అమానుషకృత స్తత్ర దండో హంతి నరాధిపమ్. ౫౬

మాస్మ తాత బలే స్థిత్వా భుంజీథా దుర్బలం జనమ్,
మా త్వాం దుర్బలచక్షూంషి దహంత్వగ్ని రివాశయమ్. ౫౭

యాని మిథ్యాభిశస్తానాం పతంత్యశ్రూణి రోదతామ్,
తాని పుత్రాన్ పశూన్ ఘ్నంతి తేషాం మిథ్యాభిశంసనాత్. ౫౮

యది నాత్మని పుత్రేషు న చేత్పౌత్రేషు నప్తృషు,
నహి పాపం కృతం కర్మ సద్యఃఫలతి గౌ రివ. ౫౯

యత్రాబలో వధ్యమాన స్త్రాతారం నాధిగచ్ఛతి,
మహాన్ దైవకృత స్తత్ర దండః పతతి దారుణః. ౬౦

యుక్తా యదా జనపదా భిక్షంతే బ్రాహ్మణా ఇవ,
అభీక్ష్ణం భిక్షురూపేణ రాజానం ఘ్నంతి తాదృశాః. ౬౧

రాజ్ఞో యదా జనపదే బహవో రాజపూరుషాః,
అనయేనోపవర్తంతే తద్రాజ్ఞః కిల్బిషం మహత్. ౬౨

యదా యుక్త్యా నయేదర్థాన్ కామాదర్థవశే నవా,
కృపణం యాచమానానాం తద్రాజ్ఞో వైశసం మహత్. ౬౩

మహాన్ వృక్షో జాయతే వర్ధతే చ
తం చైవ భూతాని సమాశ్రయంతి,

యదా వృక్షః ఛిద్యతే దహ్యతే చ
తదాశ్రయా అనికేతా భవంతి. ౬౪

యదా రాష్ట్రే ధర్మ మగ్ర్యం చరంతి
సంస్కారం వా రాజగుణం బ్రువాణాః,
తైరేవాధర్మశ్చరితో ధర్మమోహా
త్తూర్ణం జహ్యాత్సుకృతం దుష్కృతం వా. ౬౫

యత్ర పాపా జ్ఞాయమానాశ్చరంతి
సతాం కలి ర్విందతే తత్ర రాజ్ఞః,
యదా రాజా శాస్తి నరా నశిష్టాం
స్తదా రాజ్యం వర్ధతే భూమిపస్య. ౬౬

యశ్చామాత్యా న్మానయిత్వా యథార్హం
మంత్రేచ యుద్ధే చ నృపో వియుంజ్యాత్,
వివర్ధతే తస్యరాష్ట్రం నృపస్య
భుంక్తే మహీం చాప్యఖిలాం చిరాయ. ౬౭

యచ్చాపి సుకృతం కర్మ వాచం చైవ సుభాషితామ్,
సమీక్ష్య పూజయన్ రాజా ధర్మమాప్నో త్యనుత్తమమ్. ౬౮

సంవిభజ్య యథా భుంక్తే నామాత్యా నవమన్యతే,
నిహంతి బలినం దృప్తం స రాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౬౯

యదా సారణికాన్ రాజా పుత్రవత్పరిరక్షతి,
భినత్తి చ న మర్యాదాం స రాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౦

యదాప్తదక్షిణై ర్యజ్ఞై ర్యజతే శ్రద్ధయాన్వితః,
కామద్వేషా వనాదృత్య సరాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౧

కృపణానాథవృద్ధానాం యదాశ్రు పరిమార్జతి,
హర్షం సంజనయ న్నృణాం స రాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౨

వివర్ధయతి మిత్రాణి తథారీం శ్చాపకర్షతి,
సంపూజయతి సాధూంశ్చ సరాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౩

సత్యం పాలయతి ప్రీత్యా నిత్యం భూమిం ప్రయచ్ఛతి,
పూజయే దతిథీన్ భృత్యాన్ స రాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౪

నిగ్రహానుగ్రహౌ చోభౌ యత్ర స్యాతాం ప్రతిష్ఠితౌ,
అస్మిన్ లోకే పరే చైవ రాజా స ప్రాప్నుయాత్ ఫలమ్. ౭౫

యమో రాజా ధార్మికాణాం మాంధాతః పరమేశ్వరః,
సంయచ్ఛన్ భవతి ప్రాణా నసంయచ్ఛంస్తు పాతుకః. ౭౬

ఋత్విక్పురోహితాచార్యాన్ సత్కృత్యా నవమన్య చ,
యదా సమ్యక్ప్రగృహ్ణాతి స రాజ్ఞో ధర్మ ఉచ్యతే. ౭౭

యమో యచ్ఛతి భూతాని సర్వాణ్యేవాఽవిశేషతః,
తథా రాజ్ఞానుకర్తవ్యం యంతవ్యా విధివత్ప్రజాః. ౭౮

సహస్రాక్షేణ రాజా హి సర్వథైవోపమీయతే,
స పశ్యతి చ యంధర్మం స ధర్మః పురుషర్షభ. ౭౯

అప్రమాదేన శిక్షేథాః క్షమాం బుద్ధిం ధృతిం మతిమ్,
భూతానాం సత్త్వజిజ్ఞాసా సాధ్వసాధు చ సర్వదా. ౮౦

సంగ్రహ స్సర్వభూతానాం దానం చ మధురం వచః,
పౌరజానపదాశ్చైవ గోప్తవ్యా స్తే యథాసుఖమ్. ౮౧

న జాత్వదక్షో నృపతిః ప్రజాశ్శక్నోతి రక్షితుమ్,
భారో హి సుమహాం స్తాత రాజ్యం నామ సుదుష్కరమ్. ౮౨

తద్దండవి న్నృపః ప్రాజ్ఞః శూర శ్శక్నోతి రక్షితుమ్,
న హి శక్య మదండేన క్లీబే నా బుద్ధినాఽపివా. ౮౩

అభిరూపైః కులే జాతై ర్దక్షై ర్భక్తై ర్బహుశ్రుతైః,
సర్వా బుద్ధీః పరీక్షేథా స్తాపసాశ్రమిణా మపి. ౮౪

అత స్త్వం సర్వభూతానాం ధర్మంవేత్స్యసి వై పరమ్,
స్వదేశే పరదేశే వా నతే ధర్మో వినంక్ష్యతి. ౮౫

తస్మా దర్థాచ్చ కామాచ్చ ధర్మ ఏవో త్తరోఽభవత్,
అస్మిన్ లోకే పరేచైవ ధర్మాత్మా సుఖమేధతే. ౮౬

త్యజంతి దారాన్ పుత్రాంశ్చ మనుష్యాః పరిపూజితాః,
సంగ్రహశ్చైవ భూతానాం దానం చ మధురా చ వాక్. ౮౭

అప్రమాదశ్చ శౌచంచ రాజ్ఞో భూతికరం మహత్,
ఏతేభ్య శ్చైవ మాంధాతః సతతం మా ప్రమాదిథాః. ౮౮

అప్రమత్తో భవే ద్రాజా ఛిద్రదర్శీ పరాత్మనోః,
నాస్య చ్ఛిద్రం పరఃపశ్యే చ్ఛిద్రేషు పర మన్వియాత్. ౮౯

ఏతద్వృత్తం వాసవస్య యమస్య వరుణస్య చ,
రాజర్షీణాం చ సర్వేషాం త త్త్వమప్యనుపాలయ. ౯౦

తత్కురుష్వ మహారాజ వృత్తం రాజర్షి సేవితమ్,
ఆతిష్ఠ దివ్యం పంథాన మహ్నాయ భరతర్షభ! ౯౧

ధర్మవృత్తం హి రాజానం ప్రేత్యచేహ చ భారత,
దేవర్షి పితృగంధర్వాః కీర్తయంతి మహౌజసః. ౯౨

## ఉతథ్య గీత: తాత్పర్యము

"మాంధాతృమహరాజా! రాజు ధర్మమార్గమున నడచుటకేకాని తన యిచ్చవచ్చినట్లు చేయుటకుఁ గాదు. లోకమును రక్షించువాఁడే రాజు. రాజు ధర్మము నాచరించునేని దేవతాసముఁ డగును. అతఁ డధర్మ పరుఁ డయ్యెనేని నరకముపా లగును. భూతము లన్నియు ధర్మము నందే యున్నవి. ధర్మము రాజునం దున్నది. ధర్మాత్ముఁ డగురాజు సర్వసంపదలు నందును. పరమధర్మాత్ముఁడు సంపన్నుఁడు నయిన రాజే ధర్మస్వరూపుఁడు. స్వధర్మ మందున్న రాజునకుఁ గలుగు నర్థ సిద్ధి వలన లోకక్షేమము కలుగును. ధర్మము నశించి యధర్మము వృద్ధినందుచో రేయుంబవళ్లు ప్రజ లందఱు భయపడుచునే యుందురు. పాపము నివారితము కానిచో, సజ్జనుల యాస్తిపాస్తులకు క్షేమము కలుగదు. పాపబలము వృద్ధి యైనచో సజ్జనుల విత్తక్షేత్రకాంతాజన ముల యునికికే ప్రమాదము వాటిల్లును. పాపము నివారితము కానిచో దేవపితృపూజలుకాని అతిథిసేవలుకాని సాగవు. పాపము నివారితము

కానిచో బ్రాహ్మణులు వ్రతములు విడుతురు. వేదములు పఠింపరు. యజ్ఞము లాచరింపరు. పాపము నివారితము కానిచో వృద్ధులు బల హీనులు భయపడిపోవుచుందురు. మును లందుచే రాజులు ధర్మ స్వరూపులై యుండి యుభయ లోకసంరక్షకు లగుదురు గాకని కోరిరి. ఎవనియందు ధర్మము పెంపొందునో యాతఁడు రాజువలె గౌరవింపఁ బడును. ఎవరియం దధర్మము పెచ్చు పెరుగునో వారు దేవతలైనను వృషలు లనఁదగుదురు. వృష మనఁగా ధర్మము. దానిని లయము చేయువారు వృషలులు. ధర్మము వర్ధిల్లినపుడే సకల ప్రాణులకు సౌఖ్యము; ధర్మము నశించునపు డెల్లరకు నాశనమే. కావున, ధర్మ హాని రా జెన్నఁడు నొనరింపరాదు. ధర్మవృద్ధివలన స్వర్గము ధర్మ హానివలన నరకము నగును. భూతముల యుత్పత్తిస్థితులకే బ్రహ్మ ధర్మమును సృజించెను. రాజు ప్రజానుగ్రహకారణమున ధర్మాభివృద్ధి నొనరింపవలయును. కావున ధర్మ మన్నిటికన్న శ్రేష్ఠమైనది. ధర్మ ప్రభు వగురాజే నిజమగు రాజు. కామక్రోధములను గాక నిజమగు రాజు ధర్మమునే పెంపొందింపవలెను. రాజునకు ధర్మమే సర్వశ్రేయ స్కరము. ధర్మము బ్రాహ్మణులవలనఁ గలిగినది. కావున రాజు సదా బ్రాహ్మణులను పూజింపవలయును. బ్రాహ్మణు లేమికోరినను మదమాత్సర్యములు దక్కి రాజు తీర్చుచుండవలెను. అట్లు చేయని నాఁడు రాజు భయావహుఁ డగును. మిత్రులు వృద్ధిపొందక పోఁగా శత్రులు వృద్ధిపొందుదురు. విరోచనసుతుఁ డగుబలిచక్రవర్తి బాల్యము నుండియు బ్రాహ్మణులన్న మాత్సర్యము వహించియుండెను. అందు చేతనే లక్ష్మి యాతనిని విడిచి యింద్రుని జేరెను. ఆ తరువాత బలి యా లక్ష్మి తన్ను విడచి యాతనిఁ జేరినందుల కెంతయో దుఃఖపడెను. అసూయాదురభిమానములే లక్ష్మి తొలఁగుటకుఁ గారణములు. మాంధాతా! ఇట్టి గుణములవలన లక్ష్మి నిన్నెన్నఁడు విడువకుండుఁగాక! దర్పము లక్ష్మి కధర్మమువలనఁ గలిగిన పుత్రుఁ డని శ్రుతులు చెప్పుచున్నవి. దీనివలననే పెక్కండ్రు దేవతలు, రాక్ష సులు, రాజర్షులు నాశన మందిరి. దీనిని జయించినవాఁడు రాజు. దీనిచే జయింపఁబడినవాఁడు దాసుఁడు. మాంధాతా! నీవు చిరకాలము చక్రవర్తిగ నుండఁదలఁచితివేని దర్పసహితమగు నధర్మమును దవ్వుగఁ

ద్రోలుము. మత్తుఁడు, ప్రమత్తుఁడు, పాషండుఁడు, ఉన్మత్తుఁడు ప్రయత్న పూర్వకముగా వీరికిఁ గడుదూరమున నుండ వలయును. పరాజితుఁడు, అమాత్యుఁడు, స్త్రీలు, పర్వతము, విషమ మయిన దుర్గము, ఏనుఁగు, గుఱ్ఱము, సర్పము, మున్నగు వానితో నెన్నఁడు చేరిక లేకుండవలయును. నిశాసంచారము కూడ విడువఁదగినది. అత్యాగము, అభిమానము, దంభము క్రోధము వీనిని విడిచివేయవలయును. ఇదివఱ కెఱుఁగనిస్త్రీని, పేడివలె నున్నస్త్రీని, జారిణియగుస్త్రీని, పర భార్యను, కన్యను కామమునఁ గూడరాదు. పాపములను పరిమార్చి స్త్రీలౌల్యమును త్యజింపనియెడల వర్ణసంకర మగుటేకాక పాపు లగు రాక్షసులు, నపుంసకులు, అంగహీనులు, మూఁగలు, మూఢులు మున్నగువారు జన్మింతురు. ఇట్టి ప్రమాదములకు గుఱికాక రాజు కడు జాగరూకుఁడై యుండవలయును. అధర్మప్రాబల్యమున వర్ణసంకర కారకులు ప్రబలుదురు. కాలధర్మములు తాఱుమాఱై వేసవిని జలి, శీతకాలమున నుక్కపోఁత, వానకాలమున నెండలు, నెండకాలమున వానలు, అతివృష్టి, అనావృష్టి, వ్యాధిపీడ మున్నగునవి సంభవించును. తోఁకచుక్కలు కనఁబడుట, గ్రహములు క్రూరము లగుట మున్నగు రాజనాశనకరము లగు నుత్పాతములు ప్రబలును. తన్ను రక్షించు కొనలేనిరాజు ప్రజలనుసైతము రక్షింప లేఁడు. అతనిప్రజ లాతనితోపాటు నశింతురు. ఒకని ధన మిరువురు, ఇరువురి ధనము పెక్కురు కొట్టి దోఁచుకొందురు. యువతులగు కన్యల మానధనమును బలవంతులగు విటకాండ్రు కొల్లగొట్టుదురు. ఈ నింద లన్నిటికి రాజే బాధ్యుఁ డగును. రాజు ధర్మము నేమఱినపుడు ఆస్తిపాస్తులక్షేమమున కధికభంగము కలుగును.

మేఘుఁడు సకాలమున సువృష్టి గురిసి, ధర్మచారియై పార్థివుఁ డుండి, సంపదలు పెంపుగలిగియున్నపుడు ప్రజలసుఖమునకు మేర యుండదు. రంగు వెలియనీక, అంచు మాయనీక బట్టముఱికిని పోఁగొట్ట లేనివాఁడు చాఁకలివాఁడు కాఁడు. అట్లే బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులను స్వధర్మవర్తులఁజేసి దోషాదు లణఁపని రాజు రాజు కాఁడు. శూద్రునకు సేవ, వైశ్యునకుఁ గృషి, క్షత్రియునకు దండనీతి,

బ్రాహ్మణునకు బ్రహ్మచర్యాతపస్సత్యములు ధర్మములు. వారి వారి వర్ణ వ్యవస్థకు భంగములేనిభంగి వారివారి గుణశీలములను తీర్చిదిద్దఁ గలరాజే ప్రజలకుఁ దండ్రి, ప్రజాపతి. కృతత్రేతాద్వాపరకలియుగములు రాజునడవడులు. రాజే యుగ మని చెప్పుదురు. రాజునకుఁ బ్రమాదము సంభవించినపుడు నాలుగువర్ణములవారికి, నాలుగు వేదములకు, నాలుగాశ్రమములకు నన్నిటికిని బ్రమాదమే. రాజునకుఁ బ్రమాదము కలుగునెడల మూఁడగ్నులకు, మూఁడువిద్యలకు, యజ్ఞయాగములకు నన్నిటికిని బ్రమాదమే. సర్వభూతములకు రాజే కర్త, వినాశకుఁడు. ధర్మాత్ముఁడై కర్తయగును, అధర్మాత్ముఁడై నాశకుఁడగును. రాజభార్యాపుత్రమిత్ర బాంధవులు మున్నగువా రెల్లరు రాజునకుఁ బ్రమాదము వచ్చినపుడు దుఃఖింతురు. అధర్మవర్తి యగురాజు రాజ్యమున నన్ని విధములగు పశువులుసైతము మార్తిఁ గాంచును. దుర్బలులను రక్షించుటకొఱకే బలము కల్పింపఁబడినది. అందుచే అబలుల కదిమహద్భూతము. అందే సర్వము సంప్రతిష్ఠిత మయియున్నది. రా జధర్మవర్తి యయ్యెనేని సర్వభూతములు సంతాపపడును. బలహీనులయు మునులయు పాములయు వీరిదృష్టిని భరించుట చాలకష్టము. బలహీనుల నవమానింపరాదు. అట్టి దుర్బలుల తీక్ష్ణనేత్రాగ్ని రాజవంశముల సమూలనాశనము చేయుటకు సమర్థము. బలహీనుల యుసురు తగులుటవలన దహింపఁబడిన వంశవృక్ష మింకఁ జిగిరింప లేదు. కావున, రాజెన్నఁడు వారిజోలికిఁ బోకూడదు. బలముకంటె బలము లేమియే చాల గొప్పది. అదియే అధికబలము. అబలులచే దగ్ధమైన బలమున నింక మిగులునది లేదు. అవమానింపఁబడినవాఁడు, కొట్టఁబడినవాఁడు, కష్టపెట్టఁబడినవాఁడు, – వీరిని గాపాడనిరాజును దైవదండము చంపును. నీవు బలవంతుఁడవుగదా యని దుర్బలుల హింసింపకుము. అగ్ని జ్వాలలు దగ్గఱనున్న వస్తువులను దహించి వేయునట్లు దుర్బలుల నేత్రాగ్ని నిన్ను దహింపకుండుఁగాక! చేయని తప్పు చేసిరని నిందమోపి శిక్షింపఁగా నట్లు శిక్షపడినవారేడ్వఁగాఁ గాఱు కన్నీటిబొట్లు, ఆ నింద మోపి యకారణముగా శిక్షించినవారి పుత్ర మిత్ర పశుక్షేత్రకళత్రసహితముగా వారిని దగ్ధముచేసివేయును. ఒక్కొక్కప్పుడు చేసినపాపము వెంటనే కట్టికుడుపదు. ఆ పాపి యా పాపఫలము

గుడుపకమునుపే చచ్చినయెడల అతనిపుత్రులో పౌత్రులో ప్రపౌత్రులో అనుభవింపక తప్పదు. ఏ దేశమున దుర్బలుఁడు తేనినింద మోపఁబడి శిక్షపడి తన్ను గాచునాథుఁడు లేక యేడ్చునో ఆ దేశము మహాఘోరము దైవకృతము నగుపండ మనుభవించును. (ఉదాహరణ : ఏ విప్రరూపములు బిచ్చ మెత్తుకొనునట్లు నటించు శత్రులో యేమఱుపాటున రాజును బట్టి వధింతురు.) రాజోద్యోగు లెవ్వ రవినీతిపరులైనను గొప్పపాపము రాజునుపొందును. అశక్తులైన ప్రజలు దీనులై బతిమాలుకొనుచున్నను వినక యేదేశమున రాజోద్యోగులు కామలాలసులై కాని ధనాశాపరులై కాని దుష్కృత్యము లొనరింతురో ఆదేశ మేలురాజునకు మహాపాపము సంభవించును. చిన్నమొక్క పుట్టి పెరిగి మహావృక్షమై యలము కొనఁగా దాని నెన్నోభూతము లాశ్రయించినపుడు ఆ చెట్టునుగొట్టివేయు దాని నాశ్రయించిన భూతము లన్నియు నాశ్రయములేక గిలగిల లాడును. ఏ రాజు రాజ్యమందలి ప్రజలు ధర్మపరులయిన నా రాజు కీర్తి నలుదెసల నలముకొనును. అధర్మము వైతొలఁగి ధర్మము నిలచును. అట్లు గాక, ప్రజ అధర్మవర్తనులై పాపు లగుదురో ఆ పాపమా దేశ మేలురాజును రాజోద్యోగులను పొందును. ఏ దేశమందు రాజు తనబలిమిచే నధర్మ మణఁచి ధర్మమును నిలుపఁడో యా దేశ మభివృద్ధి చెందనేరదు. ఏ దేశమున రాజు తన యమాత్యుల నాదరించుచు మంత్రాలోచనవేళలను యుద్ధములందును దగురీతి నుపయోగించుకొనునో యా దేశ మభివృద్ధినందును. ఆ రాజు జనరంజకముగాఁ జిరకాల మాదేశము నేలును. సుకృతకర్మములను సుభాషితములను నాదరించు రాజు అత్యుత్తమ మగుధర్మమునందును. పంచి కుడుచుటయు, అమాత్యుల నవమానింపమియు, గర్వించియున్న బలవంతుల నణఁచుటయు రాజుప్రధానకర్మములు. మనోవాక్కాయకర్మములచే నెల్లరిని గాపాడుచు విరోధియైనఁ బుత్రునైనను సహింపమి రాజునకు ధర్మము. ఏ రాజు దుర్బలులగు తన ప్రజలతో పంచి కుడుచునో దాన నా దుర్బలులు బలవంతు లగుదురో అదియే రాజుధర్మము. రాష్ట్రమును గాపాడుచు దస్యులను బరిమార్చుచు, యుద్ధమున విజయము సంపాదించుట రాజు ధర్మము. క్రియలచేతను, మాటలచేతను ఇష్టుఁడేయైనను పాపము చేయువాని నెవ్వని నోర్వకుండుట రాజుధర్మము. వణిజులను పుత్రులను

వలె రక్షించుచు, మర్యాద మీఱకుండుట రాజుధర్మము. కామద్వేషము లను వర్జించి శ్రద్ధాళువై సదక్షిణము యజ్ఞయాగములు చేయుట రాజు ధర్మము. కృపణులయు, అసాధులయు వృద్ధులయు నశ్రువులు తుడిచి యెల్లరకు సంతృప్తి సమకూర్చుట రాజుధర్మము. మిత్రుల సంఖ్య పెంచుచు, శత్రుసంఖ్య తగ్గించుచు, సాధువులఁ బూజించుట రాజుధర్మము. ప్రీతితో సత్యమునే పలుకుచు, భూదానాదు లొనరించుచు, అతిథిపూజ, భృత్యప్రీతియుఁ గలిగించుట రాజుధర్మము. నిగ్రహాను గ్రహసమర్థుఁ డగురా జిహపరసుఖము అందును. రాజే యముఁడు. ధార్మికుల కాతఁడు పరమేశ్వరుఁడు. ఇంద్రియముల నణఁచి యాతఁడు పెంపును, అణఁపక లోటు గాంచును. ఋత్విజులను, పురోహితులను, గురు వులను అవమానింపక గౌరవించి హితులను జేసికొనుట రాజుధర్మము. యముఁడు నిష్పక్షపాతబుద్ధితో సర్వభూతముల నణఁచునట్లే రాజును సర్వసమత్వమున మెలఁగవలయును. అన్నివిధముల రాజింద్రునితో సమానుఁడు. ఏది ధర్మముగా భావింపఁబడుచుఁ జూడఁబడుచున్నదో అదే ధర్మము. నీవు ప్రమాదపతితుఁడవు కాక క్షమ, బుద్ధి, ధృతి, మతి కలిగియుండుము. సర్వభూతములందును సాధు అసాధు భేద ముల నెల్లపుడును దెలిసికొనుము. సర్వభూతములయెడ దానము, మధురవచనము నేర్చికొనుము. పురజనులను, జానపదులను కన్న బిడ్డలవలెఁ గాపాడవలయును. అశక్తుఁ డగురా జెప్పుడు నీపని చేయఁ జాలఁడు. రాజ్యభారముఁ దాల్చుట ఐనవానికిఁ గానివానికి సాధ్యము కాదు. అభిరూపము, కులము, జాతి, దక్షత, భక్తి, బహుశ్రుతత్వము గలమంత్రులఁగూడి మనుజుల మనస్సులను, మహర్షులకార్యములను స్వబుద్ధిచే గ్రహింపఁ గలిగియుండుట రాజధర్మము. దాన సర్వవర్ణ ధర్మములు తెలియును. అపుడు స్వదేశమున నున్నను పరదేశమున నున్నను బాధలేదు. ధర్మము అర్థము, కామము వీనిలో ధర్మమే ముఖ్యమైనది. ధర్మాత్ముఁడే ఇహపరముల సుఖించును. త్యాగము, మధురభాషణము నీకున్న యెడల నీకై ప్రజలు దారపుత్రాదులనైన విడిచివేయుదురు. అప్రమాదము, శౌచము రాజున కైశ్వర్యహేతు వులు. ఈ విషయముల నేనుఱుగుదును. ఓ మాంధాతా! రాజు తనగుట్టు తెలియనీక శత్రువులగుట్టు తెలిసికొనఁగలుగుచుఁ దఱితో వారిని జయింప

వలయును. ఈ రీతినే యింద్ర, యమ, వరుణాదులు వర్తించిరి. రాజర్షు లెల్ల రిట్లే నడచుకొనిరి. ఈ దివ్యపద్ధతినే నీవు తప్పక అనుసరింపుము. ధర్మవర్తి యగురాజు నిహపరముల దేవతలు, ఋషులు, గంధర్వులుఁ గొనియాడుదురు." మాంధాత యట్లొనరించి రాజర్షులలో నుత్తముఁడయ్యెను.

ఉతథ్యమహర్షి యిట్లు ధర్మోపదేశకుఁడు, మహాతపస్వి, విజ్ఞానియై వినుతి కెక్కెను.



# మహర్షుల చరిత్రలు

## ఋచీక మహర్షి

### వంశ చరిత్ర

భృగుమహర్షి పులోమ యనుభార్యయందుఁ గాంచిన పుత్త్రుఁడు చ్యవనమహర్షి. చ్యవనుఁడు సుకన్య యనుసాధ్వియందు దధీచి, ప్రమతి, అప్రవానుఁడు ననుకుమారులను గాంచెను. అప్రవానుఁడు ఋచి యనునామె నర్ధాంగిగాఁ గైకొని గృహస్థుఁ డయ్యెను. కాలక్రమమున నామె యతనివలన గర్భము ధరించెను.

ఆ దినములలో హైహయవంశీయుఁడు, కార్తవీర్యార్జునుని తండ్రి యగుకృతవీర్యుఁ డనుమహారాజు భార్గవ వంశ విప్రులను కులగురువులుగాఁ జేసికొని అనేక యజ్ఞయాగాదు లొనరించి వారికిఁ బెక్కు భూరి దక్షిణ లొసఁగి వార్ధకమున స్వర్గమున కేగెను. ఆతని యనంతర మాతనిపుత్రులు భృగువంశజు లగుబ్రాహ్మణులపై నీర్ష్య వహించి వారు తమతండ్రిని వశపఱచుకొని యాతని సర్వస్వము నపహరించిరని నింద మోపి భృగువంశ విప్రుల నష్టకష్టములఁ బెట్టఁదొడఁగిరి. ఒకనాఁ డారాజకుమారులజట్టు వెంబడింప భయపడి భృగువంశస్త్రీలు కొందఱు హిమగిరి ప్రాంతములకుఁ బాఱిపోయిరి. వారిలో గర్భిణి యగు ఋచియు నుండెను. ఆమె కొంతవడి పరుగిడి యింకఁ బోలేక యొకచోఁ జదికిలఁబడి యోగశక్తిఁ దనగర్భమును దనయూరువునఁ జేర్చెను. రాక్షస సదృశు లగురాజకుమారు లామెను బీడింప సమీపింపఁగనే ఋచి యూరువునుండి దివ్యతేజముతో నొక్కపుత్రుఁ డుదయించెను. ఆతని తేజముఁ గాంచుసరికే హైహయరాజకుమారు లంధులై దారితెన్ను గానక దీనులై పశ్చాత్తప్తులై యా తల్లిని క్షమింపఁ బరిపరివిధములఁ బ్రార్థించిరి. ఆమె తా నేమియుఁ జేయఁజాల ననియుఁ దనపుత్త్రుని దివ్యతేజమువలననే వా రంధులై రనియు నందుచే నాతనినే ప్రార్థింపఁ

దనియు వారికి సూచించెను. వారు తడవిఁ యాతని పాదములను బట్టు కొని లెంపలు వైచుకొని మ్రొక్కి మ్రొక్కి యిఁక తప్పిదారియైనను హైహయవంశీయు లెవ్వరు భృంగువంశీయుల జోలికి పోకపోవుటే కాక దైవములుగఁ బూజింతు రనియుఁ దమతప్పు సైఁచి తమకు దృష్టి దానముఁ జేయుమనియుఁ గోరుకొనిరి. ఆ బాలుఁడు కటాక్షింపఁ గనే వారికిఁ గన్నులు వచ్చెను. వా రాతని నెంతయుఁగొనియాడి ఋచికి నమస్కరించి భీతావహలైన విప్రస్త్రీలను మాతృసమానలుగాఁ జూచి వారివారి యిండ్లకుఁ జేర్చి సుఖముండిరి.

ఋచి యూరువునుండి పుట్టిన యా బాలుఁడే ఔర్వుఁడు. దుష్ట క్షత్త్రియనాశనార్థ మౌర్వాగ్నిని బుట్టించి పితరుల యాజ్ఞవలన దానిని సముద్రమున విడిచిన మహనీయుఁ డీతఁడే. ఈతఁడు బ్రహ్మచర్య దీక్షితుఁడై వివాహ మాడనొల్లక తన తపశ్శక్తిచే నయోనిజులగు నొక పుత్రిని, పుత్రుని గాంచెను. ఈతని పుత్రికయే కందళి యనుపేర దుర్వాసుని భార్యయయ్యెను. ఈతని పుత్రుని కీతఁడు తనతల్లి పేరు పెట్టెను. ఆతఁడే ఋచీకమహర్షి.

ఇ ట్లుత్తమోత్తమ మగు భృగువంశమున నుత్తమోత్తమముగఁ బుట్టి బ్రహ్మచర్యమున విద్యలార్జించి తపస్వియై యుక్తవయస్సు దాఁటి నను వివాహ మాడకుండెను. తరువాతఁ గొంతకాలమునకుఁ దాను వివాహమాడి సత్సంతానమును బడయ నిశ్చయించుకొని దివ్యదృష్టిని కుశికపుత్రుఁడగు గాధియను భూపతి కూఁతురు సత్యవతి యనునామె తన భార్య కాఁదగు నని యెఱింగి యుండెను.

## సత్యవతి చరిత్ర

తొల్లి పురూరవుఁ డను మహారాజువంశమున బలాశ్వుఁ డనురాజు నకుఁ గుశుఁ డనువాఁడు పుట్టి రాజయ్యెను. అతనికిఁ గల్గినపుత్త్రులలో కుశనాభుఁడు శ్రేష్ఠుఁడు. ఆతఁడు పెరిగి పెద్దవాఁడై ఇంద్రసమానుఁ డగుపుత్రుని గాంచఁగోరి యింద్రునిగూర్చి ఘోరతప మొనరించెను. ఇంద్రుఁ డాతనితపమున కిచ్చ మెచ్చి వచ్చి తనయంశమున నితనికి

సుపుత్రుఁడు కల్గు నని వరమిచ్చి చనెను. ఆ వరము ననుసరించి కాల క్రమమున కుశనాభునిభార్య పతివలన గర్భము ధరించి యింద్ర సమానుఁ డైనపుత్రుని గాంచెను. అతఁడు గాధి. గాధిరాజు మహా పరాక్రమశాలియై పరమధర్మాత్ముఁడై ప్రజారంజకముగఁ బరిపాలన మొనరించెను. ఆతనికి సంతానము కలుగకపోఁగా పెక్కునోములు, వ్రతములు పూని దేవతల నారాధించి వారిదయవలన సత్యవతి యను నొకపుత్రికను గనెను. చక్కనిచుక్క యగు అక్కన్య మిక్కిలి గారా ముగఁ బెరుగుచు సర్వసుగుణసుందరి యయ్యెను.

## వి వా హ ము

ఆ దినములలో ఋచీకమహర్షి గాధిరాజునింటి కరుదెంచి యాతని యతిథి సత్కారము లంది తన కొకకోరిక కలదనియు దానిని దీరుచు కొనఁ దా నచటికి విచ్చేసితి ననియుఁ దెలిపెను. గాధిరా జానందమున "మహాత్మా! ఏ కోరికలు లేని మహాఋషి కొకకోరిక కలుగుట లోకకల్యా ణార్థము, ఏ కోరిక లెఱుఁగని లోకేశతుల్యుఁ డగుమహర్షికిఁ గలిగిన యేకైకమగుకోరికఁ దీరుచు నదృష్ట మేపుణ్యపురుషునికిఁ బట్టునో! శక్తి వంచన లేక నీకోరిక దీర్ప యత్నింతును. దయదలఁచి తెలుపు" మని యాతనిఁ బ్రార్థించెను. అపు డాతఁడు గాధిరాజుకూతురగు సత్యవతిని దనకిచ్చి వివాహము చేయు మని యడిగెను. వయోవృద్ధు, తపోజీవి యగుఋచీకునకుఁ దనయేకైక పుత్రిక నెట్లిచ్చుట యని గాధి మిక్కిలి పరితపించెను. ఆ సంగతి గమనించిన ఋచీకుఁడు గాధిరాజా! నేను కామినై యోఁగామము లెఱుఁగక నీ పట్టిని జేపట్టు పట్టుదలతో నిప్పట్టున నుట్టి పడలేదు. నీ వంశక్షేమమును గోరి నే నిటకు వచ్చితిని. నీ పుత్రిక కేదైన నుంకువ కోరుదువేని యిచ్చెదను కోరుము. అంతేకాని నా కోరిక నీవు తృణీకరించుట ధర్మము కాదు. దూర మాలోచింపు" మని వలికెను.

గాధిరా జాతనిపలుకులు విని తనలో "అయ్యో! ఈతని నెట్లు తప్పించుకొనఁగలనో! తృణీకరించిన మహర్షి శాపమీయఁ గలఁడు. అంగీకరించుటకు మన సేమాత్ర మొప్పకున్నది. ఐనను, ఈతఁడు

సందిచ్చినాఁడు. మానవమాత్రునకు సాధ్యముకాని వస్తువుల నుంకువగాఁ దెచ్చి యిమ్మందును. దానితో నీతఁడే పోవును. ఒకవేళఁ దెచ్చెనా అంతశక్తిసంపన్నునకుఁ బిల్లనిచ్చుటకంటె నానంద మేమున్నది?" అనుకొని ప్రకాశముగా "మహాత్మా! చాల సంతోషము. మాకొకకోరిక కలదు. ఆ కోరికను నీవు దీర్చితివా నీకు బ్రహ్మానందముగ నాపట్టి నిచ్చి మహావైభవముగ వివాహ మొనరింతును. మేము కోరు నుంకువ యేమందువా నల్లని చెవులు, తెల్లనిమేనులు కలిగి మహావాయువేగము లైనగుఱ్ఱములను వేయింటిని నీవు కొనివచ్చి యిమ్ము. నీవు మాకోరిక తీర్చితివా నీకోరిక మేమును దీర్తుము. తపశ్శక్తి సంపన్నుఁడవు, సర్వ శక్తిమయుఁడవు, నీ కిది యొక్కలెక్కలోనిదా?" అని సవినయముగాఁ బలికెను.

ఋచీకమహర్షి యాతనిగోంతెమ్మకోరికను దృణీకరింపక యట్లే తెచ్చి యిచ్చి సత్యవతిని బెండ్లాడుదు నని చెప్పి వెడలిపోయెను. బ్రతుకు జీవుఁడా! ప్రస్తుత మీకష్టము దాఁటి గట్టెక్కితి నని గాధిరాజు సంతసించెను కాని, సత్యవతి యాతఁ డాయశ్వములు తెచ్చి యిచ్చుట నిక్కువ మనియుఁ దా నాతని భార్యయగుట తథ్య మనియు నిశ్చ యించుకొనెను.

ఋచీకమహర్షి బయలుదేఱి వెడలి నల్లనిచెవులు తెల్లని మేనులు కలిగి గాలివలెఁ బరుగిడు గుఱ్ఱము లెచ్చట దొరకు నని లోకమంతయు గాలించి యట్టివాని నెచ్చటను బొడగానఁడయ్యెను. ఎవ్వరి నడిగినను వారు నవ్వి యట్టిగుఱ్ఱములు సృష్టిలో నెక్కడను నుండ వనిరి. ఇదివఱ కెక్కడను నట్టిగుఱ్ఱములు లేనిచోఁ దనప్రీతికొఱ కట్టియశ్వములు పుట్టి పెరిగి తనకు లభింపవలయు నని యాతఁడు గాఢముగాఁ గోరెను. అతఁడు తిరిగితిరిగి తుద కట్టియశ్వములు వరుణ లోకమునఁ గల 'తురంగతీర్థ' మను మహాక్షేత్రమున లభించిన లభింపవచ్చు నని తెలిసి కొని నిజతపోమహత్త్వమున వరుణలోకమున కేగి వరుణదేవునికిఁ దనరాక నెఱింగించెను. ఋషిప్రియుఁ డగు నాతఁ డమితానందమున నాతనికి స్వాగత మొసఁగి యతిథిమర్యాద లెల్ల నడపి యాతఁడు వచ్చినపని యడిగెను. ఋచీకమహర్షి తనసంగతి యంతయు నాతనితోఁ జెప్పి

నల్లనిచెవులు, తెల్లనిమేనులు, వాయువేగము కలిగిన గుఱ్ఱములు తన కొకవేయి కావలయు నని వరుణు నర్థించెను. వరుణుఁ డంత "మహాత్మా! సదా తపస్సంపన్నులు, సత్యసంధులు, సర్వకామవివర్జితులు నగు మహానుభావులు సాధింప లేని దేమి కలదు! భార్గవవంశప్రసిద్ధుఁడవు, బ్రహ్మచర్యదీక్షాపరిపాలకుఁడవు, తపస్స్వాధ్యాయనిరతుఁడవు, నీ రాక వలన మాలోకము పవిత్రమైనది. నీ వేకాకిచేతఁ గబురు పంపినను నీ యడుగులకు మడుగులొత్తుచు నివియేకాదు ఏమి యడిగినను గొనివచ్చి యిచ్చెడివాఁడనే కదా!" అని యాదరమేదురముగఁ బల్కి ఋచీక మహర్షిని దీసికొనిపోయి తురంగతీర్థమున నోలలాడించి యాక్షేత్రముఁను సందర్శింపఁజేసెను. అం దాతఁడు వేనకు వేలు వివిధములైన యశ్వ రాజములను గాంచెను. అతఁ డచ్చెరువందున ట్లచట నల్లనిచెవులు తెల్లనిమేనుఁలు కలిగి వాయువేగములైన గుఱ్ఱములు కోటానఁగోటు లుండెను. అవి యన్నియు మహోన్నతములు, మహాసత్త్వములు, సర్వసౌందర్యసమన్వితములు. వానినుండి వేయిగుఱ్ఱములను లెక్కపెట్టి వరుణుఁడు ఋచీకమహర్షి కొసఁగి సత్కరించెను.

ఋచీకుఁ డా గుఱ్ఱముల వేయింటిని గొని శీఘ్రగమనమున గాధి రాజు నింటికి విచ్చేసెను. కలలోనైనను తాను జెప్పిన యశ్వముల వంటి యశ్వముల నాతఁడు తీసికొనిరాఁగలఁడని గాధి తలంపలేదు. అందుచే నొకటికాదు, రెండు కాదు వేయి దివ్యాశ్వములతో విచ్చేసిన ఋచీకునిఁ జూచి గాధి తన కన్నులను దాను నమ్మలేకుండెను. దాన ఋచీకుఁడు లోకాతీతప్రజ్ఞాన్వితుఁ డని యాతనికి బోధపడెను. అతనిని గుఱించిన సంశయము లేమియు నిఁక లేకపోఁగా నాతఁ డమితానందమున నొక సుముహూర్తమునఁ దనయేకైక పుత్రికయగు సత్యవతిని ఋషి తల్లజుఁ డగు ఋచీకుని కిచ్చి విధ్యుక్తముగా దివ్యవైభవముతో వివాహము గావించెను. భూతజాల మెల్ల అందుల కమితానందమును వెల్లడించెను.

## పుత్త్రోదయమను చరువృత్తాంతము

తదనంతరము ఋచీకుఁడు ధర్మపత్ని యగుసత్యవతిని దీసికొని పోయి యొక యాశ్రమమును నిర్మించుకొని యందుండి గృహస్థాశ్రమ

మును నిర్వర్తించుచునే తపస్స్వాధ్యాయప్రవచనములతోఁ గాలము గడపఁ దొడఁగెను. ఇట్లు కొన్ని సంవత్సరములు గతించినపిదప నొక నాఁడు ఋచీకుఁడు సత్యవతికి సంతానముఁ బ్రసాదింప నిశ్చగించి ఋతుస్నాతయై పరమపవిత్రముగ నున్నసమయమునఁ దనసంకల్ప మామె కెఱిఁగించి విపుల వేదమంత్రములతో నొక్కచరువు (అగ్నిదేవుని కాహుతిచేయుటకు తయారుచేసిన అన్నము) సిద్ధము చేసి సత్యవతి కీయఁబోయెను. అంత నామె భయభక్తులతోఁ బతికి నతు లొనర్చి "దేవా! నా కొక్కకోరిక కలదు. అది మీ రనుగ్రహింపవలయును. మా తల్లిదండ్రులకు నే నొక్కతెనే బిడ్డను, వారికిఁ బుత్రహీనుల మను దుఃఖ మొకటి కలదు. నాకును తోడఁబుట్టినవాఁ డొకఁడు లేకపోయెనే యనువంత కొంతకలదు. కావున, దయయుంచి యీచరువులో సగము నాకు సగము మాతల్లికి నిచ్చి యిరువురకుఁ బుత్రులు కలుగునట్లు వర మనుగ్రహింపవేఁడుదు" నని కోరెను.

ఋచీకుఁ డట్లే యని ఋతుస్నాతయై పవిత్రయై పుత్రకాంక్షాన్వితయై యున్న సత్యవతిమాతను రప్పించి యిరువురను గూర్చుండఁబెట్టి వారివారికిఁ దగినట్లు బ్రాహ్మణ క్షత్రియ పాత్రములైన సౌమ్యక్షాత్ర మంత్రములతో రెండుచరువులను సిద్ధముచేసి బ్రాహ్మణోచితము, సౌమ్య మంత్ర సంసిద్ధమునగు చరువును భార్యయగుసత్యవతికి, క్షత్రియోచితము, క్షాత్రమంత్రసంసిద్ధమునగు చరువును సత్యవతితల్లికి నిచ్చి వాని నుపయోగింపుఁ డని చెప్పి ఋచీకుఁడు సమిత్కుశఫలాదులను దీసికొనివచ్చుటకు వనమునకుం బోయెను.

అపుడు సత్యవతితల్లి సత్యవతిని బిలిచి "బిడ్డా! లోకములో నెవ రైనను దమబిడ్డలు చాల గొప్పవారు కాఁగోరుదురు. అందుచే నీ పతి నీకుఁ గలుగఁబోవు బిడ్డఁడు గొప్పవాఁ డగునట్లు తగిన మంత్రములను జదివి చరు వొనరించి యది నీ కిచ్చియుండును. నేను పైదానను గాన, నాకు సామాన్యుఁ డగుసుతుఁడు కలుగునట్లు సామాన్య మంత్ర ములతోఁ జరువును దయారుచేసి యిచ్చియుండవచ్చును. ఆఁడుబిడ్డ తనసోదరుఁ డఖిలగుణసమగ్రుఁడు గాఁగోరును. కావున, నీ కిచ్చిన

చరువు నా కిమ్ము, నా కిచ్చినది నీవు గ్రహింపుము" అని పలికెను. అందులకు సత్యవతి యాశ్చర్యపడి "అమ్మా! ఇంతవిడ్డూరపుగ మాటాడితివేమే? అట్టి పక్షపాతముచూపు సామాన్యునిగా నీ జామాత నెంచితివే? నేను నీ కోసమై ఆయనను బతిమాలి నీకును బుత్రసంతా నము కలుగునట్లు వరమును గ్రహించితిని. అట్టి మాపట్ల నీ కిట్టి సందేహము కలుగుట దురదృష్టము. రెంటను నొకటే. నీ సందేహము పోవుటకు పోనీ నాదే నీవు తీసికొనుము. నీది నేను గ్రహింతు" నని తన కుద్దేశింపఁబడిన చరువును దల్లి కిచ్చి తల్లి యుపయోగింపవలసి నది తాను గైకొని యిరువురు వానిని మహాప్రసాదముగా స్వీకరించిరి. తరువాత సత్యవతితల్లి బిడ్డను వీడుకొని తనపట్టణమున కేగి సుఖ ముండెను.*

ఋచీకమహర్షి యింటికి వచ్చి చరు వుపయోగించినవెంటనే గర్భ వతి యైనసత్యవతిని జూచి యామెగర్భము రౌద్రగతి వర్తిల్లుటయుఁ గాంచి "సతీ! నేఁ జెప్పినచొప్పునఁ జేయక నీవు గైకొన వలసినచరువు మీయమ్మ కిచ్చి యామె గైకొనవలసినది నీవు గైకొంటివి. అందుచే నీగర్భ మింత రౌద్రముగ నున్నది. ఈ తాలుమాలువలన:

"భయదక్షత్రియకర్మతుండును మహాభాగుండు శస్త్రాస్త్రపా
ణియుఁ గానున్నసుతుండు పుట్టెడుసుమీ నీయందు! వేదాంతవే
దియు నత్యంతతపోధనుండు నవనీదేవాన్వయాచారవ
ర్తియుఁ గానున్నతనూభవుండు కలుగున్ దెల్లంబు మీతల్లి కిన్."

విష్ణుపురాణము, ౬ ౧౩౩.

(నీకు భయంకర మగుక్షాత్రధర్మమును పాటించుచు శస్త్రాస్త్రపాణి యగు కుమారుఁడు పుట్టును. మీతల్లికి వేదాంతవేది, మహాతపస్సంపన్నుఁడు. బ్రాహ్మణాచారవర్తి సాధువు నగుపుత్రుఁడు కలుగును) అని పలికెను.

---

* ఇది శ్రీవిష్ణుపురాణకథ. భారతమున తల్లిబిడ్డ లిరువురు పొరపాటున నొక రుపయోగింపవలసిన చరువును మఱియొక రుపయోగించి రనియు నందుచే బ్రహ్మక్షత్రములు తడఁబడె ననియుఁ గలదు.

అందులకు సత్యవతి భయభ్రాంతయై భర్తపాదములపైఁబడి తనతప్పు క్షమింపు మని ప్రార్థించెను. దాని కాతఁడు "ఇది దైవ కృతము. కర్మమునుబట్టి బుద్ధి పుట్టుచుండును. అది తప్పింప సాధ్యము కా" దనెను. సత్యవతి మిక్కిలి ఖేదపడి తనబిడ్డ యంత కఠిన క్షత్ర ధర్మముచే భీతావహుఁ డైనఁ దాను భరింపఁజాలననియు ఆ గుణములు తనపుత్రునియందుఁగాక పౌత్రునియందైనయెడల గొంత మనమున కూఱట కలుగును కనుక, నట్లైన ననుగ్రహింపుఁ" డని భర్తను గోరెను. ఎట్టకేల కాతఁడు దాని కనుమతించి యట్లేయగుఁగాక యని వరమును ప్రసాదించెను. *

---

* త్రికాలజ్ఞుఁ డగుఋచీకుని కీ విషయము తెలియనిదికాదు. అట్లు జరుగ వలసియున్న దని యాతఁ డెఱుఁగును. అది పూర్వము బ్రహ్మ విధించినది. చ్యవ నుఁడు ప్రయత్నించి మాన్పలేకపోయినది. ఒకప్పుడు దేవతలు మునీశ్వరులు బ్రహ్మ లోకమున సభ దీర్చియున్న సమయమునఁ బ్రసంగవశమున భృగు కుశిక వంశములకు బ్రహ్మక్షత్రములు తడఁబడి వర్ణసంకర మగునని బ్రహ్మ పలికెను. ఆ సమయమున నచట నున్న చ్యవనమహర్షి యీ మాట వినెను. నాఁటినుండి యాతఁ డెట్లైనఁ దనభృగువంశము కుశికవంశముతో సంకరము కాకుండున ట్లొనరించు నుపాయముల నెన్నిఁటినో పన్నఁదొడఁగెను. తానే కుశికవంశమును నాశన మొనరించినచో నీ ప్రమా దము కలుగ దని భావించి కుశికభూపాలుఁ డగు కుశనాభునియింటి కేఁగి యాతని పరిచర్య లందుచున్నను నాతని నెందయినఁ దప్పుపట్టి యాతనివంశము నాశనమగు నట్లు శపించి తీరవలయు నని పట్టుపట్టి యుండెను. భార్యాసహితుఁడై కుశికభూ పాలుఁ డతిశాంతియుతుఁడై యాతనికి సకలపరిచర్య లొనరించుచుండెను. చ్యవనుఁడు యోగశక్తి నదృశ్యుఁ డగుచు వచ్చుచుఁ బోవుచు నా దంపతులను గొట్టుచుఁ దిట్టుచుఁ బెట్టరానిబాధలఁ బెట్టుచు గొడ్ల బాదినటులు బాదుచు, తాను రథ మెక్కి వారిని లాగుమని కశాహతుల రక్తము కాలువలుగట్టఁ జేయుచు వారిశాంతమునకు భంగము కలిగించి శపింపవలయు నని విశ్వప్రయత్నములు చేసెను. కాని, చ్యవనమహర్షియే ఓడిపోయెను. కుశికభూపతియు భార్యయు సత్త్వగుణసంపన్నులై సర్వోత్తమమగు శాంతిసహనశక్తులతుది చూచినవారై దిగ్విజయము సాధింపఁ గలిగిరి. ఇంక, చ్యవన మహర్షి పరమప్రీతుఁడై వారికిఁ గోరినవరము లనుగ్రహించి భువిపై దివి చూపి కుశికభూపతికి మూఁడవతరమువాఁడు బ్రహ్మతేజోదీప్తుఁ డయి పుట్టుననియుఁ దన

తరువాతఁ గొంతకాలమునకు శుభలగ్నమున సత్యవతి జమదగ్ని యనుసుపుత్రునిం గాంచెను. ఆమెతల్లియు విశ్వామిత్రునిఁ గనియెను. తదనంతరము ఋచీకమహర్షి సర్వసంగపరిత్యాగ మొనర్చి తపోవనమునఁ బరమైకాంతికుఁడై యోగ మవలంబించి బ్రహ్మైక్యమందుటకుఁ బోవుచుఁ బత్నియగుసత్యవతికి శాశ్వత మగుపుణ్యనదీత్వము కలుగునట్లు వర మొసఁగి యామెను సంతృప్తిపఱచి వెడలిపోయెను. సత్యవతి కొంతకాలమైనపిదప కౌశికీనదీమతల్లియై శాశ్వతత్త్వముఁ బడసెను. జమదగ్ని యిక్ష్వాకు వంశజుఁడై నరేణు వనుమహారాజుపుత్రిక యగురేణుకను వివాహమాడెను. ఆమెయందు :

"సకలక్షత్రికులప్రభంజనకళాసంపన్నబాహాబల
ప్రకటీభూతసమస్తలోకుఁడు మహీభారావతీర్ణప్రభా
వకళాకర్మఠవైష్ణవాంశజననవ్యాపారశౌర్యుండు శం
భుకుమారప్రతిమానుఁడై పరశురాముం డుద్భవించెన్ ధరన్."

(విష్ణు పురాణము ౪-౧౩౭.)



---

మనుమఁడు ఋచీకుఁ డనువాఁడు గాధి కూఁతును బరిణయమై జమదగ్నిఁ గని యాతనియందు సకల ధనుర్వేదమును నిలుపు ననియు, శ్రీహరి యాతని పుత్త్రుఁడుగాఁ బరశు రామావతారముఁ దాల్చి భూమి నిఃక్షత్ర మొనరించుననియుఁ దెలిపెను.

# మహర్షుల చరిత్రలు

## కామందక మహర్షి

### బాల్యము

కామందకుఁ డొకమహర్షి. అతఁడు మహాతపస్సు చేసి ధర్మశాస్త్రములను అధ్యయనము చేసి వేదాదివిద్యలను సంపాదించెను. అతఁడు ధర్మతత్త్వజ్ఞుఁడుగ, నీతిశాస్త్రజ్ఞుఁడుగ, భారతమునఁ గానవచ్చుచున్నాఁడు. ఆ మహనీయుని జన్మవృత్తాంతము కాని యితరచరిత్ర కాని యేమియు లభింపలేదు.

కామందకుఁడు తపోజీవనముఁ గడపుచు ధర్మమూర్తియు నీతిపారగుఁడునై యుండెను. అంగరిష్ఠుఁడు (అరిష్టుఁడని కొన్ని భారత ప్రతులలో కలదు) అనురాజు కామంపక మునికి శిష్యుఁడై యాతనివలన ననేక ధర్మవిషయములను దెలిసికొనుచు నాతనిని గురువుగ భావించి పూజించుచుండెను.

### అంగరిష్ఠునికి బోధించుట

ఒకప్పు డంగరిష్ఠుఁడు ధర్మార్థకామమోక్షము లనుచతుర్విధ పురుషార్థముల విషయమునను కొన్ని సందేహములు కలిగి ఆ సందేహములను గురుముఖమున నివారించుకొనఁ దలఁచి కామందకమహర్షి యాశ్రమమునకు విచ్చేసెను. కామందకుఁ డాతని నాదరించి అతిథి సత్కారములు నెఱపి వచ్చినపని అడిగెను. అతఁడు శ్రద్ధాభక్తులతో కామందకునికి నమస్కరించి "మహాత్మా! ధర్మార్థ కామములను గూర్చిన కొన్ని సంశయములు నాకుఁ గలవు. ఈ త్రివర్గములో దేనియందు ప్రధానముగా లోకయాత్ర నెలకొనియున్నది? దీనికి మూల మేమి? కామమోహావృతుఁ డగురాజు చేసినపాపములకు విఱుగుడు

కలదా? ఏ సుకృతులచే ఆ దుష్కృతమును బోఁగొట్టుకొనవచ్చును? అజ్ఞానముచే అధర్మమైనదానిని ధర్మముగా భావించి చేసినవానికి ప్రాయశ్చిత్తమేమి? ఇట్టి సంశయములకు నాకు సమాధానము చెప్పి కటాక్షింపు" మని ప్రార్థించెను.

కామందకుఁ డారాజు నాదరించి సావధానుఁడవై విను మని హెచ్చరించి యిట్లు చెప్పఁదొడఁగెను. "రాజా! ధర్మార్థకామములకు పరస్పరసంబంధము కలదు. అర్థమునకు మూలము ధర్మము, ఫలము, కామము. వీనికి సంకల్పము కారణము. ధర్మేతర మగు దానివలన నైతము అర్థము లభింపవచ్చును. కాని, అట్టి యర్థమువలన ధర్మార్థములకు పరమయినమోక్షము లభింపదు. ఫలమును కోరనిదే ఉత్తమమైన ధర్మము. ఫలమును కోరుట, ధర్మమును మలీమస మొనరించుట యగును. అట్లే ఇంద్రియసంతుష్టిఁ గోరుటయే కామమును మలీమస మొనరించుట యగును. ఈ విధముగ మలీమసము కానిధర్మకామములు చిత్తశుద్ధికి హేతువులై మోక్ష మొసంగును.

ధర్మార్థములను విడిచిపెట్టి కేవలము కామమునే ఆరాధించువాఁడు ప్రజ్ఞాహీనుఁడై నశించును. కామమోహములవలననే ప్రజ్ఞ నశించును. ప్రజ్ఞ నశించుటే నాస్తిక్యమునకు, దురాచారమునకు కారణము. రాజు తా నీ స్థితికి వచ్చినను, లేదా తన ప్రజ లీ స్థితికి వచ్చినపుడు వారిని శిక్షింపక విడిచినను, అతని పతనము సమీపించుట సూచించును. ఉత్తములగు ప్రజలు, ధర్మాత్ములగు బ్రాహ్మణులు, సాధుసజ్జనులు, అట్టిరాజును జూచి యసహ్యించుకొందురు. అట్టివార లసహ్యించుకొనుట వలన రాజు అవమానమును, దుఃఖమును, పతనమును అనుభవింప వలసివచ్చును.

అట్టి ఆపత్కాల మొకప్పుడు రాజునకు సంప్రాప్తించినయెడల, అతఁడు వెంటనే మేలుకొని తన్నివారణోపాయముల నాచరింపవల యును. వేదములను, విప్రులను, ధర్మమును మిక్కిలి పూజింపవల యును. క్షమ కలిగి, శాంతి నిలిపి, సత్యము నారాధించి, ఆస్తిక్య మును పెంచి, సంతోషమున సజ్జనసాధుసేవల నాచరింపవలయును.

మఱియు రాజ్యమునందలి దుష్కర్ములను దూరమునకుఁ దొలఁగింప వలయును. ధర్మాత్ములను దరిఁజేర్పవలయును. మంచి మాటలచేతను, మంచిపనులచేతను ప్రజలను ప్రసన్నులను జేసికొనవలయును. తనకు శత్రువు అయినను, పరులయుత్తమగుణము లనే శ్లాఘించుచు రాజు జనమంచినడవడి నిరూపింపవలయును. గురువుల వచనములపై గుఱి నిలిపి, వానిని ఆలసింపక, తర్కింపక ఆచరించి వారియనుగ్రహ మును, తన్మూలమున రాజు తన శ్రేయమును సంపాదించుకొనఁ గలుగును."

ఈ మాటలు విని యంగరిష్ఠుఁ డానందించి కామందకునికి అనేక నమస్కారము లొనరించి యాతనిసెలవు గైకొని వెడలి ఆ ప్రకార మాచ రించి ధర్మప్రభు వయ్యెను. *

## కామందక నీతిశాస్త్రము

కామందకుఁడు అపుడపుడు రాజులకు బోధించిన ధర్మముల సంక లనమే కామందకనీతిశాస్త్రము. ఇది 'కామందకనీతి' 'కామందకనీతి సారము' అనుపేళ్ల వ్యవహరింపఁబడుచున్నది. ఇది రాజనీతి బోధించును.

ఇందు ముప్పదియాఱుప్రకరణములు కలవు. మొదటిది ఇంద్రియ విజయప్రకరణము, రెండవది విద్యావినయసంయోగప్రకరణము, మూఁడవది విద్యావిభాగప్రకరణము, నాలుగవది వర్ణాశ్రమ వ్యవస్థా ప్రకరణము. ఐదవది దండమాహాత్మ్యప్రకరణము. ఆఱవది ఆచార వ్యవస్థాప్రకరణము, ఏడవది ప్రకృతిసంపత్ప్రకరణము. ఎనిమిదవది స్వామ్యనుజీవనవృత్తప్రకరణము, తొమ్మిదవది కంటకశోధనప్రకరణము, పదియవది రాజపుత్రరక్షణప్రకరణము, పదునొకండవది ఆత్మరక్షణ ప్రక రణము, పన్రెండవది మండలయోనిప్రకరణము, పదుమూఁడవది మండల చరిత్రప్రకరణము, పదునాల్గవది సంధివికల్పప్రకరణము, పదునైదవది

* భారతము. శాంతిపర్వము.

విగ్రహవికల్పప్రకరణము, పదునాఱవది యానాసన ద్వైధీభావ సంశ్రయ వికల్ప ప్రకరణము, పదునెనిమిదవది దూతప్రచార ప్రకరణము, పందొమ్మిదవది దూతచరవికల్పప్రకరణము, ఇరువదవది ఉత్సాహ ప్రశంసా ప్రకరణము, ఇరువదిఒకటవది ప్రకృతికర్మ ప్రకరణము, ఇరువదిరెండవది ప్రకృతివ్యసన ప్రకరణము, ఇరువదిమూఁడవది సప్తవ్యసన వర్గ ప్రకరణము, ఇరువదినాలుగవది యాత్రాభియోక్తృప్రదర్శ ప్రకరణము, ఇరువదియైదవది స్కంధావార నివేశన ప్రకరణము, ఇరువది యాఱవది నిమిత్తజ్ఞాన ప్రకరణము, ఇరువదియేడవది ఉపాయవికల్ప ప్రకరణము, ఇరువదియెనిమిదవది సైన్యబలాబల ప్రకరణము, ఇరువదితొమ్మిదవది సేనాపతిప్రచార ప్రకరణము, ముప్పదియవది ప్రయాణ వ్యసన రక్షణ ప్రకరణము, ముప్పదియొకటవది కూట యుద్ధ వికల్ప ప్రకరణము, ముప్పదిరెండవది గజాశ్వ రథ ప్రతికర్మ ప్రకరణము, ముప్పదిమూఁడవది పత్త్యశ్వ రథ గజ భూమి ప్రకరణము, ముప్పదినాలుగవది దానకల్పన ప్రకరణము, ముప్పదియైదవది వ్యూహ వికల్ప ప్రకరణము, ముప్పదియాఱవది ప్రకాశయుద్ధ ప్రకరణము.

ఈ ముప్పదియాఱుప్రకరణములు ఇరువదిసర్గలలో గలవు. మొదటి సర్గలో మొదటిరెండుప్రకరణములు కలవు. రెండవసర్గలో మిగిలిన మూఁడు ప్రకరణములు కలవు. మూఁడవసర్గలో ఆఱవప్రకరణ మొక్కటి కలదు. నాల్గవసర్గలో ఏడవప్రకరణము గలదు. ఎనిమిదవప్రకరణము కలది ఐదవసర్గ. తొమ్మిదవప్రకరణము కలది ఆఱవసర్గ. పది, పదు నొకండు ప్రకరణములు కలది ఏడవసర్గ. పండ్రెండు, పదుమూఁడు ప్రకరణములు గలది ఎనిమిదవసర్గ. పదునాలుగు, పదునైదు ప్రకరణ ములు కలది తొమ్మిదవసర్గ. పదునాఱవప్రకరణము కలది పదవసర్గ. పదునేడవప్రకరణము కలది పదునొకండవసర్గ. పదునెనిమిదవ ప్రకర ణము గలది పండ్రెండవసర్గ. పందొమ్మిది, ఇరువదిప్రకరణములు గలది పదుమూఁడవసర్గ. ఇరువదియొకటి, ఇరువదిరెండు, ఇరువది మూఁడు ప్రకరణములు గలది పదునాల్గవసర్గ. ఇరువదినాల్గవ ప్రకర ణము పదునైదవసర్గ. ఇరువదైదవప్రకరణము పదునాఱవసర్గ. ఇరు వదియాఱు, ఇరువదియేడుప్రకరణములు గలది పదునేడవసర్గ. ఇరువది

యోనిమిషవ్రకరణము కలది పదునెన్మిదవసర్గ. ఇరువదితొమ్మిది, ముప్పది, ముప్పదియొకటి, ముప్పదిరెండు ప్రకరణములు గలది పందొమ్మిదవసర్గ. ముప్పదిమూఁడు, నాలుగు, ఐదు, ఆఱు ప్రకరణ ములు గలది యిరువదవసర్గ.

ఇందలివిషయ మీ విధముగ నున్నది: చంద్రుఁడు సముద్రము నుప్పొంగఁజేయునట్లు రాజు ప్రజలను సంతోషపెట్టవలెను. నావికుఁడు లేని నావవలె మంచిరాజులేని రాజ్యము నశించును. రాజు ధర్మమార్గ మవలంబించి ప్రజలను రక్షింపవలయును. అపుడు వారివలన నాతఁ డభ్యుదయముఁ గాంచును. న్యాయమార్గమున రాజు ధర్మార్థకామ పాలనముతోపాటు ప్రజాపాలనము కావింపవలయును. ధర్మమార్గ మవలంబించి వైజవనుఁ డనురాజు చిరకాల మేలెను. అధర్మమార్గ మవలంబించి నహుషుఁ డింద్రాధిపత్యమును గోలుపోయెను. రాజ్య మనుచెట్టు ధర్మమనుతల్లివేరుతో సంపదలనుపండ్లనొసంగును. స్వామి అమాత్యుఁడు, రాష్ట్రము, బలము, దుర్గము, మిత్రులు, కోశము అను సప్తప్రకృతులతో కూడినదే రాజ్యము; సన్మార్గవర్తియగురాజు ఈ సప్తాంగములకు లాభము చేకూర్పవలయును. న్యాయముగా ధన మార్జించుట, ఆ ఆర్జించినదానిని చక్కగా సంరక్షించుట, మఱియు దానిని మిగుల వృద్ధిచేయుట, యోగ్యులకు దాన మొసంగుట అను ఈ నాలుగు రాజవృత్తము లనఁబడును, వీనిని రాజు పాటింపవలయును.

నయమునకు మూలము వినయము. అది శాస్త్రపరిశోధనాఫలము. వినయ మింద్రియవిజయ మొసంగును. దానివలన సిరి లభించును. ప్రజ్ఞ శాస్త్రము, ప్రగల్భత, ధృతి, ధారణాశక్తి, దాక్షిణ్యము, సత్యము, కష్టసహిష్ణుత, ఉత్సాహము, త్యాగము, మైత్రి, దార్ఢ్యము, వాక్శ్రీ, పుణ్యము, ఆభిజాత్యము, ప్రభుశక్తి, సుస్వభావము, దమము, శౌచము, కృతజ్ఞత, ఇవి ఎప్పుడైనను, ఎక్కడనైనను సంపదలకు హేతువులు. రాజు తొలుత పంచేంద్రియములను వశపఱచుకొని పిదప మంత్రిభృత్యసుతప్రజలను వినయాన్వితులనుగాఁ జేసుకొనవలయును. ప్రజానురక్తి, వినీతి గలరాజెప్పుడును శుభములనే పొందును. పిష

యము లనెడిఅడవులలో యథేచ్ఛముగాఁ దిరుగుచు తన్నుఁ బట్టవచ్చు వారిని పరిపరివిధముల బాధించు నింద్రియము లనునేనుఁగును జ్ఞానమనుఅంకుశముచే పొడిచి వశపఱచుకొనవలయును. ఆత్మ ప్రయత్నముచే మనస్సు నింద్రియములపై పునకుఁ ద్రిప్పి భోగకాంక్ష కలుగఁ జేయును. యత్నమువలన నింద్రియనిగ్రహ మొనర్చి రాజు జితేంద్రియుఁడు కావలయును. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనునైదును జ్ఞానేంద్రియములు. పాయూపస్థహస్తపదవాక్కులు కర్మేంద్రియములు. శబ్దస్పర్శరూపరసగంధములు, ఉత్సర్గహర్షగ్రహణగత్యాలాపములు, నింద్రియములు సేయుపనులు. వీనిని అంతఃకరణ మందురు. ఆత్మ మనస్సులప్రయత్నమే సంకల్పము. ఆత్మకుఁ గలశ్రవణేంద్రియాద్యర్థములను 'బహిష్కరణ' మందురు. ఈ అంతఃకరణబహిష్కరణములు రెండును ప్రయత్నమువలననే కలుగుచుండును. ఆ ప్రయత్నము చేయకుండుటే అమనస్కత. మనస్సును జయింపలేనివాఁడు ఏమియు జయింప లేఁడు. శబ్దస్పర్శరూపరసగంధాదులలో నేదైనను నాశహేతువే. అన్నియుఁ గూడిన నిఁక వేఱే చెప్పనక్కఱలేదు. శబ్దమాధుర్యమునకుఁ జిక్కి శాకాహారియయ్యు మృగము నశించును. గిరీంద్రసదృశ మైనయేనుఁగు ఆఁడేనుఁగు స్పర్శ నాశించుటచే బంధముఁ గాంచును. దీపపురూపమునకు ఆశపడి మిడుత నశించును. గాలపు మాంసము నాశించి మీనములు వలలో పడి నశించును. గంధలోభముచే తుమ్మెదలు మదగజగండస్థలము నాశించి దానిచెవులదెబ్బలచేఁ జచ్చును. ఈ విధముగా ఏ ఒక్కటియైనను ప్రమాదహేతువై యుండుచున్నప్పుడు అన్నియుఁ గలిసిన నరుని కెప్పుడును క్షేమము లేదు. ఇంద్రియములను కాలానుసారము సేవించినయెడల నష్టపోఁడు. అట్లుకాక, ఎప్పుడును స్త్రీలోలుఁడైనవాని సంపదలు హానియౌవనముతోడనే జారిపోవును. ధర్మమువలన అర్థము, దానివలన కామము, దానివలన సౌఖ్యము పొందువాఁడే ధన్యుఁడు. అన్యుఁడు తననాశనమును దానే తెచ్చుకొనును. అందుదానిపేరే వికారము కల్పించి ఆపదకు హేతువగును. అట్టివట్టున అందగత్తెను జూచినవానిపతనమునకు సందేహ మేల యుండును? నిర్మలము, కాంతియుతము నగుసంధ్యాసమయచంద్రబింబమువలె ప్రసన్నవదనాంబుజయగు స్త్రీ మునులకైతము రాగయుక్తు

లను జేసి వశపఱచుకొనును. హృదయంగమమైనస్త్రీ, మందయాన మొనర్చుచుగువ, నీరు, పర్వతమును భేదించునట్లు మహాత్ములైన భేదించును. పాండురాజు, నలమహారాజు, యాదవులగుసాంబాదులు మున్నగువారిని దలంచి రాజు వేట, జూదము, పానము తప్పక విడువ వలయును. కామక్రోధములను లోభమోహమదమాత్సర్యములను గాంచినమహారాజు లెందఱో భ్రష్టులై పోయిరి. అరిషడ్వర్గమును జయించినవారు నాభాగాంబరీషభార్గవులవలె శాశ్వతకీర్తి నార్జింతురు. విద్యావినయసంయోగము గలరాజు తావి యబ్బినమేలిమి బంగారము వలెఁ జాలశోభించును.



# మహర్షుల చరిత్రలు

## కౌశిక మహర్షి

### జపతత్పరత

పిప్పలాదమహర్షి వంశమున కౌశికుఁ డనునొకమునికుమారుఁ డుదయించెను. అతఁడు బాల్యము కడచి ఉపనీతుఁడై సదా జపతత్పరుఁడై యుండెను. మఱియు నతఁడు వేదవేదాంగవిదుఁడు, ధర్మశాస్త్రజ్ఞుఁడు, మహాప్రాజ్ఞుఁడు అనుగొప్పకీర్తి సంపాదించెను. అపరోక్షజ్ఞానము షడంగములవలన సంపాదించి హిమవత్పర్వత పార్శ్వప్రదేశము నాశ్రయించి ఆ మహనీయుఁడు సంహితాజపము బ్రాహ్మ మగు జపము నిరంతరాయముగా నిష్ఠాగరిష్ఠుఁడై చేయుచుండఁగా వేయి సంవత్సరములు గతించెను. అగ్నిహోత్రునివలె నాతఁడు తేజఃపుంజమయ్యెను. అతఁడు మూర్తీభవించిన బ్రహ్మమో యన వెలుఁగొందుచుండెను. శీతవాతాతపములకుఁ జీకాకుపడక, లాభనష్టములయెడఁ దగులువడక, జపతపము లొనరించుటకే జన్మించి నట్లు విసుగువిరామము లెఱుఁగక జపతపములే యొనరించి శాంతిదాంతియుతుఁడై సంతుష్టహృదయుఁడై సర్వజనరంజకుఁడై యలరారుచుండెను.

### సావిత్రి ప్రత్యక్షమగుట

ఇట్లుండఁ గొంతకాలమునకు ఆ మహర్షి నిరుపమనిష్ఠకు మెచ్చి సావిత్రీదేవి యాతఁనికిఁ బ్రత్యక్షమయ్యెను. అతఁ డామెను గన్నెత్తి చూడఁడయ్యెను. అంత నామె "వత్సా! నీ జపనిష్ఠకు మెచ్చితిని. నేను సావిత్రిని. నీ కేమి కావలయునో కోరుకొనుము ఇచ్చెద" నని పలికెను. ఐనను, తనజపము నిలుపుచేసి మాటాడుట కిచ్చగింపక ఆ మహనీయుఁడు జపమునే చేయుచుండెను గాని యామెకు మ్రొక్కనైన మ్రొక్కఁ డాయెను. సావిత్రీదేవి చల్లనితల్లి యగుటచేతను, అతని

యుల్లము నెఱిఁగిన సల్లలితహృదయ యగుటచేతను అతఁడు తన్నుఁ దృణీకరించినను ఆమె యాతనిని దృణీకరింపక పోవుటే కాక, అతని జపనిష్ఠ నభినందింపఁ దొడఁగెను. ఇట్లు చాలసేపైనపిదప కౌశికుఁడు తన నియమము ప్రకారము జపము పరిపూర్తియైన పిదప, కన్నులు విప్పి గాయత్త్రీదేవిని కాంచి శ్రద్ధాభయభక్తివినయ విధేయతలతో లేచి వచ్చి యామెపాదములపైఁ బడి తల్లీ! సర్వలోకములు శాంతిసౌఖ్యముల నలరారుటకు నీవే కారణము, నీవే సర్వవేదసారము. నీ చలువ వల్లనే నిఖిలలోకములు నిలిచియున్నవి. నేను మిగులమందబుద్ధినైనను, నీ నిర్వ్యాజకటాక్షమును నాపైఁ బఱపి నాయెడ పుత్త్రవాత్సల్యముంచి యిటు విచ్చేసితివి. ఎంతటి తపశ్శాలులకు నీ దర్శనము లభించుటరిది. అట్టిపట్టున నీ దర్శనము లభించిన నా భాగ్యము నెంతగ గొనియాడుకొందునోకదా! అమ్మా! ఆదరించి నన్ను నీవు ఆశీర్వదింపుము" అని ప్రార్థించెను.

కౌశికుని నిష్కల్మషహృదయమును మెచ్చుకొని అతని నిరుపమ నిష్ఠ కలరిన సావిత్త్రి "వత్సా! నీ కేకోరిక కావలయునో కోరుకొమ్ము, సిద్ధింపఁ జేసెదను. ఇంతటి నిష్ఠాగరిష్ఠునికోరిక లీడేర్చుటకంటె మాకుఁ గావలసిన దేమున్నది? నీకోరిక యెంతదుష్కరమైనదైన నిచ్చెదను. సందేహ ముడిగి సవినయముగాఁగోరుకొను" మని చెప్పెను. అంత నాతఁడు చేతులు జోడించి నిలిచి "తల్లీ! నాయెడ నీకు కటాక్షము కలిగినచో నాజపనిష్ఠ ఇనుమడించునటులు, అది నీకు మఱింతప్రీతికర మగునటులు నన్నుగ్రహింపుము. జపమునఁ బుట్టి జపమునఁ బెరిగి జపశరీరుల మైన మా కింతకంటె వేఱుకోరిక యేముండును?" అని పలికెను. ఆమె మిక్కిలి సంతసించి "విప్రోత్తమా! నీవు కోరినకోరిక కోరికయే కాదు. ఐనను, నీవు కోరినట్లే యగునట్లు వరమిచ్చితిని. అది కాక ఇంకొకకోరిక కోరుకొనుము. కోరికతోఁ జేసినజపము ఫలవంతను కాదని నీవు భయపడనక్కఱ లేదు. నీకు శాశ్వతమైనబ్రహ్మప్రాప్తి యగును. ఏకాగ్రచిత్తముతో నీ విట్లే జపించుచున్న, అనతికాలముననే ధర్మదేవత వచ్చి నీమ్రోల నిలుచును. అంతే కాదు కాల మృత్యువులు నీకడకు విచ్చేయుదురు. నీకు శుభ మగు" నని యదృశ్యయయ్యెను.

పిదప, కౌశికమహర్షి మిక్కిలియుత్సాహమున జపతపస్స్వాధ్యాయ దీక్షానవద్యుఁడై మఱియొకనూఱుదివ్యసంవత్సరములు కడపెను. ఆతని హృదయము ప్రశాంతపరిపూర్ణ మయ్యెను. దమ మాతనిసొమ్మయ్యెను. క్రోధాదు లాతనినే కాదు ఆ పరిసరములనే వీడి మాఱుమూలల మాటు మణఁగెను. శమదనములతో పాటు ఆతఁడు సత్యము, జ్ఞానము, అనసూయ పెంపొందించుకొనెను. ఆతఁడు జపసిద్ధిని గాంచెను. జీవిత సార్థక్యమును గడించెను, జ్ఞానస్వరూపుఁ డయ్యెను.

## ధర్మదేవత ప్రత్యక్షమగుట

ఇట్లుండ ధర్మదేవత కౌశికమహర్షి గొప్పతనమును విని వెదకు కొనుచు నాతని దర్శనమునకు విచ్చేసెను. అనంతర మాతఁడు కౌశికు నితో "బ్రాహ్మణోత్తమా ! నీ నిష్ఠాగరిష్ఠత విని మెచ్చి నీదర్శనము కోరి వచ్చియున్నాను. నేను ధర్మదేవతను. నీ జపమునకుఁ దగినఫల మందుదువు. నిరతిశయములైన పుణ్యలోకములన్నియు నీవు సాధించి తివి. నీకుఁ గావలసినలోకమున కేగి సుఖముల నందుము. ముం దీశరీర మును విడిచివేయుము" అని చెప్పెను. దానిపై నాతఁడు "అయ్యా ! నీ కొక్కనమస్కారము. నా కేలోకము ఏ సుఖము నక్కఱ లేదు. ఈ లోకము, ఈ సుఖము, ఈ జపము నాకుఁ జాలును. నీవు ధర్ముఁడవై నను నీతో నాకుఁ బనిలేదు. పోయి రమ్ము శుభము" అని జవాబు చెప్పెను. ధర్ముఁ డందుల కాశ్చర్యపడి "ఓయీ ! వెఱ్ఱివిప్రుఁడా ! సిరి రా మోఁకాలొడ్డువాఁ డుండునా? ఎంతటివారికైనను, ఏమైనను, లభింపని పుణ్యలోకము నీకు దయతో ననుగ్రహింప మహానుగ్రహ మని స్వీక రింపక తృణీకరించెదవు ? నీ కేమైన మతిస్థిరత చెడినదాయేమి ?" అని పలికెను. అంత నా బ్రాహ్మణుఁడు "పోనిమ్ము. నీ వేమనుకొన్నను నాకు సంతోషమే. నీవు నన్ను విడిచినఁ జాలును. పొ"మ్మని వాక్రు చ్చెను. అంత ధర్ముఁ "డోయీ ! ఈ పాంచభౌతిక మగుదేహముపై మమకారము విడువలేక యట్లు పలుకుచున్నావు. దీనిని శీఘ్రముగా విడిచివేసి శాశ్వతము లగుపుణ్యలోకముల నందుము." అని మరల బోధించెను. కాని, కౌశికమహర్షి "ధర్మప్రభూ ! నేను సశరీరస్వర్గసుఖ

మున కంగీకరించెదను. సర్వ సుఖదుఃఖములకుఁ గారణభూతమైన యీ దేహమును నేను విడువలేను. నీ వేమన్నను సరియే ” అని బదులు చెప్పెను.

## యమకాలమృత్యువులు ప్రత్యక్ష మగుట

అపుడు ధర్మదేవత కౌశికునిపట్టుదలకు జపతత్పరతకు సక్కజపడి “ఓయీ! నీ శరీరమును విడువకుండుటకు నీ యిష్ట మేనా? ఇదిగో! యమకాలమృత్యువు లేతెంచియున్నారు. నిన్ను నీ శరీరమునుండి తొలఁగించి తీసికొనిపోవుదురు. ఏమి చేయఁగలవో చూతును. నీ బాగు నీ వెఱుఁగనప్పుడు బలవంతముగనైన నీకు క్షేమమును మేము సంఘటింతుము ” అని పలికెను.

అంతలో యముఁడు, కాలము, మృత్యువు- ఈ ముప్వురును మానవరూపములను ధరించి వచ్చి కౌశికమహర్షియెదుట నిలిచిరి. కౌశిక మహర్షి వారికి నమస్కరించి నిలువఁగా యముఁ డాతనిని సంబోధించి తాను యముఁడ ననియు, కౌశికునిజపతపములకు, నిష్ఠాగరిష్ఠతకు మెచ్చి యాతని కుత్తమఫల మొసఁగుటకు విచ్చేసితి ననియు వాక్రుచ్చెను. అట్లే కాలముకూడ తన్నెఱుకపఱచుకొని కౌశికుఁడు స్వర్గాదిపుణ్య లోకముల కేగుటకు సమయము వచ్చినదనియు జీవుల పుణ్యపాపముల ననుసరించి స్వర్గాదులకుఁ గాని నరకాదులకుఁ గాని తటి యైనవెంటనే పంపుటే తనపని యనియుఁ జెప్పెను. పిదప మృత్యువుకూడ కౌశిక మహర్షికి తన్నెఱుకపఱుచుకొని కాలప్రేరణచే జీవులను సమయమైన వెంటనే ప్రమింగి కొనిపోవుటే తనపని యనియుఁ దెలిపి కౌశికమహర్షిని గొనిపోవుటకు వచ్చినసంగతి తెలిపెను.

వారిని జూచి కౌశికమహర్షి యణుమాత్రమును భీతిల్లక యమకాల మృత్యువులకు ధర్మదేవతకు సాష్టాంగప్రదక్షిణనమస్కారము లొనరించి అర్ఘ్యపాద్యాదుల నిచ్చి యాదరించి “అహా! నేఁడుకదా నా జన్మము ధన్యమైనది! మీలో నే యొక్కరిని జూచుటకు నెంతటివానికిని సాధ్యము

కాదు. అట్టిపట్టున మీ నలువురిదర్శనము నా కగుట నిజముగా నా పూర్వ జన్మ సుకృతము, మీరు నాకు ఉత్తమోత్తము లగు అతిథులైనారు. నాయందు దయచూపి సన్నిహిమి చేయుమందురో ఆనతిండు. మీ యాజ్ఞ శిరసావహించి ధన్యుఁడ నగుదును" అని పలికెను.

## ఇక్ష్వాకుమహారాజు విచ్చేయుట

ఇట్లుండ పుణ్యాత్ముఁడు, ధర్మనిలయుఁడు, తీర్థయాత్రాపరుఁడు నగు నిక్ష్వాకుమహారాజు తీర్థయాత్రలు చేసికొనుచు కౌశికమహర్షి యాశ్రమ ప్రాంతమునకు వచ్చి యాతని మహత్త్వము విన్నవాఁ డగుటచే నాతని దర్శనము చేసికొని పోవుద మని యాతని యాశ్రమమునకు వచ్చిచేరెను. అతనిని కౌశికమహర్షి యాదరించి అతిథిసత్కారాదులు జరిపి కుశలవార్త లడిగెను.

ఇక్ష్వాకుమహారాజు తనకుశలవార్తలు తెలిపి ధనధాన్యాదులేమైనఁ గావలసినఁ గోరుకొమ్ము. ఇచ్చెద నని కౌశికమహర్షితో మనవిచేసి కొనెను. ఆ మాటల కానందించి కౌశికమహర్షి "మహారాజా! నీ యభి మానమునకుఁ గృతజ్ఞుఁడను. లోకమునందలి బ్రాహ్మణులు ముఖ్య ముగా రెండు రకములవారు. ప్రవృత్తిమార్గపరులు, నివృత్తిమార్గ పరులు. ప్రవృత్తిమార్గపరులు వారికిఁ దగినప్రవృత్తి ధర్మములనే అవలంబింతురు. అట్లే నివృత్తిమార్గవర్తనులు వారికిఁ దగిననివృత్తి ధర్మముల నవలంబింతురు. నేను నివృత్తిమార్గమునందుండి నియమ నిష్ఠలు నిలుపుకొనుచున్నాను. కావున, నేను నీ నుండి యేమియు వాంఛింపను. ఏమైన బలవంతముగ నిచ్చినను తృణీకరింతును. అది యును గాక, లోకమునఁ బ్రవృత్తిపరు లెందఱెందరో గలరు. వారికి నీ వంటివా రిచ్చుటయు వారు కైకొనుటయు సమంజసము. కాని, అస్మాదృశులపట్లు నీ వితరణము నిరుపయోగము. నీకుఁ గావలసిన దేమే నున్న నడుగుము. ఈయఁగలిగిన ఇచ్చెదను. కాన, నీకిచ్చు వాఁడనే కాని నీకడఁ బుచ్చుకొనువాఁడను గాను" అని పలికెను.

ఆ మాటలకు ఇక్ష్వాకుమహారాజు "మునీంద్రా! మే ముత్తమ క్షత్రియులము. ఒక్క యుద్ధము తప్ప మే మింక నొరుల నేమియుఁ గోరము. మఱియు, యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహ షట్కర్మనిరతు లగుబ్రాహ్మణులు యాచించినను స్వీకరించినను తప్పు లేదు. కాని, మేము స్వీకరింప" మని బదులుచెప్పెను. ఆ మాటలు విని కౌశికమహర్షి చాల సంతోషించి "మహారాజా! ఇప్పుడు మన మిరువురము స్వధర్మపరిపాలనమున సమానులము. ధర్మక్రియులము కావున, నిపుడు నీవేమి చేసినను నాకు సంతోషమే. ఇచ్చినను పుచ్చుకొన్నను నాకు సమ్మతమే" అని బదులు చెప్పెను. "ఐనచో నీ జపమువలన లభించినఫల మంతయు నాకు ధారవోయుము. ఏ మడిగిన నిచ్చెద నని వాగ్దానము చేసితివి కాన, నీ వాగ్దానము చెల్లించుకొనుము" అని ఇక్ష్వాకుమహారాజు పలికెను. ఆ మాటలు విని కౌశికమహర్షి "మహారాజా! ఒక్కయుద్ధము కాని నొరుల నేమియు నెప్పుడును గోరనంటివి కదా!" అని పలికెను. ఇక్ష్వాకువు "విప్రర్షీ! నీకును నాకును వాగ్యుద్ధ మైనదికదా! కావున, నేఁ గోరినదోషము లేదు. ఇపుడు నిజముగా నీజపఫల మొసంగ వేఁడుకొందును" అని మరలఁ గోరెను. కౌశిక మహర్షి "రాజా! నిస్సంశయముగ నిచ్చెదను. నా వాగ్దానమును నిలుపు కొనుటకు నీవు నాప్రాణములనే యడిగినను ఇచ్చెదను పుచ్చుకొనవచ్చు నని బదులుచెప్పెను. "ఐన, నీజపఫల మిమ్ము" అని ఇక్ష్వాకువు మరల నడిగెను. "అట్లే యిచ్చెదను గ్రహింపుము. నా జపమువలనఁ గలిగిన ఫలమునం దర్ధభాగము నీకుఁ గావలయునా? లేక పూర్తిభాగము కావల యునా? తెలుపు" మని కౌశికమహర్షి యిక్ష్వాకుమహారాజు నడిగెను. "మునీంద్రా! సగమో పూర్తియో చెప్పుటకుముందు నీజపముఫల మేమో నాకుఁదెలుపుము. అది తెలిసినఁగదా నేను కోరుకొనుట" అని మహారా జనెను. దానికి మహర్షి "రాజా! జపముచేయుటే నా వంతు. దానిఫలిత మేమని నే నెప్పు డెవ్వరి నడుగ లేదు. నాకుఁ దెలియదు. నిజ ముగ దానిఫలితము నా కక్కఱ లేదు. జపము జపముకొఱకే చేసితి" నని బదులుచెప్పెను. ఆర్యా! ఫలిత మేమో తెలియనిజపమును నీవు నాకు ధారవోయుట యేమి? నేను గ్రహించుటేమి? ముందు ఫలితము చెప్పి పిదప ధారవోయు" మని యిక్ష్వాకు వడిగెను. దానికి కౌశికమహర్షి

"మహారాజా! నేను చేసినవాగ్దానము ప్రకారము నా జపఫలము నీ కిదే ధారపోసితిని. దానిఫలితమును జెప్పుమంటివి. నిజముగా దానిఫలిత మును నే నెఱుఁగ ననుటకు మానవాకారములు ధరించి వచ్చిన యీ ధర్మ కాలయమమృత్యువులే సాక్షులు. వారిని నీవు కనుఁగొనవచ్చు" నని పలికెను.

## కౌశికేక్ష్వాకుల విచిత్రవాదము

దానిపై నిక్ష్వాకుమహారాజు "నాకు సాక్షులతోఁ బని లేదు. నీ జపముఫల మేమియో నీవు చెప్పని యప్పుడు నా కది యవసరమే లేదు. నీవు ధారపోసిన నీ జపఫలము నేను స్వీకరింప లేను. కావున, నీవే దానిని పరిగ్రహింపు" మని పలికెను. "రాజా! నా జపఫలము నీకు ధారపోయుట యైపోయినది. ఇచ్చివేసినది తిరిగిపుచ్చుకొనుట లేదు. ఏ ఫలమాశించియు నేను జపము చేయ లేదు. మఱియు దానిఫల మిది యని తెలిసి చేయ లేదు. విప్రుఁడనై జన్మించితిని. వేదవేదాంగము లభ్యసించితిని. నిష్కాముఁడనై నిరుపమజప మొనరించుటే నావిధి యని నేను జప మొనర్చితిని. కనుక, జపఫలము నాకెంతమాత్రము తెలి యదు. నీ వడిగితివి ఇచ్చివేసితిని. నాకు వలదు, నీవే తీసికొను మని మరల నీ వనుటయు ధర్మము కాదు. నేను తీసికొనుటయు ధర్మము కాదు. నేను సత్యవాదిని. నీవు సత్యవాక్యపరిపాలకుఁడవు. కావునఁ బరిగ్రహింపుము. అసత్యమాడువారు తాము తరింపలేరు. ఒరులను తరింపఁజేయలేరు. యాగములుకాని త్యాగములుకాని సత్యమును పోలఁ జాలవు. వేయితపము లైన నొక్కసత్యముతో సాటి గావు. సత్యమే పరబ్రహ్మము, సత్యమే తపము, సత్యమే యజ్ఞము, సత్యమే వేదము, సత్యమే వేదచోదితము, సత్యమే యుత్తమఫలప్రదము, సత్యమే ధర్మ మూలము. సత్యము ననుసరించియే అగ్ని ప్రకాశించుచున్నది. సూర్యుఁ డుదయించుచున్నాఁడు. గాలి వీచుచున్నది. తపోయజ్ఞాదిధర్మము లెన్ని కూడినను ఒక్కసత్యముతో సాటి కాఁజాలవు. నీ వసత్య మాడితివా అధర్మ కారణమున భ్రష్టుఁడ వయ్యెదవు, ఇచ్చెద నన్నవాఁ డీయకున్నను, పుచ్చుకొందు నన్నవాఁడు పుచ్చుకొనకున్నను దుర్గతి నందుదురు.

కావున, మన మనుకొన్న ప్రకారము నీవు నేను ధారవోసిన జపఫలమును గైకొని నీవు కృతార్థుఁడవై నన్నుఁ గృతార్థు నొనరింపు" మని వేఁడు కొనెను.

దానిపై నాతఁ "డయ్యో! నేను ఉత్తమక్షత్రియుఁడను. ధర్మయుద్ధము, ప్రజారక్షణము, దానకర్మములు నాకుఁ జెల్లునే కాని విప్రోచిత మగుదానపరిగ్రహణము నాకుఁ జెల్లదు. క్షమించి విడిచి పుచ్చు" మని ప్రార్థించెను. అందుల కాతఁడు "రాజా! నేనై నీ యింటికి విచ్చేసి దాన మిచ్చెదను. పుచ్చుకొను మన లేదు. నీయంతట నీవు వచ్చి రెట్టించి రెట్టించి దాన మిమ్మంటివి. ఇచ్చెదనన్నఁ దీసికొనవైతివి. ఇదెంత న్యాయముగ నున్నదో నీ వొక్కఁడవే చెప్పుము" అని గద్దించి యడిగెను.

అపుడు ధర్మదేవత నిజరూపమునఁ గానవై వారియిరువురి ధర్మనిష్ఠకు మెచ్చి తన్ను వారి కెఱుకపఱచుకొని ద్విజునకు జపదానఫలము రాజునకు సత్యఫలము లభించుఁగాక! యని పలికెను. అంతలో స్వర్గము సాకారమై వచ్చి కౌశికేక్ష్వాకులకుఁ దన్నుఁ గూర్చి తెలుపుకొని యిరువురు సమానఫలభాగు లయ్యెద రనియు వివాదమును జాలింపుఁ డనియు విన్నవించెను.

ఇక్ష్వాకుమహారాజు స్వర్గమునసైతము సరకుచేయక దానితోఁ దనకేమియుఁ బ్రయోజనములే దని తెలిపి తా నింతవఱకుఁ జేసిన సమస్తపుణ్యములఫలితము నావిప్రునకు ధారవోసెద ననియు దాననాతనికి స్వర్గమునకుఁ గొనిపోవచ్చు ననియుఁ బలికెను. ఆ మాటలు విని కౌశికుఁడు తాను సంహితాజపపరాయణుఁడనియు, నిష్కామిననియు, నిర్లోభిననియు నట్టి తన్నెవరుగాని యేమి చూపికాని లోభపెట్టలేరనియు నట్లు లోభపెట్టఁజూచువారు నెగ్గలేరనియుఁ దాను స్వాధ్యాయశీలిని, అపరిగ్రహవ్రతపాలకుఁడ ననియుఁ జెప్పివేసెను. అంత నిక్ష్వాకుమహారాజు "నీవు నీ జపఫలము నాకు ధారవోసినట్లే నేను నాయాగఫలమును పుణ్యఫలమును నీకు ధారవోసితిని పరిగ్రహింపుము. అపు డుభయులము సమానుల మగుదు" మని వాక్రుచ్చెను.

## విరూపవికృత రూపుల వివాదము

ఈ వివాద మిట్లు కొనసాఁగుచుండఁగా నచటికి కుత్సితవస్త్ర ధారులు, వికృతవేషులు నగు నిరువురు పురుషులు జగడమాడుకొనుచు "నీవు నాకు ఋణపడి యుండలే" దని యొకఁడును, "ఋణపడి యున్నాను. నీవు పుచ్చుకొనకతప్ప" దని రెండవవాఁడును పలుకు చుండిరి. వారిరువురు ఇక్ష్వాకుమహారాజుదగ్గఱకు వచ్చి "రాజా! నీవు మా వివాదము విని న్యాయ మగుతీర్పు నిమ్ము; దానిని మేము పాటింతు" మని విన్నవించుకొనిరి.

ఇక్ష్వాకుమహారాజు వారిని జూచి "మీ వివాద మేమో తెలుపుఁడు. సంగతివిని తోఁచినది చెప్పెద" ననెను. దానిపై విరూపుఁడు "రాజా! నే నీతని కొక గోదానఫలమిచ్చెద నని ఋణపడియుంటిని. దాని నిప్పుడు తీర్చెద నని నేను రాఁగా నీతఁ డది యంగీకరింపఁడయ్యెను అని చెప్పెను." ఆ మాటలు విన్న రెండవవాఁడు "మహారాజా! అది నిజము కాదు. అతఁడు నాకేమియు ఋణపడియుండలేదు. కావున, అతనికడ నే నేమియు గ్రహింపను" అని బదులుచెప్పెను. ఇక్ష్వాకుమహారాజు విరూపుని జూచి "నీ వాతని కేమి యేల ఋణపడియున్నావో తెలుపు" మని యడిగెను. అతఁ డిట్లు సమాధాన మిచ్చెను. "మహారాజా! ఈతఁ డొకప్పు డొకస్వాధ్యాయశీలుఁడు. దేవసన్నిభుఁడు నగు బ్రాహ్మణ ప్రవరుని కొకగోవును దానము చేసియుండెను. నే నొకసారి యీతనిం జేరి గోవు నుత్తమబ్రాహ్మణునికి దానముచేసిన యా ఫలితము నాకు ధారవోయు మని కోరితిని. అతఁ డట్లే యని దానిని నాకు ధార వోసెను. నేను నాతనికి ప్రతిఫల మీయఁదలఁచితిని. రెండు శ్రేష్ఠము లగు కపిలగోవులను గొనితెచ్చి నే నొకయుత్తమ విప్రునికి దానముచేసి ఆ వచ్చినఫలము నీతనిని గైకొనుమంటిని. ఈతఁడు కైకొన నను చున్నాఁడు. ఈతనికడ నేను ప్రతిగ్రహించినపు డీతఁడు నాకడఁ బ్రతి గ్రహింపవలదా? అతఁడు ప్రతిగ్రహింపఁడట! నేనుమాత్రము ప్రతి గ్రహింపవలెనఁట! ఇది యేటి న్యాయము! నీ వాలోచించి చెప్పు" మని తెలిపెను.

అంత రాజు "ఓయీ! నీవాద మేమి" అని వికృతరూపు నడిగెను. అతఁడు "రాజా! నేను జేసినగోదానమువలని ఫలమిమ్మని యాతఁడు నన్నడిగినాఁడే కాని యది ఋణముగ నని, తరువాతఁ దాను ద్విగుణముగఁ దీర్చెద నని, నాతోఁ జెప్పలేదు. నే నాతనికి దానము చేసితినే కాని ఋణముగ నీయలేదు. కావున, అతనికడఁ బరిగ్రహించు ప్రస్తావనమే రాదు" అని బదులుచెప్పెను. దానిపై రాజు వికృత రూపుని జూచి విరూపునికడనుండి ద్విగుణ ఫలమును బరిగ్రహించుటయే ధర్మమని వక్కాణించెను. అది ధర్మము కాదని వికృతుఁ డనెను. విరూపుఁడు రాజు చెప్పినట్లు చేయుమని తనకోరికఁ దీరుపుమని వికృత రూపుని మఱిమఱి ప్రార్థింపఁదొడఁగెను. అతఁడు తన్ను మన్నించి విడువు మని తా నేమైనను ప్రతిగ్రహింపఁజాల నని యనుచుండెను.

ఈ సంభాషణము విన్న కౌశికమహర్షి యిక్ష్వాకుమహారాజునుజూచి తనదానమును బరిగ్రహింపు మని ప్రార్థించెను. ఇక్ష్వాకుమహారాజు చాల వగచి యాజాపకునిదాన మే విధమున నంగీకరింతును? అంగీ కరింపకుండు టెట్లు? ఇది యెక్కడి వైపరీత్యము వచ్చిపడినదో యని మనమున దురపిల్లఁదొడఁగెను. మఱియు నాతఁడు "అయ్యో! రా జయిపుట్టుటకంటె బాయయిపుట్టుట మేలు కదా! ఉత్తమక్షత్త్రియ కులమునఁ బుట్టి ఇపు డిట్టి విప్రధర్మమునకు లోను గావలసివచ్చినదికదా! నా యంతియవివేకి యింక నెచటను నుండఁడు" అని వాపోవఁ దొడఁగెను.

కౌశికుఁ డింకఁ దాళఁజాలక "రాజా! నామాట విని నా దానమును గ్రహింపవేని, ఇఁక నేను నా శాపాయుధమును వాడవలసి వచ్చును. ఏ మందువు?" అని యడిగెను. ఇక్ష్వాకువు చాల ఖిన్నుఁడై తనదురదృష్టమునకు వగచి "మహాబ్రాహ్మణా! నీ విచ్చినది నేను పరిగ్రహించెదను కాని, దానిని తిరిగి నీకే యిచ్చివేయుటకే కైకొనుచుంటి నని గ్రహింపుము. ఇమ్ము" అని సిద్ధపడెను. కౌశికమహర్షి యాతనికిఁ దన జపముఫలమంతయుఁ బరమేశ్వరార్పణ మని ధారవోసెను. ఇక్ష్వాకువు "బ్రాహ్మణోత్తమా! నీ చేతినుండి నాచేతిలోఁ బడిన యీదాన ధారయే నాచేతినుండి నీ చేతఁబడిన నా యాగపుణ్యదానధారగఁ బరి

గ్రహింతువుగాక! పరస్పరదానక్రియవలన మన ముభయులము కీడు లేని ధన్యత నందుదుము గాక" అని పలికెను.

అంత నచ్చట నున్న వికృతవికృతరూపు లిరువురు స్వస్వరూపములతోఁ గామక్రోధములుగాఁ బ్రత్యక్షమై తా మావికృత రూపములను ధరించి వచ్చుట వా రిరువురను బరీక్షించుటకే యనియు, ఆ పరీక్షలో నుభయులు దిగ్విజయ మంది నా రనియు నుభయులు యథేచ్ఛగా నెపుడు కావలసిన నపు డేలోకము కావలసిన నాలోకము నందుదురుగాక యని యదృశ్యులైరి.

కౌశికమహర్షి యిక్ష్వాకుమహారాజుదాన మంగీకరించి యాతని కోరికఁ దీర్చి "రాజా" నీ వింక నుత్తమత్వము నందుము. నీ యనుమతిని నే నింకను సావిత్రీదేవి నుపాసించి జపమును గావించెద" ననెను. రాజు "మన ముభయులము తుల్యఫలభాగుల" మనెను.

ఇట్లు వా రుభయులు పరస్పరగౌరవములతో నుండఁగా యముకాలమృత్యువులు ధర్మువు వారి నభినందించెను. వా రుభయులు ఈ నలువురకు సాష్టాంగప్రదక్షిణనమస్కారము లొనరించి తనపైఁ గురియించిన కరుణావర్షమునకుఁ గృతజ్ఞతఁ దెలిపిరి. ఇంతలో, వారి నభినందించుటకై దేవతలు, లోకపాలకులు మున్నగువారితో దేవేంద్రుఁ డచటికి విచ్చేసెను. ఆతనితో శరీరములను ధరించి శైలసముద్రాదులు, మఱియు నానదపర్వతాదు లగుదేవర్షులు విచ్చేసిరి. ఈసంగతి తెలిసికొని సహస్రశీర్షుఁ డగువిష్ణుదేవుఁడుకూడ విచ్చేసి వారి నభినందించెను. దేవతలు వారిపైఁ బుష్పవృష్టిఁ గురియించిరి. అప్సరసలు నాట్యమాడిరి. తుంబురునారదులు వీణాలాపము లొనర్చిరి. గంధర్వులు గీతములు పాడిరి. జయజయధ్వానములు మిన్నుముట్టెను. అపుడు సాకారమున వచ్చినస్వర్గము కౌశికేక్ష్వాకులను సిద్ధపురుష లని యభినందించెను.

అనంతరము కౌశికేక్ష్వాకు లొక్కసారిగ నింద్రియములను నుపసంహరించి యైదువాయువులను మనసున నిలిపి, యటనుండి భ్రూమధ్య

భాగమును జేర్చి యోగ మవలంబించి ఆత్మను మూర్ధగత మొనర్చిరి. కౌశికమహర్షి బ్రహ్మరంధ్రమునుండి బయలువెడలి మహాజ్యోతిర్జ్వాలామాలుఁడు, ప్రాదేశమాత్రుఁడు నగుపురుషుఁడు స్వర్గమునకుఁ బోయెను. దశదిశలు జయజయధ్వానము లొనరించెను. అట్లేగిన యా పురుషుని జ్యోతిర్బ్రహ్మ మట్లే వెడలిన ఇక్ష్వాకుని తేజమునకు స్వాగత మొసఁగెను. ఈ రెండుతేజములు పోయి తమ్మాహ్వానించిన బ్రహ్మదేవునిముఖమునఁ బ్రవేశించెను.

దేవతలు, దిక్పాలకులు, దేవర్షులు బ్రహ్మ ననేకవిధములఁ గీర్తించి జాపకులయు, యోగులయు మహోత్తమగతులు తెలిసికొంటి మని యానందించిరి. బ్రహ్మవారిని జూచి "దేవతలారా! మహాజపపరునివలె మహాయోగియు, మహాస్మృతిపాఠకుఁడు, అను స్మృతిపాఠకుఁడు, వీ రందఱుకూడ నా లోకము నంది శాశ్వతముగ నుందురు. కౌశికేక్ష్వాకు లను మహాపుణ్యపురుషుల బ్రహ్మసాయుజ్యముఁ గాంచఁగల్గిన మీ రెల్లరు ధన్యులు. మీకు శుభము అగుఁగాక! పోయి రం" డని వారిని వీడ్కొలిపెను.

ఈ విధముగా కౌశికమహర్షి సావిత్రి నుపాసించి మహోత్తమ బ్రహ్మర్షియై బ్రహ్మసాయుజ్యము నందఁగలిగెను.



# మహర్షుల చరిత్రలు

## దక్షమహర్షి

### జననము

బ్రహ్మదేవుని మనస్సునుండి మరీచి, అంగిరసుఁడు, అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు అనుకుమారు లాఱుగురు జన్మించిరి. ఆతని కుడిబొటనవ్రేలినుండి దక్షుఁ డను మహాత్ముఁడు జన్మించెను. ఆతఁడు తండ్రి యనుమతి నేగి మహాతపస్సంపన్నుఁడు, దివ్యతేజస్వి యయ్యెను.

### వివాహము — సంతానము

దక్షుఁడు సర్వవేదశాస్త్రము లభ్యసించి మహాతపస్సు చేయుచు సర్వలోకసంపూజ్యుఁ డయ్యెను. ఆతఁడు యుక్తవయస్సు గన్నపిదప మనువు మూఁడవకూఁతు రగు ప్రసూతి యనునామెను బరిణయ మాడెను.

కాలక్రమమున నామె యం దాతనికిఁ బదునాఱుగురు కొమార్తెలు జన్మించిరి. వారు శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, ప్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి, స్వాహ, స్వధ, సతి అను వారలు. వారిలో మొదటిపదుమువ్వురను దక్షుఁడు ధర్మదేవుని కిచ్చి వివాహము చేసెను. స్వాహను అగ్నిదేవునికి, స్వధను పితృదేవునికి, సతిని సర్వేశ్వరుఁ డగుశివునికి నిచ్చి పెండ్లిండ్లు గావించెను.

### సంతానమునకు సంతానము

ధర్మదేవుఁడు తనభార్యలను పదుమువ్వురను, అమితప్రేమమున లాలించుచు వారియుందఱకు నుత్తమసంతానము ననుగ్రహించెను. శ్రద్ధాదేవికి శ్రుతము, మైత్రికి ప్రసాదము, దయకు అభయము, శాంతికి

సుఖము, తుష్టికి ముదము, పుష్టికి స్మయము, క్రియకు యోగము, ఉన్నతికి దర్పము, బుద్ధికి అర్థము, మేధకు స్మృతి, తితిక్షకు క్షేమము, హ్రీకి ప్రశ్రయము, మూర్తికి నరనారాయణులు జన్మించిరి. ఈ ఉత్తమసంతానమగు నరనారాయణులు కలిగిన సమయమున వాయు దేవుఁడు మందమలయానిలముల వ్యాపింపఁ జేసెను. దశదిశలు మిగుల ప్రశాంతము లయ్యెను. పదునాలుగు లోకములు సంతోషసంభరితము లయ్యెను. దేవదుందుభులు తుములములై మ్రోఁగెను. సప్తసాగరములు కలఁక లుడిగి ప్రసన్నము లయ్యెను. నదులు స్వచ్ఛజలము లతో శాంతముగఁ బ్రవహించెను. గంధర్వకిన్నర కామినులు గాన మాధుర్యముల నెల్లెడల నింపిరి. అప్సరసలు నాట్య మొనర్చిరి. దేవతలు పుష్పవృష్టిని గురియించిరి. మునిబృందములు మోదమున ముప్పిరి గొన్న హృదయములతో వేదసంస్తుతుల వినిపించిరి. ప్రపంచ మంతయుఁ బరమశుభప్రదముగాఁ బరిఢవిల్లెను. బ్రహ్మాదిదేవతలు వచ్చి వారిని స్తుతించి వారికరుణఁ గోరి వెడలిరి. ఆ నరనారాయణులు తండ్రి యనుమతి గొని గంధమాదనపర్వతమునకు వెడలి తపోనిరతులైరి.

అగ్నిదేవునివలన స్వాహాదేవి పావకుఁడు, పవమానుఁడు, శుచి అనుమువ్వురు కొడుకులను గాంచెను. పితృదేవునివలన స్వధ వయున, ధారిణి అను నిరువురు కన్యకలఁ గాంచెను. వారు జ్ఞాన విజ్ఞానపారగలై ప్రఖ్యాతి నందిరి.

దక్షమహర్షి సతి యను తనకూఁతును ఈశ్వరుని కిచ్చి వివాహము చేసెను. ఈప్రకార మాతఁడు తన పుత్రికల నుత్తమవరుల కొసఁగి వారిచే వారు సంతానవతులు కాఁగా ప్రజాపతి యయ్యెను.

ఇది శ్రీమద్భాగవతము చతుర్థస్కంధమునఁ గల కథ. దీనికిని భారతాదిపర్వమునఁ గలకథకును గొంత భేదము కలదు. ఆదిపర్వమున నిట్లు కలదు; బ్రహ్మదేవుని కుడిబొటనవ్రేలినుండి శాంతాత్ముఁడు, మహా తపస్సంపన్నుఁడు, మహాత్ముఁడునై దక్షుఁడనుమహర్షి జన్మించెను. బ్రహ్మ యెడమబొటనవ్రేలినుండి పుట్టిన కన్యను దక్షుఁడు వివాహ

మాడెను. ఆ దంపతులకుఁ గాలక్రమమున నేఁబదిమంది కూఁతులు కలిగిరి. అందచందముల నలరారుచు నత్యంతమనోహర లైనవారలనే దక్షమహర్షి పుత్రులనుగా భావించెను. ఆ కన్యకలు యుక్తవయస్సుఁ గన్నపిదప వారిలోఁ బదిమందిని ధర్మదేవునికిని, కశ్యపమహర్షి కిఁ బదుమువ్వురు కూఁతుండ్రను, చంద్రునకు అశ్విన్యాదు లగు నిరువది యేడుగురు కూఁతుండ్రను, ఇచ్చి దేవతావిధుల ననుసరించి దివ్యవైభవముగా వివాహములు చేసెను. కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ, పుష్టి, శ్రద్ధ, క్రియ, బుద్ధి, లజ్జ, మతి అను పదిమంది ధర్మదేవుని భార్యలు. వీరి వలన ధర్మదేవుని కెనమండుగురు పుత్రులు కలిగిరి. వారే అష్టవసువులు. వారిపేళ్ళివి: ధరుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అహస్సు, అనలుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు.

భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, అంగిరసుఁడు, అత్రి, క్రతువు, వసిష్ఠుఁడు, దక్షుఁడు, మరీచి అను నవబ్రహ్మలను బ్రహ్మ తన మనస్సునుండి పుట్టించెను. పిదప సంకల్పుఁడు, ధర్ముఁడు అనుకొడుకుల నిరువురను బ్రహ్మ సృజించెను. అనంతర మాతఁడు స్వాయంభువుఁ డను మనువును శతరూప యను కుమారిని గాంచెను. శతరూపా స్వాయంభువు లిరువురు దంపతు లయి ప్రియవ్రతుఁడు, ఉత్తాన పాదుఁడు అనునిరువురు కుమారులను, సూతి, ప్రసూతి అనునిరువురు కూఁతుండ్రను గాంచిరి. అందులో సూతిని రుచి యనుమహర్షియు, ప్రసూతిని దక్షుఁడును వివాహమాడిరి. రుచిసూతులకుఁ బండ్రెండుగురు కుమారు లుదయించిరి. దక్షునకుఁ బ్రసూతియందు ఇరువదినలువురు కొమార్తెలు కలిగిరి. వారిలోఁ బదుమువ్వురను ధర్మునికి, ఖ్యాతి యను కూఁతును భృగునకు, సతి యనుకూఁతును శివునికి, సంభూతి యను కూఁతును మరీచికి, స్మృతి యనుకూఁతును అంగిరసునికి, ప్రీతి యను నామెను పులస్త్యునకు, క్షమ యనునామెను పులహునకు, సంతతి యను నామెను క్రతువునకు, అనసూయను అత్రికి, ఊర్జ యనునామెను వసిష్ఠునికి, స్వాహను అగ్నికి, స్వధ అనునామెను పితరులకు, ఇచ్చి వివాహములు చేసెను అని మార్కండేయపురాణమునందుఁ గలదు.

## దక్షుఁడు ప్రాచేతసుఁ డైనవిధము

అజుని దక్షిణాంగుష్ఠమునుండి జన్మించిన దక్షుఁడు నవబ్రహ్మలలో నొకఁడైన సంగతి విన్న మైత్రేయమహర్షి పరాశరమహర్షి తోడి సంభాషణమున "దేవా! అజుని దక్షిణాంగుష్ఠమునుండి దక్షుఁ డుదయించి నవబ్రహ్మలలో నొకఁ డయ్యె నని యిదివఱ కంటివి. అతఁడు ప్రచేతసులకుఁ దనయుఁడై యెప్పు డేలజనించెనో చెప్పు" మని ప్రార్థించెను. దానిపై నాతఁ డిట్లు చెప్పెను. "బ్రహ్మ మానసపుత్త్రుఁ డైనదక్షప్రజాపతి మహాతపోధనుఁడు కావున, నాతని కెన్నఁడును కల్పనలు లేవు. సృష్టినిమిత్తము ప్రతిమన్వంతరమునఁ బ్రతియుగమున నొక్కొక్క ప్రజాపతి దక్షనామమున జన్మించి సృష్టికిఁ గర్తయై యుండు. కావున, ప్రచేతస పుత్త్రుఁ డైన దక్షుని చరిత్రముఁ దెల్పెద వినుము" అని ఆ చరిత్రఁ దెలిపెను.

పుణ్యమూర్తియు సమంచితకీర్తియు నగుదక్షుఁడు చిరకాలము విష్ణుమూర్తిని గుఱించి ఘోరమగు తప మొనరించెను. తుద కాతఁడు ప్రత్యక్షము కాఁగా నాతనివలన సచరాచరభూత సృష్టి యొనరించుటకుఁ దన్ను దక్షు నొనరింపు మని ప్రార్థించెను. అట్లే యని విష్ణుమూర్తి వర మొసఁగి యంతర్ధాన మయ్యెను. పిదప దక్షుఁడు బ్రహ్మయనుమతిని కిన్నరులను, సిద్ధులను, సాధ్యులను, మునులను, ఖేచరులను, భూచరులను, దేవతలను, రాక్షసులను, పన్నగులను, మానవులను, మృగములను, పక్షులను, మానస సృష్టియందుఁ బుట్టించెను. కాని, ఆ సృష్టి బహువంశపరంపరలఁ బ్రవృద్ధి నంద దయ్యెను. అందుల కాతఁడు మిగుల వగచి బ్రహ్మ పాలి కేగి మొఱవెట్టుకొనెను. అప్పు డాతఁ "డోయీ! నీ మానస సృష్టి నిలుపనేరదు. కావున, నీవు వివాహమాడి మిథునకర్మ మారంభింపుము. దానివలన సంసృష్టి యగు. అది వృద్ధిపొందు" నని హిత ముపదేశించెను.

దక్షుఁ డంత బ్రహ్మయానతిఁ దలఁదాల్చి వరుణప్రజాపతి పుత్త్రిక యైన అసిక్ని యనునామెను వివాహమాడి యామెతో మిథున కర్మ

మొనరింపఁ దొడఁగెను. కాలక్రమమున నామెకు హర్యశ్వు లనువా రైదువేలమంది జన్మించిరి. ఆ కుమారులను దక్షుఁడు చేరఁ జీరి "మీ రందఱును వివాహములు చేసికొని ప్రజాసృష్టి యొనరింపుఁడు. మి మ్మందఱను బ్రజాపతుల నొనరించెద" నని చెప్పి వారి నందులకు నియోగించెను. వారును వల్లె యని దక్షునియాజ్ఞ శిరసావహించి తన్నిమిత్తమై తప మొనరింప నేగిరి.

దక్షపుత్రు లట్లు తప మొనరించుచోటి కేగి నారదమహర్షి వారి కిట్లు బోధించెను. "వత్సలారా!

జలజభవాండము సర్వముఁ
గలయంగాఁ జూచి దేశకాలక్రమముల్
తెలియక ప్రజఁ బుట్టింపన్
దలఁచుట మీ కెల్ల వెఱ్ఱితనమౌఁ గాదే!"

(విష్ణుపురాణము 2-283)

అని బోధించి చనెను. వా రంద ఱాతనిమాటలు పట్టుకొని తలొక దిక్కునకుఁ బోయి తిరిగి రారైరి.

అట్లు కనిమసంగిన కొడుకుల గతికి విచారించి దక్షుఁడు వైతరణి అనునామెను వివాహమై ఆమెకును మిథునకృత్యము జరపెను. దాని వలన నామెకుఁ గాలక్రమమున వేయిమంది కుమారులు జన్మించిరి. వారికి శబళాశ్వులను పేరిడి వారిని వివాహమాడి సంతానవంతులు కండనియుఁ బ్రజాపతుల నొనరింతు ననియు దక్షుఁడు నియోగించెను. వారును మహాతప మొనరించి వివాహమాడ నిశ్చయించుకొని వనముల కేగి తప మారంభించిరి. అప్పుడు నారదుఁడు విచ్చేసి వారిపూర్వులకుఁ జెప్పినట్లే వారికిని జెప్పి వెడలిపోయెను. శబళాశ్వులు వేయిమందియు బయలుదేఱి యన్నలజాడ నెఱుఁగఁ బోయిరి. పిదప, వారిజాడ వీరికిఁ గాని వీరిజాడ తత్పూర్వవారికిఁ గాని నాఁటికి నేటికి తెలియకుండఁ బోయెను. అందుచే నాటినుండి.—

పరదేశము చరియింపఁగ
నరిగిన యగ్రజుల వెదక ననుజన్ములు వో
యిరయేని వారు వారును
మరలక యెందైనఁ బోయి మడియుదు రనఘా!

(విష్ణుపురాణము 2-267)

ఈ విధమున మరల నష్టసంతానుఁడైన దక్షుఁడు నారదుని గోపించి తనభార్య యగువైతరణికి మరల మిథునకృత్య మొనరించెను. దానివలన నామెకు అఱువదిమంది కన్యక లుద్భవించిరి. వారు పెరిగి పెద్దవారైన పిదప వారిలోఁ బదిమందిని ధర్మునకు, పదుముువ్వురను కశ్యపునకు, ఇరువదియేడ్గురను చంద్రునకు, నలుగురను అరిష్టనేమికి, ఇరువురను బహుపుత్రునకు, ఇరువురను అంగిరసునకు, ఇరువురను కృశాశ్వునకు వారువారు వీరి వీరిని వరింప నిచ్చి వివాహములు కావించెను. పిదప, వారివా రెల్లరకు మిథున కృత్యమువలననే బహుళ సంతానములు కలుగ సృష్టి విస్తరించెను అని శ్రీ విష్ణుపురాణమునఁ గలదు. ఈ కథయే శ్రీమద్భాగవతమున నీ విధముగాఁ గలదు.

ప్రాచీనబర్హిషు అను పేరుగల ప్రచేతసులు పెక్కురు మహా సముద్రమునుండి వెలువడివచ్చి బహువృక్షములతోఁ గూడియున్న భూమిని జూచిరి. వారికి వృక్షములపై మిక్కిలికోపము వచ్చెను. అందుచే వారు తమ నోళ్ళనుండి మహావాయుసంయుతమైన అగ్ని జ్వాలలను గల్పించి యా వృక్షముల నన్నిటిని గాల్పఁ దొడఁగిరి. అది చూచి వృక్షప్రియుఁ డగుచంద్రుఁడు విచ్చేసి "ఓ మహాత్ములారా! మీకోప మిట్లీ చెట్లపైఁ జూపఁదగునా? మీరు పుట్టఁగనే మిమ్ముఁ బ్రజాపతు లని మీతండ్రి పలికెను. మీరు ప్రజాసృష్టికై జన్మించిన వారు. ఈ విధముగా వృక్షసంతతిని దహించుట భావ్యముకాదు. ఈ వృక్షాదులు ప్రాణుల కన్నాదిక మొసఁగి పోషింప భగవంతునిచే సృష్టింపఁబడినవి. మఱియు, ఆ భగవంతుఁడే మిమ్ము పాపరహితులు గను దయామయులుగను సృష్టించెను. కావున మీ రీ పాపకృత్యము మానుఁడు. వృక్షముల రక్షింపుఁడు.

"తప్పక యర్ఘ్యకావలికిఁ దల్లియుఁ దండ్రియు; నేత్రపంక్తికిన్
ఱెప్పలు; నాతికిం బతియు; ఱేఁడు ప్రజావలి కెల్ల; నర్థి కిం
పొప్పఁ గృహస్థు; మూఢులకు నుత్తము లెన్న సమస్తబాంధవుల్
ముప్పునఁ గావలేని కడుమూర్ఖులు గారు నిజాల చుట్టముల్.

అఖిలభూతముల దేహాంతస్థ మగునాత్మ
యీశుఁ డచ్యుతుఁ డని యెఱుఁగవలయు;
నెఱిఁగి సర్వం బైన యిందిరారమణు లో
చూపునఁ దనివిగాఁ జూడవలయుఁ;
జూచిన చిద్రూపశుద్ధాత్ములగు మిమ్ము
నెనసిన వేడ్కతో నిచ్చ మెచ్చు;
మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగినచోటఁ
గోపగుణంబులఁ బాపవలయుఁ;
బాపి దగ్ధశేషపాదపజాలంబుఁ
దియ్య మెసఁగ బ్రదుకనియ్యవలయు
ననఘులార! మీర లస్మదీయప్రార్థ
నంబు పరఁగఁ జేకొనంగ వలయు.

(భాగ. ౬, ౨౦౦, ౨౦౧)

ఈ వృక్షములనుండి జన్మించిన మారిష యనుకన్యారత్నమును మీ కిచ్చి వివాహము చేయుదును. మీ రామెను గైకొని సంతోషించి వృక్షదహనము మానుఁడు" అని చెప్పి చంద్రుఁడు మారిష యనునామెను వారి కొప్పగించి వెడలిపోయెను.

ప్రచేతసులు దాని కంగీకరించి యామెను గ్రహించి శాంతచిత్తులైరి. కాలక్రమమున వా రామెను రమింపఁగా నామెకు దక్షుఁడు ప్రాచేతసుఁ డనుపేర బ్రహ్మసమానుఁడై జన్మించెను. పిదప నాతఁడు పెక్కువిధముల ప్రజాసృష్టి యొనరించెను. తన మనస్సునుండి కొందఱిని, అకుంఠితవీర్యముచేఁ గొందఱిని, భూచర, ఖేచర, వనచర, జలచర, దివాచరులను, నరసురగరుడోరగకిన్నర దానవయక్షపక్షిపర్వతవృక్షలతాదులతోఁ గూడినసమస్త జీవములను దక్షుఁడు సృష్టించెను. ఈ సృష్టితో

నాతఁడు సంతుష్టి నందక వింధ్యపర్వతప్రాంతమున కేగి విష్ణుమూర్తిని గుఱించి అఘమర్షణ మనుతీర్థమును సేవించుచు మహాతప మొనరించెను. కొంతకాలమునకు విష్ణు వాతనికిఁ బ్రత్యక్ష మయ్యెను; దక్షుఁడు హంసగుహ్య మనుస్తోత్రమున విష్ణు నిట్లు స్తుతించెను.

"నమః పరాయావితథానుభూతయే
గుణత్రయాభాసనిమిత్తబంధవే,
అదృష్టధామ్నే గుణతత్త్వబుద్ధిభి
ర్నివృత్తమానాయ దధే స్వయంభువే.

న యస్యసఖ్యం పురుషోఽవైతి సఖ్యు
స్సఖావసన్ సంవసతః పురేఽస్మిన్,
గుణో యథా గుణినోఽవ్యక్తదృష్టే
స్తస్మై మహేశాయ నమస్కరోమి.

దేహోఽసవోక్షా మనవోభూతమాత్రా
నాత్మానమన్యం చ విదుః పరం యత్,
సర్వం పుమాన్వేద గుణాంశ్చ తద్జ్ఞో
న వేద సర్వజ్ఞ మనంతమీథే.

యదోపరామో మనసో నామరూప
రూపస్య దృష్టస్మృతిసంప్రమోషాత్,
య ఈయతే కేవలయా స్వసంస్థయా
హంసాయ తస్మై శుచిషద్మనే నమః.

మనీషిణోఽంతర్హృది సన్నివేశితం
స్వశక్తిభిర్నవభిశ్చత్రివృద్భిః,
వహ్నిం యథా దారుణి పాంచదశ్యం
మనీషయా నిష్కర్షంతీహ గూఢమ్.

సవై మయాశేషవిశేషమాయా
నిషేధనిర్వాణసుఖానుభూతిః,
స సర్వనామా స చ విశ్వరూపః
ప్రసీదతా మనిప్రవృత్తాత్మశక్తిః.

యద్యన్నిరుక్తం వచసా నిరూపితం
ధియాక్షభిర్వా మనసోతయస్య,
మాభూత్స్వరూపం గుణరూపబృంహితం
స వై గుణాపాయ విసర్గ లక్షణః.

యస్మిన్ యతో యేన చ యస్య యస్మై
యద్యోయథా కురుతే కార్యతే చ,
పరావరేషాం పరమం ప్రాక్ప్రసిద్ధం
తద్బ్రహ్మతద్ధేతు రనన్యదేకమ్.

యచ్ఛక్తయో వదతాం వాదినాం వై
వివాదసంవాదభువో భవంతి,
కుర్వంతి తేషాం ముహురాత్మమోహం
తస్మై నమోఽనంతగుణాయ భూమ్నే.

అస్తీతి నాస్తీతి చ వస్తునిష్ఠయో
రేకస్థయోర్భిన్నవిరుద్ధధర్మయోః,
అపేక్షితం కించ న యోగసాంఖ్యయో
స్సమం పరం హ్యనుకూలం బృహత్తత్.

యోఽనుగ్రహార్థం భజతాం పాదమూలం
హ్యనామరూపో భగవా ననంతః,
నామాని రూపాణి చ జన్మ కర్మభి
ర్భేజే స మహ్యం పరమః ప్రసీదతు.

యః ప్రాకృతైర్జ్ఞానపథైర్జనానాం
యథాశయం దేహగతో విభాతి,
యథానిలః పార్థివమాశ్రితో గుణం
స ఈశ్వరో మే కురుతాన్మనోరథమ్.

శ్రీమద్భాగవతము. ౬ స్కం. ౨౩-౩౪.

ఈ శ్లోకములకు శ్రీ పోతన్నగారి తెలుఁగు అనువాదము.

"పరమునికి వందనము సేతుఁ బరిఢవించి
ము న్నవితథానుభూతికి మ్రొక్కికొందు
మఱియు గుణములఁ దేలు నిమిత్తమాత్ర
బంధువై నట్టివానికిఁ బ్రణుతి సేతు.

తవిలి గుణులచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరానినెలవువాని
మొదలఁ దాన కలిగి ముక్తిమానావధి
రూపఁ మైన వాని ప్రాపుఁ గందు.

ఎల్లతనువులందు నిరవొంది తనతోడఁ
బొందు సేసినట్టి పొందుఁగాని
పొందు వొంద లేఁడు పురుషుండు గుణము నా
గుణిని బోలునట్టి గుణి భజింతు.

పూని మనంబునుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులున్
ప్రాణములున్ వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగ నేర వా గుణనికాయములం బరికించునట్టి స
ర్వామగతున్ సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్.

మఱియు ననేకవిధ నామరూప నిరూప్యం బగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలన గలిగెడుసు పరామం బగు సమాధియందుఁ గేవల జ్ఞానస్వరూపంబున దోఁచు నిర్మలప్రతీతిస్థానం బైన హంసస్వరూపికి నమస్కరింతు. దారువందు నతిగూఢం బైనవీతిహోత్రుని బుద్ధి

చేతం బ్రకాశంబు నొందించుభంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుండయిన పరమపురుషుని నాత్మశక్తిత్రయింబులచేతం దేజరిల్లంజేయుడు రట్టిదేవుండు సకల మాయావిచ్ఛేదకం బయిననిర్వాణ సుఖానుభవంబులం గూడి యుచ్చరింపంగొలందికాని శక్తిగల విశ్వ రూపుండు నాకుం బ్రసన్నుం డగుంగాక! వాగ్బుద్ధీంద్రియ మానసంబులచేతం జెప్పను, నిట్టిదని నిరూపింపను నలవి గాక యెవ్వని గుణ రూపంబులు వర్తించు నెవ్వండు నిర్గుణుండు సర్వంబు నెవ్వని వలన నుత్పన్నం బగు నెవ్వనివలన స్థితిం బొందు, నెవ్వనివలనలయం బగు, నట్టిపరాపరంబులకుం బరమంబై, యనన్యంబై ప్రాక్ప్రసిద్ధంబై యదియ బ్రహ్మంబై, యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్ర యింతు. ఎవ్వనిప్రభావంబు మాటలాడెడువారలకు, వాదంబు సేయు వారలకు వివాదస్థలంబ లగుచు, నప్పటప్పటికి మోహంబునొందించు చుండు నట్టి యనంతగుణంబులు గల మహాత్మునకు నతిభక్తిం బ్రణా మంబు సేయుదు; నస్తి నాస్తి యనువస్తు ద్వయనిష్ఠలం గలిగి యొక్కటన యుండి విరుద్ధధర్మంబులుగాం గనంబడు నుపాసనాశాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపం దగిన పరమంబు నాకు ననుకూలంబగుంగాక! ఎవ్వండు జగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబుల చేత నామరూపంబు లెఱుంగంబడకుండియు నామరూపంబులు గలిగి తేజరిల్లు నట్టి యనంతుండయిన భగవంతుండు బ్రసన్నుండగుంగాక! ఎవ్వండు జనులకుం బురాకృతజ్ఞానపదంబులచేత నంతర్గతుండై మేదినిం గలుగు గంధాదిగుణంబుల నాశ్రయించిన వాయువుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబు సేయుంగాక!"

(భాగ. ౬స్కం-౨౧౩-౨౧౮)

## దక్షుండు నారదుని శపించుట

దక్షుం డాతని నతిభయభక్తులనిట్లు స్తుతింప విష్ణు వా దక్షునకు అసిక్ని యనుపంచజన ప్రజాపతి తనయ నిచ్చి యామెవలన సంతాన వృద్ధి నందు మని చెప్పి యదృశ్యుం డయ్యెను. దక్షుం డామెను

గ్రహించి యామెకు హర్యశ్వ అను పేరనొప్పు పదివేలమంది పుత్రుల నొసంగెను. వారు తండ్రియాజ్ఞ చొప్పున నారాయణసరస్సనుతీర్థ ప్రాంతమున కేఁగి యుగ్రతప మొనరించుచుండ నారదుఁ డటకు విచ్చేసి వారికి నివృత్తిమార్గము నుపదేశించి చనెను. వా రాతని మాటలు తలకెక్కి యాతనికి వందనము లొనర్చి తిరిగి యెన్నఁడురాని తెరువుఁ బట్టి పోయిరి.

ఈ సంగతి నారదుఁడే వెళ్ళి దక్షునికిఁ దెలుప నాతఁడు విచారించి బ్రహ్మప్రేరణచే మరల శబళాశ్వ అనువారిని గని వారిని సృష్టిచేయ నియమించి తపమునకుఁ బంపెను. వా రేఁగి నారాయణ తీర్థముననే తప మొనరింపఁ జూడ నారదుఁడేఁగి మరల వారినికూడ నివృత్తిపరుల నొనర్చెను. వారు తపముఁ మాని తిరిగి రాని తెరువునఁ బోయిరి. ఈ సంగతి యెఱిఁగి దక్షుఁడు నారదునిఁ గోపించి "భాగవతోత్తములలో లజ్జాహీనుఁడవై యశోహానిపొంది చరింతువుగాక! నీ వెల్లరిచేతను కలహభోజనుఁడ వని పిలువఁబడుదువుగాక! నీవలన మిత్రభేదమే కాని మిత్రలాభము కాకుండుఁగాక! నేఁటినుండి పురుషుఁడు విషయసుఖంబు లనుభవించిన పిదపనే కాని జ్ఞానము గ్రహింపకుండుఁగాక! నీ వేలోక మునను నిలువ నీడ లేక నిత్యసంచారముననే నిలుతువుగాక" అని శపించెను. పిదప, నాతఁడు, బ్రహ్మపనుపునఁ బ్రియభామ యగు అసిక్నియందుఁ బెక్కురు పుత్రికలం బుట్టించి వారిలో ధర్మునకుఁ బది మందిని కశ్యపునకుఁ బదునేడుగురను, చంద్రుని కిరువదేడ్వురను, భూతి, అంగిరసుఁడు, కృశాశ్వుఁడు అనువారి కిద్ద ఱిద్దఱి నిచ్చి వివాహ ములు చేయ వారు వారివారి భర్తలవలన సంతానము నందఁగా సృష్టి చక్కగా విస్తరించెను.

## దక్షుఁడు చంద్రుని శపించి కటాక్షించుట

చంద్రుఁడు తాను పెండ్లాడిన దక్షపుత్రికలం దందఱియందును సమానానురాగము చూపక రోహిణియందు మాత్రమే బద్ధానురాగుఁడై మిగిలినవారి నుపేక్షింపఁ దొడఁగెను. వారు తండ్రి యగు దక్షునితోఁ

దమబాధ తెలిపికొనిరి. ఆ సంగతి విని దక్షుఁడు చంద్రుని బిలిచి యాతని దోషము చెప్పి తత్ఫలితముగా క్షయరోగము సంతానహీనత కలుగునట్లు శపించెను. చంద్రుఁ డాతని పాదములపైఁ బడి క్షమింపు మనియు నిఁక నెన్నఁడు సందఱ పత్నులను సమానముగనే చూతు ననియు మాట యిచ్చెను. అంత దక్షుఁ డందులకు సంతోషించి క్షయ పీడితము లగు షోడశకళలను మరల ననుగ్రహించెను. కాని, చంద్రు నకు దక్షశాపమున నిజభార్యలయందు సంతానము లేకపోయెను. ఈ సంతానకాంక్ష, బృహస్పతికిఁ గలిగిన శాపము, కారణములుగా నీతఁడు తారను రమించి బుధమహర్షిని బుట్టించి యీ విధముగఁ బరభార్య యందు సంతానము గలవాఁ డయ్యెను. *

## దక్షుఁ డీశ్వరునిపైఁ బగఁగొనుట

తొల్లి బ్రహ్మ యొనరించు సత్త్రియాగముఁ జూచు కుతూహల మున విష్ణుమహేశ్వరులు, ఇంద్రాదిదేవతలు, మహర్షులు వచ్చి కూర్చుండిరి. అంతఁ గొంతసేపటికి దక్షమహర్షి ఆ సత్త్రియాగము చూడ నేతెంచెను. అతఁడు రాఁగానే యెల్లరు లేచి నిలిచిరి. కాని, బ్రహ్మ, ఈశ్వరుఁడు ఇరువురు కూర్చుండియే యుండిరి. అపుడు దక్షుఁడు విష్ణుమూర్తికి నమస్కరించి భక్తిపరవశులై సభ్యులు తన కిచ్చినపూజలు గైకొని, ఉచితాసనమునఁ గూర్చుండి శివునివంకఁ గనులెఱ్ఱఁ జేయుచుఁ జూచి సభ్యులెల్లరఁ దిలకించి "ఓ దేవతలారా! దిక్పాలకులారా! సభ్య మహాశయులారా! ఈ శివునిపొగరు చూడుఁడు. ఈతఁడు క్రియా శూన్యుఁడు, సిగ్గు లేనివాఁడు, సావిత్రీసమానురా లగు నా కూఁతురగు సతీదేవిని నే నీతని కిచ్చినగర్వమునఁ గాఁబోలు నన్నుఁజూచి లేచి నిలువఁడయ్యెను. కానీ దానికేమనుకొంటిని. నోటితోఁ బలుకరింప నైనఁ బలుకరింపఁ డాయెను. ఈతఁడు మానహీనుఁడు, ఉన్మత్తుఁడు, దిగంబరుఁడు, భూతప్రేతపిశాచపరివృతుఁడు, శుచిహీనుఁడు, అస్థిమాలా ధరుఁడు, దుష్టహృదయుఁడు, ఉగ్రుఁడు, శ్మశానవాసి, ఇట్టి శివునికి శివనామము కలుగుట ప్రవాదము. నేను తెలియక వేదము శూద్రుని

* బ్రహ్మవైవర్తపురాణము, భాగవతము, చతుర్థస్కంధము.

కిచ్చినటులు నాకూఁతు నీతని కిచ్చి పెండ్లి చేసితిని. స న్నీతఁడు చేసిన తృణీకారమున కితనికి శాప మిచ్చుచున్నాను. ఈతఁ డింద్రాదులతో నున్నను యాగభాగముల కర్హుఁడు కాకుండుఁగాక!" అని శపించెను. సదస్యులలోఁ బెక్కురు లేచి దక్షుని నిందించిరి. అంత నాతఁడు కోపమున నట నుండనోపక లేచి వెడలిపోయెను.

అపుడు నందికేశ్వరుఁడు దక్షుఁడు చేసిన శివనిందకు, ఇచ్చిన శాపమునకు మండిపడి "ఈ మూఢాత్ముఁడు తత్త్వవిముఖుండగుఁగాక! ఈతఁడు కూటధర్మము లయిన గ్రామ్యసుఖకాంక్షలయందు సక్తుఁడై అర్థవాదములైన వేదములచే బుద్ధిహీనుఁడై కర్మపరుఁడగుఁగాక! దేహాదికములు ఉపాదేయములుగా తలఁచుచు బుద్ధిచే ఆత్మతత్త్వ మెఱుఁగలేక వర్తించుచుఁ బశుప్రాయుఁడు, స్త్రీకాముఁడు నగుఁగాక! త్వరలో నీతఁడు మేషముఖుండగుఁగాక! ఈతని ననుసరించినవిప్రులు విమోహితమనస్కులు, కర్మాధీనులు, దేహలంపటులు నయి యాచకు లగుదురుగాక!" అని శపించెను.

నందికేశ్వరునిమాటలు విని భృగుమహాముని యాతనిపై మండిపడి "ధూర్జటివ్రతులు, వారి ననుసరించువారు పాషండు లగుదురుగాక! సకలవర్ణాశ్రమాచారహేతువు, లోకమంగళకరము, సనాతనము, పూర్వఋషిసమ్మతము, జనార్దనము, నిత్యము, శుద్ధము, పరము, ఆర్యపథానుగను అగువేదమును విప్రులను ఈతఁడు నిందించినకారణమున, ఈతఁడు, ఈతని ననుసరించువారు భస్మజటాస్థిధారణములచే మూఢబుద్ధులై నష్టశౌచులై పాషండు లగుదురుగాక!" అని శపించెను.

ఇట్లన్యోన్యశాపము లందియు భగవత్కటాక్షము కలవారగుట నెవ్వరు నాశము నొందరైరి. జరిగినసంగతికి హరుఁడు మనస్సు చివుక్కుమన ననుచర సమేతుఁడై వెడలిపోయెను. ఈ విధముగా నాఁటుకొనిన విరోధబీజములు ఉల్లుఁడగుశివునియందు, మామ యగు దక్షునందు దినదినప్రవర్ధమానములు కాఁజొచ్చెను.

## దక్షాధ్వరవినాశము

రుద్రుఁడు లేనియాగము యాగము కాకపోవుట యెఱిఁగియు నాతనిపైఁ గల తనకోపము కారణముగా, సకలప్రజాపతి విభుఁడ నను గర్వకారణమునను, బ్రహ్మనిష్ఠు లగుఈశ్వరాదుల ధిక్కరించి, అరుద్రక ముగా దక్షమహర్షి వాజపేయయాగముచేయ నారంభించెను. అది పరిసమాప్తి యైనవెనుక బృహస్పతియాగ మను పేర మఱియొకయజ్ఞ మును దక్షుఁ డారంభించెను. అది చూచుతలంపున పరమమునులు, ప్రజాపతులు, మహర్షులు, దేవతలు సపరివారముగా విచ్చేసి దీవనలిచ్చి దక్షునిపూజ లందిరి. దక్షతనయయు, ఈశ్వరునిల్లాలు నగుసతీదేవి తనతండ్రి చేయు యజ్ఞమును గుఱించి గగనచరులు పొగడఁగా విని ఆకాశమువంకఁ జూడఁగా ఆ యజ్ఞమును జూడ నేఁగు ఖచర గంధర్వ కిన్నరాంగనలు కనఁబడఁ గాంచి, తనభర్తతోఁ దాము ను జనుట మంచిదని జనక, గురు, మిత్ర రాజులిండ్లకుఁ బిలువకున్నను బోవచ్చును. కనుకఁ బోవుద, మని పలికెను. అది విని శివుఁడు "కాంతా! నీవు చెప్పినది నిజమే కాని, విద్యావయోరూపవిత్తకులములు మంచివారి యెడ మంచిగనే యుండును. కాని, ఇవి కుజనుల కున్నయెడల దోష హేతువులై వివేకము చెఱచును. మహాత్ములైనవారి గొప్పతనము గర్వులు చూడలేరు. కుటిలు లగువారిండ్లకు మంచివాఁడు పోరాదు. నీవు దక్షునికూఁతురవే యైనను నాభార్య వగుట నాతఁడు నిన్నాదరిం పఁడు, పరాభవించును. లోకమున బంధువులవలనఁ బూజ నొందక తిరస్కారము ననుభవించుట చచ్చుటే యగును" అని చెప్పి యూర కుండెను.

కాని, సతీదేవి తల్లిని తోఁబుట్టువులను తండ్రిని చూచువేడుక తొందరచేయఁగా సపరివారముగా దక్షునియజ్ఞశాల కేతెంచెను. అపు డామెను జూచి తల్లియు అక్కసెల్లెండ్రును పలుకరించిరి. కాని దక్షుని భయమున మిగిలినవా రెవ్వరుఁ బలుకరింపరైరి. దక్షుఁడుకూడ అవ మానించెనే కాని పలుకరింప లేదు. పైఁగా ఆ యజ్ఞమున నామె శివ తిరస్కారమును గాంచి ఆ దక్షుని వధింత మని లేచిన భూతగణములను

వారించి దక్షుని జూచి "తండ్రీ! లోకమున శరీరధారులైన జీవులకుఁ బ్రియాత్మకుఁడైనయీశ్వరునకుఁ బ్రియాప్రియులు, అధికులును లేరు. అట్టి యీశ్వరుని నీవు తృణీకరించితివి. నీకూఁతుర నని పిలువఁబడుటకు నాకు సిగ్గగు చున్నది. ఈ నాశరీరమును దహించి నేను స్వేచ్ఛత నందెద" నని సతీదేవి యోగమార్గమున యోగాగ్నిచే తత్క్షణమే దగ్ధమయ్యెను. అది చూచిన శివానుచరులు దక్షుని దహింప నుద్రేకించిరి. భృగుమహాముని అభిచారికహోమ మొనర్చి దక్షిణాగ్నిని వేల్చిన ఋభునామక దేవతలు విచ్చేసి రుద్రపార్షదు లైన ప్రమథగుహ్యకగణములను బాఱఁద్రోలిరి.

ఈ సంగతి విని శివుఁడు కోపించి తనజట నొక్కదానిని పెఱికి వైచిన నందుండి వీరభద్రుఁ డుదయించి శివునానతిఁ గొని దక్షాధ్వర వినాశనమునకు బయలుదేఱెను. అతని వెనుక శివపరివారము యుద్ధసన్నద్ధమై చనెను. వీరిని జూచి దక్షాధ్వరమున నెల్లరు తలయొక వంకకుఁ బోయి దాఁగుకొనిరి. వీరభద్రునితోడి శివసైన్యము దక్షాధ్వరమును సర్వవిధముల నాశనము చేసెను. నందీశ్వరుఁడు మును దక్షుఁ డభవుని దిట్టినప్పుడు కన్నుగీటిన భగునిఁబట్టి కన్నులు పెకలించెను. దక్షుఁడు భవునిశపించినపుడు పరిహసించిన పూషుని పండ్లూడఁగొట్టెను. దక్షునివక్షముఁ ద్రొక్కి వీరభద్రుఁడు మంత్రితచర్మము గలదక్షుని జంపలేక తల నఱికి సపరివారముగా కైలాసమున కేఁగెను.

ఇది విని బ్రహ్మ విష్ణువు దేవతలు కైలాసపర్వతమున కేఁగి దక్షిణామూర్తి రూపుఁ డగునీశ్వరుని సమీపించి నమస్కరించిరి. శివుఁడు వారలక్షేమ మడిగి వారిప్రార్థనమున దక్షాదుల ననుగ్రహించెను. తల నఱుకఁబడిన దక్షుని మేషముఖునిఁ జేసిన నాతఁడు నిద్ర మేల్కనినట్లు లేచి యెదుట నున్నశివుని శరణుచొచ్చి యిట్లనెను. "దేవా! నీ కపరాధుఁడ నగు నను దండించుట రక్షణమే కాని శిక్షణము కాదు. నీవు, విష్ణువు బ్రాహ్మణాఖాసులను దండింతురు. సర్గాదిని ఆమ్నాయసంప్రదాయ ప్రవర్తనము నెఱిఁగించుటకు విద్యావ్రతపరాయణు లైన బ్రాహ్మణులను బుట్టించితివి. కాన గోపాలుఁడు గోవులను రక్షించు

నట్లు నీవు వారిని రక్షించుచుందువు. నీకు నే నెన్నియుపకారములు చేసినను నన్నుఁ గాపాడితివి. నీకు నే నేమి ప్రత్యుపకారము చేయఁ గలను ?" అని రుద్రక్షమాపణంబు చేసి బ్రహ్మ పనుపున నేఁగి యజ్ఞమును పరిసమాప్తి చేసెను. అపుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, దేవతలు నచటికి విచ్చేసిరి. అందఱు విష్ణుమూర్తిని బూజించిరి. విష్ణువు సంతసించెను. విష్ణుదేవతాకమను ఆ యాగమున దక్షుఁడు విష్ణువును బూజించి తరువాత అంగప్రధానకయాగములచే శివుని బరితుష్టు నొనర్చెను. అపు డందఱు ధర్మబుద్ధి గలిగి సుఖవృత్తి నుండుమని దక్షుని దీవించి వెడలిపోయిరి.

దాక్షాయణి యగుసతీదేవి పూర్వకళేబరము విడిచి హిమవంతునకు మేనకయందుఁబుట్టి పూర్వదయితుఁడగు రుద్రుని వరించెను. *

## దక్షస్మృతి

దక్షమహర్షి రచించిన ధర్మశాస్త్రగ్రంథమునకు దక్షస్మృతి యని పేరు. ఇందు ఏడధ్యాయములు గలవు. మొదటి అధ్యాయములో చతురాశ్రమవర్ణనము కలదు.

సర్వధర్మార్థతత్త్వజ్ఞ సర్వవేదవిదాంవరః,
పారగః సర్వవిద్యానాం దక్షోనామప్రజాపతిః.

ఉత్పత్తిప్రళయశ్చైవ స్థితిసంహారఏవ చ,
ఆత్మాచాత్మని తిష్ఠేత ఆత్మాబ్రహ్మాణ్యవస్థితః.

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోయతిస్తదా,
ఏతేషాంతు హితార్థాయ దక్షశ్శాస్త్ర మకల్పయత్.

---

* శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము, పద్మపురాణము సృష్టిఖండము విష్ణుపురాణము.

అని యీ ధర్మశాస్త్రము ప్రారంభింపఁబడినది. రెండవఅధ్యాయమున ప్రాతఃకాలమునఁ జేయవలసిన కర్మాదికమునుగూర్చి తదితర విషయములనుగుఱించి కలదు. ఈ అధ్యాయారంభ మిట్లున్నది:

ప్రాతరుత్థాయ కర్తవ్యం యద్ద్విజేన దినే దినే,
తత్సర్వం సంప్రవక్ష్యామి ద్విజానా ముపకారకమ్.

తృతీయాధ్యాయమున గృహస్థాశ్రమవర్ణనము కలదు. ఇందు:

న క్లేశన వినా ద్రవ్యం ద్రవ్యహీనః కుతః క్రియా,
క్రియాహీనే నధర్మస్స్యాత్ ధర్మహీనే కుతః సుఖమ్.

సుఖం వాంఛతి సర్వోహి తచ్చ ధర్మసముద్భవమ్,
తస్మాద్ధర్మః సదా కార్యః సర్వవర్ణైః ప్రయత్నతః.

న్యాయాగతేనద్రవ్యేణ కర్తవ్యం పారలౌకికమ్,
దానంచ విధినా దేయం కాలే పాత్రే గుణాన్వితే.

మున్నగు మనోహరధర్మములు చెప్పఁబడినవి. నాలుగవఅధ్యాయమున

పత్నీమూలం గృహం పుంసాం యదిచ్ఛందోనువర్తినీ,
గృహాశ్రమసమం నాస్తి యదిభార్యావశానుగా.

అను శ్లోకారంభముతో భార్యాభర్తృధర్మములు చక్కగావిశదీకరింపఁ బడినవి. పంచమాధ్యాయమున శౌచాశౌచములు క్రియాక్రియలను గూర్చిన సూక్ష్మధర్మములు కొన్ని గలవు. ఆఱవ అధ్యాయము జన్మమృత్యుసముద్భవ మగుసూతకమునుగూర్చి చెప్పి:

స్వస్థకాలే త్విదం సర్వ మశౌచం పరికీర్తితమ్,
ఆపద్గతస్య సర్వస్య సూతకే నచ సూతకమ్.

అని ముగిసినది. ఏడవఅధ్యాయమున యోగమును గూర్చిన ప్రశంస గలదు. ఈ ధర్మశాస్త్రమునందలి తుదిశ్లోకము లివి:

దక్షశాస్త్రం యథాప్రోక్తం అశేషాశ్రమముత్తమమ్,
అధీయంతే తు యేవిప్రాః తే యాన్త్యమరలోకతామ్.

ఇదంతు యః పఠేద్భక్త్యా శృణుయా దథమోఽపివా,
స పుత్రపౌత్రపశుమాన్ కీర్తించ సమవాప్నుయాత్.

శ్రావయిత్వా త్విదంశాస్త్రం శ్రాద్ధకాలేఽపివా ద్విజః
అక్షయం భవతి శ్రాద్ధం పితృభ్యశ్చోపజాయతే.



# మహర్షుల చరిత్రలు

## దీర్ఘతమో మహర్షి

### జననము

అంగిరసుఁ డనుమహర్షి దేవహూతీకర్దముల కుమారి యగు శ్రద్ధను వివాహ మాడి ఆమెయందుఁ బెక్కురుపుత్రులను గాంచెను. వారిలో ఉతథ్యుఁడు, బృహస్పతి, సంవర్తుఁడు అనుముప్పురు జగత్ప్రసిద్ధులు.

ఉతథ్యుఁడు యుక్తవయసు గన్నపిదప మమత యనుకన్యకను వివాహ మాడి యామెతో గృహస్థధర్మములను నిర్వర్తించుచుండెను. నిరంతరతపోధ్యానాసక్తుఁడు, జ్ఞానసమన్వితుఁడు, తీర్థయాత్రాపరుఁడు నయి ఉతథ్యమహర్షి పేరుగాంచెను. సంవర్తుఁడు యోగీశ్వరుఁడు బ్రహ్మచారియై ఖ్యాతి గాంచెను. బృహస్పతి తన బుద్ధిబలమున దేవ గురువై తారను భార్యగాఁ గైకొని దేవేంద్రునికిఁ బ్రధానాచార్యుఁడై వసించుచుండెను.

ఇట్లుండఁ గాలక్రమమున మమత ఉతథ్యునివలన గర్భము ధరించెను. కొంతకాలమునకు ఉతథ్యుఁ డామె నింట విడిచి తీర్థ యాత్రలకై బయలుదేఱి పోయెను. ఆ సమయమున బృహస్పతి సోదరుని జూచుటకు దేవలోకమునుండి భూలోకమునకు విచ్చేసి ఉత థ్యునియాశ్రమముఁ జేరెను. ఇంట నున్నమమత యాతని కతిథి సత్కారములు చేసి గౌరవించి తనభర్త తీర్థయాత్రల కేఁగె నని తెలిపెను. మిక్కిలిబుద్ధిమంతుఁడును దేవగురుఁడు నగుబృహస్పతి దైవోపహతుఁడు, శాపతిమిరబద్ధుఁడునై సౌందర్యవతి, పతివ్రతాతిలకము నగుమమతపై మరులుగొనెను.

మమత బృహస్పతిధోరణి గ్రహించి తాను గర్భవతి ననియు నంతకు మించి యాతనికి మాతృసమాన ననియుఁ దెలిపి యుట్టితనయెడ నాతఁడు మరులుగొనుట ధర్మరహిత మని హితముపదేశించెను. కామాంధు లకు హితోపదేశములు తలకెక్కునా? వెంటనే యాతఁ డామెను జేరి దేవ రన్యాయమునఁ దనయెడ దోషము లే దనియుఁ దన్ను స్వీకరించి కోరిక తీర్పు మనియు బలవంతము చేసెను. అందుకు కీయకొనక యామె యాతని నెంతయుఁ దృణీకరింపఁగా నాతఁ డామెపైఁ బడి శయ్యకుఁ జేర్చి బలవంతముగా రమింపఁ దొడఁగెను.

అపు డామెగర్భమునఁ గలయర్భకుఁ డాతనినీచ కృత్యమున కసహ్యించుకొని "ఓయీ! తప్పుపని వెంటనే మానుము. ఈమె గర్భమున నర్భకుఁడను నే నున్నాను. నీ వీర్యమున కిచటఁ దావులేదు. నీవు చేయుపని మిక్కిలి యధర్మము. కావున, బుద్ధిగలిగి యీ పని విరమించి వెడలిపొమ్ము" అని బృహస్పతికి వినఁబడునట్లు పలికెను. ఐన, నాతఁ డీయర్భకునిమాటలు తృణీకరించి తన కామబాధ తీర్చుకొని మమతగర్భమున వీర్యము విడిచెను. తత్క్షణములోనున్న బాలుఁ డావీర్యమును బయటకుఁ దన్నివేయఁగా నదినేలపైఁ బడెను. అందులకుఁ గనలి బృహస్పతి యా గర్భమునఁ గల బాలుని దీర్ఘత ముఁడ వగు మని శపించెను.

కాలక్రమమున నా బాలుఁడు పుట్టుగుడ్డియై జన్మించి దీర్ఘతముఁ డను పేరఁ బెరుగఁజొచ్చెను.

## వివాహము

శాపవశమున నిట్లు పుట్టుగ్రుడ్డియై జన్మించినను, వంశపరంపరా గత మగుతపోజ్ఞాన విద్యావివేకము నంది దీర్ఘతముఁడు వేదవేదాంగము లభ్యసించి పండితపుంగవుఁడు, విజ్ఞానవేత్త, తపస్వి, కీర్తిశాలి యయ్యెను.

తండ్రి నియోగమున నాతఁడు వివాహమాడి సంతానమునంద నిశ్చయించుకొనెను. యుక్తవయసు గన్నపిదప నాతఁడు ప్రద్వేషిణి

యనువిప్రకన్యకను వివాహమాడెను. ఆమె పేరునకుఁ దగినట్లే అందఱిని ద్వేషించుటలో అగ్రేసరురాలయ్యెను. ఐనను, ఆమెకుదీర్ఘత మునివలన గౌతముఁడు మున్నగుపేళ్ళతో నెందఱో పుత్రులు జన్మించి పెరుగుచుండిరి. తపస్స్వాధ్యాయపరుఁడగు దీర్ఘతమోమునియు దేనిని పట్టించుకొనక కాలక్షేపము చేయుచుండెను.

## కామధేనుపుకుమారునితో మైత్రి

ఇట్లు దీర్ఘతమోమహర్షి యొక్కఁడును తపోధ్యానాను రక్తుఁడై యుండెను. ప్రద్వేషిణీ ఈతనికి దూరమున నుండుచుఁ దనపుత్రులపై మమకారము పెంచుకొని భర్తను తృణీకరింపఁ దొడఁగెను. ధ్యానాసక్తుఁ డగుదీర్ఘతమునికడ కొకసారి కామధేనువు కుమారుఁడు విచ్చేసి తన్నై ఱుక పఱుచుకొని "ఓ దీర్ఘతమోమహర్షీ! నీవు జాత్యంధుఁడవైనను, సర్వశక్తి సంపన్నుఁడవు. అమోఘవీర్యుఁడవు. నీవు సంతానహీనులకుఁ బుత్ర దానము చేయఁగల సమర్థుఁడవు. మఱియు నీవు కారణజన్ముఁడవు. వంశవర్ధన నిమిత్తమే పుట్టితివి. కావున, ఎట్టిగొడ్రాలికైనను నీవు పుత్ర భిక్షపెట్టఁగల మైథునశక్తిని నీ కనుగ్రహించెదను. 'ప్రకాశమైథున' మను ఈ యమూల్యవిద్యను నీకు నేర్పెదను. దాన నీవు కొన్నివంశము లకు ఉద్ధారకుఁడ వయ్యెదవు. మఱికొన్నివంశములకు మూలపురుషుఁడ వయ్యెదవు. పరశురామునిచే సర్వక్షత్రియకులము సంపూర్ణముగా నశించి యుండుటచే నీయీశక్తి యవసరము కాఁగలదు. జాత్యంధుఁడ వగు నీవు వంశవర్ధన మొనరించుమహర్షి వయ్యెదవు. భౌతికాంధులు కాక పోయినను క్రోధాంధులై వంశవర్ధనము గాక వంశవినాశముఁ గావించు వారికన్న నీ వెన్నోరెట్లు మిన్నవు కాఁగలవు" అని చెప్పి దీర్ఘతముని కావిద్య నుపదేశించి వెడలిపోయెను.

నాఁటినుండి దీర్ఘతముఁడు తాను నేర్చిన యీ విద్యాఫలిత మెట్లుండునో యని చూడ వేఁడుకపడి తనభార్య కోపించి తనకడకు రాక పోవుటచే అన్యవిషయమునఁ దాను ప్రయోగము కావింప మొదలిడెను. తాను నేర్చినవిద్య యెల్లెడల సద్యఃఫలిత మొసఁగుచుండెను. కాని,

దీర్ఘతమోమహర్షి యీ ప్రవర్తనమును అర్థము చేసికొనలేక యాతనిని జారుఁ డని లజ్జా విహీనపశుకాముఁ డని నిందించి యాతనిని వెలివేయఁ దొడఁగిరి.

తనకుఁ గలకోపమునకుఁ దోడు ఈ సంగతి విన్న ప్రద్వేషిణి భర్తను పూర్తిగా ద్వేషించుచు నాతనివంక కేగుటే మానివేసెను. ఒకనాఁ డాతఁడు భార్యకడకు వచ్చి 'సతికిఁ బతిని ద్వేషించుటకన్న పాప మున్నదా? నీకు నే నేవిధమైనలోపమును జేసి యుండలేదే? నన్నిట్లు ద్వేషించుటకుఁ గారణమే" మని యడిగెను. ఆమె నదురుబెదురు లేక:

"పతియు భరియించుఁ గావున భర్త యయ్యె
భామ భరియింపఁబడు గాన భార్య యయ్యె
పరగ నవి మనయందు వీడ్వడియె నిన్ను
నేన యెల్లకాలము భరియింతుఁగాన."

భార. ఆది ౪ ౨౨౮.

అని పలికి "ఇఁక నిన్నొకక్షణమైన నేను భరింపలేను. నీవు నాకు భర్తవు కావు, నేను నీకు భార్యను గాను. ఇటనుండి కదలి యెటకేని పొమ్ము. పోకున్న నేనే నిన్నుఁ ద్రోలివేసెద" నని యామె యాతని నిష్ఠురోక్తు లాడెను.

## దీర్ఘతముఁడు భార్యను శపించుట

అంత నాతఁడు "ఓసీ! నా విలువ తెలియని మూర్ఖురాలవై నన్నిట్లు నిష్ఠురోక్తులాడితివి. నీవును నీ కుమారులును గలిసి నన్ను రాజగృహమునకుఁ దోడుకొని పొండు. నన్నుఁ దా నుంచుకొని యా రాజు మీకుఁ దగినధన మొసంగఁగలఁ" డని సూచించెను. కాని యామె యాతనిమాటలకుఁ జిరాకుపడి "నీవలన సంపాదించినధనము నీచము, దుఃఖకారణము" నని మఱింత నిందించెను.

దీర్ఘతముఁడపు డొడలుమండి "ఇది మొదలు సతి కొకఁడే పతి యగుఁగాక ! మఱియు

పతి హీన లైనభామిను
లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలం
కృత లయ్యెడు మాంగల్య ర
హిత లయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలుగన్."

భార. ఆది. ౪. ౨౩౦.

అని యామెనే గాక స్త్రీల నందఱను శపించెను.*

## ప్రద్వేషిణి భర్తను గంగఁ ద్రోయించుట

ఈ శాపమును విన్న ప్రద్వేషిణి భర్తపై మండిపడి తనపుత్రులను బిలిచి "వత్సలారా ! ఈతఁడు నోటికి వచ్చినట్లు కూఁతలు కూయు చున్నాఁడు. ఇఁక మీ రాలసించిన మిమ్ములను కూడ శపింపఁగలఁడు. కావున, వెంటనే మీ రీతనిని బట్టుకొని కట్టివేసి గంగలోఁ ద్రోసి రండు. గ్రుడ్డివాఁడు, జారుఁడు, క్రూరుఁడు నగు తండ్రి తండ్రి కాఁడు. నాయాజ్ఞ వెంటనే పాలింపుఁ" డని యామె యాజ్ఞాపించెను. లోభోప హతచేతసులు, అజ్ఞానులు నగునామె పుత్రులు వెంటనే యంధుఁ డగు తండ్రిని పట్టి కట్టి తెప్పలోఁ గూర్చుండఁబెట్టి గంగానదియందు విడిచి చేతులు కడిగికొని యింటికిఁ జేరిరి.

దీర్ఘతముఁడు తనకుఁ బట్టినదుర్గతికి వంత నొందక నిర్భాగ్యురా లగుభార్య బుద్ధిహీను లగుపుత్రులు గలవారి కట్టియోగముకాక మఱెట్టి యోగము కలుగు ననుకొని విజ్ఞాని, యోగి కావున నాతఁడాస్థితిలోనైతము ఉదాత్తానుదాత్తస్వరితప్రచయస్వరభేదంబు లేర్పడ—

---

* "అద్యప్రభృతి మర్యాదా మయాలోకే ప్రతిష్ఠితా,
ఏకఏవపతిర్నార్యా యావజ్జీవం పరాయణమ్.

సలక్షణముగా వేదములు చదువుచు అల లేత్తైపునకు గెంటిన నాపైపునకే పోవుచు, ప్రౌఢబ్రహ్మచరిష్ఠు డగుయోగియై గంగానదిలో ప్రయాణము చేయుచు పెక్కుదేశములు దాఁటి పోయెను.

## బలి యనురాజు మహర్షిని గొల్చుట

ధార్మికశ్రేష్ఠుఁడు రాజతిలకుఁడు నగు బలి యనువాఁడు గంగాభిషేకార్థము వచ్చి నదిలోఁ గొట్టుకొనివచ్చుచుఁ దనయున్నదరిని జేరవచ్చినవానిని దీరముఁ జేర్చి యాతని బంధనములు సడలించి యాతఁడు మమతాపుత్రుఁ డగుమహర్షి యని గ్రహించి సాష్టాంగ దండప్రణామము లాచరించి-

" ఎందుండి వచ్చి తిందుల
కెందుల కేఁగుదు మహామునీశ్వర ! విద్వ
ద్వందిత ! నాపుణ్యంబునఁ
జెందితి ని న్నిష్టఫలముఁ జెందినపాటన్.

భార. ఆది ౪. ౨౨౨

అని యడిగెను.

---

మృతే జీవతి వా తస్మి న్నాపరం ప్రాప్నుయాన్నరమ్,
అభిగమ్య పరం నారీ పతిష్యతి న సంశయః.
అపతీనాంతు నారీణా మద్యప్రభృతిపాతకమ్,
యద్య స్తిచేద్ధనం సర్వం వృథా భోగా భవంతు తాః.
అకీర్తిః పరివాదాశ్చ నిత్యం తాసాం భవంతు వై

సం. భార. ఆది. ౧౦౪. ౩౫-౩౭.

ఇది మొదలు నేను శాసించుచున్నాను. స్త్రీకి యావజ్జీవము ఒక్కఁడే మగఁడు గతియగుఁగాక ! వాఁడు మరణించినను బ్రతికి యున్నను స్త్రీ మఱియొక పతిని పొందరాదు. పొందినయెడల ఆమె పతితురా లగును. భర్తను విడిచినస్త్రీ యెంతధనవంతురాలైనను పాపిని యగును. ఆమెభోగము వ్యర్థమే యగును. అకీర్తి, నింద యామెకుఁ గలుగును.

దీర్ఘతమోమహర్షి తనవృత్తాంత మంతయు దాఁపక బలికిఁ జెప్పి వేసెను. బలి యెంతయు సంతసించి తనకు సంతానలాభముఁ గలుగఁ జేయుమని యాతనిఁ బ్రార్థించి పురమునకుఁ గొనిపోయి దివ్యసౌధమున విడియించి పూజించెను.

పిదప, బలిమహారాజు మహర్షిని సమీపించి ఋతుమతియగుతన భార్యను సుదేష్ణయనుదానిని బంపెద ననియు నామెకుఁ బుత్రభిక్షఁ గటాక్షింపు మనియుఁ గోరెను. దీర్ఘతముఁ డందుల కంగీకరించెను కాని సుదేష్ణ:

"పుట్టుఁజీఁకు వృద్ధుఁ బూతిగంధాస్యు
వేదజడునిఁ బొంద వెలఁది రోసి
తన్ను బోనిదానిఁ దన్విఁ గోమలిఁ దన
దాదికూఁతుఁ బంచెఁ దపసికడకు.

భార. ఆది. ౪. ౨౩౪

దీర్ఘతముఁ డాసంగతి యెఱిఁగియు నా దాదికూఁతు సదృష్టమునకు సంతసించి యామెకే పదునొకండుగురు పుత్రులను బుట్టించెను.

## దీర్ఘతమోమహర్షి వంశవర్ధనుఁ డగుట

కక్షీవంతుఁడు మున్నగు పేళ్ళు గల యాపదునొకండుగురు వేదము లభ్యసించుచుండుటఁ గని బలి యా పుత్రులు తన పుత్రులేయని భ్రమించి వారిని గొనివచ్చి మహర్షికిఁ జూపెను. దీర్ఘతముఁడు వారు దాసి కూఁతు పుత్రు లని సత్యముఁ దెలిపెను. బలి చాల విచారించి తనపత్ని యగుసుదేష్ణను మహర్షికడకుఁ బుత్రోత్పత్తికై పంపెను.

దీర్ఘతముఁ డారాణి యొడలు తడవి "దేవీ! నీకు సూర్యసమతేజులైనయైదుగురు కొడుకు లుదయింతు" రని యామెకు వరమిచ్చి యనుగ్రహించెను. సుదేష్ణ యా మహర్షి వలన నుత్తము లగునైదుగురు

పుత్రులను గనెను. వారు అంగుఁడు, వంగుఁడు, కళింగుఁడు, పుండ్రుఁడు, సుహ్మఁడు నను వారు. వారు పెరిగి పెద్దవారై వరుసగా అంగదేశము, వంగదేశము, కళింగదేశము పుండ్రము, సుహ్మము అనుదేశములకు రాజులై వంశాభివృద్ధి నందిరి. ఇట్లు దీర్ఘతమోమహర్షి పెక్కు రాజవంశములకు గారకుఁ డయ్యెను.



# మహర్షుల చరిత్రలు

## రురుమహర్షి

### జననము

భృగుమహర్షికి పులోమయందు చ్యవనమహర్షి జన్మించెను. చ్యవనమహర్షి సుకన్యయందు ప్రమతి యనుకుమారుని గాంచెను. ప్రమతి దివ్యతేజస్వియై మహాతపస్సంపన్నుఁడై విరాజిల్లుచుండెను. ఘృతాచి యనునప్సరస యాతనిని వలచి యాతని యాశ్రమమునకు వచ్చి సేవచేయుచుండఁగాఁ గొంతకాలమున కాతని కామెపై ననురాగ ముదయించెను. పిదప ఘృతాచియందు ప్రమతి యొకసుపుత్రుని గాంచెను. అతఁడు రురుఁడనుపేరఁ బెరుఁగుచు ధర్మాత్ముఁడు, తపశ్శాలి, విద్యావంతుఁడు, మన్మథోపముఁడు నయి యలరారుచుండెను.

### ప్రమద్వర

ఆ దినములలో మహాతపస్సంపన్నుఁడు, విద్యావంతుఁడు, అపార తేజుఁడు నయి స్థూలకేశుఁ డనునొకమహర్షి యుండెను. అతఁడు సర్వ భూతములయందు సమదృష్టి కలవాఁడై దయామయుఁడు తత్త్వ విదుఁడు నను విఖ్యాతి గడించెను. అతని యాశ్రమము నిర్మానుష్యమై పరమ పవిత్రమై ప్రశాంతనిలయమై యుండెను.

ఇట్లుండఁగా, విశ్వావసుఁ డనుగంధర్వరాజు అప్సరస యగు మేనకయందు మిక్కిలి మక్కువ కలిగి యామెపొందుఁ గోరెను. మేనక యాతని నిసుమిక్కిలి వలచియుండెను. వా రుభయులు సందుచూచు కొని లేచి వచ్చి స్థూలకేశమహర్షి యాశ్రమప్రాంతమున మిథున కృత్య మొనరించి తమకోరికఁ దీర్చుకొనిరి. వారట్లాడ లెఱుఁగక కొంతకాల మచట విహరించిన మేనక గర్భవతి యాయెను.

ప్రసవసమయము వచ్చినంతనే మేనక చక్కనిచుక్కయగునొక కూఁతుమ గని యా పిల్లను స్థూలకేశమహాముని యాశ్రమప్రాంతమున విడిచిపెట్టి స్వర్గమునకు వెడలిపోయెను. విశ్వావసుఁడును కోరిక తీరిన వాఁడై యా బిడ్డజోలికిఁ బోక తాను యథేచ్ఛముగా వెడలిపోయెను. ఏమి! సృష్టిచిత్రము! ఏయుగముననైన నెంతటివారికైనఁ గామావేశము కలుగుట, అంత మిథునకృత్య మొనరించుట, గర్భము కలుగుట, దయారహితులై పుట్టిన బిడ్డను పారవేసి పోవుట పరిపాటియే యేమో! స్వర్గవేశ్య యట్లొనరించు టొకయాశ్చర్యమా?

స్థూలకేశమహర్షి యాశ్రమము విడిచి నది కేఁగి స్నానముచేసి తిరిగివచ్చుచు దేవతాకన్యవలె ముద్దులు మూటగట్టుచు అంద చందములతో నలరారు చిన్నిబిడ్డను గాంచి దివ్యదృష్టిని సర్వము తెలిసికొని దయామయుఁడై యింటికిఁ దీసికొనిపోయి యా పసికూనను పెంపఁ దొడంగెను. జ్ఞానసంపన్నులు, దయాసముద్రులు అగు మహర్షులు చలిచీమపైనైనను జాలిగొందురు. అట్టితఱి, ఏ పాపమెఱుఁగని యా పసికూనను గాంచిన స్థూలకేశమహర్షి యెట్లు విడిచి పోఁగలఁడు? కన్న తలిదండ్రులకు లేని జాలి కనులతోఁ గాంచిన కారుణికులకుఁ గలుగును కదా!

సర్వసంగములను విడనాడి సర్వేశ్వరునిదక్క నన్య మెఱుఁగని యా జడదారి యీ పసిపిల్లను బెంచి యథాశాస్త్రీయముగా జాతకర్మాదిక మొనరించి నామకరణ మొనరింపవలసినవేళ, ప్రమదలలోనెల్ల ఉత్తమురా లగుట ఆ పిల్లకు 'ప్రమద్వర' అని పేరిడి యల్లారు ముద్దుగాఁ జూచుకొనుచుండెను. ఆమె కాతఁడన్ని విద్యలు నేర్పుచు చక్కగా తీర్చి దిద్దుచుండెను.

## రురుఁడు ప్రమద్వరను వరించుట

ఇట్లుండఁగా రురుఁ డొకసారి స్థూలకేశమహామునిని దర్శించుట కాతనియాశ్రమమునకు విచ్చేసి యందతి మనోహరముగఁ బెరుఁగుచు దివినుండి భువి కేతెంచిన దేవకన్యయో, లేక సౌందర్యము మూర్తీ

భవించిన సారసాక్షియో యన వెలుఁగొందు ప్రమద్వరను గాంచెను. పరమధర్మాత్ముఁడు సదా బ్రహ్మచర్యపరినిష్ఠితుఁడు నగు నామహనీయుని కా కన్యపై ననురాగ ముదయించెను.

తరువాత రురుఁ డింటి కేఁగి ప్రియమిత్రులమూలమున తండ్రి యగు ప్రమతిమహర్షి కంతయు నెఱిఁగించి కర్తవ్య మాతనిపై విడిచి వేసెను. ప్రమతి యాలోచించి తగినవారిని వెంటఁగొని స్థూలకేశమహర్షి యాశ్రమమున కేఁగి యాతనివలన నుచితసత్కారము లంది పిదప తాను కన్యార్థినై వచ్చితి ననియుఁ దన కుమారుఁ డగు రురునకు స్థూలకేశుని యాశ్రమమునఁ బెరుఁగు ప్రమద్వరనిచ్చి వివాహము చేయుమని తనకుమారుఁ డామెను గాంచి వరించుటాది యగు వృత్తాంతమంతయు వినిపించెను.

స్థూలకేశుఁ డందుల కెంతయు నానందించి యంతకన్నఁ దనకుఁ గావలసిన దొండులేదని యందుల కంగీకరించి ప్రమతిని గౌరవించి వివాహముహూర్త మేర్పఱిచి పంపివేసెను.

## ప్రమద్వరను పాము కఱచుట

రురుప్రమద్వరల వివాహము కొలఁది దినములలో జరుగవలసియుండెను. కాని, తా నొకటి తలఁచిన దైవమొకటి తలఁచుచుండును. పుట్టినజీవి నెల్ల మృత్యుదేవత వెన్నాడుచునే యుండును. కాల మాసన్నమైనంత నది యేదోరూపమున ఆ జీవిపైఁ బడి ఆ జీవిని తనపొట్టఁ బెట్టుకొనుచుండును. 'క్షణంచిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః, యమస్య కరుణానాస్తి' అన్న దెంతయు సత్యము. సమయ మైనపిదప క్షణమైన జీవి బ్రతుకలేఁడు. 'అయ్యో! పెండ్లి కుదిరిన దని కాని, ఇంకను జిన్నవయసే యని కాని యేమి చూచియు మృత్యువు జాలిగొనదు. తనపని యది చేసికొనును. ప్రమద్వర పెండ్లి కుదిరినది. హస్తానక్షత్రయుక్త లగ్నమున నింక నొకటి రెండుదినములలో పెండ్లి. కాని యీలోఁగా నామె చావవలసినకర్మ మున్నది. విధి బలీయము. దాని నెవ్వరును తప్పింపలేరు. అది జరుగువఱ కెవ్వరికిని దెలియదు.

ప్రమద్వర యొకనాఁడు పూలుకోసికొనుటకు వనమునఁ దిరుగుచుండఁగా పొరపాటునఁ బరుండియున్న యొకత్రాచుపాము నామె త్రొక్కెను. అది బుస్సున లేచి ప్రమద్వర యుస్సు రనునట్లు వెంటనే యామెను గఱచెను. పాముకాటువలన ప్రమద్వర వెంటనే స్పృహ తప్పి యటఁ బడిపోయెను. అతిమనోహర మైనయామె వదనబింబము కాంతిదక్కెను. పద్మదళములవంటి యామెకన్నులు మూతవడెను. బంగారుచాయ గలమేను చల్లఁబడిపోయెను. క్రూరసర్పవిషమెక్కి ప్రమద్వర యిట్లు విగతజీవయై పడిపోఁగానే స్థూలకేశమహర్షి చూచి పరుగుపరుగున వచ్చిచేరెను. ఆ చుట్టుపట్లఁ గలయాశ్రమములనుండి స్వస్తి, ఆత్రేయుఁడు, మహాజానుఁడు, కుశికుఁడు, శంఖమేఖలుఁడు, ఉద్దాలకుఁడు, కఠుఁడు, శ్వేతుఁడు, భరద్వాజుఁడు, కౌణకుత్సుఁడు, ఆర్ష్టిషేణుఁడు, ప్రమతి, అతని పుత్త్రుఁ డగు రురుఁడు మున్నగు మహర్షులు, ఇంక నెందఱో తాపసులు వచ్చి సర్పదష్టయై మృతినొందిన ప్రమద్వరను జూచి దుఃఖావిష్టులై చేష్టలు దక్కి కూర్చుండిపోయిరి. కడచిన యాయువును మరల పోయఁగలవా రెవరు లేక యెల్లరు దీన వదనులై యుండిరి.

రురుఁడు దుఃఖావేశచిత్తుఁడై యచటినుండి పోయి యొక యేకాంతప్రదేశమునఁ గూర్చుండి ప్రమద్వరకై వాపోవుచుండెను.

"అలయక యేన దేవయజనాధ్యయనవ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని నేన గురుసద్ద్విజభక్తుఁడనేని నేన య
త్యలఘుతపస్వినేని దివిజాధిపభూసురులార! మన్మనో
నిలయకు నీప్రమద్వరకు నిర్విష మయ్యెడు నేఁడు మీదయన్

అపరిమితాజ్ఞఁ జేసియు మహాపురుషుల్ విషతత్త్వసంహితా
నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష
వ్యపగత మైనజీవ మిది వచ్చునుపాయము సేయరొక్కొ! నా
తపముఫలంబు నధ్యయనదానఫలంబులు నిత్తు వారికిన్.

భార, ఆది. ౧, [illegible], [illegible]

అని యాతఁడు పెక్కువిధముల నాక్రోశించుచున్న జాలిపడి యాతని కడకు వచ్చి యొక్కదేవదూత యిట్లనెను. ఓయీ! మానవుల యాయువు క్షయించిన దాని నెవ్వరు నీయలేరు. గంధర్వునకు అప్సరసకుఁ బుట్టిన యీకన్యకు ఆయువు తీరిపోయినది. కావున, నీవు వృథా విచారింపకుము. ఒక యుపాయము చెప్పెదను. చేతనైనఁ జూచుకొనుము. నీయాయువులో సగ మీమె కిచ్చితివేని ఈమె మరల జీవింపఁగలదు" అని పలికెను. వెంటనే రురుఁడు తన యాయువులో సగము నామెకు ధారవోసెను.

వెంటనే ప్రమద్వర తొల్లిటికంటె నధికశృంగారసమన్వితయై విష వినిర్ముక్తయై నిద్రమండి లేచినటుల లేచి కూర్చుండెను. అప్పుడచటి మునీశ్వరులు, ప్రమతి, స్థూలకేశుఁడు, పొందిన యానంద మింతింతన వీలులేకుండెను.

## రురు ప్రమద్వరల పరిణయము

అనంతరము శుభస్య శీఘ్ర మ్మని స్థూలకేశాదులు, ప్రమతి, హస్తానక్షత్రయుక్త లగ్నమున రురువునకుఁ బ్రమద్వరకుఁ గల్యాణ మహోత్సవముఁ గావించిరి. ఆ పుణ్యదంపతు లందటి యాశీస్సులంది యిష్టోపభోగము లనుభవించుచు సుఖముగా నుండిరి.

నిజతపశ్శక్తివల్లను, త్యాగమువల్లను వలచినకాంత మరణింపఁగాఁ బునర్జీవింపఁ జేసికొని యామెను ధర్మపత్నిగాఁ బరిగ్రహించిన రురుఁడు, తనకొఱకై చూపిన నిష్కల్మషప్రేమము, నిరుపమానత్యాగము నెంతయో మెచ్చుకొని పునర్జీవితయై అపూర్వ సౌందర్యము నందినప్రమద్వరయు నుత్తమోత్తమ దాంపత్యధర్మమును బాటించుచు గృహస్థాశ్రమమును నిర్వర్తించుచుండిరి.

రురుఁడు తనకాంతను గఱచిన యా పాముమీదనే కాక పాఁపజాతి మీఁదనే పగగొని చేత నొకదండమును గొని కనిపించిన పాములనెల్లఁ జంపఁదొడఁగెను.

## రురు డుండుభ సంవాదము

ఇట్లుండ రురుఁ డొకనాఁడు వనమునఁ దిరుగుచుండఁగా డుండుభ మను పేరు గలపామును జూచి దండము నెత్తి దానిని జంపఁబోయెను. అంత నది "అయ్యా! నేను నీ కేమియు నపకారము చేయలేదు. నీవు బ్రాహ్మణోత్తముఁడవు, విశేషించి భార్గవవంశజుఁడవు. అట్టినీవు నన్ను కారణముగ నేల చంపుదు" వని యడిగెను. దానికి రురుఁడు "తొల్లి నా భార్య నొక పాము కఱచి మూర్ఛింపఁజేసి తల్లడపెట్టినది. ఆ కారణమున నేను పాములనెల్ల వెదకి వెదకి చంపుదును గాక యని శపథము పూనితిని. ఇపుడు నీవు నా కెదురైతివి. కావున నిన్నుఁ జంప దండము నెత్తితి" నని పలికెను. దానికి డుండుభము తాను దుష్టవిషసర్పములవలె పీడ గలిగించెడు దానను గా ననియు నిందుచేఁ దన్నుఁ జంపుట న్యాయము కా దనియు వేఁడుకొనెను.

దానిధోరణిఁ గనిపట్టి రురుఁ డది సర్పజన్మ మెత్తిన యొకఋషి యని గ్రహించి "ఓయీ! నీ వెవరు? ఏల యీ నికృష్ట జన్మము కలిగినది?" అని యాదరమేదురుఁడై యడిగెను. దాని కాపా మిట్లు బదులుచెప్పెను. "అయ్యా! నేను పూర్వజన్మమున సహస్రపాదుఁ డను ఋషిని. నే నొకబ్రాహ్మణుని శాపము కారణముగా ఈ సర్పజన్మము నందితి" నని చెప్పెను.

రురుఁడు జాలిగొని యావృత్తాంత మంతయుఁ దెలుపుమని కోరెను. డుండభ మిట్లు చెప్పఁదొడఁగెను. "అయ్యా! తొల్లి తపోధనుఁడు, నిగ్రహానుగ్రహసమర్థుఁడు, తీక్ష్ణవాక్కు గలవాఁడునగు ఖగముఁ డనునొక బ్రాహ్మణుఁడు నాకు మిత్రుఁడుగా నుండెను. అతఁ డగ్నిహోత్రగృహమున ధ్యానమగ్నుఁడై యున్నసమయమున నేను వానియింటి కేఁగి పరిహాసమునకు గడ్డిపఱకలతో నొకపామునుజేసి యాతనిపై వైచితిని. ఏమఱుపాటున నున్న యాతఁడది పాముగా భ్రమించి గజిబిజి వడి మనఃఖేద మందెను. వెంటనే యాతఁడు కోపారుణితలోచనుఁడై నన్ను సర్పవ్యాజమున భయపెట్టితివి కావున, నీవు

నిజముగా సర్పమవై పుట్టుదువుగా" కని నన్ను శపించెను. నేను పశ్చాత్తప్తుఁడనై యాతని పాదములపైఁ బడి తప్పు క్షమించి మన్నింపు మని ప్రార్థించితిని. అతఁడు దయదలఁచి "ఓయీ! ప్రమతి కుమారుఁడగు రురుమహర్షి దర్శనమున నీకు శాపవిమోచన మగు" నని యభయ మిచ్చెను. నేను వెంటనే సర్పమనై యీ వనమున విహరించుచు నుంటిని. నీ దర్శనమున నాపూర్వదేహము గనఁగందు" నని యన్నంత నే యాతఁడు సహస్రపాదఋషియై యాతని యెదుట నిలిచి యిట్లు పలికెను.

"భూనుతకీర్తి! బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ దోడనపుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసంహితబుద్ధియుఁ జిత్తశాంతియున్
మానవచప్రహాణము సమత్వము సంతతవేదవిధ్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతమున్ గరుణాపరత్వమున్.

భార. ఆది. 1-157

నీవు బ్రాహ్మణుఁడవు, భృగువంశవరిష్ఠుఁడవు. సర్వగుణసంపన్నుఁడవు. విద్యావినయవివేకివి. అట్టి నీ విట్టిహింసఁ బూనుట ధర్మముకాదు. బ్రాహ్మణు లహింసాపరులు. ఒరులు చేయుహింసలు వారించుపరమ కారుణ్యమూర్తులు. జనమేజయజనపాలుఁడు సర్పయాగము చేసి సర్పసంహారము చేయుచుండఁగా నీతండ్రి శిష్యుఁ డగు ఆస్తీకుఁడు దానిని నిలుపుచేసెను. కావున నీ కిట్టిపని మంచిదికా" దని సహస్రపాదుఁడు రురునకు సర్పఘాతమునం దుపశమన బుద్ధి పుట్టించి వెడలి పోయెను.

రురుమహర్షియు నాఁటినుండి సర్వభూత దయకలిగి ప్రమద్వరతోఁ గూడి సర్వసుఖము ననుభవించుచుఁ జిరకాలము గృహస్థ ధర్మములను నిర్వర్తించెను.

అట్లు గృహస్థాశ్రమమున నుండియు రురుఁడు తపస్స్వాధ్యాయ ప్రవచనదీక్షాపరుఁడై దివ్యతపస్విగాఁ దేజరిల్లుచుండెను. కాలక్రమమున

నాతని దయవలన ప్రమద్వర గర్భము ధరించి నవమాసములు నిండిన పిదప నొకయుత్తమ పుత్రునిం బడసెను. అతఁడే శునకమహర్షి. అతని కుమారుఁడే శౌనకమహర్షి. శునకుఁడు పెరిగి పెద్దవాఁడై భృగువంశీయుల కందఱకు నానంద దాయకుఁడై సత్త్వగుణసంపన్నుఁడై తీవ్ర తపము సలిపి శాశ్వతయశస్సును సంపాదించెను.



# మహర్షుల చరిత్రలు

## శతానందమహర్షి

### వంశము

గౌతమమహర్షి లోకాతీతసౌందర్యవతిగా బ్రహ్మచే సృష్టింపఁబడిన అహల్యను, గోప్రదక్షిణము భూప్రదక్షిణముకన్న ఎన్నోరెట్లు మిన్న యన్న శ్రుతివాక్యప్రమాణ బుద్ధిఫలితముగాఁ బరిగ్రహించి యామెతో నిజాశ్రమమున కేఁగి గృహస్థాశ్రమము నారంభించెను. మహాతపస్సంపన్నుఁ డగునామహర్షి పెక్కువేలేండ్లు తప మొనరించుచు, అహల్యసేవ లంగీకరించుచు నిరుపమబ్రహ్మచర్య వ్రతమునే పరిపాలించెను. అతి దారుణ మగు ప్రపంచక్షామ మేతెంచినపుడు, త్రిలోకప్రజలను తన తపశ్శక్తిచే నన్నవస్త్రాదుల నఖండముగ నొసంగి కాపాడి వారు సర్వ లోక బాంధవులైరి. తదనంతరము గౌతమమహర్షి గోహత్యా పాప నివృత్తికై పరమేశ్వరునిగుఱించి మహాతప మొనరించి యాతనికటాక్ష ఫలితముగా గంగను భూమికి గౌతమిగాఁ దీసికొనివచ్చి విశ్వకల్యాణ సంధాయకుఁడై వినుతి కెక్కెను.

ఇట్లు దాంపత్యబ్రహ్మచర్యమును పెక్కువేలేండ్లు నడపిన పిమ్మట గౌతమమహర్షి సాధ్వీరత్న మగునహల్య నాదరించి వలసినకోరికఁ గోరు కొను మని యనుజ్ఞ నొసఁగెను. ఆ తరుణీమణి "దేవా! నీ కృపకన్న నాకుఁ గావలసినది లేదు. ఐనను, ఆ సంగతి యెఱిఁగిన నీవు నన్నుఁ, గోరుకొను మనఁ గోరుకొనకుండుట తృణీకారభావ మగునని కోరు చున్నాను. స్త్రీసహజమగుమాతృత్వకాంక్ష నాకుఁ దీరలేదు. కావున, దయదలఁచి నలువురుబిడ్డలఁ గన్న చల్లనితల్లిగా నన్ననుగ్రహింప నర్థించుచున్నాను" అని వేఁడుకొనెను.

### జననము

గౌతముఁ డపరిమితానంద మంది నిజయోగబలమునఁ దాను నవయువకుఁడై అయోనిజ యగు అహల్యాకాంత నిండు యౌవనము

నకుఁ బందువెన్నెలయై సర్వలోకము లందలిమనోహర కేళివనముల నూఱుచోట్ల నూఱువిధము లగురత్యానందము నామె ననుభవింపఁ జేసి యామెకోరికఁ దీరిచెను. తత్ఫలితముగా నామె గర్భము ధరించి నవమాసములు మోసి నవమోహనాకారుఁ డగు నొకపుత్రరత్నమును గాంచెను. అహల్యాగౌతముల శతవిధానందఫల మగునాతనికి గౌతముఁడు "శతానందుఁ" డను సార్థకనామకరణము చేసెను. ఈతఁడే యహల్యాగౌతముల సంతానములో జ్యేష్ఠుఁడు.

## బాల్యము

శతానందుఁడు బాల్యమునుండియుఁ దండ్రిగుణసంపద లంబుటికి పుచ్చుకొని తండ్రికిఁ దగినకొడు కనుఖ్యాతిగాంచెను. తండ్రిచే నుప నీతుఁడై తండ్రికడనే సమస్తవేదశాస్త్రాదివిద్యలు నభ్యసించి బ్రహ్మ చర్యా శ్రమముఁ బాటించుచు మహాతపశ్శాలి యయ్యెను. శుక్లపక్ష క్షపాకరునివలెఁ జెలువొందు శతానందుఁడు బాల్యమునందే తనప్రజ్ఞాపాట వము నెల్లెడలఁ జాటఁగలిగెను. ఈతని బుద్ధివైభవము, జ్ఞానసంపద, శీలగౌరవము, తపోనిరతి, వినీతి, కని, జనకమహారాజు తన పురోహితు నిగా నుండు మని యీతని నర్థించెను. గౌతమమహర్షి యానందించి శతానందుని కుచితగుణశీలసంపదల నొప్పు కన్యామణితో వివాహ మొన రించి భార్యాసహితుఁ డగు శతానందుని జనకచక్రవర్తికిఁ గులగురువుగా నుండ మిథిలానగరము పంపివేసెను. జనకుఁ డపరిమితానంద మంది యా మహర్షిని విధ్యుక్తముగా గురువుగా గ్రహించి గౌరవించెను. ఈ విధముగా శతానందమహర్షి జనకరాజర్షి కులగురువై విరాజిల్లఁదొడఁగెను.

## రామలక్ష్మణుల మిథిలాగమనము

ఇట్లు కొన్నిసంవత్సరములు గతించెను. తదనంతరము గౌతముఁ డహల్యను శపించుట, ఆమె చిరకాలము రామపాదస్పర్శ కెదురుచూచుచు శిలారూపమున మహాతప మొనరించుచుండుటయు జరిగెను. శ్రీరామాదుల జననము, బాల్యము నయి విశ్వామిత్రుల

వెంట రామలక్ష్మణు లరుగుటయు, నాతనివలన వారు బలాబలవిద్య లెఱుంగుటయు, తాటకను దునుమాడి తపసి జన్నముఁ గాచుటయు, వారు సిద్ధాశ్రమమును జేరి మారీచాది రాక్షసుల జయించుటయు నయ్యెను. అనంతరము వారు విశ్వామిత్రుని వెంట మిథిలానగరము నకుఁ బోవుచు దారిలో శిలారూపమున నున్న నహల్యకు శాపవిమో చన మొనరించిరి. అందుల కహల్య భక్తి పురస్సరముగా శ్రీరాము నీ విధముగఁ గీర్తించెను.

"అహో కృతార్థాస్మి జగన్నివాస తే
పాదాబ్జసంలగ్న రజః కణా దహమ్,
స్పృశామి యత్పద్మజ శంకరాదిభిః
విమృగ్యతే రన్ధిత మానసైః సదా.

అహో విచిత్రం తవ రామ చేష్టితం
మనుష్యభావేన విమోహయన్ జగత్,
చలస్యజస్రం చరణాది వర్జిత
స్సంపూర్ణ ఆనందమయోాతి మాయికః.

యత్పాదపంకజపరాగపవిత్రగాత్రా
భాగీరథీ భవవిరించిముఖాన్ పునాతి,
సాక్షాత్సఏవ మమదృగ్విషయో యదాస్తే
కింవర్ణ్యతే మమ పురాకృతభాగధేయమ్.

మర్త్యావతారే మనుజాకృతిం హరిం
రామాభిధేయం రమణీయదేహినమ్,
ధనుర్ధరం పద్మవిశాలలోచనం
భజామి నిత్యం న పరాన్ భజిష్యే.

యత్పాదపంకజరజః శ్రుతిభిర్విమృగ్యం
యన్నాభిపంకజ భవః కమలాసనశ్చ,
యన్నామసారరసికో భగవాన్పురారి
స్తం రామచంద్ర మనిశం హృది భావయామి.

యస్యావతారచరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః
ఆనందజాశ్రుపరిషిక్త కుచాగ్రసీమా
వాగీశ్వరీ చ త మహం శరణం ప్రపద్యే.

సోయం పరాత్మా పురుషః పురాణ
ఏష స్స్వయం జ్యోతి రనంత ఆద్యః,
మాయాతనుం లోకవిమోహనీయాం
ధత్తే పరానుగ్రహ ఏష రామః.

అయం హి విశ్వోద్భవ సంయమానా
మేకస్స్వమాయా గుణబింబితోయః,
విరించివిష్ణ్వీశ్వరనామభేదాన్
ధత్తే స్వతంత్రః పరిపూర్ణ ఆత్మా.

నమోస్తు తే రామ తవాంఘ్రిపంకజం
శ్రియాధృతం వక్షసి లాలితం ప్రియాత్
ఆక్రాంత మేకేన జగత్త్రయం పురా
ధ్యేయం మునీంద్రై రభిమానవర్జితైః.

జగతామాదిభూతస్త్వం జగత్త్వం జగదాశ్రయః
సర్వభూతేష్వసంయుక్త ఏకోభాతి భవాన్పరః.

ఓంకారవాచ్యస్త్వం రామ వాచా మవిషయః పుమాన్,
వాచ్యవాచకభేదేన భవానేవ జగన్మయః.

కార్యకారణకర్తృత్వఫలసాధనభేదతః
ఏకో విభాసి రామ త్వం మాయయా బహురూపయా.

త్వన్మాయా మోహితధియస్త్వాం నజానంతి తత్త్వతః,
మానుషం త్వాభిమన్యంతే మాయినం పరమేశ్వరమ్.

ఆకాశవత్త్వం సర్వత్ర బహిరంతర్గతోఽమలః,
అసంగోహ్యచలో నిత్య శ్శుద్ధో బుద్ధ స్స దవ్యయః.

యోఽపి న్మాథాహ మజ్ఞాతే తత్త్వం జానే కథం విభో,
తస్మాత్తే శతశో రామ నమస్కుర్యా మనన్యధీః.

దేవ మే యత్ర కుత్రాపి స్థితాయా అపి సర్వదా,
త్వత్పాదకమలే సక్తా భక్తి రేవ సదాఽస్తు మే.
నమస్తే పురుషాధ్యక్ష నమస్తే భక్తవత్సల,
నమస్తేస్తు హృషీకేశ నారాయణ నమోస్తుతే.

భవభయహరమేకం భానుకోటిప్రకాశం
కరధృతశరచాపం కాలమేఘావభాసమ్,
కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం
కమలవిశదనేత్రం సానుజం రామ మీడే.

(అధ్యాత్మరామాయణము—బాల. ౫, ౪౭-౬౦)

ఓ జగన్నివాసా! రామా! నీపాదధూళిలవమున నేను కృతార్థురాల నైతిని. ఏనీపాదపద్మమునకై బ్రహ్మరుద్రాదులు వెదకియుఁ గానఁ జాలరో, దానిని నేను స్పృశించుచున్నాను.

రామా! నీచేష్ట విచిత్రము. మనుష్య భావమున జగమును మోహింపఁజేయుచున్నావు. ఎప్పుడు చరణాదులు లేనిఆనందమయుఁడవు గదా!

ఎవనిపాదపద్మరజమునఁ బుట్టినగంగానది బ్రహ్మరుద్రాదులనే పవిత్రము చేయుచున్నదో, అట్టిపాదపద్మయుగ్మని కనులారఁగాంచఁ జాలిన నాభాగ్యము నేమని వర్ణింతును?

మనుజుఁడై పుట్టి మానవాకృతిని రాముఁడనుపేర రమణీయ దేహముఁ దాల్చిన ధనుర్ధరుని, పద్మవిశాలలోచనుని నేను నిత్యము భజింతును.

ఎవనిపాదపద్మరజము వేదములుసైతము వెదకునో, ఎవని నాభి పంకమున బ్రహ్మ పుట్టెనో, ఎవనిపేరు శివుఁ డెపుడు భజించునో, అట్టి రామచంద్రుని నిరంతరమును నేను భావించెదను.

ఏమహనీయుని యవతారకథలను బ్రహ్మలోకమున నారద, బ్రహ్మ, రుద్రాదులు గానము చేయుదురో, ఎవనిగానమున సరస్వతి సైతము ఆనందాశ్రువుల రాల్చునో, అట్టిమహనీయుని నేను శరణు చొచ్చెదను.

పరమాత్మ, పురాణపురుషుఁ డగు నీరాముఁడు స్వయంప్రకాశుఁడుఁ సమస్తకారణుఁడు, లోకానుగ్రహమున కాతఁడు మాయామయశరీరముఁ గాంచును.

ఆతఁడు సత్త్వరజస్తమోగుణములఁ బ్రతిబింబించి బ్రహ్మవిష్ణు రుద్ర రూపుఁడై సృష్టిస్థితిలయములఁ జేయుసర్వవ్యాపకుఁడైన పరమాత్మ.

ఓరామా! లక్ష్మీదేవి తనవక్షస్స్థలమును జేర్చి లాలించునది, ఒక్కటి ముల్లోకముల నాక్రమించినది, అభిమానవర్జితు లగుమునులచే ధ్యానింపఁబడినది యగు నీపాదకమలమునకు నమస్కారము.

రామా! నీవె జగత్కారణుఁడవు. నీవె జగత్తు. జగత్తునకాశ్రయుఁడవు. అన్నిభూతముల నున్నవాఁడవు. సర్వమునకుఁ బరుఁడవై స్వయంప్రకాశుఁడవై యున్నావు.

నీవు ఓంకారవాచ్యుఁడవు. వాచామగోచరుఁడవు. వాచ్యవాచక భేదముచే నీవె ప్రపంచరూపుఁడవు.

రామా! నీ వొక్కఁడ వయ్యు వివిధరూపములఁ గానవగుచున్నావు.

నీమాయచే మోహితులైనవారు నీ నిజస్వరూప మెఱుఁగరు. పరమేశ్వరుఁడవు. మనుష్యరూపుఁడ వని తెలియక నీవు నిజమగు మనుజుఁడవే యనుకొనుచున్నారు.

నీ వంతట నాకాశమువలె నావరించినవాఁడవు. అసంగుఁడవు. అచలుఁడవు. నిత్యుఁడవు. శుద్ధుఁడవు. బుద్ధుఁడవు. అవ్యయుఁడవు.

స్త్రీని, మూఢురాలను, నీ తత్త్వమెట్లెఱుఁగఁగలను? నీకటాక్ష మునకై, అనన్యచిత్తనై నీకు నూఱుసారులు నమస్కరింతును.

శ్రీరామా! నే నెచట నున్నను, నీ పాదపద్మములందు భక్తి యెల్లపుడు నెడతెగకుండున ట్లనుగ్రహింపుము.

పురుషాధ్యక్షా! నమస్కారము. భక్తవత్సలా! నమస్కారము. హృషీకేశా! నమస్కారము. నారాయణా! నమస్కారము.

సంసారభీతిఁ బోఁద్రోలువాఁడు, ఒక్కఁడు, భానుకోటి ప్రకాశుఁడు, కోదండపాణి, కనకరుచిరవస్త్రుఁడు, రత్నకుండలుఁడు, కమల విశద పత్రాక్షుఁడు, నీరదరయుతుఁడు నగు శ్రీరాముని స్తుతించెదను.

ఇట్లు స్తుతించి భర్తను జేరిన యహల్యాసాధ్వికి రామలక్ష్మణులు మ్రొక్కి విశ్వామిత్రునివెంట మిథిలాపురి కేగిరి.

## శతానందజనకులు స్వాగత మిచ్చుట

వీరిరాక యెఱిఁగి జనకుఁడు గురువగు శతానందునితో నెదురేగి వారికి స్వాగతమొసఁగి తాను చేయుయజ్ఞమున కాహ్వానించెను. వా రంగీకరించి యాతనివెనుక నేఁగిరి. యజ్ఞశాల నుచితాసనముల వారిఁ గూర్చుండ నియమించి జనకుఁ డా రాజకుమారు లెవ రని విశ్వామిత్రు నడుగ నాతఁడు వారివిషయ మెల్లఁజెప్పి యహల్యాశాపవిమోచన మైన పిదప నిటు వచ్చినా రని తెలిపెను. ఆ మాటలు విన్న శతానందుఁ డమితానంద మంది తనతల్లి శాపవిముక్తయై తండ్రిని జేరిన దని విని మిగుల నానందించి యా వివరములు తెలుపు మని విశ్వామిత్రునిఁ గోరెను. విశ్వామిత్రుఁ డంతయుఁ బూసగ్రుచ్చినట్లు తెలిపెను. శతా నందుఁడు నితాంతానందమున రామలక్ష్మణుల నభినందించి వారికి విశ్వామిత్ర చరిత్రము నంతయుఁ జెప్పి యా మహనీయు ననుసరింపఁ గలిగినవారి భాగ్యమును మెచ్చుకొనెను.

శ్రీరాముఁడు శివధనుర్భంగముఁ గావించి సీతను వివాహమాడు తఱి దశరథపక్షమున వసిష్ఠుఁడు, జనకునిపక్షమున శతానందుఁడు గోత్రప్రవరాదులు చెప్పి సీతారామ కల్యాణసంధాయకులైరి. *

## శతానందుని సంతానము

శతానందుఁ డీ విధముగా లోకోపకారకక్రియ లొనరించుచు జనకుని కులగురువై చిరకాలము జీవించెను. ఆతని ధర్మపత్నియందాతఁడు సత్యధృతి యను సుపుత్రుని గాంచెను. సత్యధృతి మాతృగర్భము నుండి జనింపఁగనే యాతనిచేత బాణ ముండెను. ఆ కారణమున నాతనికి శరద్వంతుఁ డనియుఁ బేరు వచ్చెను.

సత్యధృతి పుట్టిననాఁటినుండియు శరము విడువక చేతిలోనుంచు కొనువాఁడు. దాని ననుసరించి యాతఁడు పెరిగి పెద్దవాఁడగుచున్న కొలఁది నాతనిమనస్సు వేదశాస్త్రాది విద్యలయందుకంటె ధనుర్వేద మందే లగ్నము కాఁజొచ్చెను. శతానందుఁడు తనయుని కుపనయన మొనరించి "వత్సా! నీకు వలసినవిద్యలను తపస్సుచే సాధింపుము. అన్యవిధసాధ్యము అగువిద్యలకు విలువ లే" దని ప్రబోధించి యాతనికిఁ దపోజీవన మలవఱిచెను.

సత్యధృతి మహాతప మొనరించి ధనుర్వేదమును, వివిధాస్త్రములను బడసియు నింకను గొప్పయస్త్రములను సంపాదించుటకై నిరంతర తప మొనరించుచుండెను. ఈతని తపము పెంపునకు మచ్చరము గొన్న యింద్రుఁ డీతనితపముఁ జెఱుప జాలవతి యను దేవకన్యను బంపెను. ఆమె తనరమణీయశరీరముచేతను గానన్యత్యములచేతను ధనుర్బాణములు ధరించియున్న సత్యధృతికి వలపు గొలిపెను. మహాసౌందర్యవతి యగునామెను గాంచినంతనే సత్యధృతిచేతిలోని విల్లమ్ములు జాఱి క్రిందపడెను. వెంటనే యా మహాత్ముఁ డది గ్రహించి యావిల్లమ్ములను, ఆమెను, ఆ ప్రదేశమును విడిచి దవుదవ్వులకుఁ బోయి తన కామో

* రామాయణము — బాలకాండము.

ద్రేకమును నిగ్రహించుకొనెను. కాని, యాతనికిఁ దెలియకుండఁగనే రేతః పతనమై యది యొకరెల్లుగడ్డిలో పడెను. అది రెండుభాగములై యమోఘ మగుట నందుండి యొకబాలుఁడు నొకబాలిక జన్మించిరి.

ఆ తరువాతఁ గొంతకాలమునకు శంతనమహారాజు వేఁటాడుచు నచటికి వచ్చి యా బాలుని బాలికను జూచి వారినగుమోములఁ బరికించి వారిని దీసికొనిపోయి తన బిడ్డలుగాఁ బెంచుకొనఁ దొడఁగెను. వారికి జాతకర్మాదిసంస్కారములు గావించి తనచేఁ గృపతోఁ బెంచఁబడిరి కావున వారికి కృపుఁడు, కృపి అనునామకరణము చేయించెను.

కాలక్రమమున నీ సంగతి యంతయు దివ్యదృష్టిని గ్రహించిన సత్యధృతి శంతను నింటికి వచ్చి తనసంగతి చెప్పి ధనుర్వేదాసక్తుఁ డగు కృపునకుఁ జతుర్విధ ధనుర్వేదములును నానావిధశాస్త్రములను నేర్పెను. కృపుఁ డచిరకాలముననే విలువిద్యయందుఁ బరమాచార్యుఁడై భీష్ముని ప్రార్థనమునఁ గౌరవ పాండవులకు గురు వయ్యెను. పిదప యాదవులు, మఱి పెక్కురు రాజకుమారులును నీతనినే చాపాచార్యునిగా గ్రహించి గౌరవించిరి.*

ఈ విధముగా శతానందమహర్షి ఉత్తమపుత్త్రపౌత్త్రవంతుఁడై ధన్యాత్ముఁ డయ్యెను.



* భారతము—ఆదిపర్వము

# మహర్షుల చరిత్రలు

## సౌభరిమహర్షి

### తపోనిరతి

పూర్వము కాంపిల్య మనుపురమున సౌభరి యనువిప్రుఁ డొకఁ డుండెను. అతఁ డఖిలవేదశాస్త్రములను నేర్చి బ్రహ్మచర్య మవలంబించి మహాతపోనిరతుఁడై యుండెను. అతఁడు తపోధనముతోపాటు వ్రతనియమధనమును సైత మమితముగాఁ బ్రోగుచేయఁదొడఁగెను.

సౌభరి మొదటఁ జాంద్రాయణాదివ్రతము లొనరించెను. పిదప నాతఁడు మాసోపవాసము లారంభించెను. పిమ్మట నాతఁడు పర్ణాశనుఁడై కొంతకాలము తపముచేసెను. తదనంతర మా మహర్షి నిరశనవ్రత మారంభించి మాఘమాసమున జలములో నుండి ఘోరతప మొనరింపఁ జొచ్చెను.

### సంసారకాంక్ష

ఈ విధముగా నొకశతాబ్దము గతించెను. అప్పు డాజలములలో సామమద మనుపేరు గల * మత్స్య మొకటి పుత్త్రపౌత్త్ర ప్రపౌత్త్రకళత్త్ర మిత్త్ర బంధుపరివేష్టితమై మహారాజువలె స్వచ్ఛందముగ సంచరించుచు సౌభరిముని చుట్టుపట్టులఁ దిరుగుచుండెను. ఆ జలచరవిహార సౌఖ్యముఁ జూచిన సౌభరి తాను సైతము వివాహమాడి గృహపతియై సుఖింపవలయు నని కోరెను. పరమచిత్రము! తపముపై నామౌని తగులము విడిచి తరుణిపైఁ గాంక్ష గలిగి యామెకై వెదుకఁ జొచ్చెను. ఆహా! అంతటి వ్రతదీక్ష గలమహర్షికూడఁ దపస్సమాధియెడ నిలిపిన లక్ష్యము వదలి సంసారసుఖముల కభిముఖుఁ డయ్యెను. ఇం దున్న వారికి దానిపై నందున్న వారికి దీనిపై మనసు గలుగుచుండునేమో!

---

* పద్మపురాణము మందుఁ డనుపేరు గలమత్స్య మని విష్ణుపురాణము.

## సౌభరి మాంధాత పాలి కేతెంచుట

సౌభరి యట్లు బయలుదేఱి మాంధాతృచక్రవర్తి యింటి కేతెంచెను. అతనిని జూచి మాంధాత ఆసనార్ఘ్యపాద్యాది వివిధోపచార విధుల నొనర్చి నమస్కరించి "మహాత్మా! మీరు నాకడ కొక్కరు రాఁగత మేమి? మీ కిట్లు నాపై దయ గలుగుట కేమి హేతువో సెలవిం" డని ప్రార్థించెను.

అందుల కా మహర్షి మాంధాత సుచిత వాగ్విధానముల సంభావించి "రాజా! నీవు దాతవు కదా! ని న్నొకటి యడుగఁ గోరి వచ్చితిని. ఇక్ష్వాకువంశజు లెవ్వ రెప్పుడు వచ్చి యే మడిగినను నిచ్చివేయు మహాదాత లని మీ వంశజులకుఁ బేరు. మఱియు నీవు జగమెల్ల బాహుసంపద నుజ్జ్వలముగ నేలి యింద్రాదులకైనఁ గోరిక తీర్చువాఁడవు. నేను ని న్నొకయిహలోకకాంక్ష కాంక్షించుటకు వచ్చితిని.

"క్షేత్ర మెఱిఁగి వి త్తిడుటయుఁ
బాత్ర మెఱిఁగి దాన మిచ్చి పనుచుటయు వివే
కత్రాణపరాయణులకు
ధాత్రీశ్వర! ఇందు నందుఁ దగ మే లొసఁగున్.

ఇన్నిగుణంబులందు నుతికెక్కినవాఁడవు సత్యవాక్యపం
పన్నుఁడ విట్టి నీకు నరపాలక! నాకొసఁగంగరాని వే
మున్నవి? యైన నేమియును నొల్ల నరేంద్రకులావతంస! నీ
కన్నియలందు నాకు నొకకన్నియనిమ్ము గృహస్థు నయ్యెదన్"

(విష్ణుపురాణము ౫. ౧౩౨)

అని పలికెను.

ఆ మాటలు విన్నమాంధాత నరసినగడ్డము, జడలువడిన జుట్టు, వయసు ముదిరిన జడతయుఁ గలిగినసౌభరివంకఁ జూచి యాతనికిఁ దనకూఁతు నీయలేక ఱియు నన్న నాతఁడు శపించునని భయపడి యుపాయాంతరమునఁ దప్పించుకొనఁ దలఁచి "మహాత్మా! మా కులము

వారు కన్యలకుఁ బెండ్లి సేయుపట్ల వారు కోరిన వరులకే యిత్తురు కాని కోరనివారి కెంతవారికైన నీయనొల్లరు. ఈ మా కులాచార మెట్లుల్లంఘింతును? నిన్నుఁ జూచిన ముసలివాఁడవు. నిన్ను నా కన్నెలు వరింతు రనువిశ్వాసము నాకెంతమాత్రము లేదు. ఏమిచేయు మందువు?" అని ప్రశ్నించెను.

అందులకు సౌభరి యిట్లు సమాధానము చెప్పెను. "రాజా! చాల మంచిమాట చెప్పినావు. నాకు నదియే యిష్టము. నన్ను నీ కన్నెలకుఁ జూపుము. వారిలో నెవతెయైన నన్ను మెచ్చిన నే నామెను బెండ్లాడుదును. లేదా నేను నీ కేయపకారమును జేయక వచ్చినదారి నేఁగెదను సరియా?" "సరే" యని మాంధాత కన్య కాంతఃపురమునఁ గలవర్షధరు నొకనిఁ బిలిచి "ఈ మునీశ్వరునిఁ గన్నియ లున్న చోటికిఁ గొనిపొమ్ము. వారిలో నెవతెయైన నీతనిఁ బరిణయమాడఁదలఁచిన వచ్చి నాతోఁ జెప్పుము. ఆమె నీతని కిచ్చి వివాహముచేసెద" నని పలికెను.

## మాంధాతకూఁతులు సౌభరిని వరించుట

ఆ కంచుకి యట్లే యని సౌభరిమునీంద్రుని దీసికొని రాజాంతఃపురమున కేఁగెను. ఆ మునీంద్రుఁ డచట నఖిలసిద్ధసాధ్యగంధర్వ మనుష్యులకంటె నతిశయ మైనరూపము ధరించెను. అపుడు కంచుకి రాజకన్యకల రప్పించిన వారు:

> "కాఱుమెఱుంగులో మెఱపుఁ గైకొననేర్చిన పైఁడిబొమ్మలో
> మారునిదీములో కలికిమాటలచంద్రికలో చెలంగు శృం
> గారరసాధిదేవతలొ కమ్మనిక్రొవ్విరితీఁగలో యనన్
> వారిజపత్త్రిలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై.
>
> (విష్ణు. ౫. ౧౪౬)

వారిని జూచి కంచుకి "కన్నియలారా! ఈ ముదుసలి మీ తండ్రికడకు వచ్చి మీలో నొకతె నర్థించెను. మీ తండ్రి మాటాడక యాతనినే మీ కడకుఁ బంపెను. మీలో నెవరైన నీతనిని వరించినచో నామె నాతని కిచ్చి పెండ్లిచేయునఁట, చూచుకొం" డని హెచ్చరించెను.

అప్పు డా కన్యక లందఱు సౌభరి సౌందర్యమునకు ముగ్ధలై యంద ఱాతనిని వరించి యీతఁడు మాకే కావలయును మాకే కావలయు నని సిగ్గువిడిచి యాతనిని మోహించిరి. ఈ సంగతి కంచుకి వచ్చి చెప్పిన మాంధాత యా మునితపశ్శక్తి కచ్చెరువడి తన కన్యకల నేఁబది మందిని నొక్కశుభలగ్నమున నా మునీశ్వరుని కిచ్చి వివాహము కావించెను. పిదప, మణికనకశిబిరారూఢలంజేసి వారిని మాంధాత వీడ్కొలిపెను.

సౌభరియు నేఁబదిమంది భార్యలతోడను నిజాశ్రమమునకు వచ్చి యనేకశిల్పకల్పనాచార్యుఁడైన విశ్వకర్మను రప్పించి "ఓయీ! నేను గృహస్థాశ్రమము స్వీకరించితిని. నాదగుభార్యలేఁబదిమంది మహారాజ పుత్రికలు; మహాభోగము నందినవారు. వీర లందఱకు విహారోచితము లగు దివ్యరత్నకాంచనగృహములు నిర్మించి యి"మ్మని శాసించెను.

ఆ మునిశాసనమున విశ్వకర్మ తత్క్షణము బహువిధద్వారోపద్వారకవాట వప్రప్రాకార పరిఖావిశాలము లయిన కనకరత్నధగధగ ద్ధగాయమాన ప్రాసాదములను, నానావిచిత్రభిత్తికా సభాస్తంభసంభృతదేహళిప్రాం గణసుందరము లైనమందిరములను, జలాశయములను, ఆరామము లను, హంసతూలికాతల్పములను, వినోదవిహారడోలాజాలములను మొదల గున వెన్నిటినో నిర్మించి యిచ్చెను. సౌభరి వారి నందఱ నన్నిసౌధ ముల నుంచి వారివారి కూడిగము లొనరించుటకుఁ దనతపశ్శక్తి నప్సరసల రప్పించి రమణీయాంబర దివ్యమాల్యవిభూషణముల నొసఁగి వివిధవరి మళానులేపనముల నిచ్చి, అతిమనోహరము లగుభక్ష్యభోజ్యాది సము చితాన్నపానముల నర్పించి యాతఁ డా కాంతాజనములతో సురతసుఖ మనుభవించెను.

## సౌభరి సాంసారిక సౌఖ్యములు

ఇట్లు పరమగృహస్థధర్మమున సంసారసుఖములు చిరకాల మనుభ వించుచుండఁగా మాంధాతచక్రవర్తి తనకూఁతుండ్రఁ జూడవేడుకపడి

"అడవులఁ గందమూలముల నాఁకలిదీర్చి తపంబుసేయుచున్
బడలినవృద్ధతాపసుని బాలికలన్ సుకుమారమూర్తులన్
గడుసుఖులై నవారలను గట్టిఁడినై వెసఁ గట్టి త్రోచితిన్
నడఁకుచు వార లెవ్విధమునన్ దురపిల్లుచునున్నవారొకో!
(విష్ణు. ౫,౧౭౩)

అని కటకటంపడుచు సపరివారముగా సౌభరిమహర్షి యాశ్రమము వంకకుఁ బ్రయాణము సాగించెను. ఆ యాశ్రమప్రాంతమున కేఁగుసరి కొతఁడు తననేత్రములను దానే నమ్మలేనట్లుగా —

"బహువిధాలంకార భర్మదీప్తిచ్ఛటా
ప్రాకారమణిహర్మ్యభవనములును
నానావిధప్రసూనానూనసౌరభ
రమణీయమందిరారామములును
కలహంసచక్రవాకక్రౌంచ కలనాద
జలజకైరవజలాశయచయంబు
ధనధాన్యయుతనిరాతంకశంకాచతు
ర్వర్ణసంకీర్ణనివాసములును
తతఘనానద్ధసుషి రాభిధానవాద్య
కీలితామర కామినీ గీతరవము
గలిగి త్రిభువనలక్ష్మికి నిలయ మగుచుఁ
బరగు సౌభరి సౌభాగ్య పురవరంబు.
(విష్ణు. ౫. ౧౭౪)

కనుఁగొని యాశ్చర్యముతో "ఏమీ! ఈ ప్రాంతమున నెప్పు డేపట్టణ మును లేదే! సురపురిని బోలిన యీ పురి నెవరు నిర్మించిరో? దీని రా జెవరో?" యని యందలిపౌరుల నడుగ వారు సౌభరి తపఃప్రభావ మున నిర్మిత మైనసౌభాగ్యపుర మది యని తెలిపిరి. మాంధాత యానందబాష్పములు విడుచుచు న మ్మహామునిని గని నమస్కరించి

యాతనిచే యథోచితగౌరవమర్యాద లందెను. పిదప మాంధాత తన పుత్రికలఁ జూడఁ గోర సౌభరి యాతనిని సపరివారముగా సాదరముగాఁ గన్యాంతః పురమునకుఁ బంపెను. మాంధాత యచట నొక రమ్యహర్మ్యమునఁ గర్పూరవీటీవదనను, మణి డోలికాచలితనానాభూషణభూషితను, దివ్యాంబరసంవృత స్తనయుగను, కాశ్మీరకస్తూరికాఘనసార గంధబంధుర శుభాంగను దనకూఁతును జూచెను. ఆమె లేచి నమస్కరించి తండ్రిని సకలోపచారములతో సబహుమానముగాఁ దనకేళీ సౌధమునకుఁ దీసికొనిపోయి కూర్చుండ నియమించి యోగక్షేమ మడిగిన నాతఁ డమితానందమంది యిట్లనెను "బిడ్డా! నీవు నీ సోదరీమణులు సుఖముగ నున్నారా? మీ భర్త మీ కన్ని సౌఖ్యములు సమకూర్చుచున్నాఁడా? తొడుగఁ బూయఁ గట్ట నన్నియుఁ గలవా? చెప్పుము." ఆ మాటలకామె చిఱునవ్వు నవ్వి "తండ్రీ! నాకు సమస్తము సంపన్నము. నిన్నుఁ జూడకుంటి నను విషాదము తక్క నొండేమియు లేదు. మన్మథరూపమహిమతో నామనోనాథుఁడు నా యింట నెప్పుడుండుచు నాకు సర్వవిధసౌఖ్యములు సమకూర్చుచు నన్నుఁ దనప్రియకాంతగాఁ బరిగణించుచున్నాఁ" డని తెలిపెను.

ఆమె యొక్కతెయే యట్లున్నదేమో మిగిలిన కూఁతులెదుస్థితిలో నున్నారో యని మాంధాత మఱియొక కూఁతుసౌధమున కేఁగి మొదటికూఁతుకంటె నధికవిభవమున నలరారు పుత్రికారత్నముఁ గని యామె వందనాద్యుపచారముల నంది యామెయోగక్షేమము లడిగిన నామెయు నప్పచెప్పినచొప్పుకంటె నధికముగా వర్ణించిన మాంధాత సంతోషించి మూఁడవకూఁతునింటి కేఁగెను. ఆమెయు నట్లే యుండెను. నాలవకూఁతు నింటికివెళ్ళెను. ఆమె యంతకంటె నెక్కువసుఖముగా నుండెను. ఇట్లందఱు నొక్కవాక్యముగా మగనివలన సకలసుఖము లనుభవించుచున్న సంగతి తెలియఁజేసిరి.

మాంధాత సౌభరిమహర్షి దివ్యశక్తి కచ్చెరు వంది తన కూఁతుండ్ర సౌభాగ్యమునకుఁ బ్రమోదభరితుఁడై సౌభరిని సమీపించి యాతనికి సాష్టాంగనమస్కారము లొనరించి మెచ్చుకొని యాతని సెలవుగైకొని

కూఁతులకు గౌరవార్థము ధనకనకవస్తు వాహనవనితారత్నముల నిచ్చి నిజపురమున కేఁగెను.

సౌభరి మాంధాతపుత్రికలైన ధర్మపత్నులయందు సమస్తభోగములు ననుభవించి యేఁబదిమంది భార్యలయందు నూటయేఁబదిమంది కుమారులను గాంచెను. అతఁ డావిధమున శైశవ క్రీడా ప్రసంగములఁ గొన్నేండ్లు, కుమారుల ముద్దుపల్కులఁ గొన్నేండ్లు, విద్యావినోద గోష్ఠులఁ గొన్నేండ్లు, వడుగుఁబ్రాయపు వైభవములఁ గొన్నేండ్లు, యౌవనోన్నతులఁ గొన్నేండ్లు, వివాహక్రియావ్యసనములఁ గొన్నేండ్లు కోడండ్ర కోడంట్రికములఁ గొన్నేళ్లు, మనుమలు మనుమరాండ్రతోఁ గొన్నేళ్లు, వారియౌవనములతోఁ గొన్నేళ్లు, వారివివాహసంతానములతోఁ గొన్నేళ్ళు నిట్లు తరతరము తామరతంపరలైన సంసారసాధనములైన మనోరథములఁ దగిలి యనేకవేల సంవత్సరములు వినోదించెను.

## సౌభరివైరాగ్యము

చిరకాల మిట్లు కడచినపిదప సౌభరి యొకనాఁడు పరతత్త్వ చింతా సమాధానమానసుఁడై యైహికమోహలతానేక బంధములను పరమయోగ విమలతత్త్వ మనుకొడవలితోఁ గోసివేసి యాత్మజ్ఞాన సంపన్నుఁడై యిట్లు తలపోసెను. "ఆహా! ఈ యిహసౌఖ్యములు దుస్సహములు. పుత్రమిత్రకళత్రాది సంగతి దుస్సంగతి. ఈ నిస్సారమైన సంసారము నజ్ఞులు లెస్సగా భావింతురు. పదివేలవిధముల సకలవిషయోపభోగముల ననుభవించినను నా చిత్తము తృప్తినందలేదు. పైఁగా, తత్కాంక్ష దినదినాభివృద్ధి నందుచున్నది. ఈశ్వరవిలాసము పరమచిత్రము! జలములలో నిలిచి తపోవృత్తిఁ జరించుసా కా మత్స్యము కనిపించి సంసారభ్రమ గొలుపఁగా నొక్క కన్యకై నేనేఁగి పెక్కురు కన్యలఁ బరిణయ మాడితిని. అంతతో నూరకుంటినా? వారికిఁ బిల్లలఁ బుట్టించితిని. వారికై బహుసంపదల సంపాదింపవలసివచ్చెను. తదాసక్తిచే పుత్ర పౌత్రదౌహిత్ర కళత్రమిత్రబంధు ధనధాన్యవైభవప్రాభవములు చూచి పెక్కేండ్లు సంసారసుఖముల గాసిపడితి. కాలమెల్ల వ్యర్థమై పోయెను, నిజమునకు:

"యోగము కల్గినచోటను
భోగంబులు లేవు భోగములు గల్గినచో
యోగంబు లేదు కావున
యోగము భోగంబుఁ బడయ నొరులకు వశమే."

(విష్ణు. ౫ ౧౯౩

అని సర్వసంగపరిత్యాగ మొనరించి నిజభార్యాయుక్తుఁడై కానకేఁగి పెక్కేండ్లు మరల మహానియమమునఁ దపోయుక్తుఁడై యుండెను.*

## అర్జునాదులు సౌభరి యాశ్రమమున కేతెంచుట

ఇట్లుండ ధర్మరా జశ్వమేధయాగ మొనరించి యాగాశ్వమును విడిచెను. దానివెంట నర్జునాదులు తత్సంరక్షణకై వెడలిరి. ఆ యశ్వమును బట్టినవారిని బోర జయించుచు వారు పోవఁబోవనొకచో యజ్ఞాశ్వ మొక్కశిలను గదియఁబోయి దాని నంటుకొని కదల లేకుండెను. అది కన్న సైనికులు దానిని గదల్ప నెన్నిప్రయత్న ములో చేసి విఫలులై తుద కర్జునునితోఁ జెప్పిరి. అర్జునుఁడాశ్చర్య మంది యా సమీపమునఁ గల సౌభరిమహర్షి యాశ్రమమునకుఁ బోయి యాతని నడిగి తెలిసికొంద మనుకొని ఋష్యాశ్రమము సమీపింప దానిసమీపమునఁ గల యారామమున జంతువులు జాతి వైషమ్య ముడిగియుండుటఁ గాంచి యబ్బురపడి సర్వసైన్యముల నట నిలిపి ప్రద్యుమ్నవృషకేతనాదులతో ముందు కేఁగి

"అక్షయపుణ్యశీలు నిగమార్థరహస్యకథా ప్రవీణు రుద్రాక్షవిభూతివల్కలమృగాజినశోభితగాత్రు శ్రీమద
ష్టాక్షరమంత్రలబ్ధమహిమాధికుఁ" డైన సౌభరి
మహర్షిని గాంచి సాష్టాంగనమస్కారము లొనరించి —

* పద్మపురాణము: ఉత్తరఖండము; విష్ణుపురాణము

"మునీంద్రా! ధర్మరాజు గోత్రవధ మొనర్చినకారణమున నపరిమిత పరితాపమంది వ్యాసమహర్షి యాదేశమున నశ్వమేధ మొనర్చి యా దురితముం బాపుకొన సమకట్టి యజ్ఞాశ్వమును విడువఁగానది తిరిగి తిరిగి యీ వింధ్యప్రాంతమునకు వచ్చి యీ సమీపమునఁ గలయొక శిల కంటుకొనిపోయినది. అది బయటపడు నుపాయ మెఱింగించి కరుణింపు" మని ప్రార్థించెను.

అందులకు సౌభరి యర్జునుని జూచి "ఓయీ! భయపడకుము. తొల్లి యుద్దాలకుఁ డనుమహర్షి బ్రహ్మచర్యమును గడపి చండిక యను పేరుగల పరుషవచన, దుశ్శీల యగు కన్యను బెండ్లాడెను. ఆమె యాతఁడు చెప్పినపనిచేయకపోవుటే కాక దానికి వ్యతిరేక మగుపని చేయుచుండెడిది. కాని దాని కాతఁ డుపాయ మూహించి తా నొకపని కావలయు నని కోరుకొన దానికి వ్యతిరేక మగునదే కావలయు నని యామెకుఁ జెప్పి యామె యాతఁడు చెప్పినదానికి వ్యతిరేక మగుపని చేయఁ దనసంకల్పసిద్ధి నందుచు నాతఁడు కాలము పుచ్చుచుండెను. కొంతకాలమున కాతఁడు పితృకార్య మొనరించి యాపారణము నావు నకుఁ బెట్టు మని పొరపాటున నామెకు నిజము చెప్పెను. అది యామె తీసికొనిపోయి యావునకుఁగాక కుక్కకుఁ బెట్టెను. దాని కాతఁ డాడలు మండి యామెను వింధ్యశైలప్రాంతమునఁ బాషాణమవై పడియుండు మని శపించెను. ఆమె దుఃఖింప "నోసీ! కొన్నాళ్లకు ధర్మరాజు యాగాశ్వము నిన్నంటుకొనిన, దానిని విడిపించుటకై వచ్చు నర్జునుని కరస్పర్శమున నీవు పవిత్రురాలవై స్త్రీ వగుదు వని కరుణించెను. ఆ శిల యామెయే. కావున, నీ వేగి నీచేతితో నాశిల నంటిననామె శాప మోక్ష మందును. మీ యశ్వము విడుదల గాంచును" అని చెప్పెను.

అర్జునుఁ డా మహర్షి కనేకవందనము లొనర్చి యేఁగి యాశిలను దాఁకఁగనే యామె శాపమునుండి విడివడి మరలచండికయయ్యెను. యాగాశ్వము విడుదల నంది ముందు కేగెను. అర్జునాదులు దానిని ననుసరించిరి.*

---

* జైమినిభారతము.

## సౌభరి మోక్ష మందుట

అంతరము సౌభరి సన్న్యాసియై వార్ధకమున సాంగత్యవశము లైన విషయములు మాని యంత్యమున విష్ణుభక్తివలనఁ గల్యాణ కైవల్యమును గాంచెను.

"ఈ సౌభరికథఁ దలఁచిన
వ్రాసినఁ బేర్కొనిన వినిన వర్ణించిన న
ఖ్యానముచేసినవారికి
శ్రీసంపద లొనరి మోక్షసిద్ధియుఁ గలుగున్."

(విష్ణు. ౪, ౧౯౪)

